# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

VEEKSHANAM, TELUGU MONTHLY

సంపుటి : 19 సంచిక : 5 హైదరాబాద్ 235 మే 2021 పేజీలు : 68 రు. 25

* తెలంగాణ ఆర్థిక నిర్వహణపై కాగ్ విశ్లేషణ
* ప్రశ్నించే గళాలు, కలాలపై ఎన్ఐఎ దాడులు
* ఖైదీల హక్కులు రాజ్యాంగ బద్ధమే
* రాఫెల్ విమానాల కొనుగోలు ఎవరికోసం?
* ఇక రాష్ట్రాలు ఉనికిలో ఉండవా!
* తత్వశాస్త్రం అంటే ఏమిటి?
* రాజకీయ సిద్ధాంత వేత్తగా మార్క్స్

## *STOP PRESS*

ఈ సంచిక అచ్చుకు వెళుతున్న సమయంలో తెలంగాణలో భావ ప్రకటనా స్వేచ్ఛ మీద, వాక్‌సభా స్వాతంత్రాల మీద తెలంగాణ ప్రభుత్వ దుర్మార్గ దాడి వార్త తెలిసింది. భావ ప్రకటనా స్వేచ్ఛను గౌరవించే, ఆ స్వేచ్ఛ కోసం నిలబడే పత్రికగా వీక్షణం ఈ దాడిని తీవ్రంగా ఖండిస్తున్నది. ఈ సమయంలో తెలంగాణ సమాజం మేల్కొనకపోతే భిన్న భావాలు వ్యక్తపరిచే ప్రతి సంస్థ, ప్రతి వ్యక్తి ముళ్ల బాటలో ముందుకు సాగే ప్రమాదం పొంచి ఉంటుంది. నిషేధం విధిస్తూ వెలువరించిన ప్రభుత్వ ఉత్తర్వును వెంటనే ఉపసంహరించుకోవాలి. వివరమైన విశ్లేషణలు, వాదనలు వచ్చే సంచికలో ప్రచురిస్తాం. **– వీక్షణం కలెక్టివ్**

235 ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

మే 2021
సంపుటి : 19
సంచిక : 05







**'వీక్షణం' పేరిట రచనలు, ఎం.ఓలు, చెక్కులు,డి.డి లు పంపాల్సిన చిరునామా**

వీక్షణం VEEKSHANAM

మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495

Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : **చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్. ఫోన్ : 040 - 27678411

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 25 | రు. 25 |
| సంవత్సరం | రు. 300 | రు. 250 |
| మూడు సంవత్సరాలు | రు. 900 | రు. 650 |
| ఐదు సంవత్సరాలు | రు. 1500 | రు. 1100 |
| పది సంవత్సరాలు | రు. 3000 | రు. 2000 |

ఆన్‌లైన్ యూనియన్ బ్యాంక్ ఆఫ్ ఇండియా ద్వారా డబ్బులు పంపేవారు బ్యాంక్ స్లిప్‌లపై '**VEEKSHANAM**' అని రాసి తమ పేరు కూడా రాయాలి. వీక్షణం అకౌంట్ నెంబర్ – **013911011002175** యూనియన్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి. ఇతర బ్యాంకులలో వేసేవారు **UBIN0801399** నెంబర్‌తో పాటు తమ పేరు కూడా రాసి వేయాలి.

పారిస్ కమ్యూన్ చారిత్రక పాఠాలు గత సంచికలో పునర్ముద్రించిన కొండపల్లి సీతారామయ్య పారిస్ కమ్యూన్ – చారిత్రక పాఠాలు వ్యాసం పిలుపు పత్రికలో మొదట వెలువడిందని ఇచ్చిన సమాచారం సరికాదు. ఆ వ్యాసం మొదట ఆంధ్రభూమి దిన పత్రికలో అచ్చయింది. ఈ సమాచారాన్ని సవరించిన మిత్రులు సత్యంకు కృతజ్ఞతలు...

'నేపాల్‌లో మళ్లీ అనిశ్చితి' అన్న వీక్షణం (ఫిబ్రవరి 2021) సంపాదకీయ వ్యాఖ్యలో అపసవ్య విశ్లేషణ, తప్పుడు నిర్ధారణలు ఉన్నాయని 'నేపాల్‌లో భారత విస్తరణవాదం – ఇటీవలి పరిణామాలు" అన్న వ్యాసంలో (వీక్షణం – ఏప్రిల్ 2021) ఎస్ కృష్ణమూర్తి గారు ఆక్షేపించారు. భారత విస్తరణవాద తత్వమే నేపాల్ అనిశ్చితికి కారణమని, ఆ విషయాన్ని నరసింహారెడ్డి విస్మరించారని కృష్ణమూర్తి గారి ఆవేదన. భారతదేశ విస్తరణ వాదాన్ని నరసింహారెడ్డి గారు మరిచిపోయారని ఆవేదన చెందిన కృష్ణమూర్తి చైనా ఆధిపత్య తత్వాన్ని ఈసమెత్తు కూడా ప్రస్తావించక పోవడం, పైపెచ్చు 'బలీయమవుతున్న' చైనా దేశాన్ని అభాసుపాలు చెయ్యడం కోసం భారత్, దాని మీడియా ప్రయత్నిస్తున్నాయని వాపోవడం విడ్డూరం.

మేడిపండు ప్రజాస్వామ్యంతో ప్రపంచంలోనే మాది అతిపెద్ద ప్రజాస్వామ్య దేశమని విర్రవీగుతున్న భారతదేశం ఏ మాత్రం అవకాశం దొరికినా సరిహద్దు దేశాల సార్వభౌమత్వం మీద కాళ్లూనడానికి ఎల్లప్పుడూ వేచి చూస్తూనే ఉంటుందనడం నిర్వివాదాంశం. కానీ భారతదేశ విస్తరణవాద తత్వాన్ని నిరూపించడానికి కృష్ణమూర్తి గారు ఉదహరించిన ఉదంతం మాత్రం హాస్యాస్పదం. నేపాల్, శ్రీలంకలలో బిజెపి ప్రభుత్వాలను ఏర్పాటు చేస్తామని, అందుకు గాను ముందస్తుగా ఆ దేశాలలో భారతీయ జనతా పార్టీని ప్రారంభిస్తామని హోం మంత్రి అమిత్ షా ప్రకటించాడన్న వార్తకు కృష్ణ మూర్తి గారు అధిక ప్రాధాన్యత ఇచ్చారు. బిజెపిని ఆ దేశాలలో స్థాపించే ప్రక్రియను కాసేపు పక్కన పెడితే, సముద్రానికి ఆవల శ్రీలంక, ఈవల తమిళనాడు కదా! సముద్రాన్ని దాటే సంగతి తర్వాత ఆలోచిద్దాం గాని, రానున్న రెండు దశాబ్దాల కాలంలో నైనా సముద్రానికి ఈవలనున్న, భారతదేశంలో అంతర్భాగమయిన తమిళనాడులో నైనా భారతీయ జనతా పార్టీ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయగలగడం సాధ్యమేనా అన్న విషయం కృష్ణ మూర్తి గారు ఆలోచించాలి. 2021, ఏప్రిల్ 6న జరిగిన అసెంబ్లీ ఎన్నికల ప్రచారంలో బలవంతంగా నెయ్యం కలుపుకున్న ఏఐడిఎంకె పార్టీ అభ్యర్థులే బిజెపి కార్యకర్తలకు చేతులెత్తి దండం పెట్టి 'అయ్యలారా! మీ మోడీ, అమిత్ షాల బొమ్మలు దాచిపెట్టండి. మీరు మా వెంట తిరిగి మాకు డిపాజిట్లు కూడా రాని స్థితి తీసుకురాకండి. ప్లీజ్.' అని వేడుకుంటున్నారంటే, ఇక శ్రీ లంక, నేపాల్ దేశాలకు వెళ్లి ప్రభుత్వాలు ఏర్పాటు చెయ్యడమెక్కడ? కీలు బొమ్మ ప్రభుత్వాలను నెలకొల్పి పరోక్ష పాలన సాగించే పరిస్థితులు కూడా లేవన్నది స్పష్టం.

నేపాల్‌కు భారత దేశానికి చారిత్రిక, సాంస్కృతిక సంబంధాలు బలంగా ఉన్నాయి. భారత ప్రజలకు, నేపాల్ ప్రజలకు మధ్య సంబంధాలను "రోటీ ఔర్ బేటీ కా సంబంధ్" అని నిర్వచిస్తారు. అయినప్పటికీ నేపాల్ ప్రభుత్వానికి, నేపాల్ రాజకీయ పార్టీల నాయకత్వాలకు చైనాతోనే క్రియాశీలక సంబంధాలు ఉన్నాయి. చైనా కమ్యూనిస్టు పార్టీకి, నేపాల్ కమ్యూనిస్టు పార్టీకి మధ్య సంబంధం పటిష్టంగా ఉందన్న సంగతి మరిచారా కృష్ణమూర్తి గారూ!

చైనా ఆధిపత్య వాదాన్ని గురించి పల్లెత్తు మాట కూడా అనకుండా నేపాల్ అనిశ్చితికి కారణం భారత్ మాత్రమే అనడం పాక్షిక సత్యమే అవుతుంది. పొరుగు దేశాల పట్ల అవసరానికి మించిన భారత జోక్యాన్ని ఎంత అభిశంసించాలో చైనా సామ్రాజ్యవాద ధోరణిని కూడా అంతే ఎండగట్టాలి. అటు భారత ప్రభుత్వం, భారతదేశంలోని రాజకీయ పార్టీలు, ఇటు చైనా ప్రభుత్వం, చైనా కమ్యూనిస్టు పార్టీ ప్రమేయం లేకుండా నేపాల్ ప్రజలు, నేపాల్ ప్రభుత్వమూ, నేపాల్ రాజకీయ పార్టీలు మాత్రమే తమ రాజ్యాంగాన్ని తామే రూపొందించుకొని, తమ సమస్యలను తాము పరిష్కరించుకునే దారిలో ప్రస్థానం సాగించకపోతే నేపాల్‌లో అనిశ్చితి అలాగే కొనసాగుతూనే ఉంటుంది.

**– రాజేంద్రబాబు అర్విణి,**
వీక్షణం ఎడిటోరియల్ కలెక్టివ్, హైదరాబాద్

వీక్షణం పత్రికను నాకు మొట్టమొదటి సారి పరిచయం చేసినవారు అసహజ మరణాల సూచి విశాఖ కరస్పాండెంట్ అయినటువంటి పి.వి. రమణ గారు. అప్పటి నుండి నేను క్రమం తప్పకుండా పత్రికను చదువుతున్నాను. ఇందులో వ్యాసాలు నన్ను ఎంతగానో ఆకట్టుకుంటున్నాయి. ఇవి వ్యాసాలు అనేకంటే పరిశోధనా పత్రాలు అంటే బావుంటుందని అనుకుంటున్నాను. ఎందుకంటే నేడు చిన్న చిన్న కాంపిటేటివ్ పరీక్షలకు వెళ్లే విద్యార్థుల నుండి సివిల్స్ పరీక్షలకు వెళ్లే విద్యార్థులకు కూడా ఒక దిక్సూచిలా ఈ వ్యాసాలు ఉపయోగపడుతున్నాయంటే అందులో ఏమాత్రం ఆశ్చర్యం లేదు. ఈ వీక్షణం పత్రికను ఇంత బాగా తీర్చిదిద్దుతున్నందుకు పత్రిక యాజమాన్యానికి అభినందనలు తెలియజేస్తున్నాను. అయితే పత్రికలో ఒక్క వ్యాసాలే కాకుండా ఆకర్షణీయంగా ఇతర శీర్షికలు కూడా ప్రవేశ పెడితే బాగుంటుందని నా అభిప్రాయం. ముఖ్యంగా బుక్ రివ్యూ లాగ సినిమా రివ్యూ ఒకటి ప్రవేశపెట్టండి. ఏ లాంగ్వేజ్ అయినా పర్వాలేదు, ఆణిముత్యాల్లాంటి పాత సినిమాలను తీసుకుని అందులో మంచి చెడులను కూలంకుషంగా చర్చించండి. పత్రిక అన్న తర్వాత అన్ని వర్గాల వారిని ఆకట్టుకోవాలనేది నా ఉద్దేశం. పత్రిక నిరాటంకంగా నడపడానికి ఒక ట్రస్ట్ ఏర్పాటు చేస్తే బాగుంటుందని నా అభిప్రాయం. ప్రస్తుతం ఉన్న చందాదారులకు, పత్రిక శ్రేయోభిలాషులకు ఒక విజ్ఞప్తి చేయండి. సంవత్సర చందా ఎలా కడుతున్నారో అదే అమౌంట్ ప్రతినెలా సంవత్సరం పాటు కట్టమని చెప్పండి. అలాగే మరింత ఎక్కువ డొనేషన్స్‌కు కూడా విజ్ఞప్తి చేయండి. సహృదయులైన పాఠకులు తప్పకుండా సహకరిస్తారని నాకు నమ్మకం ఉంది. పత్రికను బతికించుకోవాలంటే ఈ మాత్రం భరించక తప్పదు.

**– మద్రి సూర్యనారాయణ**
నరసింహనగర్, విశాఖపట్నం

వీక్షణం ఏప్రిల్ 2021 సంచికలో వచ్చిన సంపాదకీయంతో పాటు, (మిగతా 46వ పేజీలో...)

కోవిడ్ వల్ల పత్రికలలో సాధారణ వార్తలు రావడం లేదు గనుక అసహజ మరణాల సూచి సమగ్రంగా తయారు చేయడం సాధ్యం కావడం లేదు. కొద్దికాలంగా అసహజ మరణాల సూచి వేయలేకపోతున్నందుకు చింతిస్తున్నాం. సం.

**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ముత్తన్నగారి రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఇక్బాల్; వరంగల్ – ఓరగంటి ఎల్లయ్య

**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – కొండ్రాయుడు; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – కె.ఎస్. ప్రకాష్‌రావు; శ్రీకాకుళం – ఆర్. శ్రీలత; విశాఖపట్నం – పి.వి. రమణ

# మూర్ఖత్వానికి పరాకాష్ట

– రాజేంద్రబాబు అర్విణి

*'తెలుగునాట భక్తి రసం తెప్పలుగా పారుతోంది*
*డ్రైనేజి స్కీమ్ లేక డేంజర్‌గా మారుతుంది'*

తెలుగు కవి గజ్జెల మల్లారెడ్డి దశాబ్దాల క్రితమే 'తెలుగు నాట' అని వాపోయాడు గాని నేడు దేశమంతా ప్రభుత్వ ప్రోత్సాహంతో 'భక్తిరసం' వికృత రూపం దాల్చి అత్యంత నికృష్టమయిన మూర్ఖత్వానికి పరాకాష్టగా నిలిచింది. దానికి తార్కాణం హరిద్వార్‌లో జరుగుతున్న కుంభమేళ. భౌతిక దూరం పాటించమని, మాస్కులు ధరించమని ప్రపంచమంతా ఏక కంఠంతో కోడై కూస్తూ ఉంటే కుంభ మేళాలో అఖారాలు, సన్యాసులు, మత మౌఢ్యంతో లోకజ్ఞానం, ఇంగితజ్ఞానం కోల్పోయిన మూఢ భక్తులు కొవిడ్ నిబంధనలు పాటించకుండా హరిద్వార్‌లో సంచరిస్తూ ఉంటే, గంగానదిలో స్నానాలు చేస్తూ ఉంటే కొవిడ్‌తో దేశం అతలాకుతలం కాక మరేమవుతుంది? ప్రతి రోజు పది లక్షల నుండి ఇరవై లక్షల దాకా ప్రజలు గుమిగూడుతున్నారట. 'పవిత్ర స్నానం' పేరుతో కొన్ని ప్రత్యేకమయిన దినాలలో 50 లక్షల దాకా గంగా నదిలో స్నాన మాచరిస్తున్నారట. దీని ఫలితంగా కొవిడ్ బాధితుల సంఖ్య ఇంతకు ముందెన్నడూ లేనంతగా పెరిగిపోయింది. ఈ సంపాదక వ్యాఖ్య రాస్తున్న సమయానికి ఒకే రోజు దేశంలో త్రిపుర, లఢక్‌లను మినహాయించి 3 లక్షల 15 వేల 660 మంది కరోనా బారిన పడ్డారు. ఒకే రోజు కొవిడ్‌తో 2,091 మంది మరణించారు. ఇంతవరకు ప్రపంచంలోనే ఒకే రోజు ఇంత పెద్ద సంఖ్యలో వైరస్ సోకిన దాఖలా లేదు. జనవరి 14న ప్రారంభమయిన కుంభమేళా నుండి తిరిగి వచ్చిన భక్తులు తమ వంతుగా తమ తమ రాష్ట్రాలలో కరోనా వ్యాప్తికి తోడ్పడ్డారు. ఈ తంతు కంతా కేంద్ర, ఉత్తరాఖండ్ రాష్ట్ర ప్రభుత్వాలు ప్రారంభంలో వత్తాసు పలకడం ఆందోళన కలిగించిన విషయం. కొవిడ్ రెండవ దశ తీవ్రంగా వ్యాపిస్తుందన్న సంకేతాలు మార్చ్ నెలలోనే వెలువడ్డాయి. మార్చ్ 21 నాడు దేశంలోని అన్ని ప్రధాన దిన పత్రికలు గంగా స్నానం 'సురక్షిత' మని, 'పరిశుభ్రత' పాటిస్తున్నామని ప్రధాన మంత్రి నరేంద్ర మోడీ, ఉత్తరాఖండ్ ముఖ్యమంత్రి రావత్ హామీలతో, వారి ఫోటోలతో భక్తులకు స్వాగతం పలుకుతూ పూర్తి పేజీ ప్రకటనలు ప్రచురించాయి. ఉత్తరాఖండ్ ముఖ్యమంత్రి ఇంకొక అడుగు ముందుకు వేసి 'గంగా మాత దీవెనల ప్రవాహంలో కరోనా వైరస్ కొట్టుకు పోతుంది' అని కూడా ప్రకటించాడు. విపత్తు వ్యాపించిన తర్వాత ఇప్పుడు ప్రధాన మంత్రి, ఉత్తరాఖండ్ ముఖ్యమంత్రి మెల్లొని సన్నాయి నొక్కులు నొక్కుతున్నారు. గత సంవత్సరం కరోనా ఊసే లేనప్పుడు 3500 మంది ప్రతినిధులతో తబ్లీగి జమాత్ వార్షిక సమావేశాలు జరుపుకొంటే కరోనా వైరస్ వ్యాప్తికి వారే కారణమని దుమ్మెత్తిపోసిన సోషల్ మీడియా, మీడియా కుంభమేళ పట్ల ఇప్పుడు కిక్కురుమనడం లేదు.

మార్చ్ నెల నుండి కొవిడ్ బారిన పడిన వారి సంఖ్య, దానితో మరణించిన వారి సంఖ్య రోజు రోజుకు పెరుగుతూనే ఉంది. గ్రాఫ్ పైపైకే పోతూ ఉంది కానీ ఏ రోజు కిందకు రాలేదు. అమెరికా, బ్రిటన్, కెనడా, ఆస్ట్రేలియా, సింగపూర్, దుబాయ్ లాంటి దేశాలు భారత్‌కు ప్రయాణాలు మానుకోవాలని తమ దేశ పౌరులకు సూచించాయి. ఇందులో కొన్ని దేశాలు భారత్‌కు ప్రయాణాలు నిషేధించాయి కూడా. ఇంతజరుగుతూ ఉన్నా కూడా ప్రభుత్వం పత్రికా ప్రకటనలకే పరిమితం కావడం శోచనీయం. కోర్టులు, రాష్ట్ర, కేంద్ర ఎలెక్షన్ కమిషన్‌లు స్పందించక పోవడం మరింత ఆందోళన కలిగించే విషయం.

ప్రభుత్వానికి ఈ మహమ్మారిని ఎదుర్కోవడానికి ఒక పక్కా వ్యూహం ఉందా అన్నది సందేహాస్పదం. వ్యాక్సిన్‌లు తయారుచేయడానికి అనుమతించారు. తయారయిన వ్యాక్సిన్‌లను విదేశాలకు ఎగుమతి చేశారు. కొత్తగా కొవిడ్ హాస్పిటల్ ఒక్కటీ నిర్మించలేదు. చైనాలో కొవిడ్ మొదటి వేవ్ ప్రారంభ దశలోనే పది రోజుల్లో 50 అంతస్తుల కొవిడ్ ఆసుపత్రిని నిర్మించిన ఉదంతం మన ముందుంది. ఇప్పుడు కొవిడ్ రెండవ వేవ్ సమయంలో కేంద్ర ప్రభుత్వం కొవిడ్ ఆసుపత్రి ఒకటి నిర్మించాలని ఆలోచిస్తుందని పత్రికలలో వార్తలు వస్తున్నాయి. అది వాస్తవమయితే కొవిడ్ ఆసుపత్రి నిర్మాణం ఇంకా ఆలోచన దశలోనే ఉంది. ఆలోచనలు కార్యాచరణ దశకు చేరుకునేసరికి కొన్ని సంవత్సరాలు పట్టవచ్చు. చేతులు కాలాక ఆకులు పట్టుకోవడం మన ప్రభుత్వానికున్న ఒక ప్రత్యేక లక్షణంగా తయారయ్యింది.

ప్రజలలో శాస్త్రీయ దృక్పథం పెంపొందేలా ప్రభుత్వం కృషి చెయ్యాలని రాజ్యాంగం నిర్దేశిస్తున్నది. అందుకు భిన్నంగా మత మౌఢ్యం పెంపొందేలా చర్యలకు పాల్పడుతున్న ప్రభుత్వం తన నిర్వ్యాపారత్వాన్ని, కుంభ మేళాను ప్రోత్సహించడాన్ని, కరోనా కల్లోల కాలంలో ఎన్నికలు నిర్వహించడాన్ని కప్పిపుచ్చుకోవడానికి వైరస్ వ్యాప్తికి ప్రజలపై నింద మోపుతున్నది. ప్రజలు జాగ్రత్తలు పాటించడం లేదని, మాస్కులు ధరించడం లేదని ప్రజలనే దోషులను చేసి చేతులను దులిపేసుకుంటున్నది.

అదుపు హద్దు లేకుండా కరోనా వ్యాప్తి చెందడానికి మరొక కారణం అయిదు రాష్ట్రాలలో ఎన్నికల నిర్వహణ. ప్రధానమంత్రి, కేంద్ర హోం మంత్రి, రాష్ట్రాల ముఖ్య మంత్రులు, ఎన్నికల కమిషన్, న్యాయ వ్యవస్థ, అన్ని రాజ్యాంగ వ్యవస్థలు ప్రజల బాగోగులను మర్చిపోయి, ప్రజల ప్రాణాలు కాదు ఎన్నికలే మాకు ముఖ్యం అని నిస్సిగ్గుగా చాటుకున్నారు. లక్షల మందితో ర్యాలీలు, సభల నిర్వహణ వల్ల పశ్చిమ బెంగాల్‌లో వైరస్ వ్యాప్తి 1500 శాతం పెరిగింది. తమిళనాడులో 62 శాతం, అసోంలో 230 శాతం పెరుగుదల రికార్డ్ అయింది. ఎన్నికల వలన టెస్ట్‌లు బాగా తగ్గినా ఇదీ వైరస్ కేసుల పెరుగుదల.

ప్రజాస్వామ్య ప్రక్రియ కొనసాగటానికి ఎన్నికలు అవసరం కావచ్చు. అత్యవసరం మాత్రం కాదు. ప్రజలకు కావలిసింది జాబ్ మేళాలు కానీ, కుంభ మేళాలు కాదు. ప్రజలకు కావలిసింది ఉపాధి అవకాశాలు, మందులు వాక్సిన్‌లు. మతమౌఢ్యం కాదు. ప్రజలకు కావలసినది వేల కోట్ల రూపాయలు ఖర్చు చేసి నిర్మించే ఎత్తైన విగ్రహాలు కాదు. ప్రాణాలు కాపాడుకోవడానికి అవసరమయ్యే ఆక్సిజన్ ఉత్పత్తి కేంద్రాలు. వీ

సంపాదకీయ వ్యాఖ్య - తెలంగాణ

# కొవిడ్‌తో విలవిల - కొరవడిన రాజకీయ సంకల్పం

**- ఎ. నర్సింహారెడ్డి**

తెలంగాణలో కొవిడ్ రెండోదశ కరాళ నృత్యం చేస్తోంది. పరిస్థితులు విషమించడంతో ప్రజల్లో భయాందోళనలు వ్యక్తమవుతున్నాయి. కొవిడ్ విజృంభిస్తుందని, దాన్ని అదుపు చేసే మందులు లేవని తెలిసి కూడ తెలంగాణ ప్రభుత్వం ఎందుకు నివారణ, నియంత్రణ చర్యలు తీసుకోలేదన్నది అందర్నీ వేధిస్తున్న ప్రశ్న. కొవిడ్ మన సంస్థాగత, వ్యవస్థాగత లోపాలను సంవత్సరం క్రితమే బయట పెట్టింది. అయినా, దీన్ని నివారించడంలో ఉదాసీనత పాటించడంతో పరిస్థితి తీవ్రతరమైంది. ముందస్తు నియంత్ర చర్యలను గాలి కొదిలేశారు. రోజు రోజుకూ పాజిటివ్ కేసులు పెరిగి ఆసుపత్రులు రోగులతో నిండిపోతున్నాయి. ఒక పక్క టెస్టుల కోసం జనం బారులు మరో పక్క టీకా కోసం గంటల తరబడి ఆసుపత్రుల్లో ఎదురుచూపులు...మరోవైపు వైరస్ తీవ్రత ఎక్కువ ఉన్నవారు ప్రైవేటు ఆసుపత్రులకు వెళ్లితే లక్షల రూపాయలు బిల్లు వసూలు, ప్రభుత్వ దవాఖానాల్లో పట్టించుకునే నాథుడు లేకపోవడంతో రోజుకు పదుల సంఖ్యలో రోగులు ప్రాణాలు కోల్పోతున్నారు. ప్రభుత్వ దవాఖానాల్లో నిధులు, మందుల్లేక, వ్యాక్సిన్లు, ఆక్సిజన్ అందుబాటులో ఉండక వైరస్ ప్రళయ భీభత్సం సృష్టిస్తున్నది. ప్రభుత్వ వైద్య ఆరోగ్య శాఖ ప్రతిరోజు విడుదల చేసే బులెటిన్‌లో ప్రైవేట్‌లో బెడ్లన్నీ ఖాళీగానే ఉన్నాయని ప్రకటిస్తుంటే, నో బెడ్స్ అని ప్రైవేట్ వాళ్లు అంటున్నారు. ఒక్కో బాధితుడికి బెడ్డు దొరకాలంటే పది నుంచి 20 ఆసుపత్రులు తిరిగితే గానీ లభించని పరిస్థితి ఉంది. కృత్రిమ కొరత సృష్టించొద్దని గతేడాది నుంచి ప్రభుత్వం పలుమార్లు హెచ్చరించినా ఇప్పటికీ లెక్క చేయడం లేదు.

రోజుకు లక్ష మందికి టెస్టులు, వ్యాక్సిన్లు చేస్తామని ఊదరగొట్టిన ప్రభుత్వం వాగ్దానం అటకెక్కింది. రోగులకు బెడ్ల కొరత, ఆక్సిజన్ కొరత, కిట్ల కొరత, మాస్క్‌ల కొరత కొట్టవచ్చినట్లు కన్పిస్తోంది. కేంద్రంపై ఆరోపణలు చేయడంతో సరిపుచ్చుకోవడం శోచనీయం. రాష్ట్ర ప్రభుత్వానికి అవసరమైన కిట్లు, ఆక్సిజన్, వ్యాక్సిన్ తెప్పించుకునే సత్తా లేదా అన్నది సామాన్యుని ప్రశ్న. అత్యవసరమైన ఆక్సిజన్ అందక పలువురు రోగులు చనిపోతున్నారు. ఒకరు చస్తే మరొకరికి ఆక్సిజన్ అందే దుస్థితికి రాష్ట్ర ప్రభుత్వం కారణం కాదా! బెడ్స్ లేవనడానికి కారణం తగినంత మంది డాక్టర్లు, నర్సులు లేక పూర్తి స్థాయిలో రోగులను అడ్మిట్ చేసుకోవడం లేదు. సంవత్సర కాలంగా వైద్యరంగాన్ని బలోపేతం చేస్తే ఇవాళ ఈ గడ్డు పరిస్థితి వచ్చేదా? రాష్ట్రంలో ప్రభుత్వ-ప్రైవేట్ దవాఖానాల్లో 25,188 బెడ్స్ ఉండగా ఆక్సిజన్ అందుబాటులో ఉన్న బెడ్స్ 10,536 మాత్రమే. వెంటిలేటర్ సదుపాయం కేవలం 1451 బెడ్స్‌కు మాత్రమే ఉంది. ఇక ఆక్సిజన్ కొరతకు తోడు రెమ్‌డెసివర్ ఇంజక్షన్ కొరత ఉంది. 3 వేలకు దొరికే రెమ్‌డెసివర్ బ్లాకులో 22 వేలకు అమ్ముతున్నారు. ఇక హైకోర్టు అక్షింతలు వేశాకగానీ తెలంగాణ ప్రభుత్వం కదలకపోవడం గమనార్హం. "ప్రజల ప్రాణాలు పోతున్నా ప్రభుత్వానికి పట్టింపు లేదా? వైన్‌షాపులు, పబ్బులు, క్లబ్బులపై వచ్చే ఆదాయమే ముఖ్యమా? సభలు ర్యాలీలపై ఆంక్షలు ఎందుకు పెట్టడం లేద"ంటూ హైకోర్టు ప్రశ్నించింది. ఈ మాటలే రాష్ట్రంలో కొవిడ్ దారుణ వ్యాప్తిని, ప్రభుత్వ నిష్క్రియా పరత్వాన్ని రుజువు చేస్తున్నాయి. వైరస్ తీవ్రమవుతున్నా మున్సిపల్ ఎన్నికలకు గ్రీన్‌సిగ్నల్ ఇవ్వడం విషాదకరం. వీ

సంపాదకీయ వ్యాఖ్య - ఆంధ్రప్రదేశ్

# ఆడలేక మద్దెల వోడు అన్నట్టు ఎన్నికల బహిష్కరణ

**- ఎ. నర్సింహారెడ్డి**

ఆడలేక మద్దెల వోడు అన్నట్లు మాజీ ముఖ్యమంత్రి, ప్రతిపక్ష తెలుగుదేశం పార్టీ అధినేత నారా చంద్రబాబు నాయుడు ఆంధ్రప్రదేశ్‌లో జరుగుతున్న జిల్లా పరిషత్, మండల పరిషత్ ప్రాదేశిక సభ్యుల ఎన్నికకు దూరం అంటూ ప్రకటన చేయడంతో పోటీ ప్రారంభం కాక ముందే చేతులెత్తేసినట్లుంది. మరోవైపు స్థానిక సంస్థల ఎన్నికల్లో గ్రామ సర్పంచ్, మున్సిపల్ చైర్మెన్, నగర పంచాయితీ, మున్సిపల్, కార్పొరేషన్ ఎన్నికల్లో 80 శాతం స్థానాల్లో వైసిపి విజయం సాధించింది. ప్రజాస్వామ్యంలో అధికార పార్టీ ఎంత ముఖ్యమో, ప్రతిపక్ష పార్టీ కూడా అంతే ముఖ్యం. అయితే బూర్జువా పార్లమెంటరీ ప్రాతినిధ్య వ్యవస్థలో ప్రతిపక్షంలో ఉంటే ప్రజల మాట, అధికారంలో ఉంటే కార్పొరేట్ బాట మనం చూస్తూనే ఉన్నాం. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అధికార పార్టీ వైసిపి ఏకపక్షంగా నిర్ణయాలు తీసుకుంటుందన్న ప్రతిపక్ష చంద్రబాబు విమర్శల నేపథ్యంలో ఎంపిటిసిల, జడ్‌పిటిసిల ఎన్నికల నిర్వహణ ఆఘమేఘాల మీద జరగాలన్న మొండి పట్టుదలను వైసిపి ఏర్పర్చుకున్నది. టిడిపి అధికారంలో ఉన్నప్పుడు అనేక విషయాలలో ఏకపక్షంగా వ్యవహరించిందని ప్రతిపక్ష వైసిపి గతంలో పలు సందర్భాలలో తీవ్రంగా ధ్వజమెత్తిన విషయాన్ని మనం మరిచి పోలేదు. అధికారంలో ఉన్నప్పుడు చంద్రబాబు నియంతగా వ్యవహరించినట్లే, ఇప్పుడు అధికారంలో ఉన్న జగన్ వ్యవహరిస్తుండడం కొనసాగుతున్న ప్రజాస్వామ్య వ్యవస్థలో సహజమే. రెండు పార్టీలు ఆయా సందర్భాల్లో తీసుకుంటున్న నిర్ణయాలు, వైఖరులు ఇప్పటికే దిగజారిన ప్రజాస్వామ్య వ్యవస్థను మరింతగా దిగజారుస్తాయనడంలో సందేహం లేదు.

ఆంధ్రప్రదేశ్‌లో స్థానిక సంస్థలకు జరిగిన ఎన్నికల్లో 13,106 పంచాయితీల్లో 10,122 పంచాయితీలు వైసిపి గెలిచింది. 24 శాతం పంచాయితీలు ఏకగ్రీవంగా ఎన్నికయ్యాయి. 59 మున్సిపాలిటీలలో 57, 16 నగర పంచాయితీలలో పదహారింటిని, 12 కార్పొరేషన్‌లలో పన్నెండింటిని వైసిపి స్వాధీనం చేసుకున్నది. సుప్రీంకోర్టు ఎన్నికలను స్టే చేయడం వల్ల 7,321 ఎంపిటీసిలు, 526 జడ్‌పిటీసి ఎన్నికలు నిలిచిపోయాయి. నూతన ఎస్‌ఇసిగా నీలం సాహ్ని నియమితులైన వెంటనే ఎంపిటీసి, జడ్‌పిటీసి ఎన్నికల షెడ్యూల్ విడుదల చేసింది. అయితే గతంలో జరిగిన గ్రామ పంచాయితీ ఎన్నికలను తిరిగి నిర్వహించాలని చంద్రబాబు ఎస్‌ఇసిని కోరాడు. ఎస్‌ఇసి అంగీకరించలేదు. ఎన్నికల బహిష్కరణకు చంద్రబాబు చెప్తున్న కారణాలు అధికార వైసిపి దౌర్జన్యాలు, బెదిరింపులు, అధికార దుర్వినియోగం, బలవంతపు ఏకగ్రీవాలు వగైరా.. వగైరా కారణాలతో ఎన్నికలకు దూరం అని బాబు ప్రకటించాడు. ఇది అధికార పార్టీ దాష్టికాలపై పోరాడకుండా చేతులెత్తేయడమే తప్ప మరోటి కాదు. స్వంత పార్టీ కార్యకర్తలు తీవ్రంగా విమర్శిస్తున్నారు. పద్నాలుగేళ్లు ముఖ్యమంత్రిగా ప్రపంచ బ్యాంకు సిఇఓగా చెప్పుకుంటు ఆయన చేసిన నిర్వాకం చరిత్రలో నిలిచే ఉంది. బాబు బహిష్కరణ పిలుపు బిజెపికి సదావకాశంగా పరిణమించనుందని తెలుగుదేశం క్యాడర్ ఆరోపిస్తుంది. ఈ పరిణామం ప్రజల ఐక్యతను దెబ్బతీసి నానా తంటాలు పడుతున్న విద్వేష రాజకీయాలతో వాతావరణాన్ని కలుషితం చేస్తున్న బిజిపికి తోడ్పడడం ప్రజాహితం కాదు. లౌకిక ప్రజాస్వామ్య శక్తులు ప్రజాస్వామ్య పరిరక్షణకు అప్రమత్తం కావాల్సి ఉంది. వీ

# అంతర్యుద్ధం దిశగా మయన్మార్

- ఎ. నర్సింహారెడ్డి

ప్రజా తీర్పును కాలరాసి మయన్మార్ సైనిక (టాట్మాడా) నియంతలు మరోసారి దేశాధికారాన్ని ఫిబ్రవరి ఒకటి తెల్లవారుజామున తమ ఇనుప బూట్ల కిందికి తెచ్చుకొని మూడు నెలలవుతుంది. అక్కడి ప్రజలు వీరోచితంగా సైనిక పాలకుల తుపాకులకు ఎదురు వెళ్లి ప్రజాస్వామ్య పునరుద్ధరణ కోసం వీధి పోరాటాలు సాగిస్తున్నారు. నిరసనకారులు మాడ్చే ఎండలకు భయపడడం లేదు, కరోనా భీతి కూడా వారిలో లేదు. ఇంటర్నెట్ షట్ డౌన్లు వారి ఆత్మస్థైర్యాన్ని దెబ్బతీయడం లేదు. పోలీసుల దౌర్జన్యం కూడా వారిని నిలువరించలేకపోతోంది. వాటర్ కేనన్లు, టియర్ గ్యాస్, రబ్బరు బుల్లెట్లు ఇవేవీ నిరసనకారులను ఆపలేకపోతున్నాయి. విభిన్న తెగలకు చెందినవారు, వివిధ వయో సమూహాల వారు, సాధారణ ప్రజలు అందరూ నియంతల పరిపాలనకు చరమగీతం పాడాలనే దృఢ నిశ్చయంతో కనిపిస్తున్నారు. ఈ సమరంలో ఇంతవరకు 600 మంది ప్రాణాలర్పించినట్లు అధికారిక సమాచారం. సైనిక జుంటాకు వ్యతిరేకంగా పోరాడేందుకు ప్రజాస్వామిక శక్తులు ఏకమవుతున్నాయి. ప్రజాస్వామిక అనుకూల నేతలు, సాధారణ పౌరులు, వివిధ జాతులకు చెందిన ప్రజలు ఒకే తాటిపైకి వస్తుండడంతో క్రమంగా దేశంలో అంతర్యుద్ధ పరిస్థితులు నెలకొంటున్నాయి. పైడాంగ్స్ హులుతావ్ ప్రాతినిధ్య కమిటీ (సిఆర్‌పిహెచ్) నేతృత్వంలో సాగుతున్న ప్రజాస్వామిక ఉద్యమం దేశవ్యాప్తంగా ప్రతిగ్రామం నుంచి పది నుంచి ఇరవై మంది పురుషులను సైనిక సేవల కోసం ముందుకు రావాల్సిందిగా పిలుపిచ్చింది. ప్రస్తుత మయన్మార్ సైన్యానికి వ్యతిరేకంగా పోరాడేందుకు సమాఖ్య సైన్యాన్ని ఏర్పాటు చేయాలనే లక్ష్యంతో వీరందరినీ ఆహ్వానించింది. అనేక జాతుల సాయుధ సంస్థలు (ఇఏఓ) స్వయంపాలన, సంపూర్ణ స్వాతంత్ర్యం, స్వయం ప్రతిపత్తి వంటి డిమాండ్లతో పోరాడుతున్నాయి.

ప్రజలంతా ఏకతాటిపైకి వచ్చి పౌర ప్రభుత్వానికి మద్దతునిస్తూ కలిసికట్టుగా సైనిక జుంటాను వ్యతిరేకిస్తున్నారు. మయన్మార్‌లో రాజకీయపరంగా బర్మార్ (బర్మన్లు) అనే ఆధిపత్య సామాజిక వర్గం దేశవ్యాప్తంగా ఉంది. ఇలాంటి వర్గాల్లో షాన్లు, కేయన్లు, కచిన్లు, రఖినేలు, చిన్లు ప్రసిద్ధి పొందాయి. మిలటరీకి వ్యతిరేకంగా గెరిల్లా యుద్ధాలు ప్రారంభమయ్యాయి. మార్చ్ 27న ఇక్కడి ముత్రావ్ జిల్లా దేహ్‌బునోహ్ గ్రామానికి సమీపంలో సాల్వీన్ నది ఒడ్డున ఉన్న మయన్మార్ మిలటరీ పోస్టులపై కరేన్ నేషనల్ యూనియన్(కెఎన్‌యు) దళాలు దాడి చేశాయి. 10 మంది సైనికులను చంపేశాయి. మరో 8 మందిని అపహరించాయి. ఆ ప్రాంతంపై ఆధిపత్యాన్ని నిలబెట్టుకున్నాయి. మయన్మార్ సైన్యం మార్చ్ 27 రాత్రి దేహ్‌బునోహ్ గ్రామంపై వైమానిక దాడులు జరిపింది. ఈ దాడుల్లో ఇద్దరు మరణించారు. మయన్మార్ పార్లమెంటుకు ఎన్నికైన సభ్యులతో పైడాంగ్స్ హులుతావ్ (యూనియన్ పార్లమెంట్) సిఆర్‌పిహెచ్ సమాంతర పౌర ప్రభుత్వాన్ని (ఎన్‌యుజి) మార్చ్ 31న ప్రకటించింది. ప్రధానిగా సూకీ, అధ్యక్షునిగా విన్ మైంట్, 21 మంది మంత్రులు ఉన్నారు. ఐక్యరాజ్య సమితి ప్రత్యేక ప్రతినిధిగా యు ప్టిన్ లిన్ ఆంగ్‌ను ప్రకటించింది. ఫెడరల్ డెమోక్రసి చార్టర్‌ను విడుదల చేస్తూ, సైనిక ముసాయిదా 2008 రాజ్యాంగాన్ని రద్దు చేసినట్లు ప్రకటించింది. మయన్మార్‌తో వాణిజ్య సంబంధాలను దృష్టిలో పెట్టుకొని సైనిక పాలనను ఆసియా దేశాలు తీవ్రంగా ఖండించలేక పోతున్నాయి. ఏసియాన్ ఈ పరిణామాలను అంతరంగిక వ్యవహారంగా పరిగణిస్తోంది. చైనా సైనిక పాలనకు పరోక్ష మద్దతు ఇస్తున్నది. భారత్ ఆందోళనకరమంటూ సరిపుచ్చుకుంది. ఈ నేపథ్యంలో మయన్మార్‌లో ప్రజాస్వామ్య పునరుద్ధరణ కోసం జరుగుతున్న ఉద్యమానికి ప్రపంచ దేశాలు మద్దతుగా నిలువాలి. వీ




- నర్సిం



❖ **తంగేడుపూల పాట –** తంగెళ్ల సుదర్శనం – విరసం ప్రచురణలు – 120 పేజీలు, 1/8 డెమీ, రు. 80, ప్రతులకు : తంగెళ్ల సుదర్శనం, ఇ.నెం. 2-10-304/2, టీచర్స్ కాలనీ, ఫేజ్ 2, వడ్డేపల్లి, హనుమకొండ, వరంగల్ – 506370, ఫోన్ : 9490853507



❖ **సబ్జెక్ట్ కరెక్షన్ –** మరికొన్ని కవితలు – రివేరా – విరసరం కృష్ణా యూనిట్ ప్రచురణ – 94 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలలో



❖ **తూరుపు ముఖాన –** దీర్ఘ కవిత – కెనరి – విరసం ప్రచురణలు – 32 పేజీలు, 1/8 డెమీ, రు. 30, పై ప్రతులకు: డి.వి. రామకృష్ణారావు, ఎం.ఐ.జి–14, ఎ.పి.ఐ.సి. కాలనీ, కార్బైడ్ కంపెనీ ఎదురుగా, మౌలాలి, హైదరాబాద్ – 500040, ఫోన్ : 9989189250



❖ **అచ్చు కాయిదం –** అచ్చ తెలంగాణ భాష మ్యూజింగ్స్ – అల్లాడి శ్రీనివాస్ – పాలపిట్ట బుక్స్ ప్రచురణ – 160 పేజీలు, 1/8 డెమీ, రు. 100,



❖ **గున్నపూలు –** (క్రైతికాలు) – కవిత్వం – అల్లాడి శ్రీనివాస్ – పాలపిట్ట బుక్స్ ప్రచురణ – 56 పేజీలు, 1/8 డెమీ, రు. 50, పై రెండు ప్రతులకు: పాలపిట్ట బుక్స్, ఇ.నెం. 16-11-20/6/1/1, 403, విజయ సాయి రెసిడెన్సీ, సలీమ్‌నగర్, మలక్‌పేట్, హైదరాబాద్ – 500036, ఫోన్ : 9848787284



❖ **చరిత్రలో కుసుమ ధర్మన్న –** వి. చెంచయ్య – విప్లవ రచయితల సంఘం ప్రచురణ – 32 పేజీలు, 1/8 డెమీ, రు. 30, ప్రతులకు: వి. చెంచయ్య, 'సాహితీ నిలయం', ఇ.నెం. 10-40-15ఎ, జనతాపేట నార్త్, కావలి – 524201, శ్రీ పొట్టి శ్రీరాములు నెల్లూరు జిల్లా, ఫోన్ : 9440638035

## మధు మృతి

*సిపిఐ(ఎం.ఎల్) కేంద్ర కార్యదర్శి వర్గ సభ్యులు, 'క్లాస్ స్ట్రగుల్' పత్రిక సంపాదకుడు మధు(78) ఏప్రిల్ 16న విజయవాడలో గుండెపోటుతో మృతి చెందారు. మహబూబ్‌నగర్ జిల్లాకు చెందిన మధు ఉమ్మడి కమ్యూనిస్టు పార్టీ కాలం నుండి విద్యార్థి రంగంలో పనిచేశారు. ఎమర్జెన్సీ కాలంలో కూడా దృడంగా నిలిచారు. నాటి నుంచి నేటి వరకు విప్లవ సంస్థల మధ్య ఐక్యతకోసం జరిగిన కార్యక్రమాల్లో ప్రత్యక్షంగా పాల్గొన్నారు. తరిమెల నాగిరెడ్డి విప్లవ పంథాను ముందుకు తీసుకుపోవడంలో ఆయన కృషి చేశారు. ఆ పార్టీ ఆంగ్ల పత్రిక క్లాస్ స్ట్రగుల్‌కు ఎడిటర్‌గా బాధ్యతలు నిర్వహించారు.*

## జర్నలిస్టు అమర్‌నాథ్ కన్నుమూత

*సీనియర్ జర్నలిస్టు, ప్రెస్ కౌన్సిల్ ఆఫ్ ఇండియా పూర్వ సభ్యుడు కోసూరి అమర్‌నాథ్(70) కన్నుమూశారు. హైదరాబాద్‌లోని పంజాగుట్ట నిమ్స్ ఆస్పత్రిలో గత 15 రోజులుగా కొవిడ్ కోసం చికిత్సపొందుతూ ఏప్రిల్ 20న మృతిచెందారు. ఇటీవల ప్రెస్ కౌన్సిల్ ఆఫ్ ఇండియా సమావేశాల కోసం డిల్లీ వెళ్లి వచ్చిన ఆయన కరోనా బారిన పడ్డారు. ఆంధ్రప్రదేశ్ పశ్చిమ గోదావరి జిల్లా పెనుమంట్ర మండలం మాముడూరులో 1952లో అమర్‌నాథ్ జన్మించారు. సోవియట్ భూమి, విశాలాంధ్ర పత్రికల్లో వివిధ హోదాల్లో పనిచేశారు. జర్నలిస్టుల సమస్యలపై పోరాడి వారి సంక్షేమానికి కృషిచేశారు. ఆంధ్రప్రదేశ్ యూనియన్ ఆఫ్ వర్కింగ్ జర్నలిస్ట్స్ రాష్ట్ర ప్రధాన కార్యదర్శిగా, ఇండియన్ జర్నలిస్ట్ యూనియన్ కార్యదర్శిగా బాధ్యతలు నిర్వహించారు.*

## రచయిత మధు మృతి

*ప్రముఖ కవి, రచయిత, జలపాతం పత్రికా సంపాదకుడు సి. హెచ్. మధు(76) మృతిచెందారు. నిజామాబాద్ జిల్లా కేంద్రంలోని న్యాల్‌కల్ రోడ్డులో తన నివాసంలో ఏప్రిల్ 24న మరణించారు. ఆయన గత కొంత కాలంగా క్యాన్సర్‌తో బాధపడుతున్నా... చివరి వరకు రచనను కొనసాగించారు. ఉమ్మడి మెదక్ జిల్లా సిద్దిపేట ప్రాంతంలో జన్మించిన ఆయన తర్వాత నిజామాబాద్‌లో స్థిరపడ్డారు. సాహితీ రంగంలోనే కాకుండా పాత్రికేయ రంగంలోనూ పనిచేశారు. కథలు, కవిత్వం, నవల, స్కెచ్‌లు, వ్యాసాలూ రాశారు. బట్టల దుకాణంలో గుమస్తాగా పనిచేశారు. అత్యంత నిరాడంబరుడు. పది సంవత్సరాల పాటు విరసంలో పనిచేశారు.*

# ప్రశ్నించే గళాలు, కలాలపై ఎన్ఐఎ దాడులు

*మోడీ ప్రభుత్వం రాజ్యాంగ సంస్థలను రద్దుచేసి, సహజ వనరులను, ప్రభుత్వ రంగ సంస్థలను కార్పొరేట్‌లకు కట్టబెడుతూ ప్రశ్నిస్తున్న మేధావులను ఎన్ఐఎ ద్వారా అణచివేతకు గురిచేస్తుందని అంటున్నారు* **ఎ. నర్సింహారెడ్డి**

**భా**రత జాతీయోద్యమ ప్రభావం భారత రాజ్యాంగంపై ఉందనడంలో సందేహం లేదు. భారత రాజ్యాంగం ప్రజాస్వామ్యం, స్వేచ్ఛ, సమానత్వం, వాక్ స్వాతంత్ర్యం, మత సామరస్యం వంటి స్వేచ్ఛలను ప్రజలందరికి కల్పించింది. కుల, మత, లింగ, ప్రాంత వివక్షత లేకుండా పౌరులందరికి విద్య, వైద్య, ఉపాధి అవకాశాలు కల్పించాలని రాజ్యాంగం పాలకులను నిర్దేశించింది. సోవియట్ యూనియన్ తరహా అభివృద్ధిని సాధించడానికి పంచవర్ష ప్రణాళికలు రూపొందిస్తున్నామని ఘనంగా చెప్పారు. అయితే, సోషలిస్టు ఆర్థిక విధానాన్ని అమలు చేయకుండా మిశ్రమ ఆర్థిక విధానాన్ని అమలు చేశారు. ప్రైవేట్ దోపిడీ నిరోధించడానికి బదులు పెట్టుబడిదారీ దోపిడీకి అవకాశమిచ్చారు. ప్రభుత్వ రంగంలో పారిశ్రామిక, వ్యవసాయ అభివృద్ధిని సాధిస్తామని ఆనాటి ప్రధాని నెహ్రూ చెప్పారు. కానీ మిశ్రమ ఆర్థిక విధానం ప్రజల అభివృద్ధి కంటే ప్రైవేట్ పెట్టుబడిదారుల, బడా భూస్వాముల సంపదలు పెంచుకోవడానికి ఉపయోగపడిందన్నది ఒక వాస్తవం. మరోవైపు ప్రజా అసమ్మతిని అణచివేసే ప్రయత్నాలు కొనసాగించింది. నెహ్రూ ప్రభుత్వం 1950లోనే ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టం తెచ్చింది. వేలాదిమంది కమ్యూనిస్టులను నిర్బంధించింది. 1975లో అత్యవసర పరిస్థితి ప్రకటించి ప్రతిపక్ష నాయకులను నిర్బంధించింది. కాంగ్రెస్ పాలనలో ప్రజల మౌలిక సమస్యలు పరిష్కరించబడలేదు.

మన దేశంలో 1991 నుంచి సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ఆర్థిక విధానాలు అమలుచేయడం ఆరంభించారు. ప్రపంచబ్యాంక్, అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ, ప్రపంచ వాణిజ్య సంస్థ, అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడి అనుకూల విధానాలు అమలు చేయడం వల్ల వ్యవసాయ రంగం సంక్షోభంలో పడింది. మూడు లక్షలకు పైగా రైతులు ఆత్మహత్యలకు పాల్పడ్డారు. పారిశ్రామిక ప్రగతి జరుగలేదు. అవినీతి కుంభకోణాలు పెరిగాయి. నిరుద్యోగం, పేదరికం జడలు విప్పింది. ఆర్థిక అంతరాలు అనూహ్యంగా పెరిగాయి. ఆర్థిక వృద్ధి పేరుతో ప్రజల ఆలనా పాలనను విస్మరించి సర్వం ప్రైవేట్‌కు అప్పగించేందుకు పాలకులు పూనుకున్నారు. ప్రపంచీకరణ విధానాల నిర్దేశిత ఫలితంగా ప్రజా సంక్షేమం క్షీణించి ప్రైవేట్ వ్యక్తుల సంపద అపరిమితంగా పెరిగింది. ప్రజలు మాత్రం దారిద్ర్యంలోకి కూరుకుపోతున్నారు. ఫలితంగా ఉపాధి కొరకు యువత, గిట్టుబాటు ధరల కోసం రైతులు, భద్రత కోసం కార్మికులు, బతుకు కొరకు ప్రజలు తమ అసంతృప్తిని నిరసన ఉద్యమాల ద్వారా తెలియజేస్తున్నారు. కాంగ్రెస్ ప్రభుత్వం, యుపిఎ ప్రభుత్వం కూడ టాడా, పోటా వంటి నిరంకుశ చట్టాలతో ప్రజా ఉద్యమాలను అణచివేయడానికి పూనుకున్నది. అయితే ప్రజా నిరసనలను కొంత మేరకు సరళంగా వ్యవహరించింది.

**మోడీ ఏడేళ్ల ప్రజా వ్యతిరేక ఫాసిస్టు పాలన:**

2014లో ఎన్నికల ప్రచార సభల్లో బిజెపి అధికారంలోకి వస్తే సంవత్సరానికి రెండు కోట్ల మందికి ఉపాధి కల్పిస్తామని, విదేశాలలో దాచుకున్న 70 లక్షల కోట్ల అక్రమ సంపాదనను 100 రోజుల్లో దేశానికి రప్పించి జన్‌దన్ ఖాతాల్లో ఒక్కొక్కరికి 15 లక్షలు జమ చేస్తామంది. 2022 నాటికి రైతులకు తమ పెట్టుబడికి రెట్టింపు ఆదాయం వచ్చేలా చేస్తామంది, అవినీతి లేని పారదర్శక పాలన అందిస్తామని ఊదరగొట్టారు. 'సబ్ కా సాత్ సబ్ కా వికాస్' అని ప్రజలను మభ్యపెట్టి ఓట్లు దండుకుని 2014 మే 26న నరేంద్ర మోడీ ప్రధాని పీఠాన్ని ఎక్కాడు. ఆర్ఎస్ఎస్ బిజెపికి మార్గదర్శకం చేస్తుందని మనందరికి స్పష్టంగా తెలుసు. దానికి రాజ్యాంగం పట్ల, రాజ్యాంగ ఫెడరల్ విధానం పట్ల, భారత సమాజంలోని బహుళత్వం పట్ల, లౌకిక, ప్రజాస్వామ్య విలువల పట్ల ఏమాత్రం విశ్వాసం లేదని కూడ తెలుసు. వారికి తెలిసింది మనుధర్మం అమలు చేయడం, హిందుత్వ రాష్ట్ర ఏర్పాటు (అదే అఖండ భారత్, అంటే పాకిస్తాన్, నేపాల్, భూటాన్, బంగ్లాదేశ్, శ్రీలంక, మయన్మార్, అఫ్ఘనిస్తాన్‌లతో కూడి ఉన్న భారతదేశం.) చేయడం.

ఆర్ఎస్ఎస్ రెండవ సర్‌సంఘ్ చాలక్‌గా పనిచేసిన గోల్వాల్కర్ చెప్పిన సిద్ధాంతాన్ని నరేంద్ర మోడీ పాటిస్తూ ఆర్ఎస్ఎస్ క్రమశిక్షణకు విధేయుడుగా ఉంటూ ప్రచారక్ నుండి ప్రమోషన్ పొంది మొదట గుజరాత్ ముఖ్యమంత్రిగా, ఆ తర్వాత దేశ ప్రధానిగా బాధ్యతలోకి వచ్చాడు. (గుజరాత్ మారణహోమం మనం ఇంకా మరచి పోలేదనుకుంటా). 2014 పార్లమెంట్ ఎన్నికల సమయంలో ఎన్నికల ప్రణాళికలో వాగ్దానం చేసిన ఏ ఒక్కటి ఏడు సంతవ్సరాల కాలంలో అమలులోకి రాలేదు. ఫెడరల్ విధానానికి హానీచేసే విధంగా ప్రణాళిక సంఘాన్ని రద్దు చేసి నీతి ఆయోగ్ ఏర్పాటు చేశాడు. ఆశ్రిత పెట్టుబడిదారులు అక్రమ సంపాదనను సక్రమంగా చేసుకోవడానికి పెద్ద నోట్ల రద్దు చేసి ప్రజలను బాధించాడు. చిన్న పరిశ్రమలు చితికి పోయాయి. ఆర్థిక వ్యవస్థను చిన్నాభిన్నం చేశాడు. ఆ తర్వాత రాష్ట్రాలను ఆర్థికంగా కుంగదీసి కేంద్రంపై ఆధారపడే విధంగా ఒకే దేశం ఒకే పన్ను అంటూ 'వస్తు సేవల పన్ను' విధానాన్ని తెచ్చాడు.

మోడీ ప్రభుత్వం 2019లో రెండవసారి అధికారంలోకి వచ్చాక కశ్మీర్ రాష్ట్ర అసెంబ్లీ ప్రమేయం లేకుండా రాష్ట్రాన్ని రెండుగా విభజించి కేంద్ర పాలిత ప్రాంతాలుగా మార్చాడు. కశ్మీర్ ప్రజల స్వయం ప్రతిపత్తి, స్వేచ్ఛకు హామీపడ్డ రాజ్యాంగంలోని అధికరణ 370ని రద్దు చేశాడు. రాజ్యాంగ వ్యవస్థలైన సిబిఐ, ఇడి, ఎన్ఐఎ, న్యాయ వ్యవస్థ, ఎన్నికల సంఘం ప్రభుత్వ జేబు సంస్థలుగా మారాయి. అవి తమ స్వతంత్రతను,

నిష్పాక్షికతను కోల్పోయాయి. సమాజ వికాసానికి, వ్యక్తి సృజనకు తోడ్పడవలసిన విద్యావిధానాన్ని కేంద్రీకరణ, కార్పొరేటీకరణ, కాషాయీకరణ చెందే విధంగా నూతన విద్యావిధానాన్ని తెచ్చాడు. మైనారిటీల పౌర హక్కులను నిరాకరించే విధంగా పౌరసత్వ చట్టానికి సవరణలు తెచ్చాడు. వ్యవసాయాన్ని కార్పొరేట్లకు కట్టబెట్టడానికి, రైతులను పరాధీనులుగా మార్చే వ్యవసాయ చట్టాలు తెచ్చాడు. 100 సంవత్సరాలుగా పోరాడి సాధించుకున్న కార్మిక హక్కులను హరించే విధంగా నలభై నాలుగు కార్మిక చట్టాలను రద్దు చేసి నాలుగు 'కోడ్స్'గా మార్చాడు. ఇప్పుడు ప్రభుత్వ రంగ సంస్థలను ఆశ్రిత పెట్టుబడి దారులకు కట్టబెట్టేందుకు ఉవ్విళ్లూరుతున్నారు. పై చర్యలేవి ప్రజలను ఉద్ధరించేటివి కావు. ప్రజలను, రైతులను, శ్రామికులను, వలస కాలం నాటి బానిస స్థితికి నెట్టే విధంగా మోడీ ప్రభుత్వ చర్యలు ఉన్నాయనడంలో ఎలాంటి సందేహం లేదు.

2014లో మోడీ ప్రధానిగా ప్రమాణం చేసిన సందర్భంలో మాట్లాడుతూ వాక్ స్వాతంత్ర్యం, భావ వ్యక్తీకరణ స్వేచ్ఛ ప్రజాస్వామ్యానికి రక్ష అన్నాడు. ఆయన మాటల పట్ల ఆనాడే పలువురు సందేహాలు వెలిబుచ్చితే, మన బలమైన ప్రజాస్వామిక సంస్థలు ఎంతటి వారినైన నిలువరించగలవని ఆయన వంది మాగదులు పలికారు. కానీ, గత ఏడేళ్ల కాలంలో, మరీ ముఖ్యంగా ఆ మాటలకు అర్థంలేదనీ నిర్ధారణ అవుతున్నది. మోడీ ప్రభుత్వం గోరక్షణ పేరుతో, లవ్ జిహద్ పేరుతో మైనారిటీలపై, దళితులపై దాడులు చేస్తూనే ఉంది. భిన్నాభిప్రాయాలున్న వారిని, తన కార్పొరేట్ అనుకూల విధానాలను ప్రశ్నించే వారిని క్రూరమైన నిర్బంధ చట్టాలతో ఏదో ఒకచోట ఎవరో ఒకరిని వేధిస్తూనే ఉంది. నేరస్తులను కాపాడుతూ, బాధితులనే వేదిస్తుంది. మోడీ మాటలకు చేతలకు పొంతన ఉండదని రుజువైంది.

మోడీ కార్పొరేట్ అనుకూల, అధికార కేంద్రీకరణ, ప్రజావ్యతిరేక విధానాలను ప్రశ్నిస్తున్న ఉద్యమకారులను, ప్రజా ఉద్యమాలకు మద్దతిస్తున్న నాయకులను, రచయితలను, కళాకారులను, న్యాయవాదులను, హక్కుల సంఘాల నాయకులను, విద్యార్థి, మహిళా సంఘాల నాయకులను, ప్రభుత్వ విమర్శకులను, సామాజిక మేధావులను తీవ్రవాద కార్యకలాపాల నిరోధక చట్టాలతో, దేశద్రోహ చట్టాలతో ఒక క్రమపద్ధతిలో వేటాడుతున్నారు. ప్రస్తుతం ప్రభుత్వం గురి మీడియా సంస్థల మీదకు మరింత విస్తరించింది. ప్రభుత్వ విధానాలను, ఐపిసి 124ఎ ప్రజావ్యతిరేక చట్టాలను ప్రశ్నించే మీడియా సంస్థల యజమానులు న్యాయ స్థానాల చుట్టూ తిరగాల్సి వస్తున్నది. వాటిని అదిలించి బెదిరించేందుకు ఇన్‌కమ్‌టాక్స్, ఎన్‌ఫోర్స్‌మెంట్ డైరెక్టరేట్‌లు ఉపకరిస్తున్నాయి.

ఈ పూర్వరంగంలోనే 'అజాద్ కా అమృత్ మహోత్సవ్' పేరిట దేశ 75వ స్వాతంత్ర్య దినోత్సవాన్ని జరుపడానికి మోడీ చేస్తున్న ఆర్భాటాలు ఆశ్చర్యం కలిగిస్తున్నాయి. భారతదేశం ప్రజాస్వామ్యానికి తల్లిలాంటిదని మోడీ చెప్పడం హాస్యాస్పదం. "మన రాజ్యాంగం, ప్రజాస్వామ్యం, సంప్రదాయాలు గర్వ కారణమని, అభివృద్ధి, ఆచరణ, కార్యసిద్ధి, సంకల్పం, ఆలోచనలనే మూల సూత్రాలపై ఆధారపడి మన వ్యవస్థ, పాలన ఉందని మోడీ చెప్పడం" దయ్యాలు వేదాలు వల్లించిన సామెతను గుర్తుకు తెస్తున్నది. నిజానికి ప్రజాస్వామ్యం, జాతీయ జెండా, సమాఖ్య స్ఫూర్తికి బిజెపి మాతృ సంస్థ ఆర్‌ఎస్‌ఎస్ వ్యతిరేకం. పాశ్చాత్య ప్రజాస్వామ్యం, చట్టబద్ధ పాలన, లౌకిక విధానం దేశాన్ని విభజిస్తుందని ఆర్‌ఎస్‌ఎస్ వాదిస్తోంది. వారి మనువాద సిద్ధాంతం ప్రకారం ఒకే దేశం, ఒకే సంస్కృతి, ఒకే చట్టం, ఒకే నాయకుడు. భిన్నత్వానికి, ప్రజాస్వామ్యానికి, ఫెడరలిజానికి, లౌకికతకు వ్యతిరేకులు.

హైదరాబాద్ విశ్వవిద్యాలయంలో, జవహర్‌లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయం, జామియా మిలియా ఇస్లామి విశ్వవిద్యాలయాల విద్యార్థులపై జరిగిన దాడులు, 'జాతీయ పౌరసత్వ చట్ట సవరణను వ్యతిరేకిస్తూ ఢిల్లీలో షహీన్‌బాగ్‌లో ఫిబ్రవరి 2020లో జరిగిన ఉద్యమంపై, జార్ఖండ్‌లోని ఆదివాసులపై, రైతు ఉద్యమకారులపై, జర్నలిస్టులపై, లాయర్లపై, విద్యార్థులపై, ప్రజాగొంతుకలపై ఉపా కేసులు సాధారణమైపోయాయి. అంతేగాకుండా సమాజ ప్రగతి కాంక్షించే, అసమానతలు, వివక్షను, అశాస్త్రీయ భావాలను వ్యతిరేకించే వారిని నల్ల చట్టాలతో అక్రమ కేసులు పెట్టి నిర్బంధిస్తున్నారు. కమ్యూనిస్టు నాయకుడు గోవింద్ పన్సారీ, హేతువాది నరేంద్ర దభోల్కర్, జర్నలిస్టు గౌరీ లంకేశ్, కన్నడ విద్యావేత్త కల్బుర్గి వంటి వారి హత్యలు, మోడీ విధానాలను ప్రశ్నిస్తున్నందుకు అర్బన్ నక్సల్స్ అంటూ అక్రమంగా జాతీయ దర్యాప్తు సంస్థతో దాడులు చేయిస్తూ 'ఉపా' చట్టం కింద నిర్బంధించడం మనం దేశవ్యాప్తంగా నిత్యం చూస్తునే ఉన్నాం.

**ఉపా చట్టం రాజ్యాంగ విరుద్ధం:**

1967లో ఏర్పడిన యుఎపిఎ చట్టం పరిణామక్రమం భారతదేశంలోని రాజకీయ మార్పులతో ముడిపడి ఉంది. కాలక్రమంలో ఎప్పటికప్పుడు ఇతర తీవ్రవాద వ్యతిరేక చట్టాలతో కూడా ఈ చట్టం ముడిపడి ఉంది. ఈ చట్టానికి 1969, 1972, 1986, 2004, 2008, 2019లో సవరణలు జరిగాయి. దేశంలో ఆర్థిక, సామాజిక సంక్షోభం పెరుగుతున్నా కొద్ది, ప్రజా సమస్యలను పరిష్కరించడంలో పాలకులు వైఫల్యం చెందినాకొద్ది, నిరంకుశ చట్టాలను ప్రయోగించడంలో తీవ్రత పెరుగుతోందని గుర్తించాలి. 1985లో టెర్రరిస్టు అండ్ డిస్రప్టివ్ యాక్టివిటీస్ (ప్రివెన్షన్) యాక్ట్ (టాడా) చట్టాన్ని చేసినా.... చివరకు 1995లో దాన్ని రద్దు చేశారు. ఆ తర్వాత 2002లో ప్రివెన్షన్ ఆఫ్ టెర్రరిజం యాక్ట్(పోటా)ను ఆర్డినెన్స్ ద్వారా చట్టం చేశారు. పోటా చట్టానికి కూడా దేశవ్యాప్తంగా బాధితులున్నారు. ఈ చట్టం పట్ల తీవ్ర ప్రజా వ్యతిరేకత వెలువడింది. 2004లో కేంద్రంలో తాము అధికారంలోకి వస్తే ముందు దానిని రద్దు చేస్తామని చేసిన వాగ్దానాన్ని యుపిఎ ప్రభుత్వం అమలు చేసింది. అయితే పోటాలోని అంశాలను యుఎపిఎలో చేర్చారు. టాడా పోటాలను ప్రధానంగా ముస్లింలకు వ్యతిరేకంగా ఉపయోగించారు.

కేంద్రంలో ప్రధానిగా బిజెపి నేతృత్వంలోని మోడీ రెండవసారి అధికారం చేపట్టిన తర్వాత 2019 ఆగస్ట్‌లో ఈ చట్టానికి చేసిన సవరణ ప్రకారం ప్రభుత్వానికి వ్యతిరేకంగా నిరసన తెలిపే వ్యక్తులను తీవ్రవాదులుగా ముద్ర వేయడం, తీవ్రవాద సంస్థలని భావిస్తే వాటిపై నిషేధం విధించే అధికారం ప్రభుత్వానికి ఉంటుంది. ఈ చట్టం కింద 42 సంస్థలపై నిషేధం విధించబడింది. యుఎపిఎ కింద నమోదైన కేసుల సంఖ్యను 2015తో పోలిస్తే, 2019లో 72 శాతం పెరిగాయని

పార్లమెంట్‌లో హోం మంత్రిత్వ శాఖ స్వయంగా తెలిపింది. ఉపాను తరచు ఎవరో ఒకరిపై ప్రయోగించడం జరుగుతోంది. 'ఉపా' ఒక అసాధారణ కఠోర చట్టం. పౌరుల హక్కుల విషయంలో రాజ్య ప్రయోజిత ఉల్లంఘనకు చట్టబద్ధమైన అధికారాలను కల్పించడమే ఉపా అని న్యాయ వ్యవహారాల విశ్లేషకులు వ్యాఖ్యానించడం, గుర్తించవల్సిన విషయం. ఈ చట్టం కింద నిర్బంధించబడిన వారిలో 80 శాతం నిర్దోషులని న్యాయస్థానాలు తేల్చి చెప్పాయి. నిర్బంధితులు సంవత్సరాల తరబడి జైళ్లలో ఉంటూ అనేక వేదనలకు గురయ్యారు. ఇదంత ప్రత్యర్థులను కుట్రపూరితంగా వేధించడం తప్ప మరొకటి కాదు. ఇటీవల అలహాబాద్ హైకోర్టు 80 శాతం ఉపా కేసులను కొట్టి వేసింది.

**కశ్మీర్‌లో క్రూర నిర్బంధం:**

జమ్మూకశ్మీర్‌లో ఎక్కడ ఏ చిన్న నిరసనగళం వినిపించినా, ప్రశ్నించినా వారిపై మోడీ సర్కార్ తీవ్రమైన నేరారోపణలు చేస్తూ కేసులు పెడుతోంది. ఆందోళనకు దిగుతున్న రాజకీయ నాయకులు, సాధారణ పౌరులు, మేధావులు, విద్యావేత్తలు... ఇలా అందరిపైనా 'అన్‌లాఫుల్ యాక్టివిటీస్ (ప్రివెన్షన్)' చట్టాన్ని (ఉపా) కేంద్రం ప్రయోగిస్తోంది. జాతీయ నేర గణాంకాల బ్యూరో లెక్కల ప్రకారం, జమ్మూకశ్మీర్‌లో 2015-2019 మధ్య ప్రతి ఏటా 255 ఉపా కేసులు నమోదవుతున్నాయి. 2015కు ముందు కేసుల సంఖ్య 60లోపే ఉండేవి. ఒక్క 2020 సంవత్సరంలోనే జమ్మూకశ్మీర్‌లో 921 ఉపా కేసులు నమోదయ్యాయి. కశ్మీర్‌లో ఒక అసిస్టెంట్ ప్రొఫెసర్‌పై ఉపా చట్టం కింద కేసు నమోదు చేశారు. 2018 నుంచి తప్పించుకొని తిరుగుతున్నాడని పోలీసులు ఆరోపిస్తున్నారు. అయితే ఆయన ప్రతిరోజూ కాలేజీకి హాజరైనట్టు అధికారిక సమాచారముంది.

**భీమా- కోరేగావ్ అభియోగాలు - అక్రమ నిర్బంధం:**

ఇక భీమా-కోరేగావ్ కేసు సంగతి చెప్పేదేముంది. రెండు సంవత్సరాల క్రితం నిర్బంధంలోకి తీసుకున్న 15 మంది మేధావులకు ఇప్పటివరకు బెయిల్ ఇవ్వలేదు, కేసు విచారణకు తీసుకోలేదు. ఆర్ఎస్ఎస్ గుప్పిట ప్రభుత్వం, ప్రభుత్వాదేశాల ప్రకారం ఎన్ఐఎ అది బెయిల్ ఇవ్వడానికి వీలు లేదంటే తల ఊపే కోర్టులు ఇది కక్షగట్టి విధిస్తున్న వివక్షాపూరిత శిక్ష కాక మరేమిటి!! భీమా కోరేగావ్ నిందితుల్లో ఒకరైన హక్కుల నేత రోనా విల్సన్ ల్యాప్‌టాప్ హ్యాక్ చేసి ఓ 10 లేఖలు అందులో జొప్పించారు. ఇది ఆయన అరెస్టుకు ముందే జరిగింది. హ్యాక్ అయిన విషయాన్ని మసాచుసెట్స్‌కు చెందిన ఆర్సెనల్ కన్సల్టింగ్ అనే డిజిటల్ ఫోరెన్సిక్ సంస్థ బయట పెట్టింది. ఇతర నిందితుల ల్యాప్‌టాప్‌లు కూడా సైబర్ దాడికి గురై ఉండవచ్చు. రోనా విల్సన్‌తో పాటు విప్లవ కవి వరవరరావు, సుధా భరద్వాజ్, వర్నన్ గోంజాల్వెస్, అరుణ్ ఫరేరా, గౌతమ్ నవ్లాఖా, సురేంద్ర గడ్లింగ్, సుధీర్ ధావ్లే, సోమాసేన్, ఆనంద్ తేల్తుంబ్డే మొదలైన హక్కుల కార్యకర్తలను అరెస్టు చేసి రెండున్నరేళ్లు గడుస్తున్నా బెయిల్ మంజూరు చేయడం లేదు. ఛత్తీస్‌గడ్ నుంచి అదే కేసులో 82 సంవత్సరాల స్టాన్‌స్వామిని అరెస్టు చేశారు. ఆ వృద్ధుడికి చేతులు వణుకుతాయి. గనుక, తన చేతులతో అన్నం తినలేని సమస్యలతో పాటు అనారోగ్య కారణాల వల్ల కూడ బాధపడుతున్నాడు.

**దేశంలో నిర్బంధంపై అంతర్జాతీయ సంస్థల స్పందన:**

2014లో మోడీ అధికారంలోకి వచ్చినప్పటి నుంచి దేశంలో పౌరహక్కులు అడుగంటి పోతున్నాయని, మైనారిటీలపై దాడులు పెరిగిపోయాయని, అసమ్మతిని అణచివేయడానికి రాజద్రోహ చట్టాన్ని, అన్‌లాఫుల్ యాక్టివిటీస్(ప్రివెన్షన్) చట్టాన్ని వినియోగిస్తున్నారని అమెరికాకు చెందిన ప్రభుత్వేతర సంస్థ 'ఫ్రీడంహౌస్' పేర్కొంది. దాని 2021 నివేదికలో భారత ప్రతిపత్తిని స్వేచ్ఛల దేశం నుంచి పాక్షికంగా మాత్రమే స్వేచ్ఛలున్న దేశంగా మార్చింది. 211 ప్రపంచ దేశాలను మదింపు వేసిన ఈ నివేదిక భారత్ స్థానాన్ని 83 నుంచి 88కి తగ్గించింది. మరొక అంతర్జాతీయ సంస్థ స్వీడన్‌కు చెందిన 'వీ-డెమ్' ఇనిస్టిట్యూట్ విడుదల చేసిన నివేదిక ప్రకారం భారత్‌లో ప్రజాస్వామ్యం రోజు రోజుకు దిగజారిపోతున్నది. అదే నివేదికలో భారత్ 'అతిపెద్ద ప్రజాస్వామ్యం' నుంచి 'ఎన్నికల నియంతృత్వం' స్థాయికి పతనమైందని పేర్కొంది. ప్రభుత్వంపై వచ్చే విమర్శలను అడ్డుకోవడానికి దేశద్రోహం, తీవ్రవాద వ్యతిరేక చట్టాలను విరివిగా వినియోగిస్తున్నదని తెలిపింది. ప్రపంచ దేశాలతో పోల్చుకుంటే భారత్‌లో మీడియాపై దారుణమైన 'అణచివేత' ఉందని తెలిపింది. ఇయు, ఇంగ్లాండ్ పార్లమెంట్, అమెరికా పార్లమెంట్ 370 అధికరణ రద్దు, పౌరసత్వ చట్టసవరణపై చర్చించడం జరిగింది. ప్రపంచ దేశాల రచయితలు, మేధావులు, సామాజిక కార్యకర్తలు మోడీ విధానాలను విమర్శించడం సాధారణమై పోయింది. దీంతో భారత ప్రతిష్ట, మోడీ పాలన మసకబారి పోతున్నది. దేశంలో నియంతృత్వ పెత్తందారీ విధానాలు అమలుచేస్తే కనుక అంతర్జాతీయ సమాజం నుంచి విమర్శను ఎదుర్కొనవలసి ఉంటుంది. తీవ్ర జాతీయ భావాల సాయంతో బయటి విమర్శలన్నిటిని శత్రు విమర్శలుగా ప్రచారం చేయవచ్చును కానీ, దాని ద్వారా బలమైన శత్రువులను తయారుచేసుకున్నట్లు అవుతుంది. ఇంత అప్రతిష్ట పాలయ్యే బదులు కాసింత ప్రజాస్వామ్యాన్ని సాధన చేస్తే బాగుంటుంది కదా?

**తెలుగు రాష్ట్రాల్లో ఎన్ఐఎ సోదాలు:**

తెలంగాణలో 2019 అక్టోబర్‌లో మహబూబ్‌నగర్ జిల్లాకు చెందిన నాగన్న అరెస్టుతో ఎన్ఐఎ వేట మొదలైంది. ఆ తర్వాత ప్రజా సంఘాల నాయకులు దాదాపు 74 మందిపై ఉపా కేసులు నమోదు చేశారు. ఉభయ తెలుగు రాష్ట్రాల్లో మార్చి 31న మళ్లీ ఎన్ఐఎ సోదాలు జరిగాయి. తెలంగాణకు సంబంధించిన సోదాలు హైదరాబాద్‌లో రఘునాథ్-పౌరహక్కుల సంఘం, జాన్-ప్రజా కళామండలి, దేవేంద్ర-చైతన్య మహిళా సంఘం, శిల్ప-చైతన్య మహిళా సంఘం, డప్పు రమేష్ ప్రజా గాయకుడు, స్వప్న-చైతన్య మహిళా సంఘం, దేవేందర్-దేశభక్త ప్రజాతంత్ర ఉద్యమం గారి ఇండ్లలో సోదాలు జరిగాయి. సంవత్సర కాలంగా దాదాపు 100 మందిని ఎన్ఐఎ విచారించినట్లు తెలుస్తుంది. 18 మందికి పైగా జైలుకు వెళ్లి బెయిల్‌పై వచ్చారు.

ఆంధ్రప్రదేశ్‌లో గత సంవత్సరం నవంబర్‌లో విశాఖ జిల్లా ముంచంగిపుట్టు గ్రామానికి చెందిన విలేకరి నాగరాజును అరెస్టు చేశారు. ఆ తర్వాత ఆంధ్రప్రదేశ్‌కు చెందిన 84 మంది ప్రజాసంఘాల నాయకులను అరెస్టు చేశారు. ముంచంగిపుట్టు కేసు గురించి హైకోర్టులో న్యాయ విచారణ జరుగుతుండగానే తిరిగి మార్చి 31న ఎన్ఐఎ జరిపిన

సోదాల్లో ప్రొద్దుటూరులో వరలక్ష్మి–విరసం, కర్నూలులో పాణి–విరసం, ప్రకాశం జిల్లా గణపవరంలో అంజమ్మ–అమరుల బంధుమిత్రుల సంఘం, ప్రకాశం జిల్లా ఆలకూరపాడులో–శిరీష, గుంటూరు జిల్లా తాడేపల్లిలో–రాజేశ్వరి, తూర్పుగోదావరి జిల్లా రాజమండ్రిలో–చిట్టిబాబు, గుంటూరు జిల్లా సత్తెనపల్లిలో చిలుకా చంద్రశేఖర్–పౌరహక్కుల సంఘం, వైజాగ్‌లో కెఎస్ చలం–అడ్వకేట్, విఎస్ కృష్ణ–మానవ హక్కుల వేదిక, శ్రీకాకుళం జిల్లా రాజమండ్రిలో నీలకంఠం– ప్రజా కళామండలి, గూడూరు గ్రామంలో జోగి కోదండం అమరుల బంధుమిత్రుల సంఘం, పల్లిసారథి గ్రామంలో పి. సుమ, వైజాగ్‌లో బాలకృష్ణ–రాజకీయ ఖైదీల విడుదల కమిటీ, శ్రీరామమూర్తి–పౌరహక్కుల సంఘం, నర్సరావుపేటలో వై. కోటేశ్వరరావు దేశభక్త ప్రజాతంత్ర ఉద్యమం, వైజాగ్‌లో అన్నపూర్ణ, ప్రగతిశీల కార్మిక సంఘం, మంగళగిరిలో బి. కొండారెడ్డి–ప్రగతి శీల కార్మిక సంఘం, విజయవాడలో దుడ్డు ప్రభాకర్, గుంటూరు న్యాయవిద్యార్థి క్రాంతి, తెనాలిలో కృష్ణ కుల నిర్మూలన పోరాట సమితి మొదలైన వారి ఇళ్లపై దాడి చేసి, ఏడు, ఎనిమిది గంటల పాటు ఏకదాటిగా సోదాలు నిర్వహించారు. పుస్తకాలు, సాహిత్యం, పెన్‌డ్రైవ్‌లు, ల్యాప్‌టాప్‌లు, హార్డ్‌డిస్క్‌లు, డబ్బులు తీసుకెళ్లారు. ఈ సోదాలో 70 హార్డ్‌డిస్క్‌లు, 19 పెన్‌డ్రైవ్‌లు, 40 సెల్‌ఫోన్‌లు, 44 సిమ్‌కార్డులు, 184 డివిడిలు, ఒక ల్యాప్‌టాప్, ఆడియో రికార్డర్, ఆయుధాలు, మావోయిస్టు సాహిత్యం, జెండాలు, ప్రెస్ నోట్లు, 10 లక్షల నగదు స్వాధీనం చేసుకున్నట్లుగా ఎన్ఐఏ ప్రకటించింది.

**ముగింపు:**

మోడీ ఏడు సంవత్సరాలుగా అనుసరించిన కార్పొరేట్ అనుకూల విధానాల వల్ల ఆర్థిక వ్యవస్థ పతనావస్థలోకి చేరింది. ప్రజల కొనుగోలు శక్తి సన్నగిల్లింది. యువత ఉపాధిలేమితో సతమతమవుతున్నారు. గోటి మీద రోకటి పోయిలా మోడీ ప్రభుత్వం ప్రజా సంపదను ఆశ్రిత పెట్టుబడిదారులకు అప్పనంగా కట్టబెడుతున్నది. ఫలితంగా ఆర్థిక సంక్షోభం ఏర్పడింది. అది సామాజిక సంక్షోభానికి దారి తీసింది. ప్రజా అసమ్మతి పెల్లుబుకుతోంది. ప్రజా సమస్యలు పరిష్కరించలేని మోడీ ప్రభుత్వం ఫాసిస్టు నిర్బంధాన్ని ప్రయోగిస్తుంది. ఇవాళ దేశంలో హిందుత్వ ఫాసిజం కరాళ నృత్యం చేస్తోంది. 1920, 30లలో ఇటలీ, జర్మనీల ఫాసిస్టు విధానాలు భారత్‌లో పునరావృత మవుతున్నాయి. ఆనాడు బూర్జువా ఫాసిజం అమలు కాగా ఇవాళ మన దేశంలో అదనంగా మతపరమైన హిందుత్వ ఫాసిజం జడలు విప్పుతోంది. భారత్‌లో ఫాసిజం మొదటి లక్షణం ప్రజలను కుల, మత ప్రాతిపదికన విభజించడం, రెండవది ప్రజలను భయభ్రాంతులకు గురిచేయడం, మూడవది సామాజిక మేధావులను భయపెట్టి మాట్లాడకుండా చేయడం, నాల్గవది అక్రమంగా నిర్బంధించడంగా ఉంటుంది. ఇవాళ రాజ్యాంగ వ్యవస్థలు తమ ఉనికి కోల్పోయాయి. ఫాసిస్టు పాలకులకు అనుకూలంగా అవి తమ విధులను ప్రజావ్యతిరేకంగా పాలకులకు అనుకూలంగా వ్యవహరిస్తున్నాయి.

మన దేశంలోని నిర్బంధ చట్టాల ప్రయోగం ప్రజల నుండి ప్రతిఘటన లేకుండా అల్ప సంఖ్యాక వర్గాల ఎదురులేని పాలనకు, రాజ్యాంగ స్ఫూర్తి లోపించిన పైపై మెరుగుల ప్రజాస్వామ్యానికి నిదర్శనం. పౌరుల రాజకీయ అనుబంధాల ప్రాతిపదికన వారి పట్ల వ్యవరించడం కేంద్రంలోనూ, బిజెపి పాలిత రాష్ట్రాలలోనూ పోలీసుల పక్షపాత వైఖరికి మరో నిదర్శనం. రైతుల అహింసాత్మక ఆందోళనకు మద్దతుగా ఒక ట్వీట్ చేసిన పర్యావరణ కార్యకర్త ఒకరిని అరెస్ట్ చేసి దేశద్రోహ నేరంపై జైలుకు పంపారు. ప్రభుత్వ విధానాల పట్ల అసమ్మతి వ్యక్తం చేసిన వారిని కాల్చివేయాలని బహిరంగంగా పిలుపు నిచ్చిన ఒక రాజకీయ వేత్త తన మంత్రి పదవిలో పదిలంగా ఉన్నాడు! పలు పట్టణాలలో రౌడీ మూకలు పేట పేటకు, వాడ వాడకు తిరుగుతూ రామాలయ నిర్మాణానికి ప్రజలను విరాళాలు ఇవ్వాలని డిమాండ్ చేస్తున్నా పోలీసులు చూస్తూ ఉండిపోతున్నారు!

భిన్నాభిప్రాయం, అసమ్మతి దేశద్రోహం కాదు. అవి ప్రజాస్వామ్యానికి ఊపిరి అని రాజ్యాంగ సూత్రాలూ, న్యాయస్థానాలూ ఘోషిస్తున్నప్పటికీ దేశంలో రోజురోజుకీ తీవ్రమవుతున్న అక్రమ నిర్బంధ పరిస్థితినేమనాలి? ఈ దేశం ఒక ఆధునిక దేశంగా అభివృద్ధి చెందేందుకు ప్రాతిపదికగా ఒక రాజ్యాంగం ఏర్పడింది. అది ఈ దేశంలో పౌరులందరూ సమానమేనని హామీ ఇచ్చింది. ప్రజలందరికీ ప్రాథమిక హక్కులు కల్పించింది. దేశం మతాతీతమైన రాజ్యంగా ఉండాలన్న లౌకిక విధానాన్ని నిర్దేశించింది. ఈ కర్తవ్యాల నిర్వహణకై వివిధ వ్యవస్థలకు రూపకల్పన చేసింది. ఇప్పుడా వ్యవస్థలను నిర్వీర్యం చేస్తూ రాజ్యాంగానికి తూట్లు పొడిచే కుట్రలు సాగుతుంటే... వాటిని ప్రశ్నించడం, తమ అసమ్మతిని తెలియజేయడం దేశభక్తి అవుతుందే గానీ దేశద్రోహమెలా అవుతుంది...? రాజకీయ ప్రజాస్వామిక సంక్షోభాలను ప్రజా ఉద్యమం మాత్రమే పరిష్కరించగలదన్న వాస్తవాన్ని ప్రజలు గ్రహించాలి. ప్రజాస్వామ్యం పరిఢవిల్లాలంటే రాజకీయ వ్యవస్థలు జవాబుదారీతనంతో పాటు స్వతంత్రంగా పనిచేయాలి. విస్తృతమైన, బలమైన రాజకీయ ఉద్యమం మాత్రమే జాతి జీవనానికి పునాదిగా ఉంటుంది. ప్రజాస్వామ్యం పరిఢవిల్లాలంటే పాలకులు ప్రజలకు జవాబుదారీగా ఉంటూ, రాజ్యాంగ వ్యవస్థలను స్వతంత్రంగా పని చేయనివ్వాలి. అందుకు విస్తృతమైన సంఘటిత ప్రజా ఉద్యమం మాత్రమే జాతి జీవనానికి భరోసాగా ఉంటుంది.

వైనారిటీలు, ముఖ్యంగా ముస్లింలను అన్ని విధాల బలహీనపరచడం, హిందూ మితవాద ఆందోళనకారులు నిర్భయంగా, పూర్తి స్వేచ్ఛతో వ్యవహరించేందుకు అనుమతినివ్వడం, అధికారపక్ష భావజాలాన్ని వ్యతిరేకించే వారి పట్ల అత్యంత కఠినంగా వ్యవహరించడం, మానవహక్కుల కార్యకర్తలు, సంస్థలను వేధించడం, అసమ్మతివాదులు, రాజకీయ ప్రత్యర్థులను ఎదుర్కొనేందుకు సంస్థాగత అధికారాలను, న్యాయ ప్రక్రియలను దుర్వినియోగ పరచడం భారత్‌లో ఇంతకు ముందు ఎన్నడూ లేని విధంగా జరుగుతున్నాయి. అసమానత్వాన్నీ, అవమానాన్నీ, అమానవీయతనూ రాజ్యాంగ విరుద్ధంగా ప్రజలపై రుద్దుతోంటే... ప్రశ్నించడం బాధ్యత అవుతుందే గానీ నేరమెలా అవుతుంది. ఒకవైపు అడుగడుగునా మనుషుల కదలికల మీదనే కాదు, ఆలోచనల మీద కూడా ఆంక్షలు విధిస్తూ, మరోవైపు 'ఆజాదీకా అమృత్ మహోత్సవ్' అంటూ 75వ స్వాతంత్ర్య వేడుకలకు పిలుపునివ్వడం తమ కుట్రలకు ముసుగులేయడమే. ఈ ముసుగులు తొలగించి, జాతిని మేల్కొల్పడం నేటి ఆవశ్యకత. 'స్వేచ్ఛ అంటే ఇష్టారీతిన వ్యవహరించడం కాదు, ఆవశ్యకతలను గుర్తించడం' అంటాడు మార్క్స్. ఆ ఆవశ్యకతలను గుర్తించడమే ఇప్పుడు దేశం ముందున్న కర్తవ్యం.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు, రాజనీతిశాస్త్ర విద్యార్థి)* వీ

# ఖైదీల హక్కులు రాజ్యాంగబద్ధమే

***జైలులో నిర్బంధించిన వ్యక్తికి ప్రాథమిక హక్కులు నిరాకరించకూడదని వివిధ సందర్భాలలో ఖైదీల హక్కుల కోసం కోర్టులిచ్చిన తీర్పుల అమలుకు ఉద్యమించాల్సిన అవసరాన్ని వివరిస్తున్నారు* సి.యస్.ఆర్. ప్రసాద్**

ఈ సంవత్సరం ఫిబ్రవరి నెలలో వరవరరావు, దిశా. ఎ. రవిల కేసులలో బెయిల్ మంజూరు చేస్తూ ముంబై, ఢిల్లీ హైకోర్టులు తీర్పులు ఇచ్చాయి. ఈ బెయిల్ పిటిషన్ల విచారణా క్రమంలో ఈ రెండు కేసులలోనూ న్యాయవాదులు చేసిన వాదనలు, న్యాయమూర్తులు తమ తీర్పులలో ఉటంకించిన అంశాలు చాలా విలువైనవి. ఉపా చట్టం గానీ, 124ఎ చట్టం గానీ ఎంత అమానవీయమైనవి అయినా అవి అంతిమంగా భారత రాజ్యాంగపు ప్రకటిత మౌలిక విలువలైన స్వేచ్ఛ, ప్రజాస్వామ్యం, ప్రాథమిక హక్కులకు మించినవి కావని ఈ క్రమంలో బోధపడుతోంది. అలానే భారత ప్రభుత్వం సార్వభౌమాధికారం కలిగిందైనప్పటికీ ప్రాథమిక హక్కులు, జైళ్లలో ఉన్న నిర్బంధితుల హక్కులకు సంబంధించి ప్రపంచవ్యాప్తంగా అంగీకరించబడిన అంతర్జాతీయ న్యాయ సూత్రాలకు అవి వ్యతిరేకంగా ఉండరాదని హక్కుల కార్యకర్తలు చేస్తున్న వాదనలకు ఈ తీర్పుల క్రమంలో బలం చేకూరింది. చట్టం గానీ, నేరం గానీ ఎంత తీవ్రమైనదైనా ముద్దాయిలకు తప్పనిసరిగా కొన్ని ప్రాథమిక హక్కులు ఉండి తీరుతాయి. వాటిల్లో బెయిల్ పొందే హక్కు ఒకటి. దీనికి సంబంధించి గతంలోనే సుప్రీంకోర్టు, ఇతర హైకోర్టులు తీర్పులు ఇచ్చి ఉన్నాయి. అయినా చాలా సందర్భాలలో దిగువ న్యాయస్థానాలు వాటిని పరిగణనలోకి తీసుకోకుండా ముద్దాయిలకు బెయిళ్లు నిరాకరించడం పరిపాటయింది. ఉపా కింద అరెస్టు అయితే బెయిల్ రాదనే భావన ప్రబలింది. దిగువ న్యాయస్థానాలు బెయిళ్లు నిరాకరించడం రొటీన్‌గా మారిపోయింది. న్యాయమూర్తులు తీర్పులు ప్రకటించేటప్పుడు కేసుకు సంబంధించిన నిర్దిష్టతపైన, నిందితుడికి సంబంధించిన వాస్తవ స్థితిగతులపైన మనస్సు పెట్టి, తమకుండే విచక్షణాధికారాన్ని ఉపయోగించి తీర్పులు ఇవ్వాలి. అలానే రాజ్యాంగంలో ఉన్న పదబంధాలకంటే వాటి వెనుకవున్న స్పిరిట్‌కు ఎక్కువ ప్రాధాన్యతనిస్తే సహజ న్యాయం అమలవుతుంది. అలాంటిది జరిగినప్పుడే న్యాయస్థానాలు ప్రజల స్వేచ్ఛను కాపాడగలుగుతాయి. న్యాయస్థానాలు – కిందిస్థాయివి అయినా రాజ్యాంగ సంస్థలయిన సుప్రీంకోర్టు, హైకోర్టులయినా, ఎన్ఐఎ వంటి ప్రత్యేక న్యాయ స్థానాలయినా – అంతిమంగా భారత రాజ్యాంగానికి లోబడి ఉండాలి.

ఈ నేపథ్యంలో వరవరరావు బెయిల్ పిటిషన్‌పై జరిగిన విచారణలో న్యాయవాది ఆనందగ్రోవర్, ఇందిరా జైసింగ్‌లు ప్రస్తావించిన అంశాలను తెలుసుకోవడం అవసరం.

ఉపా చట్టంలోని నిబంధనలు ఎంత కఠినమైనవి అయినా ఆరోగ్య కారణాల మీద బెయిల్ ఇవ్వమని కోరిన పిటిషన్‌ను విచారించే అధికారం న్యాయస్థానానికి ఉన్నది. న్యాయస్థానానికి–ఎన్ఐఎ న్యాయస్థానమైనా, సాధారణ న్యాయస్థానమైనా – ఉన్న ఈ అధికారాన్ని తొలగించే అవకాశం ఉపా చట్టానికి లేదు. దీనికి సంబంధించి ఆనందగ్రోవర్ గౌహతి హైకోర్టు ఎన్ఐఎ ....? రెదాల్ హుసేన్‌ఖాన్ కేసు సందర్భంగా ఇచ్చిన తీర్పును, ముంబై హైకోర్టు డివిజన్ బెంచ్ శ్రీమతి పూర్ణిమా ఉపాధ్యాయ జ. మహారాష్ట్ర ప్రభుత్వం, ఇతరుల కేసులో ఇచ్చిన తీర్పును ప్రస్తావించారు. ఉపా చట్టంలోని సెక్షన్ 43 ( డి 5) కింద బెయిల్ అప్లికేషన్ నిరాకరించబడిన ఉపా ముద్దాయికి వైద్య కారణాల మీద బెయిల్ మంజూరు చేయవచ్చని ముంబై హైకోర్టు డివిజన్ బెంచ్ తీర్పు ఇచ్చింది.

హోలోమియావ్ వర్సెస్ మోల్డోవా వివాదంలో యూరోపియన్ మానవ హక్కుల న్యాయస్థానం ఇచ్చిన తీర్పును ప్రస్తావిస్తూ ఆనందగ్రోవర్, దీర్ఘకాలిక నిర్బంధం ముద్దాయి ఆరోగ్యస్థితికి భంగకరమైనప్పుడు న్యాయస్థానం అతడికి బెయిల్ మంజూరు చేయవచ్చని అంతర్జాతీయ న్యాయసూత్రం అంగీకరిస్తుందని అన్నారు. పై కేసులో ఈ విషయాన్నే ప్రస్తావిస్తూ యూరోపియన్ మానవ హక్కుల న్యాయస్థానం వైద్య కారణాలమీద ముద్దాయికి బెయిల్ మంజూరు చేసింది.

కశ్మీర్ సింగ్ వర్సెస్ పంజాబ్ ప్రభుత్వం, కుమారి అర్చనా మనోహర్ గల్‌రాణి వర్సెస్ కర్ణాటక ప్రభుత్వం కేసులను కూడా ఆనందగ్రోవర్ ప్రస్తావించారు. మొదటి కేసులో, విచారణ ప్రారంభం కాకుండా సుదీర్ఘకాలం తీవ్రవ్యాధి పీడితులైన ముద్దాయిలను జైళ్లల్లో ఉంచడాన్ని సుప్రీంకోర్టు తప్పుపట్టింది. అదేవిధంగా కర్ణాటక హైకోర్టు రెండవ కేసులో ఉపా కంటే కఠినతరమైన నిబంధనలున్న మాదకద్రవ్యాల నియంత్రణ చట్టం కింద అరెస్టయిన వ్యక్తికి వైద్యకారణాలమీద బెయిల్ మంజూరు చేసింది.

మరొక న్యాయవాది ఇందిరా జైసింగ్ వాదిస్తూ భారత రాజ్యాంగం లోని 21వ నిబంధన ముద్దాయికి గ్యారంటీ చేసిన ప్రాథమిక హక్కు ఆధారంగా రాజ్యంగంలోని 226వ నిబంధన ప్రకారం బెయిల్ రిట్ పిటిషన్ వేశానని చెప్పారు. తాను బెయిల్ అప్లికేషన్ గురించి గానీ, ముద్దాయి విడుదల గురించి గానీ వాదించడంలేదని ఆమె అన్నారు. భారత రాజ్యాంగంలోని 21వ నిబంధన ముద్దాయికి జీవించే హక్కును గ్యారంటీ చేసిందని, ముద్దాయి వయసును, ఆయన ఆరోగ్యస్థితిని దృష్టిలో ఉంచుకుని రాజ్యాంగ న్యాయస్థానంగా ముంబై హైకోర్టు తనకున్న అధికారాన్ని వినియోగించుకుని ముద్దాయిని తక్షణం విడుదల చేయమని ఆదేశించాలని ఆమె వాదించారు. ముద్దాయికి ప్రాథమిక మైన వైద్య సౌకర్యాలను కల్పించడంలో ప్రతివాదులు విఫలమయ్యారని వాస్తవాలు నిరూపిస్తున్నాయని, వారలా చేయడం క్రూరత్వంతో సమానమని, ముద్దాయి ఆరోగ్యస్థితి దృష్ట్యా ఆయనను దీర్ఘకాలం విచారణలో ఉన్న ఖైదీగా కొనసాగించడం రాజ్యాంగ నిబంధన 21లోని ఆరోగ్యంగా జీవించే హక్కుకు ఉల్లంఘన అని ఆమె పేర్కొన్నారు.

చట్టంలో పేర్కొన్న పద్ధతి ప్రకారం ఒక ఖైదీని జైలులో ఉంచడానికి అవకాశం ఉన్నప్పటికీ భారత రాజ్యాంగంలోని 3వ భాగంలో పేర్కొన్న ప్రాథమిక హక్కులు అతనికి చెందకుండా చేయడానికి అవకాశం లేదని సుప్రీంకోర్టు తన తీర్పులలో స్పష్టంగా పేర్కొన్నదని ఆమె వాదించారు. 21వ నిబంధన ఖైదీలకు కూడా ప్రాణ రక్షణ హక్కును కల్పించినట్లుగా భావించిన అనేక తీర్పులు ఉన్నాయి. ఇందులో భాగంగానే తమ కుటుంబ సభ్యులను కలుసుకోవడానికి, సరైన ఆహారాన్ని, నీటిని పొందడానికి, సరైన వైద్య సదుపాయం పొందడానికి, ఇతర ఖైదీలతో కలిసిమెలిసి ఉండడానికి, త్వరితగతిన విచారణ పొందడానికి, ఇలాంటి ఇతర హక్కులు ఖైదీలకు ఉంటాయని ఆమె ప్రస్తావించారు. ఖైదీలు జీవచ్ఛవాలుగానో, జంతువుల స్థాయికో దిగజారకుండా ఆ హక్కులు కాపాడతాయి. ఈ సందర్భంలో ఆమె సుప్రీంకోర్టు ఇచ్చిన అనేక తీర్పులను ఉటంకించారు.

1949లో ప్రపంచ దేశాలు ఆమోదించిన అంతర్జాతీయ మానవ హక్కుల ప్రకటనలోని 5వ నిబంధనను ఇందిరా జైసింగ్ ప్రస్తావించారు. ఆ ప్రకటనలోని 5వ నిబంధన ప్రకారం ఏ వ్యక్తినీ చిత్రహింసలకు గురిచేయరాదు. ఎవరిపట్లా అమానవీయంగా ప్రవర్తించరాదు. 1976లో ఆమోదించిన పౌర, రాజకీయ హక్కులకు సంబంధించిన అంతర్జాతీయ ఒడంబడికలోని 7వ నిబంధన కూడా ఇదే వైఖరిని తీసుకున్నది. అదే విధంగా ఖైదీలపట్ల అనుసరించాల్సిన వైఖరికి సంబంధించిన కనీసపు ప్రమాణాల నిబంధనకు సంబంధించి ఐక్యరాజ్యసమితి నిర్దేశించిన సూత్రాలలోని 24, 25, 26 నిబంధనలు కూడా బయటి ప్రజలకు ఎలాంటి వైద్య సౌకర్యాలు లభ్యమవుతున్నాయో అలాంటి ప్రమాణాలతో కూడిన వైద్య సౌకర్యాలను పొందే హక్కు ఖైదీలకు ఉందని స్పష్టం చేసింది.

ఉపా లాంటి ప్రత్యేక చట్టాలలో బెయిల్ మంజూరుకు సంబంధించిన కఠినతరమైన నిబంధనలు కూడా, వైద్య కారణాల మీద ముద్దాయికి బెయిల్ ఇవ్వమని తగినంత సాక్ష్యాధారాలను చూపించినపుడు, వాటి ఆధారంగా కేసును పరిశీలించే అధికారాన్ని రాజ్యాంగ న్యాయస్థానమైన హైకోర్టు నుండి నిరోధించే అధికారం ఎవరికీ లేదని ఆమె వాదించారు.

ముద్దాయి తరపున, ప్రతివాదుల తరపున లేవనెత్తిన వాదనల దృష్ట్యా కొన్ని అంశాలను పరిశీలించాల్సిన అవసరం ఏర్పడిందని హైకోర్టు న్యాయమూర్తులు అభిప్రాయపడ్డారు. వాటిలో ఒకటి, ముద్దాయి పెట్టుకొన్న బెయిల్ దరఖాస్తును ఉపా చట్టంలోని 43డి(5)కింద న్యాయస్థానం నిరాకరించినప్పటికీ 226వ నిబంధన ప్రకారం అతని విడుదలకు ఆదేశించే హక్కు హైకోర్టుకు ఉన్నదా లేదా అన్నది. రెండు, తనను దీర్ఘకాలం పాటు జైల్లో ఉంచిన కారణంగా తన ఆరోగ్యస్థితి దెబ్బతింటుందని, అది తన జీవితానికి ప్రమాదం కలిగించడమేనని అభిప్రాయపడుతూ రాజ్యాంగంలోని 21వ నిబంధన కింద తన విడుదలను కోరే హక్కు కస్టడీలో ఉన్న ముద్దాయికి ఉందా లేదా అన్నది. ఇలాంటివే మరికొన్ని ప్రశ్నలు కూడా తలెత్తుతున్నాయని న్యాయస్థానం అభిప్రాయపడింది.

సాధారణంగా విచారణలో ఉన్న ముద్దాయి గానీ, శిక్షపడిన నేరస్థుడు గానీ క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌లోనూ, ఉపా లాంటి ప్రత్యేక చట్టాలలోనూ నిర్దేశించిన ప్రకారం న్యాయ స్థానాలలో బెయిల్‌కు పిటిషన్లు వేయవచ్చు. కిందిస్థాయి న్యాయస్థానాలు తిరస్కరిస్తే పైస్థాయి న్యాయస్థానాలకు అప్పీలు చేసుకోవచ్చు. ఇలాంటి కేసులలో న్యాయస్థానాలు అనుసరించాల్సిన ప్రమాణాలు స్పష్టంగా ఉన్నాయి. అయినప్పటికీ రాజ్యాంగంలోని 226వ నిబంధన ప్రకారం ఇలాంటి పిటిషన్‌ను విచారించే అధికార పరిధి హైకోర్టుకు ఉందా లేదా అన్నది పరిశీలించాల్సిన అవసరం ఉన్నది.

ఖైదీలకు ఉండే హక్కుల గురించి రాజ్యాంగంలోని 21వ నిబంధనను వ్యాఖ్యానిస్తూ అనేక సంవత్సరాలుగా సుప్రీంకోర్టు, వివిధ హైకోర్టులు తీర్పులు ఇచ్చి ఉన్నాయి. ఖైదీ కేవలం జైలులో ఉన్నంత కారణాన, పౌరులకు రాజ్యాంగంలోని 3వ భాగంలో గ్యారంటీ చేయబడిన హక్కులు అతనికి వర్తించవని చెప్పడానికి వీలులేదు. ఖైదీలు తమకు ఉన్న స్వేచ్ఛను చట్టబద్ధంగా కోల్పోయినప్పటికీ వాళ్లు 21వ నిబంధనలోని హక్కులను అనుభవించే అవకాశం లేదనడానికి వీలులేదు. ఒక వ్యక్తిపై మరణశిక్ష విధించబడి జైలులో ఉన్నప్పటికీ అతని జీవితాన్ని జంతు ప్రాయంగా దిగజార్చడానికి వీలులేదని ఈ సందర్భంలోనే సుప్రీంకోర్టు అభిప్రాయపడింది (సునీల్ బాత్రా, కశ్మీర్‌సింగ్ కేసు). చట్టం నిర్దేశించిన రీతిలో ఒక వ్యక్తి జైలులో నిర్బంధించబడినప్పటికీ అతనికి ప్రాథమిక మానవ హక్కులు నిరాకరించ కూడదని సునీల్‌బాత్రా II, కేసులో సుప్రీంకోర్టు అభిప్రాయ పడింది. ఒక వ్యక్తిని జైలులో నిర్బంధించడం వెనుకవున్న శిక్షాస్మృతి లక్ష్యాలను, ఖైదీల జీవన నాణ్యతను పెంచడానికి చేయవలసిన చర్యలను గురించి సుప్రీంకోర్టు చార్లెస్ శోభారాజ్ కేసులో చర్చించింది.

1382 జైళ్లలో అమానవీయ పరిస్థితులు అనే కేసులో సుప్రీంకోర్టు, మానవహక్కుల ఉల్లంఘన నేపథ్యంలో జైలులో ఉండే పరిస్థితులను గురించి, వెంటనే సంస్కరణలు తీసుకురావల్సిన అవసరం గురించి, భారతదేశం సంతకం చేసిన అంతర్జాతీయ ఒడంబడికల గురించి, నెల్సన్ మండేలా నిబంధనలుగా పిలవబడుతున్న ఖైదీల పట్ల అనుసరించాల్సిన వైఖరికి సంబంధించి ఐక్యరాజ్య సమితి ఆమోదించిన కనిష్ట నాణ్యతా ప్రమాణాల నిబంధనల గురించి కూడా ప్రస్తావించింది.

వామన్ నారాయణన్ ఘియా కేసులో రాజస్థాన్ హైకోర్టు ప్రత్యేకించి ఒక ఖైదీకుండే సరైన వైద్య సహాయాన్ని పొందే హక్కును గురించి ప్రస్తావించింది. అది రాజ్యాంగంలోని 21వ నిబంధనలో నిర్దిష్టంగా పేర్కొనబడిందని న్యాయస్థానం అభిప్రాయపడింది.

ఆర్నబ్ మనోరంజన్ గోస్వామి వర్సెస్ మహారాష్ట్ర ప్రభుత్వం కేసును విచారిస్తూ సుప్రీంకోర్టు వెలిబుచ్చిన అభిప్రాయాన్ని కూడా ముద్దాయి తరపున న్యాయవాదులు ప్రస్తావించారు. ప్రాథమిక హక్కుల ప్రశ్న తలెత్తిన కేసులలో రాజ్యాంగ న్యాయస్థానాలు తమ బాధ్యతను పక్కన పెట్టడానికి అవకాశం లేదని ఈ కేసులో సుప్రీంకోర్టు స్పష్టంగా పేర్కొన్నది. బెయిల్ పిటిషన్లను వేసుకోవడానికి వివిధస్థాయిల న్యాయస్థానాలు ఉన్నప్పటికీ ఇలాంటి కేసులలో హైకోర్టు ఒక వ్యక్తిని కస్టడీ నుండి విడుదల చేయమని ఆదేశించవచ్చని కూడా సుప్రీంకోర్టు భావించింది.

ఈ విషయంలో సుప్రీంకోర్టు గతంలో రామ్‌నికిసింగ్, కశ్మీర్‌సింగ్ కేసులోనూ ఇతర కేసుల్లోనూ ఇచ్చిన తీర్పులపై సుప్రీంకోర్టు ఆధారపడింది. ప్రత్యేక చట్టాల కింద నేరాలకు సంబంధించి, ఉన్న సమాచారం మేరకు విచారణ పూర్తి కావడానికి సంవత్సరాలు పట్టవచ్చని స్పష్టమవుతున్నప్పుడు కస్టడీలో ఉన్న ముద్దాయి రాజ్యాంగంలోని 21వ నిబంధన ప్రకారం తనకున్న హక్కుకు అనుగుణంగా తనను నిర్బంధం నుండి విడుదల చేయమని కోరుతూ హైకోర్టులో రిట్ వేయవచ్చని సుప్రీంకోర్టు గతంలో పేర్కొన్నది. ప్రస్తుతం విచారిస్తున్న ఈ కేసులో కూడా ఎన్ఐఏ తరఫున వాదించిన న్యాయవాదులు, ఎన్ఐఏ న్యాయస్థానం ఇప్పటికీ అభియోగాలను నిర్ణయించలేదనీ, రెండు వందలమంది సాక్షులను విచారించాల్సి ఉంటుందనీ పేర్కొన్నారు.

అభియోగాలు నిర్ణయించిన తరువాత ఎన్ఐఏ న్యాయస్థానం రోజువారీ విచారణను చేపడుతుందా లేదా అనేది కూడా తెలియచేయలేదు.

ఈ మధ్యనే సుప్రీంకోర్టు కె.ఎ. నజీబ్ కేసులో తీర్పు వెలువ రించింది. ఉపా చట్టంలోని 43డి (5) సెక్షన్‌లో చట్టబద్ధమైన పరిమితులు ఉన్నప్పటికీ, రాజ్యాంగంలోని మూడవ భాగపు ఉల్లంఘన జరిగినప్పుడు, రాజ్యాంగ న్యాయస్థానాలు బెయిల్ మంజూరుచేసే సామర్థ్యాన్ని కోల్పోవని ఆ కోర్టు అభిప్రాయపడింది. కస్టడీలో ఉన్న ముద్దాయి హక్కులకు, సమాజానికి ఉన్న హక్కులకు మధ్య సమతుల్యతను సాధించాల్సిన అవసరాన్ని ఆ తీర్పులో వక్కాణించారు.

అందుచేత ప్రత్యేకమైన పరిస్థితుల్లో రాజ్యాంగ న్యాయస్థానం రాజ్యాంగంలోని 226వ నిబంధన ప్రకారం తన అధికారాన్ని ఖచ్చితంగా వినియోగించుకోవచ్చు. ఉపా చట్టంలోని 43డి (5) సెక్షన్ వంటి ప్రత్యేక చట్టాల కింద రెగ్యులర్ పిటిషన్ నిరాకరించబడినప్పటికీ ముద్దాయికి అనుగుణంగా రాజ్యాంగ న్యాయస్థానం నిర్ణయాలు చేయవచ్చు.

సుప్రీంకోర్టు, వివిధ హైకోర్టులు ఇచ్చిన అనేక కేసులను పరిశీలిస్తే ఒక విషయం స్పష్టమవుతుంది. ఆర్టికల్ 21 గ్యారంటీ చేసిన ప్రాథమిక హక్కులు ఖైదీ కోల్పోడు. అంతేగాక ప్రత్యేకమైన పరిస్థితుల్లో అతన్ని కస్టడీ నుండి విడుదల చేసే అవకాశం కూడా ఉన్నది. శ్రీమతి పూర్ణిమా ఉపాధ్యాయ కేసులో కూడా ఈ న్యాయస్థానానికి చెందిన డివిజన్ బెంచ్, కొన్ని అతి ప్రత్యేకమైన కేసులలో న్యాయస్థానం రాజ్యాంగంలోని 226వ నిబంధన ప్రకారం కస్టడీ నుండి నేరస్థుడి విడుదలకు సంబంధించిన ఆదేశాలు జారీ చేసే అధికారాన్ని కలిగి ఉంటాయని నిర్దిష్టంగా గుర్తించింది.

పశ్చిమబెంగాల్ ప్రభుత్వం, ఇతరులు వర్సెస్ ప్రజాస్వామిక హక్కుల రక్షణ కమిటీ (సిపిడిఆర్) పశ్చిమబెంగాల్, ఇతరులు అనే కేసులో సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పుతో ఈ అధికారం మరింత బలపడింది. ఆ తీర్పులో ఇలా ఉంది. '32వ నిబంధన ప్రకారం ఈ న్యాయస్థానానికి, 226వ నిబంధన ప్రకారం హైకోర్టులకు ఇవ్వబడిన న్యాయ సమీక్షాధికారం రాజ్యాంగపు మౌలిక లక్షణాలలో అంతర్భాగం. ప్రాథమిక హక్కులను అమలు చేయడానికి సంబంధించి రాజ్యాంగ న్యాయస్థానాల అధికారాలను మినహాయించడానికి లేదా పరిమితం చేయడానికి పార్లమెంటు చేసే ఏ చట్టానికి అధికారం ఉండదు."

ఈ కేసులో ముద్దాయి పెట్టుకున్న పిటిషన్‌ను మేం విచారిస్తే ఇదే కారణాల మీద అనేకమంది ఖైదీలు పిటిషన్లు వేస్తారనే ప్రభుత్వ న్యాయవాదుల వాదనను మేం అంగీకరించడం లేదని కూడా న్యాయమూర్తులు అభిప్రాయపడ్డారు. అది ఖైదీకి ఉండే హక్కును నిరాకరించడమే. గతంలో వివిధ న్యాయస్థానాలు ఇచ్చిన తీర్పులేవీ కూడా తగిన కేసులలో రాజ్యాంగపర న్యాయస్థానాలు 226వ నిబంధన ప్రకారం ఆరోగ్య కారణాల మీద విడుదలను కోరుతూ వేసిన పిటిషన్లను విచారించలేదని ప్రస్తావించలేదు. ఈ విషయంలో ఇంకే దృష్టికోణాన్ని తీసుకున్నా అది 21వ నిబంధన ప్రకారం ఖైదీలకు ఉన్న హక్కును నీరుకార్చడమే అవుతుంది. ఏ కేసుకు ఆ కేసును దాని నిర్దిష్ట పరిస్థితుల నేపథ్యం నుండి, వాస్తవాల నుండి పరిశీలించాలి. వృద్ధులైన ఖైదీలపట్ల ఎలాంటి వైఖరి తీసుకోవాలన్నది కూడా ఆలోచించాల్సిన విషయం. అలాంటి ఖైదీలను, వాళ్లు అనేక రకాలైన అనారోగ్యాలకు గురైనప్పుడు, వాళ్లని జైళ్లలో అలానే ఉండనివ్వడం అంటే జీవిత చరమాంకంలోకి వాళ్ల ప్రయాణాన్ని వేగవంతం చేయడమే. ఈ కారణాల రీత్యా ముంబయి హైకోర్టు వరవరరావుకు షరతులతో కూడిన బెయిల్ మంజూరు చేసింది.

ఈ నేపథ్యంలో దేశంలోని వివిధ జైళ్లల్లో సంవత్సరాల తరబడి మగ్గుతున్న ఖైదీల గురించి మరింత సీరియస్‌గా ఆలోచించాల్సిన అవసరం ఏర్పడింది. ఖైదీలకు–శిక్షపడిన ఖైదీలైనా, అండర్ ట్రయల్ ఖైదీలైనా, సాధారణ ఖైదీలైనా, రాజకీయ ఖైదీలైనా, ఎంతటి తీవ్రమైన నేరం చేశారన్న అభియోగంపై శిక్షలకు గురైనవారైనా – భారత రాజ్యాంగంలోని 3వ విభాగంలో పేర్కొన్న ప్రాథమిక హక్కులలో కొన్ని అత్యంత ప్రధానమైనవి వర్తిస్తాయని గతంలోనే న్యాయస్థానాలు అభిప్రాయపడ్డ విషయం మనకు తెలుస్తోంది. అయినా రాజ్యం వాటిని అమలు పరచడంలో నిజాయితీగా ప్రవర్తించడంలేదు. కేవలం భారత రాజ్యాంగమే కాక అనేక అంతర్జాతీయ ఒడంబడికలు కూడా ఖైదీలకు ఉండే హక్కుల గురించి, వాళ్లపట్ల ప్రవర్తించాల్సిన తీరు గురించి అనేకమైన ప్రజాస్వామిక సంప్రదాయాలను నెలకొల్పాయి. వీటన్నింటి మీదా భారత ప్రభుత్వం సంతకాలు చేసింది. అంటే అర్థం వాటికి కట్టుబడి ఉంటానని అంగీకరించిందన్నమాట. కాని ఆచరణలో అవి ఎక్కడా అమలుపరచడం లేదు.

ఖైదీలను జైళ్లకు పంపడం వాళ్లను సంస్కరించడానికే గాని, వాళ్లపట్ల కక్షతీర్చుకోవడానికి, వాళ్లను మరింత కరుడుగట్టిన నేరస్థులుగా మార్చడానికి కాదని ఏ దేశంలో శిక్షాస్మృతి అయినా స్పష్టం చేస్తోంది. ఖైదీలపట్ల రాజ్యం మానవీయంగా ప్రవర్తిస్తే వాళ్లల్లోమార్పు తీసుకురావడం సాధ్యమవుతుంది. ఖైదీలు తరచుగా తమ భార్యా బిడ్డలను కలుసుకోవడానికి, ఇష్టపూర్వకంగా వాళ్లతో ప్రత్యక్షంగా మాట్లాడుకోవడానికి, వాళ్లతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరపడానికి, పుస్తకాలు, పత్రికలు చదువుకొని తమ జ్ఞానాన్ని అభివృద్ధి చేసుకోవడానికి, అవకాశాలు కలిగిస్తే వాళ్లలో మానసిక ఉత్సాహం, స్థైర్యం పెరుగుతాయి. అదే సమయంలో వాళ్లకి నాణ్యమైన ఆహారాన్ని ఇవ్వడం, వాళ్లకు సరైన వైద్య సౌకర్యాన్ని కలిగించడం రాజ్యం బాధ్యతగా స్వీకరించాలి. విచారణ క్రమం దీర్ఘకాలంపాటు పడుతున్న కేసులలో ముద్దాయిలకు హక్కుగా బెయిల్ పొందే అవకాశం ఉండాలి. అలానే దీర్ఘకాల శిక్షలను అనుభవిస్తున్న ఖైదీలకు తరచుగా పెరోల్ సౌకర్యాన్ని కల్పించాలి. వాళ్లలో సాంస్కృతిక వికాసానికి అవకాశం కలిగించాలి. ఖైదీలు కూడా పౌరులే కాబట్టి వాళ్లకు రాజకీయ హక్కులు కూడా కల్పించాలి. ఎన్నికల్లో పోటీచేసే హక్కు లేకపోయినా, ఓటువేసే హక్కు వాళ్లకు తప్పనిసరిగా ఉండాలి.

ఇవేవీ గొంతెమ్మకోర్కెలు కావు. నేరస్తులు జన్మించరు. నేరస్తులు సమాజం చేత తయారుచేయ బడతారు అని సామాజిక శాస్త్రవేత్తలు, క్రిమినాలజిస్టుల అభిప్రాయం. తన దేశ పౌరులతోపాటు ఖైదీల శారీరక, మానసిక, సాంస్కృతిక, కళాత్మక సామర్థ్యాన్ని కూడా వినియోగించు కోవడం నాగరికమైన, ప్రజాస్వామికమైన సమాజానికి ఒక లక్షణం.

కాని మన దేశంలో మాత్రం పరిస్థితి దీనికి పూర్తిగా విరుద్ధంగా ఉన్నది. ఇంతవరకు ఖైదీల హక్కుల క్రోడీకరణే సక్రమంగా జరగలేదు. ఖైదీల స్థితిగతులకు సంబంధించి సమగ్రమైన, శాస్త్రీయమైన చట్టాలు లేవు. ఈ అంశంలో ప్రజాస్వామికవాదులు, సంఘాలు, సామాజిక శాస్త్రవేత్తలు, కళా సాహిత్య రంగాలకు చెందిన వ్యక్తులు జోక్యంచేసుకొని, ఖైదీలకు గల ప్రజాస్వామిక హక్కులను రాజ్యాంగబద్ధం చేసే రీతిలో ప్రభుత్వం మీద ఒత్తిడి తేవడానికి ఒక బలమైన ఉద్యమాన్ని నిర్మించాల్సిన అవసరం ఎంతైనా ఉన్నది. వీ

*(రచయిత విరసం సభ్యులు)*

# రెండవ దశ కోవిడ్ విజృంభణ

***సామాజిక చింతనాపరులకు, యువతకు ప్రగతిశీల వైద్యుల, శాస్త్రవేత్తల వేదిక బహిరంగ లేఖ***

మిత్రులారా!

రెండవ దశ కోవిడ్ మహమ్మారి విజృంభణ సందర్భంగా ప్రస్తుతం మనదేశంలో ఒకే రోజు 80 వేల కేసులు నమోదు కావడం (2021 ఏప్రిల్ 1) ఒకవైపు భయాందోళనల్ని, మరోవైపు ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నది. ఢిల్లీ ఆరోగ్య శాఖ మంత్రి కోవిడ్ ఏమాత్రం ప్రజారోగ్య సమస్య కాదని ప్రకటించిన కొన్ని రోజుల్లోనే దేశ రాజధానిలో ఒక్కనాడే 3 వేల కేసులు నమోదు కావడం అందరినీ ఆశ్చర్యపరిచింది. మనం కోవిడ్‌ను ఎలా కట్టడి చేస్తున్నామోనని ప్రపంచమంతా మనవైపు ఆత్రుతగా చూస్తున్నదని ప్రధాని నరేంద్రమోడీ పదేపదే చెపుతున్న దాంట్లో పసలేదు.

రెండవ దశ కోవిడ్‌ను ఎదుర్కోలేని మన చేతగాని తనం గత సంవత్సర కాలంగా ఆరోగ్య రంగాన్ని పటిష్టపరచకపోవడాన్ని ఎత్తి చూపుతున్నది. గత ఏడాది కాలంగా అదనంగా ఒక్క కొత్త దవాఖానా గాని, కనీసం కొత్త పడకలు గాని, వైద్య సంబంధిత మానవ వనరుల్ని గాని ఏమాత్రం ఏర్పాటు చేయలేదు. శుష్క వాగ్దానాలు, సమస్యకు సంబంధించిన కార్యక్రమం చేపట్టకపోవడం వల్లే చాలా రాష్ట్రాలు ముఖ్యంగా మహారాష్ట్ర కోవిడ్ రెండవ దశ విజృంభణతో తల్లడిల్లుతున్నది.

కోవిడ్ విషయంలో ప్రభుత్వ చర్య పలు రకాల వివాదాస్పదమై పరిష్కారానికి నోచుకోని దైన్య స్థితిని చూస్తాం. ఇప్పటికీ ప్రభుత్వం ప్రజారోగ్యం, రోగ కట్టడి సూత్రాలేమీ పట్టించుకోకుండా నిర్లజ్జగా, ఆశ్చర్య చకితుల్ని చేసే విధంగా ప్రవర్తిస్తున్నది. కోవిడ్‌ను ఎదుర్కొనే సంబంధిత వ్యక్తులకు, ఇంకా చెప్పాలంటే ప్రజలందరికీ పారదర్శకంగా ప్రభుత్వ సమాచారం ఒక దృఢ విశ్వాసాన్ని కలిగించి ఉండాల్సింది. దాని బదులుగా కోవిడ్‌కు సంబంధించిన గణాంకాలు సమస్యను ఎదుర్కోవడంలో సీరియస్‌గా తయారై చిన్న చిన్న అసత్యాలే ఇలాంటి ఉష్ట్రపక్షి బాపతు ఉదాహరణ భారత ప్రభుత్వం, ఆరోగ్య, కుటుంబ నియంత్రణ మంత్రిత్వ శాఖ, ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ మెడికల్ రీసెర్చ్, జాతీయ రోగ నివారణ కేంద్రం మొదలైన వాటి ఇటీవలి ప్రవర్తనను బట్టి తెలుస్తున్నది. అదేమిటంటే 3 నెలలుగా 'మ్యుటంట్ కరోనా వేరియంట్ కమ్యూనిటీ ట్రాన్స్‌మిషన్'కు సంబంధించిన విషయాన్ని అణచిపెట్టడంలో చూస్తాం. ఈ ఉష్ట్రపక్షి బాపతు ప్రవర్తనకు మరో ఉదాహరణ 'మ్యుటంట్ స్ట్రెయిన్' అనేది మహారాష్ట్ర లాంటి చోట్ల కోవిడ్ రెండవ దశ విజృంభణకు ప్రధాన చోదకం.

కరోనా నియంత్రణ విషయంలో శాస్త్ర జ్ఞానం కంటే రాజకీయాలే కీలక నిర్ణయాలు ప్రకటించడం సిగ్గుచేటైన విషయం. రాజకీయ సభలు, సమావేశాల్లో ప్రజలు పెద్ద సంఖ్యలో పాల్గొనడం, ప్రధానితో సహా పార్టీలు, కార్యకర్తలు పెద్ద సంఖ్యలో పాల్గొనడం, మత సంబంధిత ఉత్సవాల్లో, ఊరేగింపుల్లో ఎలాంటి జాగ్రత్తలు పాటించక పూజాది కార్యక్రమాలు నిర్వహిస్తూ మరోసారి లాక్‌డౌన్ విధించే అవకాశాలున్నాయని చెప్పే వీరి మాటల్లో చిత్తశుద్ధి గాని, నిజాయితీ గాని లేవనేది ప్రజలకు తెలుస్తున్నది. ఇంకా ఈ చర్యలతో ప్రజల్లో ఓ రకమైన గందరగోళాన్ని సృష్టించడమే.

ప్రభుత్వ ద్వంద్వ నీతి అలా బహిర్గతమవుతున్నది. ప్రభుత్వం పెరుగుతున్న కరోనా ఉధృతిని ప్రజలపై నెట్టి ప్రజలు, కార్మికులు, రైతులు, మహిళలు, పిల్లల తలలపై ఎల్లప్పుడూ భయంకర లాక్‌డౌన్ ఖడ్గం వేలాడేట్లు ప్రకటనలు చేయడం తమ కనీస నైతిక కర్తవ్యాల నుండి తప్పుకోవడానికే. కరోనాను కట్టడి చేసే విషయంలో ముందూ వెనకా ఆలోచించకుండా లక్షలాది కుటుంబాలను బజారున పడేసిన ప్రభుత్వ అనాలోచిత, దీర్ఘ దృష్టి రహిత, అప్రజాస్వామిక నిన్నటి చర్యల ప్రభావం ఎలా ఉందో మన కళ్ల ముందే కనిపిస్తున్న సజీవ దృశ్యం. రోగ పెరుగుదలను అదుపు చేసే బదులు తమ అసంతృప్తిని ఇలా ప్రకటిస్తారు.

ప్రభుత్వంలో ఉన్న పెద్దలెందరో నిరంతరం ప్రచారం చేసిన పనికిరాని 'గోమూత్ర సేవనం', రామ్‌దేవ్ బాబా 'కరోనిల్' లాంటివి మహమ్మారి కట్టడి ముందు నిలువలేకపోగా కరోనాకు వ్యతిరేకంగా చేపట్టిన వ్యాక్సినేషన్ గూర్చి ప్రభుత్వం గొప్పగా చెప్పుకుంటున్నది. వాస్తవానికి 2021 ఏప్రిల్ 1 నాటికి 65 మిలియన్ డోసుల వ్యాక్సినేషన్ మాత్రమే ఇవ్వగలిగింది. ఇందులో 56 మిలియన్‌లు మొదటి డోసు తీసుకున్నారు. ఇది వైరస్‌ను ఎదుర్కొనే నిరోధక శక్తి ఏమాత్రం కాదు. భారతీయులు ఉచిత వ్యాక్సిన్ కోసం బారులు కడుతుంటే మాత్రం నరేంద్రమోడీ విదేశాలకు మందు సరఫరా చేస్తూ గొప్ప సహాయం చేస్తున్నట్లు ప్రకటిస్తున్నాడు. దేశంలో గల ఉన్నత, మధ్యతరగతి ప్రజలకు మాత్రమే సరఫరా అవుతున్నట్లు బహుళ సంఖ్యలో గల పేదలకు నిరాశే మిగులుస్తున్నది. బ్యూరాక్రటిక్ రెడ్ టేప్‌లో, డిజిటల్ గందరగోళంలో ఇరుక్కుపోయిన వ్యాక్సిన్ సరఫరా మెజారిటీ పేద బడుగులకు అందుబాటులోకి వచ్చే అవకాశం లేదు. ప్రయత్న లోపాలే గాక వ్యాక్సిన్ సరఫరాలో పూర్తిగా శాస్త్రీయత లోపించి ప్రభుత్వ ప్రయత్నంలో ప్రజల నమ్మకం కుదురుకోకపోవడం చూస్తున్నాం. భారత్ బయోటెక్ సంస్థ ఉత్పత్తి చేసిన 'కోవ్యాక్సిన్' విషయంలో లైసెన్స్ మంజూరు చేస్తూ అత్యవసర పరిస్థితిలో, ప్రజల క్షేమం దృష్టిలో పెట్టుకొని పరిమిత క్లినికల్ ట్రయల్ మోడల్‌లో వాడడానికి అనుమతించారు. శాస్త్రీయంగా పూర్తి నిర్ధారణ కాకముందే క్లినికల్ ట్రయల్స్ నిరాటంకంగా నడుస్తున్నాయి.

ఇలాంటి సందర్భంలో, ఆశించిన రీతిలో వ్యాక్సిన్ తయారు

కాకముందే వాడుతున్న దీనిపై తదనంతర పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని ప్రభుత్వం లైసెన్స్ రద్దు చేయగలదా? ఆ పిదప ప్రతికా ప్రకటన ద్వారా కోవిడ్-19 రోగ లక్షణాలున్నవారిని నిరోధించుటలో ఈ వ్యాక్సిన్ 81 శాతం సమర్థత కలిగి ఉన్నదని 2021 మార్చ్ 3న తెలిపారు. దీనికి కారణం మధ్యంతర ట్రయల్స్ అని ప్రకటించారు. ఆశ్చర్యం, ఆందోళన కలిగించే విషయమేమంటే ఏ ఒక్క ట్రయల్‌కు సంబంధించిన గణాంకాలు ఎవ్వరికీ అందుబాటులో లేవు. ఎలాంటి తత్సంబంధ సంస్థ/వ్యక్తుల సమీక్ష కూడా లేదు. కాని వ్యాక్సిన్ మాత్రం వాడకం విస్తృతంగా సాగిపోతున్నది. 20 మిలియన్ డోసుల వ్యాక్సిన్ బ్రెజిల్‌కు సరఫరా చేయడానికి ఒప్పందం చేసుకున్న బయోటెక్ సంస్థకు ఆ దేశానికి చెందిన 'అన్విష' హైదరాబాద్‌లో గల సంస్థ ప్రదేశాన్ని సందర్శించాక 'సెర్టిఫికెట్ అఫ్ గుడ్ మాన్యుఫ్యాక్చరింగ్' ఇవ్వడానికి నిరాకరించింది. ఆ రెగ్యులేటర్ ఇంకా ఏమన్నదంటే వాడకందార్లకు ఆరోగ్య ప్రమాదం, వ్యాక్సిన్‌కు సంబంధించిన రెండు గుణాలు 'స్టెరిలిటి', ప్యూరిటి గూర్చి కూడా వ్యాఖ్యానించినట్లు తెలుస్తున్నది.

'రోగం - ఆరోగ్యం' అనేవి బయో మెడికల్ కంటే ప్రధానంగా ఆర్థిక, సామాజికాంశాలు. ప్రజల మెరుగైన సామాజిక, ఆర్థిక, ఆహార స్థితిగతులే మహమ్మారి కోవిడ్ లాంటి వాటిని తట్టుకొని ఎదురు నిలబడగలవు. కాని ఆ పరిస్థితులే క్రమేపీ దిగజారిపోతున్నాయి. ఈ విషయాలనే ప్రభుత్వం కప్పిపుచ్చుతున్నది. ప్రజల పట్ల తృణీకారం, అమానవీయత, నిర్లక్ష్య పరిస్థితులను మరింత దిగజార్చి ప్రజల్ని ఇంకా ఇంకా కష్టాల పాలు చేస్తున్నవి.

ఈ సమస్యలకు తోడు ప్రజారోగ్యం పూర్తిగా నిర్లక్ష్యం చేయబడడం, ధనికుల సేవ కోసం ఆవిర్భవించిన ప్రైవేట్ వైద్యం పూర్తిగా వ్యాపారమై కోవిడ్ చికిత్సలు కూడా చేయడానికి సర్వ హంగులూ కలిగి ఉంటున్నాయి. పేదలు మాత్రం పగటి కలలు కంటూ 'ఆయుష్మాన్ భారత్' లాంటి వాటి గూర్చి తదేకంగా ఆలోచిస్తున్నారు.

ప్రైవేట్, కార్పొరేట్ వైద్యశాలలు తమ చికిత్సా వివరాలు, రేట్లు అత్యధికంగా చూపెట్టి బహాటంగా ప్రదర్శిస్తున్నాయి. గృహ మంత్రి అమిత్‌షా ఈ పెద్ద ఎత్తున జరిపే ఖర్చులపై నియంత్రణ పెడతానని ఎన్ని కబుర్లు చెప్పినా, ఎన్ని ప్రకటనలు చేసినా అవన్నీ ప్రజల ముందు నాటకాలుగా మిగులుతున్నాయి. మానవ చరిత్రలో అత్యంత ప్రమాదకర ఆరోగ్య సమస్యగా మారిన వేళ కూడా చాలా దేశాల కంటే భారతదేశం ఈ రంగంలో పెట్టే ఖర్చు చాలా తక్కువగానే ఉన్నది. కరోనా కట్టడిలో గాని, ప్రత్యేకించి వైద్య రంగంలో చేస్తున్న కృషి గాని రమారమి భారత్‌కు లేనట్లే కనిపిస్తున్నది.

కోవిడ్‌ను ఎదుర్కొనే విషయంలో భారత్ అశాస్త్రీయంగానే కాదు, శాస్త్ర వ్యతిరేకిగా నిలబడుతున్నది. ఎలాంటి ప్రభావం చూపని 20 ఇంటర్ వెన్షన్ థెరపీలు, సరియైన మందు మోతాదులేని కరోనాకు వాడే మందుల విషయంలో భారత ప్రభుత్వం అశాస్త్రీయంగా పనిచేస్తున్నది. శాస్త్రవేత్తలు, ఆరోగ్య సంబంధిత బాధ్యులు పిరికివాళ్లుగా మసలుకుంటూ ప్రభుత్వ అమానవీయ, అశాస్త్రీయ చర్యలను ఏమాత్రం వ్యతిరేకించడం లేదు, తప్పు పట్టడం లేదు. అలా ప్రభుత్వాన్ని తప్పు పట్టని వీళ్లు ప్రజలను వాళ్ల అదృష్టానికి వదిలేస్తున్నది గమనించగలం.

మనమంతా విధిగా జ్ఞాపకం పెట్టుకోవాల్సిన ఒక ముఖ్య విషయం మన నిశ్శబ్దం వైద్య ఆరోగ్య రంగం నిర్వహణను మరింత దిగజార్చి, గత ఏడాది కాలంగా జరుగుతున్న కార్యక్రమాలు రుజువుగా నిలబడతాయి. ప్రభుత్వం పెంచి పోషిస్తున్న మత రాజకీయాల నుండి తనను తాను రక్షించుకుంటూ కనీస ప్రజారోగ్యాన్ని చూడాల్సిన నైతిక బాధ్యతల నుండి తప్పించుకునేందుకు దోహదపడతాయి. మహమ్మారి విజృంభణ సాకుగా తీసుకొని అప్రజాస్వామిక ఆర్థిక ఎజెండాను రుద్ది, ప్రజా పోరాటాలను చిదిమేయగలదు.

సగం కాల్చిన రొట్టెతో ప్రమాదకర వంటకాలను వండిపెడితే అది దేశ ఆరోగ్యాన్ని గాని, ప్రజల కడుపుల్ని గాని నింపదు. అలాగే ప్రస్తుత మహమ్మారి విసిరే సవాళ్లకు ధీటైన జవాబు ప్రజలకు సంబంధించిన ఆరోగ్య విషయంలో మార్చిన ఎజెండా కావాలి. ఈ సందర్భంగా పిఎంఎస్ఎఫ్ ప్రగతిశీల శాస్త్రీయ సిబ్బంది, యువకులకు ఈ కింది విషయాలను గూర్చి సవినయంగా మనవి చేస్తున్నాం.

1) ఏ రకమైన శాస్త్రీయత లేక, ప్రజల ధన ప్రాణాలకు గుదిబండలుగా మారే 'లాక్‌డౌన్'ను గాని ఇతర ప్రమాదకర ???కాని ప్రకటించకూడదు.

2) అన్ని రకాల ఆరోగ్య సంరక్షణా సేవలు, కరోనా సంబంధిత సేవలతో సహా యథావిధిగా కొనసాగాలి.

3) కరోనా సంబంధిత కేసులు, వ్యాక్సిన్‌లను సరియైన శాస్త్రీయ పద్ధతుల్లో నడిపిస్తూ ఆర్థిక, సామాజిక సంబంధాన్నేమీ పరిగణించకుండా అందరికీ ఉచిత సేవలందించాలి. (దీంట్లో ఇన్సూరెన్స్ గాని, రీయింబర్స్‌మెంట్ గాని, ఇతర ఏ విధానాలు ఉండకుండా).

4) ప్రజారోగ్య శాస్త్రవేత్తల పర్యవేక్షణలో అన్ని కరోనా సంబంధిత విషయాలను పారదర్శకంగా ఉంచాలి.

5) ప్రజారోగ్య వ్యవస్థను బలోపేతం చేయడం, ఈ రంగంలో గల అన్ని రకాల కాంట్రాక్టు ఉద్యోగాలను పూర్తిగా ఎత్తివేయడం, అన్ని రకాల ఆరోగ్య సిబ్బందిని రెగ్యులరైజ్ చేయడం, దేశంలో ఆరోగ్య రంగం ప్రైవేటీకరణ కాకుండా తక్షణ చర్యలు చేపట్టడం.

6) ఆరోగ్య సేవను ప్రాథమిక హక్కుగా గుర్తించి, ఆల్మా ఆట ప్రకటనలో పేర్కొన్న విధంగా అందరికీ ఆరోగ్యాన్ని అందించాలి.

పోరాటం చేస్తున్న అశేష జనావళితో కలిసి మనమంతా దేశంలో ప్రజారోగ్య పునర్వైభవం కోసం కంకణబద్ధులమవుదాం.

*(స్వేచ్ఛానువాదం : ఎనిశెట్టి శంకర్)* వీ

*మానవ ఆలోచన భౌతిక సత్యాన్ని గ్రహించగలదా అనేది సైద్ధాంతిక ప్రశ్న కాదు. అది ఆచరణలో తేలే ప్రశ్న. సత్యాన్ని, అంటే, తన ఆలోచనకు సంబంధించిన వాస్తవికతనూ, శక్తినీ, తాను చూసే పార్శ్వాన్నీ మనిషి ఆచరణలోనే రుజువు చేయవలసి ఉంటుంది. ఆలోచన వాస్తవికమైనదా, అవాస్తవికమైనదా అనే వివాదాన్ని ఆచరణ నుంచి వేరు చేస్తే అది కేవలం పండిత చర్చే అవుతుంది.*

**- కార్ల్ మార్క్స్**

# తెలంగాణలో కొనసాగుతున్న అవినీతి, అణచివేత

*హక్కుల కోసం పోరాడేవారిని, అవినీతిని ప్రశ్నిస్తున్న వారిని నిర్బంధాలకు గురిచేస్తూ, పాలకులు తమ అక్రమాలను కప్పిపుచ్చుకుంటున్నారని అంటున్నారు* **చిక్కుడు ప్రభాకర్**

తెలంగాణ రాష్ట్రం ఏర్పడి ఏడు సంవత్సరాలు గడిచినా, సగటు తెలంగాణ భూమి పుత్రుని జీవన ప్రమాణాలు కనీసం పెరగలేదు, కొనుగోలు శక్తి మరింత తగ్గింది. నిరుద్యోగం మరింత పెరిగింది. రెండు, మూడు సంక్షేమ పథకాలు, అరకొర అభివృద్ధి తప్ప పెద్దగా ప్రజలకు జరిగిన మేలు ఏమిలేకపోగా, తెలంగాణ అరవై వేల కోట్ల అప్పుల నుండి మూడున్నర లక్షల కోట్ల అప్పుకు చేరుకున్నది. ఇందులో కనీసం నలభై శాతం అధికారంలో ఉన్న ఒక సామాజిక వర్గం అవినీతి చేసిందనే ఆరోపణలు రోజు రోజుకు బలపడుతున్నాయి. సమైఖ్యాంధ్రలో తెలంగాణ భూమి పుత్రులకు నీళ్లు, నిధులు, ఉద్యోగాలు దక్కడం లేదని, తెలంగాణేతర ప్రాంతాలకు ఈ ప్రాంత వనరులు దక్కుతున్నాయనే వాస్తవికత ఆధారంగా తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ఉద్యమం మొదలయింది. తెలంగాణ రాష్ట్రం ఏర్పడితే తప్ప వనరులు తెలంగాణ ప్రజలకు దక్కయని విద్యార్థి, మేధావి, ఉద్యోగ, కార్మిక, కర్షకుల, కళాకారుల, జాతీయ పెట్టుబడిదారుల నుండి రాజకీయ నాయకుల వరకు ఉద్యమంలో పాల్గొన్నారు.

విద్యార్థులు, ఉద్యోగులు, కార్మికులు చోదకశక్తిగా నడిచిన ఉద్యమ ఫలితమే తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు తప్ప ఏ ఒక్కరో, ఒక్క కుటుంబమో పోరాడితే తెలంగాణ రాష్ట్రం ఏర్పడలేదనేది ఒక భౌతిక వాస్తవం. పై వాస్తవాన్ని వక్రీకరించిన అధికార పార్టీ పెద్దలు, అధికారాన్ని అడ్డంబెట్టుకుని అపారమైన సంపదను దోపిడి చేసేందుకు, దోపిడి చేసిన ధనాన్ని నిలుపుకునేందుకు ప్రజలమీద, ప్రజా ఉద్యమాలమీద, ప్రజల ప్రజాస్వామిక ఆకాంక్షలమీద తీవ్ర నిర్బంధం కొనసాగిస్తున్నారు. ఇందులో భాగమే పెద్దపల్లి జిల్లా కల్వచెర్ల దగ్గర గత ఫిబ్రవరి 17న జరిగిన వామన్ రావు, నాగమణి దంపతుల పాశవిక హత్యలు.

తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ఉద్యమంలో న్యాయవాదుల పాత్ర ముఖ్యమైనది. అది ఎవరు చెరిపిన, చెరగని చరిత్ర. కాని ఆ న్యాయవాదులే నేడు ప్రభుత్వ ప్రజాస్వామిక, దోపిడీ విధానాలకు వ్యతిరేకంగా రాజ్యాంగబద్ధంగా, చట్టబద్ధంగా పోరాడుతున్నందుకు తప్పుడు కేసులు, అక్రమ నిర్బంధాలు, చివరికి పాశవిక హత్యలకు గురికావలిసిన పరిస్థితి ఏర్పడింది. అధికార పార్టీ నాయకత్వం కేంద్ర స్థాయి నుండి క్షేత్ర స్థాయి వరకు ఎంతకు దిగజారిందంటే, తమ అన్యాయ, దోపిడీ విధానాలకు వ్యతిరేకంగా ఎవరు మాట్లాడినా, పోరాడినా, అక్రమ కేసులు, అక్రమ అరెస్టులు. చివరికి మహిళా న్యాయవాది అని కూడా చూడకుండా వేటకొడవళ్లతో పట్టపగలు నరికి చంపడం వరకు వెళ్లింది.

ఒక వైపు తమ అధినాయకుడైన ముఖ్యమంత్రి పుట్టిన రోజు వేడుకలు జరుపుకుంటూ మరొకవైపు ఈ ఆటవిక రక్తకేళికి పాల్పడడం అత్యంత దుర్మార్గం. ఇందులో గ్రామ, మండల, నియోజకవర్గస్థాయి నేతలు పాత్రధారులుగా, అగ్రనాయకత్వం సూత్రధారులుగా ఉంది. తెలంగాణ రాష్ట్రం ఏర్పడిన మొదటినుండే సభలు, సమావేశాలు, ధర్నాలను అప్రకటిత, కొన్ని చోట్ల ప్రకటితంగా నిషేధించిన ప్రభుత్వం ప్రతిపక్ష రాష్ట్ర నాయకత్వం నుండి గ్రామ స్థాయి కార్యకర్తల వరకు అధికార పార్టీలో చేర్చుకున్నది. చేరని వారిని నాటి నుండి నేటి వరకు వేధిస్తూనేవున్నది. దాని వెనక పెద్ద కుట్ర దాగి ఉన్నది. తాను చేసే అప్రజాస్వామిక దోపిడీ విధానాలకు వ్యతిరేకంగా పోరాడే ప్రజలకు నాయకత్వం లేకుండా చేయడంలో ఫలితం సాధించి దోపిడీలో పైకి ఎగబాకింది. ప్రజాస్వామిక ఆకాంక్షలు అమలు కావాలని పోరాడుతున్న ప్రజా సంఘాల నాయకత్వాన్ని తప్పుడు కేసులలో పెట్టి, అక్రమ నిర్బంధాలకు గురిచేశారు. ఇంకొక వైపు పోడు భూములు దున్నుకుంటున్నందుకు ఆదివాసి ప్రజల మీద, తమ హక్కుల కోసం పోరాడుతున్న మైనారిటీ ప్రజల మీద, ప్రజాస్వామ్యబద్ధంగా పోరాడుతున్న న్యాయవాదుల మీద పాశవిక దమనకాండ, బూటకపు ఎదురుకాల్పుల పేరుతో, లాకప్ హత్యల పేరుతో, అమానుష హత్యల రూపంలో అధికార పార్టీ దమనకాండ కొనసాగిస్తున్నది. అధికార పార్టీని గద్దె దించకుండా తెలంగాణ ప్రజలకు మరో ప్రత్యామ్నాయం లేదు, ఇది జరగకుంటే తెలంగాణ ప్రజలకు మనుగడ కూడ లేదు. ప్రజలు కోటి ఆశలతో, అనన్య త్యాగాలతో పోరాడి సాధించుకున్న తెలంగాణలో ఇంటికో ఉద్యోగం ఇస్తామని గద్దెనెక్కిన అధికార పార్టీ పట్టుమని యాభైవేల ఉద్యోగాలను కూడా కొత్తవి నింపలేదు. మరో వైపు గత ఏడు సంవత్సరాలుగా దాదాపు రెండు లక్షల మంది పదవి విరమణ చేశారు, వాటిని కూడ నింపలేదు.

రాష్ట్ర ప్రభుత్వం గత ఏడు సంవత్సరాలుగా విద్య, వైద్యం పూర్తిగా ప్రైవేటుపరం చేసి తెలంగాణ రాష్ట్ర ఏర్పాటును వ్యతిరేకించిన వారికి అధికారం, ప్రభుత్వ ఆస్తులు అప్పచెప్పడంలోనూ అగ్రభాగాన నిలిచింది. తెలంగాణ భూమి, నీరు, ఉద్యోగాలు, ఇతర వనరులు అట్టడుగు ప్రజలకు దక్కక పోగా సంపన్నులకు వాటిని కట్టబెట్టింది. తెలంగాణలోని పట్టణ ప్రాంత భూములను ఆక్రమించుకున్న వారిని శిక్షించి ఆ భూములను ప్రజల పరం చేసే బదులు జి.వో.59/2015ను విడుదల చేసి ఆ భూములన్నింటిని బంగారు పళ్లెంలో పెట్టి భూ ఆక్రమణదారులకు నామ మాత్రపు ధరతో కట్టబెట్టింది. ఈ చర్యవలన అధికార పార్టీ పెద్దలకు పెద్ద మొత్తం లాభం చేకూరింది. ఇంకొక వైపు భూమిలేని పట్టణ పేదలకు ఇళ్లకు కేటాయించడానికి, భవిష్యత్ విస్తృత ప్రజోపయోగం కోసం భూమిలేని పరిస్థితి ఏర్పడింది.

గ్రామీణ ప్రాంతంలో వ్యవసాయ భూమిలేని దళితులకు మూడెకరాలు

ఇస్తామన్నహామీ గాలిలో కలిసింది. ఇది అమలు చేయకపోగా మూడు నాలుగు దశాబ్దాల క్రితం దళితులకు, పేదలకిచ్చిన భూములను అధికార పార్టీ క్షేత్రస్థాయి నాయకత్వం అండతో ప్రభుత్వ అవసరాల పేరుతో లాక్కోవడం వలన రాష్ట్ర వ్యాప్తంగా వేలాది నిరుపేదలు తల్లడిల్లుతుండగా, వందలాది నిరుపేదలు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. ఇక అటవి ప్రాంత ప్రజలు తెలంగాణ రాష్ట్రం ఎందుకొచ్చిందా? అని బాధపడుతున్నారు. తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ఉద్యమ సమయంలోనే ఆదివాసి ప్రజలు తమ భయాందోళనలు వ్యక్తం చేశారు.

తెలంగాణ రాష్ట్రం ఏర్పడితే ఆదివాసి ప్రజల మనుగడకు ముప్పు ఏర్పడుతుందనే అభిప్రాయంతో గోదావరి, ప్రాణహిత, శబరీ, గౌతమి, వంశధార, నాగావళి నదుల పరివాహక ప్రాంత అటవి క్షేత్రం మొత్తం ఒక రాష్ట్రంగా ఏర్పడాలనే ఆకాంక్షను కూడా వెలిబుచ్చారు. దీనిని కూడా ప్రజాస్వామిక వాదులందరు సమర్థించారు. అయితే ఆ ఆకాంక్ష ఉద్యమ రూపంగ మారలేదు కనక ఫలితం సాధించలేకపోయాం. అయితే ఏర్పడిన తెలంగాణలో అటవి ప్రాంతం మొత్తం ఇటు అటవి అధికారులు, మరోవైపు గ్రేహౌండ్స్ పోలీసుల పదఘట్టనలతో ఆదివాసి జీవితం ఛిద్రమయింది. దశాబ్దాల తరబడి పోడు చేసుకున్న భూములు హరిత హారం పేరుమీద ప్రభుత్వం గుంజుకుంటున్నది. రాజ్యాంగంలోని అయిదవ షెడ్యూల్ ప్రాంతమయిన ఉమ్మడి ఆదిలాబాద్, కరీంనగర్, వరంగల్, ఖమ్మం జిల్లాల్లోని మెజారిటీ ప్రాంతం ఆదివాసి ప్రజలు దశాబ్దాల తరబడి పోడు భూములు సేద్యం చేసుకుని జీవిస్తున్నారు.

ఈ భూములకు రక్షణ కల్పించాల్సిన చట్టాలు, భారత రాజ్యాంగంలోని అయిదవ షెడ్యూల్ ప్రాముఖ్యత, దేశ సర్వోన్నత న్యాయస్థాన తీర్పుల సారాంశంలో కూడ ఆ ప్రజలకు, ఆ భూముల మీద సర్వ హక్కులు ఉన్నాయి. అడవిని పెంచాలనే లక్ష్యంతో ఆ భూముల నుండి వారిని వెల్లగొట్టడం, వెల్లని వారిమీదికి అటవి అధికారులు, స్థానిక పోలీసులు పాశవిక దాడులు చేయడం నిత్యకృత్యమయింది. ఇంత దుర్మార్గం జరుగుతున్నా, అధికార పార్టీ ఆదివాసి ప్రజా ప్రతినిధుల నుండి కనీస స్పందనలేదు.

ఇదేమిటని ఆదివాసి ప్రజలు ప్రశ్నిస్తే వారిమీద అక్రమ నిర్బంధం, ఆదివాసి సంఘాలు ప్రభుత్వ అప్రజాస్వామిక విధానాలకు వ్యతిరేకంగా పోరాడితే వారి మీద ఉపా కేసులు మోపడం నిత్యకృత్యమయింది. 2018 శాసనసభ ఎన్నికల సమయంలో అధికారంలోకి వచ్చిన నెల రోజులకే పోడు భూములకు పట్టా ఇస్తామని ఆదివాసుల ఓట్లు దండుకుని అధికారంలోకి వచ్చిన అధికార పార్టీ, నేటికి మూడు సంవత్సరాలయినా పట్టాలు ఇవ్వలేదు. ఇవ్వకపోగా, ఆదివాసి ప్రజలపై దుర్మార్గ దాడులకు పూనుకుంటున్నది. ఇది మొత్తం తెలంగాణ సమాజం గమనిస్తున్నది.

ఇక ఉద్యోగ, ఉపాధ్యాయ, కార్మికుల పట్ల ఈ ప్రభుత్వం అనుసరిస్తున్న విధానం అత్యంత దుర్మార్గంగా ఉన్నది. కార్మిక చట్టాలు అమలు జరుగడం లేదు. కార్మికులకు అండగా నిలబడాల్సిన ప్రభుత్వం గుత్త, బడా పెట్టుబడిదారులకు అండగా నిలబడి కార్మికుల జీవితాలను ఛిద్రంచేసింది. వంద రోజులలో నిజాంషుగర్స్‌ను ప్రభుత్వం అధీనంలోకి తీసుకుంటుందని 2014 ఏప్రిల్‌లో జరిగిన ఎన్నికలలో వాగ్దానం చేసి అధికారంలోకి వచ్చిన ప్రభుత్వం, రాష్ట్ర ఉన్నత న్యాయస్థానం ఆదేశాలున్నా, ఆ ఫ్యాక్టరీని ప్రభుత్వపరం చేయకపోగా, 1934 సంవత్సరం నుండి 2018 వరకు, ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో కూడ లాకౌట్, లేఆఫ్‌కు గురికాని ఆ ఫ్యాక్టరీ నేడు తెలంగాణ రాష్ట్ర సమితి ప్రభుత్వ ఆధ్వర్యంలో 2018లో లాకౌట్ చేసింది. ఫలితంగా వందలాది మంది కార్మికులు ఆకలిచావులకు, ఆత్మహత్యలకు గురి కాగా, వేలాది మంది కార్మికులు, వారి కుటుంబాలు రోడ్డున పడ్డాయి.

ఏటూరునాగారంలోని రేయాన్స్, వరంగల్‌లోని ఆజంజాహి మిల్లు, కాగజ్‌నగర్ లోని సర్‌సిల్క్, పేపర్ మిల్స్, అంతర్గాం స్పిన్నింగ్ మిల్స్, హైదరాబాద్ నగరం నడిబొడ్డున మూసివేసిన ఏ ఒక్క పరిశ్రమ ఈ ప్రభుత్వ ఆధ్వర్యంలో తెరవకపోగా, కొన్ని పరిశ్రమలు మూసివేసింది. ఫలితంగా రెక్కాడితే డొక్కాడని కార్మికుల కొనుగోలు శక్తి పూర్తిగా పడిపోయి, జీవన ప్రమాణాలు మరింతగా తగ్గిపోయాయి. ఆర్‌టిసి కార్మికుల జీవితాలతో ఆడుకుని, ఎందరో కార్మికుల మరణానికి కారణమయింది ఈ ప్రభుత్వం. కేవలం కొన్ని సంక్షేమ పథకాలు రైతు బంధు, కళ్యాణ లక్ష్మి, ఆసరా పెన్షన్ల పేరు మీద ప్రభుత్వం పజలకు ఎంతో చేసినట్లుగా గోబెల్స్ ప్రచారం చేసుకుంటూ, ఎన్నికలు వచ్చిన ప్రతిసారి ప్రజలను మభ్యపెట్టి ఎన్నో పథకాలు అమలు చేయబోతున్నట్లు తన బహుళ మీడియా ద్వార ప్రచారం చేసుకోవడం తప్ప, తెలంగాణ ప్రజలకు జరిగింది ఏమి లేదు.

బంగారు తెలంగాణ కొరకు కష్టపడుతున్నానని, అందుకోసమే ముఖ్యమంత్రి అయ్యానని, చావునోట్లో తలకాయ పెట్టి తెలంగాణ సాధించానని ముఖ్యమంత్రి, అధికార పార్టీల నేతల గోబెల్స్ ప్రచారం శుద్ధ తప్పు, ఇది వాస్తవం కాదు. తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ఉద్యమ తొలిదశలో నాలుగు వందల మంది, మలి దశలో 1200 మంది తెలంగాణ బిడ్డలు తమ అమూల్యమైన ప్రాణాలు అర్పించారు. తెలంగాణలోని 80 శాతం ప్రజలు పోరాడి తెలంగాణ రాష్ట్ర ఏర్పాటును సాధించారు. నాడు టి.ఆర్.ఎస్. పిడికెడు క్యాడర్ కూడ లేని పార్టీ, మీడియా ముందు ప్రకటనలు, సెంటిమెంట్ రెచ్చగొట్టి, రాజీనామాలు చేయడం, మళ్లీ గెలవడం తప్ప, నాడు కూడ పోలవరం, పోతిరెడ్డిపాడుకు వ్యతిరేకంగా జి.ఓ. ఎంఎస్ నెం.610/1985 అమలుకు పోరాడిన చరిత్ర శూన్యం.

బంగారు తెలంగాణ పేరు మీద తెలంగాణను అప్పుల తెలంగాణగా మార్చిన తెలంగాణ రాష్ట్ర సమితి ప్రభుత్వం, 2014, జూన్ 2 నాటికి కేవలం 70,000 కోట్ల అప్పువుంటే, గత ఏడు సంవత్సరాలుగా నీటి ప్రాజెక్టుల పేరు మీద, ప్రజా సంక్షేమం పేరుమీద, విద్యుత్ ప్రాజెక్టుల పేరు మీద, పాత నిర్మాణాలను కూలగొట్టి కొత్త నిర్మాణాల పేరు మీద చేసిన అప్పు దాదాపు మూడున్నర లక్షల కోట్లు. గతంలో ఉన్న కార్పొరేషన్ల మీద, కొత్త కార్పొరేషన్లు ఏర్పాటు చేసి వాటి పేరు మీద విపరీతమయిన అప్పు చేసిన ప్రభుత్వ పెద్దలు ముఖ్యంగ మిషన్ కాకతీయ, మిషన్ భగీరథ, హైదరాబాద్, రంగారెడ్డి, మెదక్, మహబూబ్‌నగర్, నల్లగొండ జిల్లా సరిహద్దులలోని విలువైన భూముల అమ్మకాలు, పెట్టుబడిదారులకు కేటాయించిన భూములలో, ఇసుక, గ్రానైట్ ధందాలలో విపరీతమైన అవినీతికి పాల్పడ్డారు. ఈ అవినీతిని ప్రశ్నిస్తున్న ప్రతి వ్యక్తి, శక్తి, పార్టీ, మీడియా, ప్రజా సంఘాల నాయకులను, న్యాయవాదులను నిర్బంధానికి గురిచేస్తోంది. ప్రభుత్వ, అధికార పార్టీ నాయకత్వం దోపిడీ విధానాలను ప్రశ్నించే రాజకీయ పార్టీల నాయకులను నయాన్నో, భయాన్నో అధికార పార్టీలోకి చేర్చుకుని ప్రతిపక్షాలను బలహీనులుగా మార్చిన అధికార పార్టీ, ప్రజా సంఘాల నాయకుల మీద అక్రమ కేసులు నమోదు చేసి, అక్రమ నిర్బంధాలు పెట్టి, నిర్వీర్యం చేసి, కార్మికులను, ఉద్యోగులను అక్రమ సస్పెన్షన్ చేసి, మీడియాను తన గుప్పెట్లో పెట్టుకుని విచ్చలవిడిగా ప్రజాధనం దోపిడి చేస్తున్నది.

# ఆపరేషన్ ప్రహార్ ఒక్కటే సమాధానమా!

***నక్సలైట్ల సమస్యకు పోలీసులు పరిష్కారం కాదని, ఆర్థిక, రాజకీయ పరిష్కారమే మార్గమని అందుకు పాలకులు పరిణతి, చిత్తశుద్ధి, పరిపక్వతను ప్రదర్శించాలని అంటున్నారు* లక్ష్మణ్ గడ్డం**

ఈసారి జరిగిన ఏప్రిల్ 3 ఘటన పౌర సమాజాన్ని భారీగానే కలచి వేసింది. ఇలాంటి ఘటనలు జరిగినప్పుడు భావజాల పరంగా విడిపోయిన స్పందనలు వెలుగు చూస్తున్నాయి. అయినప్పటికీ శాంతిని ఆకాంక్షించే విడివడని సమాజం మాత్రం ఈ రక్త తర్పన ఇంకెన్నాళ్లు కొనసాగాలా, దానికి ముగింపు అందరికి ఆమోదయోగ్యంగా కనుగొనలేమా అని ఆతురత పడుతుంది. రాష్ట్రపతి, ప్రధాన మంత్రి, హోం మంత్రి అందరూ ఈ సమస్యకు తార్కిక ముగింపు కనుగొనాలని చూస్తున్నారు. అయితే కన్నుకు కన్ను, పన్నుకు పన్ను, దాడికి ప్రతి దాడి తార్కిక ముగింపు అవుతుందా. 2021 ఏప్రిల్ 3 ఘటన చివరిది అయితే బాగుండునని కోరుకున్న వాళ్లకు ప్రభుత్వం వైపు నుంచి జరుగుతున్న ఎదురుకాల్పుల హత్యలు, మావోయిస్టుల వైపు నుంచి జరుగుతున్న ఇన్‌ఫార్మర్ల హత్యలు చాలా నిరాశ కలిగిస్తున్నాయి. ఈ ఘటన జరిగిన వారం రోజులకే దంతెవాడ జిల్లాలో 2021 ఏప్రిల్ 18న కాటె కళ్యాణ్ పోలీస్ స్టేషన్ పరిధిలో గాడం – జుంగంపాల్ గ్రామాల మధ్య మిలీషియా కమాండర్ వెట్టి హూంగా ఎన్‌కౌంటర్‌తో ప్రభుత్వం వైపు నుండి మళ్లీ పాత పద్ధతి పునరావృతమైంది. చర్ల మండలం కుర్నపల్లి, బూరుసపాడు అటవీ ప్రాంతంలో మరో ముగ్గురు మావోయిస్టు పార్టీ మిలీషియా సభ్యులను అరెస్ట్ చేశారు. రెండు వైపుల నుండి కాల్పుల విరమణ జరిగి ప్రశాంత పరిస్థితులేర్పడాలని ప్రజాస్వామిక వాదులు కోరుకుంటున్నారు. తార్కిక ఆరంభం ఈ రీతిలో ఉండకూడదని ఆశిస్తున్నారు.

ఛత్తీస్‌గఢ్ రాష్ట్ర సుక్మా జిల్లా అటవీ ప్రాంతంలో ఏప్రిల్ 3న భద్రతా బలగాలకు, మావోయిస్టులకు మధ్య జరిగిన భీకర ఎన్‌కౌంటర్‌లో 24 మంది జవాన్లు మరణించారు. అందులో సెంట్రల్ రిజర్వు పోలీస్ ఫోర్స్‌లో ప్రత్యేక యూనిట్‌గా పనిచేస్తున్న కమెండో బెటాలియన్ ఫర్ రిసల్యూట్ యాక్షన్ (కోబ్రా)కు చెందిన 9 మంది, చత్తీస్‌గఢ్ రాష్ట్రానికి చెందిన 15 మంది పోలీసులు చనిపోయారు. అయితే కోబ్రా యూనిట్‌కు చెందిన జవాను రాకేశ్వర్ సింగ్‌ను గాయాలతో అదుపులోకి తీసుకున్న మావోయిస్టులు మూడు రోజుల తర్వాత మధ్యవర్తుల సమక్షంలో వదిలేశారు. రాకేశ్వర్‌ను వదిలిపెట్టడం వలన మావోయిస్టులు మహోన్నతమైన మానవత్వాన్ని చాటుకున్నారు. మావోయిస్టులంటే కేవలం హింసా వాదులని, దయా, కరుణ ఏమాత్రం లేని కఠోరమైన వ్యక్తులని ప్రభుత్వం, యంత్రాంగం, మీడియా చిత్రీకరించిన ప్రభావంలో ఉన్న వారికి రసాత్మక...? చర్య సందేశాత్మకంగా నిలిచింది. కుటుంబ సభ్యుల సున్నితమైన భావోద్వేగాలను పరిగణలోకి తీసుకున్న మావోయిస్టులు భార్యా బిడ్డల విజ్ఞప్తి మేరకు రాకేశ్‌ను వదిలిపెట్టడంతో పౌర సమాజం నిశ్చింతగా ఊపిరి పీల్చుకున్నారు. అదే రీతిలో మావోయిస్టు గనుక బలగాల చేతిలో ప్రాణాలతో చిక్కితే వదిలేసిన ఘటనలు మచ్చుకు ఒక్కటి కూడా లేదు. మానవత్వం, మంచితనం ఎటువైపు అనేదాన్ని బట్టి ప్రాణం పోసుకుంటుంది. దేశ సరిహద్దులో దేశ భద్రతకు ముప్పు తలపెట్టే విదేశీ సైన్యాలతో పోరాడాల్సిన కేంద్ర బలగాలు దేశీయంగా తమ తోటి సహోదరులతో యుద్ధం చేయడం పాలకులు విచారించలేరా! 'తమ సొంత బిడ్డలను తామే చంపుకోవడమేమిటి' అని సుప్రీంకోర్టు వెలిబుచ్చిన వక్రీకరణ పాలకుల పాలనా విధానంలో ఎప్పటికైనా మార్పుకు దారితీస్తుందని శాంతియుత సమాజం ఆశిస్తుంది. నక్సలైట్ సమస్య శాంతి భద్రతల సమస్య ఎంతమాత్రమూ కాదని, దాని వెనుక సామాజికార్థిక కోణం లోతుగా ఇమిడి ఉందని గత పాలకులు ఒకవైపు ప్రకటించుకుంటూనే మరోవైపు అణచివేత అస్త్రాన్ని ప్రయోగించుకుంటూ వచ్చారు. ప్రస్తుత బిజెపి ప్రభుత్వం నక్సలైట్ ఉద్యమంపై ఏ అభిప్రాయం ప్రకటించకుండానే అణచివేత మార్గాన్ని మాత్రం మునుపెన్నడూ లేనంత బలంగా అనుసరిస్తుంది. కాంగ్రెస్ తీసుకువచ్చిన ఆపరేషన్ గ్రీన్ హంట్‌ను బిజెపి ప్రభుత్వం ఇప్పుడు ఆపరేషన్ ప్రహార్ రూపంలో మరింత బలంగా ప్రయోగిస్తున్నది. ఆపరేషన్ గ్రీన్‌హంట్ కంటే ముందు కాంగ్రెస్ ప్రభుత్వం ఛత్తీస్‌గఢ్‌లో రాజ్యాంగేతర దళం 'సాల్వాజుడుం'ను 2004లో ఏర్పాటు చేసింది. నక్సలైట్లకు వ్యతిరేకులను, లొంగిపోయిన నక్సలైట్లను చేరదీసి ప్రభుత్వం ఆయుధాలు, శిక్షణనిచ్చి నక్సలైట్లను ఎదుర్కోవడానికి సమాజం మీదికి వదిలేసింది. నక్సలైట్లను ఎదుర్కొనే పేరుతో సాల్వాజుడుం సమాజంలో అరాచకత్వాన్ని సృష్టించింది. ఆదివాసీలకు తీవ్ర నష్టం కలిగించింది. గృహ దహనాలు, ఆస్తినష్టం, మహిళలపై అత్యాచారాలకు పాల్పడడంతో సుప్రీంకోర్టు తీవ్రంగా స్పందించి ఈ దళాలను 2009లో

---

మండల స్థాయి నుండి రాష్ట్ర స్థాయి వరకు అధికార పార్టీలో చేరిన ఇతర పార్టీ నాయకులు, గతంలో ఉన్న వారు కలిసి, నేడు అధికార పార్టీ నాయకులుగా అవతారమెత్తి అపారమైన తెలంగాణ సంపదను, సహజ వనరులను అధికార యంత్రాంగం మద్దతుతో విపరీత దోపిడీ చేస్తూ ప్రశ్నించిన ప్రజల మీద గతంలో ఎన్నడు లేని విధంగా నిర్బంధం అమలు చేస్తున్నారు. తెలంగాణ ప్రజలకు జీవన భద్రత లేకుండ చేస్తున్నారు. ఈ మొత్తం దుర్మార్గానికి కారణమైన అధికార పార్టీని కూకటివేళ్లతో పెకిలించకుండ, దానికి మూలమైన అధికారాన్ని తొలగించకుంటే తెలంగాణ ప్రజలకు భవిష్యత్తు లేదు. చైతన్యవంతంగా తెలంగాణ ప్రజలు అటువైపు విస్తృత, విశాల ప్రజాస్వామిక పోరాటాలు చేయడం ద్వారానే ప్రజాస్వామిక తెలంగాణ సాధిస్తాం, ప్రజల కోటి ఆకాంక్షలు నెరవేర్చగలుగుతాం. అప్పుడే తెలంగాణ అమరుల కళలు నెరవేరుతాయి.

*(రచయిత కన్వీనర్, తెలంగాణ ప్రజాస్వామిక వేదిక)* వీ

రద్దు చేసింది. స్వయంగా సుప్రీంకోర్టు సాల్వాజుడుంను రద్దు చేయడంతో ఎంతకీ నిద్రపట్టని కేంద్ర ప్రభుత్వం ఆపరేషన్ గ్రీన్‌హంట్ ప్రకటించి కేంద్ర బలగాలను ప్రత్యక్ష చర్యలోకి పంపింది. కేంద్ర బలగాలు ఆపరేషన్ గ్రీన్‌హంట్‌లో భాగంగా దట్టమైన అడవుల్లోకి చొచ్చుకుని పోయి మావోయిస్టు పార్టీకి తీవ్ర నష్టం కలిగించారు. వేల మంది నక్సలైట్లు ఎన్‌కౌంటర్‌లలో ప్రాణాలు కోల్పోయారు. అయినా గాని మావోయిస్టులు నష్టాల నుంచే బలగాలను దీటుగా ఎదుర్కొని నిలువరించారు. భద్రతా బలగాలు కూడా తీవ్ర నష్టాలకు గురికావడంతో కంగుతిన్న కేంద్ర ప్రభుత్వం తిరిగి ఆపరేషన్ గ్రీన్‌హంట్ స్థానంలో ఆపరేషన్ సమాధాన్ చర్యను మరింత దృఢ సంకల్పంతో 2017లో మొదలు పెట్టింది. సమాధాన్ అంటే పద సముదాయానికి మొదటి ఆధారాలతో ఏర్పడిన పదం. సమాధాన్ సంపూర్ణార్థం ఈ విధంగా ఉంటుంది.

ఎస్ – స్మార్ట్ లీడర్‌షిప్
ఎ – అగ్రెసివ్ స్ట్రాటజీ
ఎం – మోటివేషన్ అండ్
ఎ – యాక్షనబల్ ఇంటెలిజెన్స్
డి – డాష్ బోర్డ్ బేస్‌డ్ కెపిఐఎస్ (కి ఫర్‌ఫామెన్స్ ఇండికేటర్స్)
హెచ్ – హర్నెసింగ్ టెక్నాలజీ
ఎ – యాక్షన్ ప్లాన్ పర్ ఈచ్ థియెటర్
ఎన్ – నొ ఆక్సెస్ టు ఫైనాన్సింగ్

ఆపరేషన్ సమాధాన్ ద్వారా కూడా సరైన సమాధానాలు, ఫలితాలు రాకపోవడంతో కడుపులో మంట చల్లారని ప్రభుత్వం మళ్లీ ఆపరేషన్ ప్రహార్‌ను ప్రయోగించింది. నక్సలైట్లు ఆపరేషన్ ప్రహార్ దళాలకు కోలుకోలేని నష్టం తలపెట్టారు. అంబుష్‌లు, గెరిల్లా దాడులు అధికం చేశారు. అటవీ ప్రాంతంలోని దట్టమైన అడవిలోకి ప్రవేశించిన బలగాలు శవాలై తిరిగి వస్తున్నారు. పుట్టలో వేలు పెడితే కుట్టకుండా ఉంటామా అని నక్సలైట్లు అంటున్నారు. కరోనా కల్లోల కాలంలో కాల్పుల విరమణ ప్రకటించిన నక్సలైట్లకు భద్రతా బలగాలు తూటాల మోత సమాధానంగా ప్రకటించారు. అందులో భాగంగానే 2021, ఏప్రిల్ 2న అర్ధరాత్రి మొదలు పెట్టిన కూంబింగ్‌లో మరుసటి రోజు శవాలై మిగిలారు. అయితే ఇన్ని రూపాలు మార్చుకుంటూ ఏర్పాటవుతున్న ఈ బలగాలు ప్రభుత్వ ఉద్యోగులు. ఈ ప్రత్యేక బలగాలు ప్రత్యేక దళాలుగా ఏర్పడిన ఉద్యోగులు అత్యాధునిక ఆయుధాలు ధరించి అంతుపట్టని అడవిలోకి నక్సలైట్లను అరెస్టు చేయడానికి వెళుతున్నారా? తమకు అలవి కాని అడవిలోకి చీకటి బాటపట్టి ప్రాణాలు తీయబోయి ప్రాణాలు కోల్పోవడం మన పాలకులు కేవలం ఓ యుద్ధ క్రీడలో భాగమవుతున్నారేమో గాని సమాజంలో సున్నిత మనస్కులకు మనసంతా ఆవేదనా భరితమవుతుంది. ప్రజాస్వామ్యంలో హింసకు తావులేదని ప్రవచనాలు పలికే వాళ్లు 2059 మంది జవాన్లను 2021, ఏప్రిల్ 2న అర్ధరాత్రి ఛత్తీస్‌గఢ్ అడవిలో అహింస పాదులు నాటడానికి పంపించారా! ప్రాణాంతక అడవిలోకి పురమాయించడం అనైతికమైంది. ఈసారికి రక్తపాతం తారుమారయ్యింది కాని తారసపడితే జరిగేది ఏదో ఒక రక్తపాతంతో కూడిన హింసే అని పాలకులకు తెలియనిది కాదు కదా? ప్రభుత్వ జయాపజయాలు నెలకొల్పబడిన ఇన్ఫార్ వ్యవస్థ చుట్టూ తిరుగుతున్నాయి. ఏ ఇన్ఫార్మర్ వ్యవస్థ తమకు … సమకూర్చి పెట్టిందో అదే వ్యవస్థ ఇప్పుడు తమ గుండె ధైర్యం కోల్పోయేలా చేసింది. మొన్న జరిగిన నష్టానికి కారణం ఇన్ఫార్మర్ వ్యవస్థ మీద, అధికారుల మీద మోపుతూ విచారణ మొదలు పెట్టారు. రెండు వైపుల దాడికి దుర్బలమైన ఇన్ఫార్మర్లు బలవుతున్నారు.

అమాయకపు ఆదివాసీలను ఆశలకు, భ్రమలకు, బెదిరింపులకు ప్రభుత్వం గురిచేయడం అన్యాయం. ఈ నెపంతో మావోయిస్టులు వారి ప్రాణాలు బలిగొనడం అంతకంటే అన్యాయం. నక్సలైట్లు తమ రాజకీయాలను కేవలం తూటాల రాజకీయంగా పరిగణిస్తూ తూటాలతోనే పరిష్కరిస్తామనే పాలసీ విధానం సరైన పంథా అయితే ఈ పాటికే పరిష్కరింపబడాలి, అలా జరగకపోగా నక్సలైటు రాజకీయాలు విస్తరింపబడుతున్నాయి. నక్సలైటు సమస్యకు కేవలం రాజకీయ పరిష్కారమొక్కటే అంతిమ పరిష్కారం కాగలదు. అందుకు గాను పాలకులు పరిణతి, చిత్తశుద్ధి, పరిపక్వత ప్రదర్శించాలి. అప్పుడు మాత్రమే ప్రజాస్వామ్య రాజకీయ ప్రాథమిక లక్ష్యం నెరవేరుతుంది.

అయితే జరిగిన ఘటనపై కేంద్ర హోం మంత్రి అమిత్ షా తీవ్రంగా స్పందించారు. తగిన సమయంలో తగిన విధంగా నక్సల్స్‌కు సమాధానం ఇస్తామని, శాంతి, అభివృద్ధిలకు శత్రువులైన వారిపై మా యుద్ధాన్ని కొనసాగిస్తామని ప్రకటించారు. ఈ ప్రకటనలు వారి దృక్పథాలను వెల్లడి చేస్తాయి. సరిగ్గా ఈ వ్యూహాలే ఇరు వర్గాలకు నష్టం కలిగించాయి. ఎత్తుగడల్లో ఎవరిది పై చేయి అనే దాన్ని బట్టి ఫలితాలు వచ్చాయి. మావోయిస్టులకు రాంగూడ, గడ్చిరోలి లాంటి ఘటనలో భారీ నష్టాలు, ప్రభుత్వ దళాలకు బలిమెల, చింతల్నార్, తెర్రాం లాంటి ఘటనల్లో తేరుకోలేని నష్టాలు చోటుచేసుకుంటున్నాయి. ఇప్పటికినీ రాజకీయాలకు కాకుండా దాడులకు ఎత్తుగడలు రూపొందిస్తూ నక్సలైట్ల పై దాడులు చేసేందుకు పెద్ద ఎత్తున కోబ్రా బలగాలను వెంటనే రంగంలోకి దించింది. దీనికి గాను ఆపరేషన్ ప్రహార్-3 పేరును ఖరారు చేశారు. జరిగిన దానికి ప్రతీకారంగా మావోయిస్టులను అధిక సంఖ్యలో కాల్చివేస్తే అంతమైపోయే సమస్య కాదిది. దేశంలో ముఖ్యంగా మైదాన ప్రాంతంలో పేదరికం, ఆకలి సమస్య ఉన్నంత వరకు, అడవిలో ఆదివాసీలున్నంత వరకు నక్సలిజం ఉంటుందనేది అనుభవంలోకి వచ్చిన అంశం. ప్రజాస్వామ్య బద్ధంగా పోరాడుతున్న ప్రజలు తమ హక్కులు కోల్పోతున్నంతవరకు ఈ సమస్య సజీవంగా మనుగడ సాగిస్తుంది. 75 సంవత్సరాల స్వతంత్ర భారతదేశంలో దాదాపుగా 38 శాతం ప్రజలు దారిద్ర రేఖ దిగువనుండడం విషాదం. ఆదివాసి ప్రజల్ని అన్ని విధాల అభివృద్ధి పరిచిన నాడు, దేశంలో ఆకలి, పీడన, నిరుద్యోగం నిర్మూలించి ఆత్మగౌరవ, సమ సమాజ జీవన విధానం ఏర్పడిన నాడు బహుశ నక్సలిజానికి తావుండదేమో.

మావోయిస్టులను సమూలంగా ఏరివేస్తామని ప్రభుత్వం, మరో వైపు పారా మిలిటరీ బలగాలు తమపై దాడులు చేయడానికి ప్రయత్నాలు విరమించుకోకపోతే మూల్యం తప్పదని మావోయిస్టులు పరస్పర సవాళ్లు విసురుకుంటుంటే పరిస్థితి ఎటువైపు మళ్లుతుందోనని శాంతి కాముకులు ఆందోళన చెందుతున్నారు. కేవలం తమను తాము రక్షించుకునే క్రమంలోనే ప్రతి దాడులు చేస్తున్నామని, పోలీసులు మాకు ఏనాడూ శత్రువులు కాదని, చనిపోయిన వారి కుటుంబాలకు సంతాపం తెలిపారు. ఉద్రిక్త పరిస్థితులను నిలువరించి శాంతి నెలకొల్పే దిశగా శాంతి చర్చల్లో పాల్గొనడానికి మేము సిద్ధమేనని ప్రకటించడం సర్వత్రా ఆహ్వానించదగిన విషయం. ఇటు దిశగా ప్రభుత్వం అడుగులు ముందుకు పడాలి కాని ఇప్పటి వరకు ఆ దిశగా ప్రభుత్వం స్పందన కనపడలేదు. అయితే ఛత్తీస్‌గఢ్ రాష్ట్ర కాంగ్రెస్ పార్టీ ఎన్నికల ముందు శాంతి చర్చలు నిర్వహిస్తామని మెనిఫెస్టోలో ప్రకటించింది. ఎన్నికల్లో గెలిచాక ఇప్పటివరకు చొరవచూపలేదు. శాంతి చర్చల కోసం 2013లో స్వామి అగ్నివేశ్ చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. పైగా చర్చల ప్రతినిధులుగా నియమింపబడ్డ మావోయిస్టు నేత ఆజాద్, జర్నలిస్టు హేమచంద్ర

# తక్షణ విశ్లేషణలు - తప్పుడు నిర్ధారణలు

***జీరగూడ ఘటన నేపథ్యంలో తక్షణ విశ్లేషణలను దాటి దీర్ఘకాలిక, విస్తృత సామాజిక అంశాలను పరిగణనలోకి తీసుకోవాలంటున్నారు* జహంగీర్**

ఏప్రిల్ 3నాడు ఛత్తీస్‌గఢ్ రాష్ట్రంలోని బీజాపుర్, సుక్మా జిల్లాల సరిహద్దులలోని ఓ చిన్న ఆదివాసీ గ్రామం జీరగూడ వద్ద ప్రజా విముక్తి గెరిల్లా సైనికులు మాటుదాడి జరిపి 54 మంది పోలీసులను హతమార్చడమో, గాయపర్చడమో చేసిన విషయంపై గత వారం రోజులుగా ఎడతెగని చర్చ జరుగుతోంది. ఆ దాడిని రెండు రకాలుగా విశ్లేషిస్తున్నారు. ఆ దాడిలో స్వాధీన పరుచుకున్న 14 ఆయుధాలు, తమ సహచరుల ఐదుగురి అమరత్వాలు మున్నగు వివరాలన్నీ నాలుగు రోజులలోపే దండకారణ్య అధికార ప్రతినిధి కామ్రేడ్ వికల్ప్ బహిరంగపరిచాడు.

దాడి స్థలం నుండి గెరిల్లాలు అరెస్టు చేసి తమ వెంట తీసుకెల్లిన జమ్మూకు చెందిన అర్ధ సైనిక జవాన్ రాకేశ్వర్ సింగ్ మన్హాస్‌కు ప్రాణహాని తలపెట్టకుండా వదిలివేస్తామనీ మూడో రోజే వారే మీడియా మిత్రులకు సుస్పష్టం చేశారు. అదే విధంగా కోబ్రా జవానును క్షేమంగా ప్రభుత్వ మధ్యవర్తులకు అప్పగించడం అభినందనీయం. అభయ్ పిఎల్‌ఏ గెరిల్లాల దాడులను అభినందిస్తూ ఏప్రిల్ 5న విడుదల చేసిన ప్రకటనలో పోలీసు జవాన్లకు చేసిన విజ్ఞప్తిని మీడియా ఎక్కడా ప్రస్తావించడమే లేదు. జవాన్ల పార్థివ శరీరాలతో పాటు వారి స్వస్థలాలకు విప్లవ సందేశం కూడ వెళ్తుందని చెప్పిందానికి ఇపుడు జవాన్ విడుదల మృతుల బంధుమిత్రులు ఆలోచించడానికి ఒక సజీవ నమూనాగా వారి ముందు ఉంటుంది. ఇవన్నీ అంతర్జాలంలో అందరికీ అందుబాటులో ఉన్నందున నేను వాటిలోకి వెళ్లడం లేదు. దాడిపై మీడియాలో జరుగుతున్న విశ్లేషణలకే పరిమితం అవుతాను.

పైనే చెప్పినట్టు జీరగూడ మాటుదాడిపై మీడియాలో యథావిధిగా రెండు రకాల విశ్లేషణలు మన ముందుకు వస్తున్నాయి. ఒకటి, శుద్ధ సైనిక విశ్లేషణ (ఫోకో థియరీ). మరోటి, రాజకీయ విశ్లేషణ. శుద్ధ సైనిక విశ్లేషణలో ఎంతసేపూ అజయ్ సహానీ మొదలుకొని అనేక మంది సైనిక విశ్లేషకులు గెరిల్లాల ఆచరణతో సంబంధం లేని వినికిడి లేదా పుస్తక జ్ఞానంపై ఆధారపడిన విశ్లేషణలతో కుస్తీలు పడుతున్నారు. నక్సలిజం గురించి తోచిన నిర్వచనాలు ఇస్తున్నారు. వారంతా, దాడి సమయంలో పోలీసులు, భద్రతా బలగాలు 'స్టాండర్డ్ ఆపరేషనల్ ప్రొసీజర్స్, పాటించారా, లేదా అనే దానిపై శోధిస్తున్నారు. మార్చ్ 23నాడు నారాయణపుర్ జిల్లా కడెనార్‌లో పోలీసులు వాహనాల్లో వెళ్లడం సరైంది కాదంటారు. కానీ, కేరళతో సమాన భూభాగాన్ని కలిగిన బస్తర్‌ను కాలినడకన చుట్టిరావడం సాధ్యం కాదంటారు పోలీసులు. పోతే, మందుపాతర నిరోధక వాహనాన్ని పేల్చివేసిన ప్రతి సందర్భంలో ప్రకాశ్ సింగ్ లాంటి విశ్రాంత డిజిలు 'మృత్యు వాహకాల్లో పోలీసులను బలిగొంటున్నారంటూ' ధర్మాగ్రహాన్ని వ్యక్తం చేయడం తెలిసిందే! గిల్ లాంటి అధికారులు పాలకుల అవినీతిపై విరుచుకపడడం చూశాం. ఇలాంటి విశ్లేషణలతో గెరిల్లాల దాడులు నిలిచిపోవనీ మావోయిస్టు ఉద్యమ ప్రాంతాల నిజాలు వెల్లడిస్తున్నాయి. ఈ ఆలోచనాపరులంతా మావోయిస్టులతో ప్రభుత్వ చర్చలకు బద్ధ వ్యతిరేకులు. వీరిలో కరుడుగట్టిన అత్యున్నత పోలీసు అధికారులు, వారి రాజకీయ నాయకులున్నారు. ఈ విశ్లేషణలు ప్రజలతో, వారి సమస్యలతో ఎంతమాత్రం సంబంధం లేనివి.

పోతే, సాధారణంగా గెరిల్లాలు గెలుచుకున్న ప్రతి బ్యాటిల్ తరువాత చాలా మంది తమకు అలవాటైన ఇంటలిజెన్స్ వైఫల్యం అనే విషయంపై మల్లగుల్లాలు పడుతుంటారు. అయితే ఈసారి మాత్రం అలాంటిదేదీ లేదనీ పోలీసు అధికారులు దబాయిస్తున్నారు. 'యుద్ధంలో మోసానికి హద్దులుండవు' అనే యుద్ధనీతిని తాము ఖంగుతిన్న జీరగూడ దాడికి అన్వయించుకుంటే దేని వైఫల్యమో తెలిసిపోతుంది. ఈసారి గెరిల్లాలు కవర్ల చాటు నుండి కాల్పులు జరుపకుండా ఎదురుగా నిల్చి కాల్చారనే కొత్తదనాన్ని జోడిస్తున్నారు. కానీ, బ్యాటిల్లో ఫైరింగే మంచి కవరనే విషయాన్ని వారు గుర్తుకు తెచ్చుకుంటే మంచిది. అయినా, గతంలోనూ అనేక సందర్భాలలో గెరిల్లాలు ఇలాంటి కాల్పులు జరిపిన సమీక్షలున్నాయి. ప్రస్తుతం నార్త్ బ్లాక్ అంతా బదులు తీసుకోవడం, రెట్టింపు బలగాలతో మావోయిస్టుల కోటలోకి మరోమారు దాడికి వెళ్లడం లాంటి ప్రతీకార వాంఛిత ప్రతిజ్ఞలతో అట్టుడికిపోతోంది. వీరికి సమస్య మూలాలతో సంబంధం ఉండడం లేదు. దానితో వీరి సమాధానాలు విఫలమవుతున్నాయనీ గత ఐదు దశాబ్దాల చరిత్ర తెలుపుతోంది.

ఆర్థిక, రాజకీయ, సామాజిక సమస్యల పరిష్కారాల్ని వదిలి

---

పాండేలు తర్వాత జరిగిన ఎన్‌కౌంటర్‌లో చనిపోయారు.

ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో పౌరస్పందన వేదిక ఎస్.ఆర్. శంకరన్ ఆధ్వర్యంలో జరిగిన కృషి ఫలితంగా 2004లో అప్పటి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి, మావోయిస్టు పార్టీకి మధ్య చర్చలు జరిగాయి కాని అర్థాంతరంగా ముగిశాయి. ఇక్కడ కూడ చర్చల ప్రతినిధులైన రియాజ్ తదితరులను ఎన్‌కౌంటర్‌లో కాల్చిచంపారు. ఆంధ్రప్రదేశ్‌లో చర్చల సందర్భంగా తుపాకుల మోత ఆగిపోయింది. ప్రజులు ఊపిరి పీల్చుకున్నారు. అయితే ఎంతో కాలం అది నిలువలేదు. రాజశేఖరరెడ్డి ప్రభుత్వం శాంతియుత పరిస్థితులకు గండికొట్టి యుద్ధ వాతావరణానికి తెరలేపింది. ఉద్రిక్తతల పరిస్థితి పాలకులకు ఎన్నికల స్టంటుగా ఉపయోగపడుతుంది. ఇప్పటికైనా కేంద్ర ప్రభుత్వం, ఛత్తీస్‌గఢ్ రాష్ట్ర ప్రభుత్వం చొరవ తీసుకుని మావోయిస్టులతో చర్చలు జరిపే ప్రక్రియ మొదలు పెట్టి శాంతియుత వాతావరణాన్ని నెలకొల్పాలి. అందుకు గాను వైమానిక దాడులు నిలిపివేయాలి. ఆపరేషన్ ప్రహార్, కూంబింగ్ చర్యలను నిలిపివేసి ఛత్తీస్‌గఢ్‌లో శాంతిని నెలకొల్పాలి.

*(రచయిత పౌరహక్కుల సంఘం, తెలంగాణ అధ్యక్షులు)* వీ

విప్లవకారుల ముందు లొంగుబాటు విధానాలే శరణ్యమనే వైఖరిని ఎత్తిపడుతున్న (అ)శాంతీ, అ(హింస)ల వకాల్తా దారులు ఏకపక్ష యుద్ధానికి సిద్ధం కావడాన్ని దేశ ప్రజలు సహించరు. రక్తపాతానికి ఒడిగడుతున్న విధానాలపై రేపు లీసులు, భద్రతా బలగాలు, సైనిక జవాన్లు సైతం ఎదురుతిరుగుతారు. వారి ముందు బ్రిటిష్ వారి ఆదేశాలను ధిక్కరించిన గర్వాలి సైనికుల అనుభవాలు, జెపి నాటి సంపూర్ణ విప్లవ కాలంలో పోలీసులు ఆచరించిన అనుభవాలున్నాయి. ప్రజలను విప్లవంవైపు, రక్తపాతం వైపు నెడుతున్న 'ఆపరేషన్ సమాధాన్'కు తక్షణం స్వస్థి చెప్పాలని అనకుండా ఆర్థిక, రాజకీయ, సామాజిక కోణాన్ని వదలి శుద్ధ సైనికవాద దృష్టితో చేసే విశ్లేషణలు ఏంతమాత్రం సమాధానం కావనీ ఈ ఆలోచనాపరులు గుర్తించాలి.

పోతే, రాజకీయ విశ్లేషకులు నక్సల్స్ సమస్యను ఆర్థిక రాజకీయ సామాజిక కోణంలో చూడాలంటూ పాలకుల చెవికెక్కని హితవు పలుకుతుంటారు. ఈ తరహా విశ్లేషణలో పార్టీ నాయకుల వ్యక్తిగత స్వభావాల నుండి పాలసీల వరకు ఏకరువు పెడుతుంటారు. పార్టీ ప్రధాన కార్యదర్శి బాధ్యతలలో సైనిక రంగం నుండి వచ్చిన వ్యక్తి ఉండడంతో సైనిక దాడుల ప్రాధాన్యత పెరిగిపోయిందనీ 'భారత విప్లవ వ్యూహం ఎత్తుగడల'తో పొంతన లేని, నిర్ధారణలు చేస్తుంటారు. 'దారి తప్పిన పిల్లలు లేద సోదరుల చేష్టలు'గా కొందరు అభివర్ణిస్తుంటారు. ఇంకా కొందరు పార్టీలో మేధావులు, విశ్వవిద్యాలయాల నోబుల్ స్టూడెంట్స్ లేకుండాపోయారనీ, అంతా 'అలగా జనం' పోగయ్యారనీ వాపోతుంటారు. ఇవన్నీ ఒక తరహాకు సంబంధించిన విశ్లేషణలు కాగా అనేకమంది ప్రజాహిత మేధావులు ముఖ్యంగా 'అహింసావాదులు', గాంధేయులు అమలుకాని భారత రాజ్యాంగాన్ని పదే పదే ఉల్లేఖిస్తుంటారు, తరచుగా పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని ప్రస్తావిస్తుంటారు.

ప్రజల పేదరికాన్ని, ధనిక పేదల మధ్య పెరుగుతున్న అంతరాన్ని గణాంకాలతో సహా కంఠతస్థంగా వివరిస్తుంటారు. సమాహిత ప్రజాస్వామ్యాన్ని, అభివృద్ధిని కోరుకుంటారు. వీరు రాజ్యం పుట్టుక, దాని స్వభావాన్ని మరిచి మావోయిస్టులతో అది చర్చలు జరుపాలనీ, చర్చల ద్వారానే సమస్య పరిష్కారం సాధ్యమని నమ్ముతారు. ఇరుపక్షాలు కోరుకుంటే తాము మధ్యవర్తిత్వం జరుపడానికి సైతం సిద్ధమేనంటారు.

కానీ, ప్రభుత్వానికి మావోయిస్టులకు మధ్య చర్చలు సాధ్యమా అన్నదే ఇక్కడ తేల్చుకోవలసింది. ఎందుకంటే, గత 5 మాసాలుగా ఢిల్లీలో తమ న్యాయమైన సమస్యలపై బైఠాయించిన రైతులతోనే జనవరి తదుపరి ప్రభుత్వం మొండిగా చర్చలు నిలిపివేసింది. వారిలో మావోయిస్టులు ఉన్నారంటూ దేశ ప్రధాని ఇటీవల పార్లమెంటులోనే ఉటంకించడం గమనార్హం. నిజానికి వారు ఆ రైతాంగ సమస్యలపై పోరాడడంలో తప్పేముందో? పదే పదే ప్రభుత్వ వర్గాలు వారిని జనజీవన స్రవంతిలోకి రావాలనే పిలుపులు ఇస్తున్నపుడు వారు ఎలాంటి చట్టపర పోరాటాలలో పాల్గొనకూడదనే షరతులు విధించడం లేదే! వారు ఆ సమస్యలపై ప్రజలలో భాగంగా ఉద్యమించడం ఏ రకంగా అపరాధమవుతుంది? వారు వాటికి ఎలా అతీతులవుతారు? సిఏఏపై శాహీనా బాగ్‌లో లక్షలాది ప్రజలు పోరాడినపుడు అందులోనూ మోదీ అర్బన్ మావోయిస్టులు ఉన్నారన్నాడు. అవును. ఉంటారు. ఉంటే తప్పేంటి.

నిజం చెప్పాలంటే ప్రజల ఆర్థిక, రాజకీయ, సామాజిక సమస్యలలో వారిని మైనస్ చేసి మాట్లాడడం పాఖండీ హిందుత్వ రియాక్షనరీ శక్తుల నయా ఉదారవాద విధానాల ఫలితమే తప్ప మరేం కాదు. ఇప్పటికే వారు జిఎస్‌టి రద్దు కోరుతున్న వ్యాపారులను సమర్థించారు. ప్రైవేటీకరణను వ్యతిరేకించిన కార్మికులకు అండగా నిలిచి నాయకత్వం వహిస్తున్నారు. విద్యార్థులకు, మహిళలకు, దళితులకు, ఆదివాసులకు వారు తలలో నాలుకలా తయారయ్యారు. రచయితలకు కలాలవుతున్నారు. కళాకారులకు ఆట పాటలై క్యాన్వస్లు పరిచి ఆహార్యం అందిస్తున్నారు. అధివక్తలకు అన్యాయాలను చట్ట పరంగా సవాలు చేయండని పిలుపులిస్తున్నారు. విద్యార్థులకు తిరోగమన భావాలను, అమ్ముడుపోయె వృత్తి విద్యా కోర్సులకు చెల్లుచీటి ఇవ్వాలంటున్నారు. ఆచార్యులకు కటకటాలే విశ్వవిద్యాలయాలు కావాలంటున్నారు. మీనూ లాంటి గృహిణిలకు, 'పాపా జల్దీ ఆ జానా' అంటున్న ఆడపిల్లలకు మేం తోడున్నామంటున్నారు. కోట్లాది దేశ ప్రజల కంఠాలై వారు అడుగడుగునా మీ భారత రాజ్యాంగాన్ని మీరు అమలు చేయండని ప్రశ్నిస్తున్నారు. వారు ఉన్నారనీ ప్రజల డిమాండును కాదంటే శాహీనా బాగ్, సింఘు, టికిరీ, గాజియాబాదు, దౌడాయి, జెఎన్‌యూలకు తోడు తోడుగా మురికినార్, రానీబోదిలీ, తాళ్లగూడ (ముకురం), కసాల్, బుర్కపాల్, కారంపెల్లి, ఇర్పనార్, మొహలా, జామూర్ ఖేడా, మినప, కడెనార్, జీరగూడలు మరింత బలంగా పిడుగుపాటు శబ్దాలతో ప్రజావాణిని విన్పిస్తాయి. కల్లెడ, పూజారీ కాంకేర్, కసనూర్, ఆయిపేట, తిమ్మెం, గొంపాడు,

కోబ్రామెండల నుండి నేర్చుకుంటారు. భారత విప్లవం కోరుకునేది వీరి సమస్యల పరిష్కారాన్నే కదా! అందుకే వారు అన్నింట్లో ఉంటారు. ఉండి తీరాలి. భారత పౌరులుగా వారి పాత్ర అన్నింట్లో ఇంకా ఇంకా పెరగాలి. విప్లవం అంటేనే అది. ఆ ప్రజా విప్లవానికి గెరిల్లా దాడులు సాధికారితను కల్పిస్తున్నాయి. ఈ విషయాన్ని రాజకీయ విశ్లేషకులు అర్థం చేసుకోవాలి. లేకుంటే పడక కుర్చీల పరిష్కారాలంటూ ఎద్దేవకు గురవుతారు.

కేవలం మూడు వ్యవసాయ చట్టాలను మాత్రమే ఉపసంహరించు కోవాలని కోరుతున్న రైతులతోనే మాట్లాడేది లేదని భీష్మించుకున్న ప్రభుత్వం అసలు మావోయిస్టులతో మంతనాలకు సిద్ధమవుతుందనుకోగలమా! వారు ఆయుధాలు వదలాలనీ, అహింసను విడిచిపెట్టాలని వారిపై అనేక లొంగుబాటు షరతులు విధిస్తున్న ప్రభుత్వాలు, వారి పోలీసు బాస్లు ససేమిరా చర్చలకు సిద్ధం అయ్యే వాతావరణం లేదని పెద్దలు గుర్తించాలి.

ఇక వర్తమాన హిందుత్వ పాలకుల హయాంలో భారత రాజ్యాంగం గురించి ఊసెత్తకుంటేనే మంచిది. గడిచిన 70 సంవత్సరాలలో దానికి చేసిన 125 సవరణలలో ఏ ఒక్కటీ దాని పీఠిక వెలుగులో లేనపుడు రాజ్యాంగ సవరణలతో ప్రజలకు మేలు కన్నా కీడే ఎక్కువ చేశారు. ఆజాదీ సాధనలో చివరకు నకారాత్మక పాత్ర పోషించినవాళ్లు ఇపుడు అధికార దాహంతో 'ఆజాదీ కా అమృత్ మూత్సవ్' అంటూ మహా ఆర్భాటంగా ప్రకటిస్తూ నిన్నటి సహోదరుల భారత్ నిర్మాణ్ కు నకలుగా తయారైన తమ హిందుత్వ 'నయా భారత్' ఖాతాలో దాన్ని జమకట్టుకుంటున్నారు. ఒకే తాను ముక్కలైన వారంతా మావోయిస్టులను ఆగర్భ శతృవులుగానే పరిగణిస్తారు. ఇది గుర్తించని వారు జీరగూడను సరిగా విశ్లేషణ చేయలేరు. భిన్న రాజకీయ లక్ష్యాల పట్ల స్పష్టత, బ్రాహ్మణవాద చాణక్యనీతి, నయాఉదారవాద విధానాల అమలును కేంద్రంగా చేసుకొని విశ్లేషణలు చేయకుంటే అవి గురి తప్పుతాయి. నిర్ధారణలు దారి తప్పుతాయి.

*(రచయిత వివరాలు తెలియవు. ఇమెయిల్‌లో వీక్షణంకు అందిన వ్యాసం)* వీ

# తత్వశాస్త్రం అంటే ఏమిటి?

*మతం ప్రాతిపదికగా ఉండే ప్రాపంచిక దృక్పథానికి, తత్వశాస్త్ర ప్రాపంచిక దృక్పథానికి చాలా వ్యత్యాసం ఉంటుందంటున్నారు* **యు.ఎ. ఖారిన్**

భౌతిక అవసరాలకు అతీతంగా మానవజాతికి సంబంధించిన అధి భౌతిక సంస్కృతి ఫలితంగా, పురాతన కాలం నుండి ఒక ప్రవాహం లాగా కొనసాగుతున్న తత్వశాస్త్ర విజ్ఞానానికి సహజ పరిణామంగా మార్క్సిస్టు – లెనినిస్టు ఆలోచనా పద్ధతి ఆవిర్భవించింది. ఇది కార్మిక వర్గానికి చెందిన తత్వశాస్త్రం. ఇది భౌతిక వాదానికి మహోన్నత రూపం. కాబట్టి, మానవుని అధి భౌతిక అవసరంగా సాధారణ పరిభాషలో తత్వశాస్త్రం అంటే ఏమిటో తెలుసుకోవడంతో గతితార్కిక భౌతికవాద ప్రాథమిక సూత్రాలను అధ్యయనం చేయడం ప్రారంభించడం సరైన పద్ధతి. ఈ విషయంలో తత్వవేత్తలలో ఏకాభిప్రాయం లేదు. మరీ ముఖ్యంగా భారతదేశంలోని మేధావి వర్గంలోని చాలా మంది తాత్విక పరమైన అధ్యయనాన్ని ఒక శాస్త్రంగా కాక, ఒక సామాజిక విద్యాంశంగా భావిస్తున్నారు. సమగ్రమైన ఆలోచనా పద్ధతి ఇందులో లేదని, ఒక సంగీతకారుడు వ్యక్తిగతంగా తాను రూపొందించుకునే గానం లాగా ఎవరి ఆలోచన వారిదేనని తమకు అనుకూలంగా తమ వాదనను ముందుకు తెస్తున్నారు. మరికొందరు ప్రముఖ బ్రిటిష్ తత్వవేత్త బెర్ట్రెండ్ రస్సెల్ వాదనను ఉటంకిస్తున్నారు. ఆయన అభిప్రాయంలో సైన్స్‌కు, మతపరమైన భావజాలనికి మధ్యస్థానంలో తత్వశాస్త్రం ఉంటుంది. 'ఖచ్చితమైన సమాచారం సైన్స్‌కు సంబంధించినది. అంతకు మించి ఉండే స్థిరమైన నమ్మకాలు, మత సంబంధమైన భావజాలం' అని రస్సెల్ అంటాడు. 'కాని, మత సంబంధమైన భావజాలానికి, సైన్స్‌కు మధ్య ఎవరికీ చెందని ఎడము' తప్పనిసరిగా ఉంటుంది. ఇది ఇరువైపుల నుండి దాడికి గురవుతుంది. ఈ ఎవరికి చెందని ఖాళీ స్థలమే 'తత్వశాస్త్రం'. ఇదీ రస్సెల్ అభిప్రాయం. ఇంకా మరికొందరి దృష్టిలో తత్వ జ్ఞానం శాస్త్రాలంటికి తలమానికం లాంటిది, శాస్త్రాలకే శాస్త్రం లాంటిది. ఇది విలువలకు, మనిషి ఆనందానికి సంబంధించిన సిద్ధాంతం; భాషా పరంగా చూసినప్పుడు ఏక కాలంలో ఇది శాస్త్రపరమైనది, సాధారణమైనది కూడా. మానవునికి సంబంధించిన సిద్ధాంతం; విజ్ఞానికి మారు పేరు; సౌందర్య రహస్యాన్ని విప్పిచెప్పే సిద్ధాంతం – ఇలా పలు రకాలుగా తత్వజ్ఞానాన్ని విశ్లేషిస్తారు. అయితే ఇప్పుడు మనం ఈ సిద్ధాంతాల లోతుల్లోకి వెళ్లనవసరం లేదు. తత్వజ్ఞానం సారాంశం విస్తరిస్తున్న కొద్దీ, అది మారుతూ ఉన్నది. ఇంకా సంక్షిప్తమవుతూ ఉన్నది. తత్వజ్ఞానం ఆధునిక శాస్త్రీయమైన విచార ధార ప్రకారం పైన పేర్కొన్న సిద్ధాంతాలన్నీ పాక్షికమైనవి లేదా తప్పుల తడకలు.

కళకు, తత్వజ్ఞానానికి బేధం ఉంది. కళలో వాస్తవం కళాత్మక ప్రతీకలలో ప్రతిఫలిస్తుంది. సౌందర్య తృష్ణను సంతృప్తిపరిచే ప్రయత్నం చేస్తుంది. తత్వజ్ఞానం ఈ ప్రపంచం అంటే ఏమిటో తెలుసుకోవాలనే జ్ఞాన తృష్ణను తీర్చే ప్రయత్నం చేస్తుంది.

తత్వశాస్త్రాన్ని మతానికి సంబంధించినదిగా పరిగణించడం సరికాదు. మనుషుల దైనందిన జీవితాలను శాసించే బాహ్య శక్తుల సంఘపరమైన, సహజమైన వాస్తవ ప్రతిరూపమే మతం. మానవతీత శక్తులపై నమ్మకంతో ప్రపంచాన్ని, మనిషి అస్థిత్వాన్ని వివరించడం మత స్పృహతో చేసే పని. వస్తుగతమైన, వాస్తవిక జ్ఞానమే సైన్స్. మతం వలె భ్రమాత్మక ప్రతీకల ద్వారా కాకుండా తత్వశాస్త్రం సిద్ధాంత క్రోడీకరణల ద్వారా పర్యవేక్షిస్తూ ఉంటుంది. కాబట్టి మతానికి సైన్స్ చుక్కెదురు. ఏది ఏమైనప్పటికీ సైన్స్‌కు, తత్వజ్ఞానానికి కొన్ని ముఖ్యమైన భిన్నత్వాలు ఉన్నాయి. విభిన్నమైన వస్తువుల గుణాలను గురించి, నిర్జీవ ప్రపంచంలో ఉండే నియమ నిబంధనలు, వాటి స్వభావం లేదా వాటి చరిత్రను గురించి ప్రత్యేక అధ్యయనాలు సైన్స్‌లో ఉంటాయి.

ప్రపంచం లోని విభిన్న అస్థిత్వాలు, వాటి మధ్య ఐక్యత, ఈ ప్రపంచంలో మనిషి స్థానం, అతని ఆలోచన – కార్యాచరణ మొత్తంగా ప్రపంచపు మూలాలు, అందులో మనిషి అస్థిత్వం – వీటన్నింటిని గురించి తత్వశాస్త్రం ఆలోచిస్తుంది. వస్తుగతమైన వాస్తవాన్ని కనుగొనడానికి శాస్త్రజ్ఞుడు ప్రయత్నిస్తాడు. తత్వవేత్త వాస్తవాన్ని వివరించే ప్రయత్నం మాత్రమే కాదు, ఖచ్చితమైన వర్గ దృక్పథం నుండి దానికి భాష్యం చెపుతాడు.

తత్వశాస్త్రం ముఖ్యంగా నైతికతకు సంబంధించినది అని చాలా మంది అభిప్రాయ పడుతుంటారు. నైతికతకు, తత్వజ్ఞానానికి చాలా దగ్గర సంబంధ ఉన్న మాట వాస్తవమే. సమాజంలో ఏ రకమైన ప్రవర్తన కలిగి ఉండాలి, సిద్ధాంత పరంగా నైతిక విలువలు, మనుషుల మధ్య పరస్పర సంబంధాల తీరు ఎలా ఉండాలి అన్న విషయాలు ప్రాపంచిక దృక్పథంలో భాగంగా పేర్కొనవచ్చు. తత్వశాస్త్రంలో ప్రధానమైనది ప్రాపంచిక దృక్పథమే కదా! అయినప్పటికి నైతికతకు, తత్వజ్ఞానానికి మధ్య ఒక విభజన రేఖ ఉంది. ఒక మనిషి తోటి మనుషులతో ఎలాంటి సంబంధాలు కలిగి ఉండాలి అన్న విషయం నైతికతకు సంబంధించినది. తత్వశాస్త్రం అంతటితో ఆగిపోదు. దానితో పాటు రాజకీయాలు, మతం, ఆర్థికం, సైన్స్, కళలు లాంటి వాటిని కూడా చర్చిస్తుంది. నైతికత సమాజ ప్రక్రియలో మనుష్య సంబంధాలకు పరిమితమవుతుంది. తత్వశాస్త్రం మొత్తం విశ్వంలో, ప్రకృతిలో జరిగే పరిణామాలను విశ్లేషిస్తుంది. మంచి, చెడు, న్యాయం, కర్తవ్యం, నిర్లక్ష్యం, వివేకవంతమైన ఆలోచనలు – వీటి కోణంలో నైతికత మనిషి ప్రవర్తనను అంచనా వేస్తుంది. చట్టం, అవసరాలు, పదార్థం, చైతన్యం, అభివృద్ధి, సారాంశం – ఈ కోణంలో తత్వశాస్త్రం వాస్తవాన్ని నిర్ణయిస్తుంది.

కాబట్టి, తత్వశాస్త్రం ప్రత్యేకమైనది. భౌతిక విషయాలకు అతీతమైనది. మేధకు సంబంధించినది లేదా కొంతమంది అభిప్రాయ పడుతున్నట్లుగా అది ఒక సాంఘిక చైతన్య రూపం. మానవుని ప్రాపంచిక దృక్పథానికి సిద్ధాంత ప్రాతిపదికనేర్పరుస్తుంది తత్వశాస్త్రం. ప్రాపంచిక దృక్పథం అంటే తన చుట్టూ ఉండే ప్రపంచంతో సంబంధం, వాస్తవాధీన భావ సంచయము, ప్రకృతి పరంగా, సాంఘిక పరంగా జరిగే ప్రక్రియల పట్ల మనిషికి ఉండే దృష్టి కోణంగా నిర్వచించవచ్చు. ప్రాపంచిక దృక్పథాలు, తత్వశాస్త్రం – ఈ రెండు ఒకటిగానే కొన్నిసార్లు అగుపిస్తాయి.

# ఒక కలం వీరునికి ఇన్ని కష్టాలా!

***సామూహిక అత్యాచారం చేసి, చంపి, కుటుంబానికి తెలియకుండా ఖననం చేసిన ఘటన వార్తలు సేకరిద్దామని వెళ్లిన జర్నలిస్టు కప్పన్ పై ప్రభుత్వం దేశ ద్రోహం కేసు మోపిందని అంటున్నారు* రాజేంద్రబాబు అర్విణి**

గత ఏడాది సెప్టెంబర్‌లో దేశాన్ని కుదిపివేసిన అత్యాచార ఘటన జరిగింది. ఆ ఘటన దేశ ప్రజల జ్ఞాపకాల్లో పదిలంగా నిక్షిప్తమై ఉంది కానీ, ఆ దారుణానికి ఒడిగట్టిన ముష్కరుల గురించి మీడియా, ప్రభుత్వాలు, పోలీసులు మరిచిపోయినట్టే ఉంది. ఇంకా దారుణ మేమిటంటే, ఆ ఘటన జరిగిన తర్వాత బాధిత కుటుంబాన్ని పరామర్శిద్దామని, ఆ అత్యాచారపు వివరాలు సేకరిద్దామని ఢిల్లీ నుండి బయల్దేరిన కేరళ జర్నలిస్ట్ సిద్దిఖీ కప్పన్‌ను మాత్రం ఉత్తరప్రదేశ్ పోలీసు వ్యవస్థ, ఉత్తరప్రదేశ్ ప్రభుత్వమూ కక్ష సాధింపు చర్యలతో ఇంకా వెంటాడుతూనే ఉన్నాయి.

అది హత్రస్ సామూహిక అత్యాచారం, దారుణ హత్యగా దేశం నలుమూలల తీవ్రంగా స్పందించిన ఘటన. 2020 సెప్టెంబర్ 14న ఉత్తరప్రదేశ్‌లోని హత్రస్ జిల్లాలో 19 ఏళ్ల దళిత యువతిని నలుగురు అగ్రవర్ణ ఠాకూర్ కులస్థులు అతి కిరాతకంగా అత్యాచారం చేసి, పాశవికంగా హత్య చేశారన్న వార్త దావానలంలా వ్యాపించి దేశమంతా నిర్ఘాంత పోయేట్టు చేసింది. బాధితురాలు ఇచ్చిన వాఙ్మూలం ప్రకారం పశువుల మేత కోసం పొలానికి వచ్చిన తనను సందీప్, రాము, లవకుష్, రవి అన్న నలుగురు యువకులు తనపై దాడి చేసి అత్యాచారం చేశారు. ప్రతిఘటించిన తనను హింసించారని, తన వెన్నుపూస విరిగిపోయేలా దుపట్టాను గొంతుకు బిగించారని, నాలుకను తెగ్గోశారని ఆమె పేర్కొంది. ఆమె అరుపులు విన్న ఆమె తల్లి ఆమెను వెతుక్కుంటూ వచ్చేసరికి కూతురు విగతజీవిగా పడి ఉంది. తనను, తన కూతురును, కొద్ది నెలలుగా వేధిస్తున్న సందీప్, లవకుష్, ఇంకా ఇద్దరు పారిపోతుండగా చూసింది. వెంటనే ప్రాణాలతో కొట్టు మిట్టాడుతున్న తన కూతురును భుజాన వేసుకొని దగ్గరలో ఉన్న పోలీస్ స్టేషన్‌కు వెళ్లి ఫిర్యాదు చేసింది. అయితే ఆమె ఫిర్యాదును తీసుకోకపోగా పోలీసులు హేళనగా మాట్లాడారు, పైగా దుర్భాషలాడారు. జరిగిన సంఘటన సోషల్ మీడియాలో వైరల్ అయి దేశమంతా గగ్గోలు పెడితే సెప్టెంబర్ 22న గాని పోలీసులు ఫిర్యాదును నమోదు చేసుకోలేదు. సంఘటన జరిగిన పది రోజులు

---

కాని, ఒకదాని నుండి మరొక దానిని విడదీయడం మంచిది. ఒక వ్యక్తి ప్రాపంచిక దృక్పథాన్ని నిర్ణయించడంలో విభిన్నమైన విషయాలు పాత్ర వహిస్తాయి. ఉదాహరణకు ప్రకృతికి, సమాజానికి సంబంధించిన శాస్త్రాలు వస్తుగత ప్రపంచ వివిధ అంశాలను నిర్ణయిస్తాయి. కొన్ని ప్రాపంచిక దృక్పథాలలో సాహిత్యం, కళలు, నైతిక విలువలు, చట్టం ప్రధాన పాత్ర వహిస్తాయి. ప్రపంచాన్ని గురించి వక్రీకరించబడ్డ భావనలను మతం ప్రవేశపెడుతుంది. ప్రాపంచిక దృక్పథం సిద్ధాంతపరమైన, భావజాల పరమైన అంశాలకు ఒక స్పష్టమైన రూపం ఇస్తుంది తత్వశాస్త్రం. గతం, వర్తమానం, భవిష్యత్తు గురించి ఒక సమగ్రమైన అభిప్రాయాన్ని ఏర్పరుస్తుంది.

ప్రాపంచిక దృక్పథం సంక్లిష్టమైన భావ సంచయం. సమాజంలో మార్పులు వస్తున్న కొద్ది దాని స్వభావం, కూర్పు మారుతూ ఉంటుంది. చరిత్రలో విభిన్న దశలలో, వివిధ సమాజాలలో, వేరు వేరు వర్గాలలో భిన్నమైన ప్రాపంచిక దృక్పథాలు ప్రభావశీలంగా ఉండినవి. ఆదిమ సమాజంలో రోజువారి జీవితంలో ఎదుర్కొన్న అనుభవాల ఆధారంగా ఏర్పడిన జ్ఞానం, పౌరాణిక భావజాలంతో మిళితమై ప్రాపంచిక దృక్పథం ఏర్పడేది. అది వక్రీకరించబడ్డ వాస్తవాల అద్భుతమైన ప్రతిరూపం. ప్రకృతిలోని కొన్ని అంశాలను ఎదుర్కొనే శక్తి లేని మానవుని భావ ప్రకటన అది. ఉదాహరకణకు, భారతదేశంలో తెగలు విచ్ఛిన్నమవుతున్న చారిత్రక దశలో వేదాలు రాయబడ్డాయి. వాటిలో ప్రక్రుతి పట్ల మనుషుల మధ్య సంబంధాలు, విధి ప్రమేయం పట్ల పురాతన ప్రపంచంలోని మనుషుల అభిప్రాయాలు ఎలా ఉండేవో పొందుపరచబడ్డాయి. అప్పటికి పౌరాణిక, మత పరమైన ప్రాపంచిక దృక్పథమే కాని, తత్వజ్ఞానం ఒక శాస్త్రంగా రూపుదిద్దుకోలేదు.

మన కాలంలో కూడా పారిశ్రామిక పెట్టుబడిదారీ దేశాలలో కోట్లాది మంది ప్రజలు పూర్తిగా పౌరాణిక సంబంధమైన అభిప్రాయాలు కాకపోయినా, అనాలోచితంగా అనుభవ పూర్వకమైన, మతానికి సంబంధించిన అభిప్రాయాలు కలిగి ఉంటారు. తత్వశాస్త్ర విధానాలు ప్రారంభం నుండి గుణాత్మకమైన కొత్త ప్రాపంచిక దృక్పథానికి రూపు రేఖలు దిద్దాయి. అదే తత్వశాస్త్ర ప్రాపంచిక దృక్పథం. తత్వశాస్త్రం అంటే ప్రపంచాన్ని సమగ్రంగా చూపే ఒక బోధనా ప్రక్రియ. అది ప్రకృతిని, సమాజాన్ని, మనిషిని ఒక సమగ్ర చట్రంలో జోడించే సిద్ధాంతం.

మతం ప్రాతిపదికగా ఉండే ప్రాపంచిక దృక్పథానికి, తత్వశాస్త్ర ప్రాపంచిక దృక్పథానికి చాలా వ్యత్యాసం ఉంటుంది. తత్వశాస్త్ర ప్రాపంచిక దృక్పథం కొన్ని సూత్రాలను ప్రకటించి ఊరుకోదు. వాటిని తార్కికంగా రుజువు పరుస్తుంది. అంతమాత్రాన ప్రతి తత్వశాస్త్రం శాస్త్రీయమైనది కాదు. అది శాస్త్రీయమైన తత్వశాస్త్రంగా గుర్తింపబడాలంటే ప్రజల సాధారణ జీవిత అనుభవాలపై ఆధారపడి ఉండాలి. ఏకపక్షంగా, వ్యక్తిగత తర్కం మీద కాకుండా శాస్త్రీయమైన పరిజ్ఞానం మీద ఆధారపడి ఉండాలి.

సారాంశంలో తత్వశాస్త్ర ఆధారిత ప్రాపంచిక దృక్పథం శాస్త్రీయంగా ఉండవచ్చు, అశాస్త్రీయంగా కూడా ఉండవచ్చు. దాని మూల భావనలో అది మత పరమైనదిగా ఉండవచ్చు లేదా సౌందర్య జిజ్ఞాస కలిగి ఉండవచ్చు; ఆశావహం కావచ్చు లేదా నిరాశ రగిలించేదిగా ఉండవచ్చు; మనుష్య ద్వేషిగా ఉండవచ్చు లేదా అత్యంత మానవీయ కోణంలో ప్రపంచాన్ని వీక్షించవచ్చు; అభ్యుదయకరమైనది కావచ్చు లేదా తిరోగమన వాదాన్ని ప్రోత్సహించవచ్చు. తత్వజ్ఞానం సంధించే ప్రాథమిక ప్రశ్నలకు ఏ రకమైన సమాధానం లభిస్తుంది అన్నదాన్ని బట్టి ఆ తత్వశాస్త్రం గుణమేమిటో తెలుస్తుంది.

*('గతితార్కిక మౌలిక సూత్రాలు' పుస్తకం నుండి)*

*(అనువాదం : రాజేంద్రబాబు అర్విణి)* వీ

ఎవరినీ అరెస్టు చేయలేదు. నేరం చేశారని బాధితురాలు స్వయంగా ఫిర్యాదులో పేర్కొన్నప్పటికీ, ఆ నలుగురు బాజాప్తా ఊర్లో కాలరెగరేసుకొని తిరుగుతూనే ఉన్నారు. అత్యాచార ఘటనలో బాధితురాలికి వైద్య పరీక్ష సాధ్యమైనంత తొందరగా చేయిస్తారు. ఎందుచేతనంటే, స్త్రీ మర్మాంగంలో పురుషుని వీర్య కణాలు ఎక్కువకాలం పదిలంగా ఉండవు. కానీ, ఈ సంఘటనలో బాధితురాలికి పది రోజుల తర్వాత గాని వైద్య పరీక్ష చేయించలేదు. అందుచేత, ఆ యువతి వెన్నెముక విరిగినట్టు, గొంతు నులిమినట్టు, ఎముకలు విరిగినట్టు వైద్య నివేదికలో ఉంది గాని, అత్యాచారం గురించి ప్రస్తావన లేదు. తదుపరి సఫ్దర్ జంగ్ హాస్పిటల్ వారిచ్చిన మెడికల్ రిపోర్ట్‌లో మెడికల్ హిస్టరీలో అత్యాచారం జరిగి ఉండవచ్చునని పేర్కొన్నారు. చివరికి సెప్టెంబర్ 29న సఫ్దర్ జంగ్ దవాఖానాలో ఆ యువతి తుదిశ్వాస విడిచింది. ఆ దళిత యువతి చనిపోయిన తర్వాత రాత్రికి రాత్రి 2.30 గంటల సమయంలో కుటుంబ సభ్యుల అనుమతి లేకుండా, వారిని వారి ఇంట్లోనే బంధించి, పెట్రోల్‌తో శవాన్ని కాల్చి, అంత్యక్రియలు జరిపించామని ప్రకటించారు.

ఇంత జరిగితే భారత పౌర సమాజం ఊరుకుంటుందా! అనేక అభిశంసనలు వెలువడ్డాయి. ఉత్తరప్రదేశ్ పాలకవర్గం అగ్రవర్ణ పక్షపాతి అని, నేరస్థులు అగ్రకులస్థులయితే ఇంత బాహాటంగా రక్షణ కల్పిస్తారా అని దేశమంతా కోడై కూసింది. ప్రజా సంఘాలు, పాత్రికేయులు హత్రస్‌కు పయనమయ్యారు. చాలా మందిని పోలీసులు అడ్డుకున్నారు. హత్రస్ దరిదాపుల్లోకి కూడా వెళ్లనివ్వలేదు. బాధిత కుటుంబాన్ని పరామర్శించనివ్వలేదు. చాలా మంది పాత్రికేయుల లాగా తన వృత్తి ధర్మంగా సిద్దిఖీ కప్పన్ కూడా హత్రస్‌కు బయల్దేరాడు. అతనితో పాటు ప్రజాసంఘాలలో పనిచేస్తున్న అతని మిత్రులు కూడా బయల్దేరారు. న్యూ ఢిల్లీ నుండి హత్రస్ వెళ్లడానికి ఓలా కారును అద్దెకు తీసుకున్నారు. కానీ మార్గమధ్యంలోనే అతన్ని, అతని మిత్రులు రెహమాన్, మసూద్‌ను ఓలా కారు డ్రైవర్ ఆలంను పోలీసులు అరెస్ట్ చేశారు.

కప్పన్ ఒక పాత్రికేయుడు. కేరళ అతని జన్మ స్థలం. నివాస స్థలం న్యూఢిల్లీ. మలయాళం వెబ్ పత్రికలలో రాస్తుంటాడు. ఇంగ్లిష్, మలయాళం, హిందీ, ఉర్దూ భాషలలో వికీపీడియాలో వివిధ విషయాలపై వివరాలు సమకూరుస్తుంటాడు. కేరళ యూనియన్ ఆఫ్ వర్కింగ్ జర్నలిస్ట్స్ సంఘం ఢిల్లీ శాఖ కార్యదర్శి కూడా. మధుమేహ వ్యాధి పీడితుడు. అతనితో పాటు అరెస్ట్ అయిన రెహమాన్‌కు గుండె జబ్బు. ఆహారం, నీళ్లు ఇవ్వకుండా, వాళ్లను ఏ పోలీస్ స్టేషన్‌లో ఉంచారో సమాచారం కూడా బయటికి పొక్కనివ్వకుండా కొంతకాలం నిర్బంధంలో ఉంచారు. వారు రోజూ తీసుకోవలసిన మందులు కూడా అందుబాటులో లేకుండా చేశారు. పోలీసు కస్టడీలో ఉన్న తన క్లయింట్‌ను కలవడానికి వీలు కల్పించాల్సిందిగా దేశ అత్యున్నత న్యాయస్థానాన్ని కోరవలసి వచ్చింది ఆయన వకీలు. సుప్రీంకోర్టు అనుమతితో అరగంట సేపు మాత్రమే కలవగలిగిన అడ్వకేట్‌కు తమను శారీరకంగా, మానసికంగా ఎలా హింసించిందీ వివరించారు. పోలీసు కస్టడీలో ఉన్న పాత్రికేయుడు, ప్రజాసంఘం నాయకులు. గుర్తు తెలియని వ్యక్తులుగా పేర్కొంటూ ఇదివరకే నమోదు అయిన ప్రాథమిక సమాచార నివేదిక (ఎఫ్ఐఆర్)లో ఈ నలుగురిని చేర్చారు. చట్ట వ్యతిరేక కార్యకలాపాల నిరోధక చట్టం (ఉపా) కింద వారిపై అభియోగాలు మోపారు. దళిత యువతి అత్యాచారానికి గురై హత్య చేయబడిన ఉదంతంను ఆధారం చేసుకొని కుల ప్రాతిపదిక మీద అల్లర్లు సృష్టించి ముఖ్య మంత్రి యోగీ ఆదిత్యానాథ్ ప్రభుత్వాన్ని అపనిందల పాలు చేసి రాష్ట్రంలో అస్థిరత్వం రాజ్యం ఏలేలా చెయ్యాలన్న కుట్రలో వీరు భాగస్వాములన్న అభియోగాలతో వీరిపై కేసు నమోదయింది. పాపులర్ ఫ్రంట్ ఆఫ్ ఇండియా అన్న సంస్థ ఒకటుంది. ఆ సంస్థకు ఢిల్లీ కార్యాలయంలో ఆఫీసు సెక్రెటరీగా కప్పన్ పనిచేస్తున్నాడని పోలీసులు కథనం అల్లారు. ఇది తప్పుడు అభియోగం అని, ఆయన అసలు పాపులర్ ఫ్రంట్ ఆఫ్ ఇండియా సభ్యుడే కాదని కేరళ వర్కింగ్ జర్నలిస్టుల యూనియన్ సుప్రీం కోర్టు లో ఒక అఫిడవిట్ దాఖలు చేసింది. ఈ పాపులర్ ఫ్రంట్ ఆఫ్ ఇండియా సంస్థను నిషేధించమని కేంద్ర ప్రభుత్వానికి ఇదివరకెప్పుడో ఒక లేఖ రాసింది ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం. తన లేఖను సమర్థించు కోవడానికి కప్పన్‌కు ఆ సంస్థతో సంబంధం కలిపారన్నది స్పష్టం.

పౌరసత్వ సవరణ చట్టాన్ని నిరసిస్తూ గత సంవత్సరం ఢిల్లీ నగరంలో సుదీర్ఘకాలం జరిగిన ఉద్యమంలో పాపులర్ ఫ్రంట్ ఆఫ్ ఇండియా క్రియాశీలకంగా పాల్గొన్నది. ఆ ఆందోళన సందర్భంగా చోటుచేసుకున్న హింసాత్మక ఘటనలకు పాపులర్ ఫ్రంట్ ఆఫ్ ఇండియా కారణమని ఉత్తరప్రదేశ్ ప్రభుత్వ ఆరోపణ. ఆ ఉద్యమంలో పౌరసత్వ సవరణ చట్టాన్ని వ్యతిరేకిస్తున్న పౌరునిగా కప్పన్ కూడా పాల్గొన్నాడు. పాపులర్ ఫ్రంట్‌తో కప్పన్‌ను జత కలిపితే సరిపోతుందని ఉత్తరప్రదేశ్ పోలీసులు భావించి ఉండవచ్చు. ఇంతకూ మించి కప్పన్ పై కక్ష సాధింపు చర్యలకు మరో కారణం కనిపించడం లేదు. పాపులర్ ఫ్రంట్ ఆఫ్ ఇండియా ఒక ప్రజా సంఘం. దానికి అనుబంధంగా విద్యార్థులలో పని చేస్తున్న విద్యార్థి విభాగం 'క్యాంపస్ ఫ్రంట్ ఆఫ్ ఇండియా'. దానికి సెక్రెటరీ రెహమాన్ అని, కప్పన్, మసూద్ ఇద్దరూ ఆ సంస్థ సభ్యులని పోలీసు వారి ఆరోపణ. నిజానికి కప్పన్ పేరున్న వెబ్ జర్నలిస్ట్. ఆలం టాక్సీ డ్రైవర్. కప్పన్ అరెస్ట్ పత్రికా స్వేచ్ఛకు తీరని విఘాతమని కేరళ జర్నలిస్టుల యూనియన్ తీవ్రంగా ఖండించింది.

ఈ మొత్తం ఉదంతంలో ఆసక్తి కరమయిన సంగతి ఏమిటంటే సెంట్రల్ బ్యూరో ఆఫ్ ఇన్వెస్టిగేషన్ (సిబిఐ) వారు ఇందులో "కుట్ర" కోణం దాగి ఉందన్న ఆరోపణకు ఆధారాల్లేవు కాబట్టి, ఆ కోణంలో మేము దర్యాప్తు చేపట్టలేం అని స్పష్టం చేశారు. అయినా ఉత్తర ప్రదేశ్ ప్రభుత్వం, ఉత్తరప్రదేశ్ డైరక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్ ఆఫీసు వారు "హత్రస్ కుట్ర కేసు" అని ఒక వ్యాజ్యాన్ని కోర్టులో దఖలు చేసి అందులో నిందితులుగా కప్పన్, ఇంకా ఇతరులను చేర్చారు. ఇది కాక కప్పన్, అతనితో పాటు అరెస్ట్ అయినా మిగతా ముగ్గురిపై 5000 పేజీల ఛార్జ్ షీట్ కోర్టులో దాఖలు చేశారు. వారిపై భారత శిక్షా స్మృతిలోని అధికరణాలు 124 ఏ (దేశద్రోహం), 153 ఏ (సమూహాల మధ్య శత్రుత్వాన్ని ప్రోత్సహించడం), 295 ఏ (మత విద్వేష భావనలు రేకెత్తించడం), ఉపా చట్టంలోని సెక్షన్లు 14, 17, ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ చట్టంలోని సెక్షన్లు 65, 72, 76 కింద వారిపై నిందను మోపారు.

రేప్‌కు గురై అమానుష రీతిలో హత్య గావించబడ్డ ఒక దళిత యువతి కుటుంబాన్ని పరామర్శించి, పాత్రికేయునిగా ఘటన వివరాలను సేకరిద్దామని వెళ్లబోయిన ఒక కలం వీరునికి ఇన్ని కష్టాలా! ఇన్ని నెలలుగా వారు నలుగురు జైలు లోనే ఉన్నారు. మధ్యలో తొంభై ఏళ్ల పైబడి వయస్సున్న కప్పన్ తల్లి గారి ఆరోగ్యం పూర్తిగా క్షీణించిందని అపస్మారక స్థితిలో కొడుకును మరీ మరీ కలవరిస్తుందని కోర్టును ప్రాధేయ పడితే కప్పన్‌కు అయిదు రోజుల బెయిలు ఇచ్చారు. అదీ రిపబ్లికన్ టివి అధినేత అర్ణబ్ గోస్వామికి ఆదరాబాదరగా ఇచ్చిన బెయిలు గురించి కప్పన్ తరఫున వాదిస్తున్న మాజీ న్యాయశాఖా మంత్రి కపిల్ సిబాల్ ప్రస్తావించిన తర్వాతనే. సమాజం గగ్గోలు పెడితేనే గాని గుండాలను, రేపిస్ట్‌లను ప్రభుత్వం అరెస్ట్ చెయ్యదు. బాధ్యత గల పౌరులుగా బాధిత కుటుంబాన్ని పలకరిద్దామని ప్రయత్నిస్తే దేశద్రోహం నేరం మోపుతారు.

ఇదేమి రాజ్యం! ఇదేమి రాజ్యం! శ్రీశ్రీ కవిత గుర్తు రావటం లేదూ! "క్షేమం అవిభాజ్యం అంటే గుండాలు గండ్రాళ్లు విసిరే" సీమ లో మనం బతుకుతున్నామా?

*(రచయిత జూనియర్ కళాశాల రిటైర్డ్ ప్రిన్సిపల్)* వీ

# రాఫెల్ విమానాల కొనుగోలు ఎవరికోసం?

***రాఫెల్ విమానాల కొనుగోలులో ప్రభుత్వ రంగ సంస్థ హెచ్ఎఎల్‌ను దెబ్బతీయడం, అంబానీకి లాభాలు కట్టబెట్టడం, ఆశ్రితులు కమీషన్లు పొందడం స్పష్టమయిందంటున్నారు* బి. రామకృష్ణ**

విజయదశమి 2018 అక్టోబర్ 8న విశ్వగురువు దేశం విదేశీ ప్రైవేట్ యుద్ధ విమాన వ్యాపార కంపెనీ తయారు చేసిన విమానంలో సూపర్ సానిక్ వేగంతో విహరించి ఆనందించింది. అంతకు ముందు ఆ విమానానికి ఆయుధ పూజ చేసింది. కుంకుమతో ఓం అనే అక్షరాన్ని దిద్దింది. దిష్టి కోసం కొబ్బరికాయను కట్టింది. అక్షింతలు చల్లింది. అంతేనా టైర్ల కింద నిమ్మకాయలు పెట్టింది. తనది కాని దేశం ఫ్రాన్స్ గగనతలంలోకి దూసుకెళ్లింది. శాంతి సామరస్యం సహనం గురూపదేశాలు పని చేయలేదో, లేక బోధనా వైఫల్యమో ఏమో గానీ యుద్ధ విమానాలు అవసరమయ్యాయి. యుద్ధాలు లేని ప్రపంచం కోసం కాదు గాని, ఆయుధాల కోసం ఆరాటపడుతున్నాడు విశ్వగురువు. ఇక అసలు కథకు వద్దాం. 2016 సెప్టెంబర్ 23న ఫ్రాన్స్, మోడీ ప్రభుత్వాల మధ్య రాఫెల్ యుద్ధ విమానాల కొనుగోలు ఒప్పందం జరిగింది. రాఫెల్ విమానాలను ఫ్రాన్స్‌కు చెందిన డస్సాల్ట్ ఏవియేషన్ తయారు చేస్తుంది. ఏప్రిల్ 2021 మొదటి వారంలో ఫ్రాన్స్‌కు చెందిన పరిశోధనాత్మక వెబ్ పత్రిక మీడియా పార్ట్ ఈ ఒప్పందం వెనుక జరిగిన అక్రమాలను వెలుగులోకి తెచ్చింది. ఫ్రాన్స్ అవినీతి నిరోధక శాఖ ఆడిట్ నివేదికలోని ఈ విషయాలను మీడియా పార్ట్ ప్రచురించింది. ఒప్పందం కుదరడంలో సహకరించినందుకు భారత్‌కు చెందిన సుసేన్ గుప్తాకు 10 లక్షల యూరోల ముడుపులు చెల్లించారని బయటపడింది. డస్సాల్ట్‌కు లబ్ధి చేకూర్చేలా భారత రక్షణ శాఖ రహస్య సమాచారం ఆ కంపెనీకి అందించాడనే విషయాన్ని మీడియా పార్ట్ వెల్లడించింది.

ప్రజల సొమ్ము కార్పొరేట్ల, పాలకపక్ష రాజకీయ వర్గాల పరం ఎలా అవుతుందో రాఫెల్ యుద్ధ విమానాల కొనుగోలు ద్వారా మరోసారి రుజువయ్యింది. గతంలో కూడా బోఫోర్స్ సైనికుల శవపేటికలు, ఆగస్త్య వెస్ట్ ల్యాండ్ హెలికాప్టర్లు, 2జి స్పెక్ట్రమ్ వంటి ఎన్నో కుంభకోణాలు వెలుగు చూశాయి. వాటన్నింటిని తలదన్నే వేల కోట్ల అక్రమాలు రాఫెల్ ఒప్పందం వెనుక దాగున్నాయనేది బయట పడుతున్నది. యుద్ధంలో బాంబులు, తుపాకులు, మిసైల్స్ అంటేనే బీభత్సం విధ్వంసం. యుద్ధంలో సహజ వనరులు ప్రజల ప్రాణాలు, ఆస్తులు ధ్వంసం అయ్యి కోలుకోలేని విషాదాలు అలుముకుంటాయి. యుద్ధాలు అనేవి దేశ రక్షణ పేరుతో పాలకులకు వారి రాజకీయాలకు, పెట్టుబడిదారులు, కార్పొరేట్ శక్తులకు ప్రయోజనాలు చేకూర్చుతుంటాయి. బలయ్యేది మాత్రం అశేష పీడిత ప్రజానీకమే. యుద్ధ సామాగ్రిని తయారు చేసే కంపెనీలు ఎప్పుడూ కూడా ఈ ప్రపంచం శాంతియుతంగా ఉండడం కోరుకోవు. చాలా ఏళ్ల కిందట అమెరికాకు చెందిన ఒక యుద్ధ విమానాల తయారీ సంస్థ పాకిస్తాన్‌కు ఎఫ్–16 విమానాలను అమ్ముతుంటే భారత్ వ్యతిరేకించింది. మీకు మరింత సమర్థవంతమైన ఎఫ్–17 విమానాలను అమ్ముతామన్నారు. కానీ యుద్ధ విమానాల సరఫరా ఆపేస్తామని మాత్రం అనలేదు. ఎప్పుడూ ఏదో ఒక చోట, ఏదో ఒక ఉద్రిక్తత దేశాల మధ్య, ప్రాంతాల మధ్య ప్రత్యక్ష, పరోక్ష శతృత్వాలు, యుద్ధమేఘాల వాతావరణం ఉంటూ ఉండాలి. లేదంటే ఆ పరిస్థితులను సృష్టించడానికైనా వెనుకాడరు. వివిధ దేశాల్లోని దోపిడీ వర్గ పాలకులకూ ఈ పరిస్థితి కావాలి. పేద ప్రజలకు కనీస వసతులైన కూడు, గూడు, గుడ్డ, విద్య, వైద్యం, ఉపాధి వంటివి కల్పించని పాలకవర్గాలు దేశ సంపదను కొద్ది మందికి దారాదత్తం చేసే పనిముట్లు అవుతుంటాయి. అందులో భాగంగా తామూ లబ్ధి పొందుతంటాయి.

దేశ సంపదలపై ప్రజలందరికీ సమాన హక్కు అనేది సహజ న్యాయం. దీనికోసం ప్రభుత్వం పనిచేస్తే గనుక లక్షల కోట్లు కొద్దిమంది సంపన్న వర్గాల చేతిలోకి ఎలా వస్తాయి. కరోనా కష్టకాలంలో వలస కూలీల దీనావస్థలు పచ్చి పచ్చిగానే మెదళ్లను తొలిచేస్తున్న నేపథ్యం ఈ దేశంలోని పేదరికాన్ని, అసహాయ సామాన్య ప్రజానీక దుర్భర పరిస్థితులను కళ్లకు కట్టక మానవు. దేశ రక్షణ అనే సున్నితమైన అంశంపై ప్రజల్లో అపోహలను, భ్రమలను, భయాలను కల్పిస్తుంటారు. వాస్తవం కొంతమేరకు ఉండొచ్చు కానీ, అంతకు మించి కూడా ప్రజలను నమ్మించి మోసం చేయడమే దాగుంటుంది.

యుద్ధ విమానాలు తయారు చేసి ప్రపంచంలోని ఎన్నో దేశాలకు అమ్ముకుని సొమ్ము చేసుకునే అంతర్జాతీయ సంస్థలు ఎన్నో ఉన్నాయి. మూడవ ప్రపంచ పేద, మధ్య తరగతి దేశాలు వీటికి బలవు తుంటాయి. దేశ రక్షణ పేరుతో ఎన్నో దేశాలు విద్యా, వైద్యాన్ని కంటే కూడా వాటి రక్షణ రంగానికి ఎక్కువ నిధులు ఖర్చు చేస్తున్నాయి. వీటి ద్వారా ఆయా దేశాల్లోని పాలకవర్గాలు, సంపన్న వర్గాలు, మార్కెట్ శక్తులు ప్రయోజనం పొందుతాయనేది వేరే విషయం అనుకోండి. అమెరికా, రష్యా, ఫ్రాన్స్ వంటి దేశాల నుండి భారతదేశం యుద్ధ విమానాలను, యుద్ధ సామాగ్రిని దిగుమతి చేసుకుంటున్నది. వీటి కొనుగోళ్లకు సంబంధించిన ఒప్పందాలలో అవకతవకలు, అక్రమాలు జరగడం గురించి అప్పుడప్పుడూ బయటకు వస్తుంటాయి. చాలా వరకు తెలియవు. అలా బయటకు పొక్కిందే బోఫోర్స్ కుంభకోణం. దీనికి సంబంధించి అప్పట్లో 63 కోట్లు కాజేయబడ్డాయని అన్నారు. దీనిపై వి.పి. సింగ్ విస్తృతంగా ప్రచారం చేశాడు. హిందూ దిన పత్రికలో విశ్లేషణలు వచ్చాయి. తర్వాతి ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీ ఓడిపోయింది. బోఫోర్స్ కుంభకోణంలో 63 కోట్ల అక్రమాలపై జరిగిన విచారణలో నేటికీ ఏమీ తేలలేదు. చేతులెత్తేయడం జరిగింది. ఏ కుంభకోణంలో నైనా చాలా వరకు విచారణలుండవు. ఉన్నా అవి సుదీర్ఘంగా ఏళ్లకేళ్లు, దశాబ్దాల తరబడి జరిగి ఎవరినీ దోషులుగా తేల్చేదేమి ఉండదు. ప్రతిపక్షంగా ఉన్నప్పుడు వీటికి వ్యతిరేకంగా గొంతెత్తిన వారు అధికారంలోకి వచ్చాక వీటిపై చేసేదేమీ ఉండదు. వీరు కూడా ఇటువంటివే చేస్తూ ఉంటారు. చరిత్ర

పొడుగునా జరుగుతున్నదిదే.

రాఫెల్ యుద్ధ విమానాల ఒప్పందంలో వేల కోట్ల కుంభకోణం జరిగిందని, దీనిపై విచారణ జరిపించాలనే డిమాండ్‌ను ప్రభుత్వం పట్టించుకోలేదు. సుప్రీంకోర్టును ఆశ్రయించినప్పటికీ ఫలితం లేకుండా పోయింది. ఈ యుద్ధ విమానాల ఒప్పందం కథ 2007లో మొదలైంది. ఇంకా చెప్పాలంటే వాజ్‌పాయ్ ప్రధానిగా ఉన్నప్పుడు 2001 లోనే యుద్ధ విమానాలు కొనాలనే ప్రతిపాదనలు వచ్చాయి. 2007 ఆగస్టు 28న భారత రక్షణ మంత్రిత్వ శాఖ 126 మీడియం మల్టీరోల్ కోంబాట్ ఎయిర్ క్రాఫ్ట్ (ఎంఎంఆర్‌సి) లు కొనాలనే ప్రతిపాదనలను అంగీకరించింది. ఇందుకోసం 6 అంతర్జాతీయ వేరువేరు ఎయిర్ క్రాఫ్ట్ (యుద్ధ విమానాలు/జెట్ ఫైటర్) లను పరిశీలించారు. ఈ ఆరింటి నుండి యూరో ఫైటర్, రాఫెల్ ఎయిర్ క్రాఫ్ట్ అనే రెండింటిని ఎంపిక చేశారు. రాఫెల్ ఎయిర్ క్రాఫ్ట్‌లను తయారు చేసే దస్సాల్ట్ ఏవియేషన్ అనే ఫ్రెంచ్ కంపెనీ తక్కువ ధరకే అమ్ముతామని చెప్పిందని దానితో సంప్రదింపులు ప్రారంభించారు. మొత్తం 126 విమానాలు కోనే ప్రక్రియలో 18 విమానాలను ఫ్రాన్స్‌లోనే తయారు చేస్తారు. అవి రెడీమేడ్‌గా ఉంటాయి. మిగితా 108 విమానాలు కేంద్ర ప్రభుత్వ సంస్థ హిందూస్థాన్ ఏరోనాటిక్స్ లిమిటెడ్ ద్వారా ఇండియాలోనే తయారు చేయబడతాయి. దసాల్ట్ ఏవియేషన్‌కు చెల్లించే ధరలోనే వాటి తయారీ, మేయింటెనెన్స్ మొదలైన అన్ని రకాల సాంకేతిక పరిజ్ఞానం బదిలీ చేయడం కూడా ఇమిడి ఉంటుంది. దీనివల్ల భవిష్యత్తులో హిందూస్థాన్ ఏరోనాటిక్స్ లిమిటెడ్ స్వతంత్రంగా ఈ విమానాలను తయారు చేసుకోగలుగుతుంది. ఫ్రాన్స్ ప్రభుత్వంతో గాని, దస్సాల్ట్ కంపెనీతో గాని ఏమైనా తేడాలు వచ్చినా కూడా ప్రతికూల ప్రభావం ఉండదు.

108 విమానాల తయారీలో 70 శాతం పని హిందుస్థాన్ ఏరోనాటికల్ లిమిటెడ్ చేస్తే, 30 శాతం పని దసాల్ట్ కంపెని చేస్తుందని పని విభజన ఒప్పందం మార్చి 2014లో దసాల్ట్, హెచ్ఎఎల్‌ల మధ్య జరిగింది. ఈ చర్చలు ఇంకా జరుగుతూనే ఉన్న క్రమంలో ఎన్నికలు వచ్చాయి. మన్మోహన్ సింగ్ ప్రభుత్వం మారి మోడీ ప్రధాన మంత్రిగా బిజెపి ప్రభుత్వం వచ్చింది. చివరకు 2015 మార్చి 25న రాతపూతల పని 95 శాతం పూర్తయిందని, త్వరలోనే ఒప్పందంపై సంతకాలు జరుగుతాయని దస్సాల్ట్ చీఫ్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ (సిఇఒ) ఎరిక్ ట్రాపియర్ చెప్పాడు. భారత ప్రభుత్వం హిందుస్థాన్ ఏరోనాటికల్ లిమిటెడ్, దస్సాల్ట్ మధ్య చర్చలు జరుగుతున్నాయని 2015 ఏప్రిల్ 8న భారత విదేశీ వ్యవహారాల కార్యదర్శి చెప్పాడు. ఏప్రిల్ 9 నుండి 11 వరకు మోడీ ఫ్రెంచ్ పర్యటనలో ఉన్నాడు. అంతలోనే 2015 ఏప్రిల్ 10న ఫ్రాన్స్‌లో రాఫెల్ విమానాలకు సంబంధించి కొత్త ఒప్పందం రాబోతుందని భారత ప్రధాని మోడీ, ఫ్రాన్స్ అధ్యక్షుడు ఫ్రాంకోయిస్‌లు సంయుక్త ప్రకటన చేశారు. దీని ప్రకారం 36 విమానాలను భారత్ కోంటుంది. ఇక్కడ గమనించవలసింది ఏమిటంటే, 95 శాతం పూర్తయ్యి సంతకాలు మాత్రమే మిగిలిన ఒప్పందం ఏమైపోయినట్లు. కేబినెట్ కమిటీ ఆన్ సెక్యూరిటీ అప్రూవల్ లేకుండా రక్షణ మంత్రికి గాని, రక్షణ శాఖ ఉన్నతాధికారులకు గాని, భారత విదేశీ వ్యవహారాల కార్యదర్శికి గాని తెలియకుండా కొత్త ఒప్పంద ప్రకటన మోడీ ఎందుకు చేసినట్లు.

36 రాఫెల్ విమానాల కొనుగోలు కొత్త ఒప్పందం గురించి మోడీ, ఫ్రాన్స్ అధ్యక్షుడు సంయుక్త ప్రకటన చేసిన 12 రోజుల ముందు అంటే 2015 మార్చి 28న రిలయన్స్ డిఫెన్స్ లిమిటెడ్‌ను రిజిస్టర్ చేశాడు. ఈ సంస్థ యజమానిగా అనిల్ అంబానీ డిఫెన్స్ డీల్‌కు సంబంధించిన విదేశీ ఒప్పంద కీలక సమావేశం ఫ్రాన్స్‌లో మోడీతో పాటు 2015 ఏప్రిల్ 10న పాల్గొంటాడు. మోడీ హోలండేల సంయుక్త ప్రకటన జరిగిన 14వ రోజు అంటే 2015 ఏప్రిల్ 24న రిలయన్స్ ఎయిరో స్ట్రక్చర్స్ లిమిటెడ్‌ను అనిల్ అంబానీ రిజిస్టర్ చేశాడు. రక్షణ ఒప్పందంలోని ఆఫ్సెట్ క్లాజ్‌లో భాగంగా స్థానికంగా భారతీయ కంపెనీలో విదేశీ కంపెనీ ఒప్పందంలోని సగభాగం పెట్టుబడిగా పెట్టాల్సి ఉంటుంది. రాబోయే రోజుల్లో దస్సాల్ట్ కంపెనీకి భారతీ వ్యాపార భాగస్వామిగా అనిల్ అంబానీ రిలయన్స్ ఎయిరో స్ట్రక్చర్స్ లిమిటెడ్ ఎంపిక అవుతుంది. రిలయన్స్ ఎయిరో స్ట్రక్చర్స్ లిమిటెడ్, దస్సాల్ట్‌లు రెండూ కలిసి 51:49 పెట్టుబడులతో జాయింట్ వెంచర్ దస్సాల్ట్ రిలయన్స్ ఎయిరో స్పేస్ లిమిటెడ్‌ను ఫిబ్రవరి 2017లో ప్రారంభిస్తారు. రక్షణరంగ తయారీలో ఓనమాలు తెలియని అనిల్ అంబానీ రిలయన్స్ గ్రూపును దస్సాల్ట్ కంపెనీ ఎందుకు ఎంచుకున్నట్లు. అప్పటి ఫ్రాన్స్ అధ్యక్షుడు హోలండే రిలయన్స్‌ను ఎంచుకోమని భారత్ చెప్పడంతో మరో మార్గం లేకుండా పోయిందని చెప్పాడు. ఇదే విషయాన్ని మీడియా పార్ట్ రిపోర్ట్ చేసింది. దాంతో ఇరు దేశాల రక్షణ శాఖ మంత్రులు రిలయన్స్ ఎంపికలో ఇరు దేశాల ప్రభుత్వాలకు సంబంధం లేదని, అది ఆ రెండు కంపెనీలకు సంబంధించిన విషయమని చెప్పారు. విమానాలను తయారు చేసి సరఫరా చేసేది ప్రైవేట్ కంపెనీ కావచ్చు కానీ, ఈ ఒప్పందం రెండు దేశాల ప్రభుత్వాల మధ్య జరిగినట్టిది. దస్సాల్ట్ చీఫ్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ కూడా తమపై ఎలాంటి వత్తిడులు లేవని, తమంతట తాముగానే రిలయన్స్‌ను వ్యాపార భాగస్వామిగా ఎంచుకున్నామని వివరణ ఇచ్చాడు. ఈ వివరణలకేమి గాని, ఏ సంస్థ అయినా తన వ్యాపార భాగస్వామిగా లక్ష కోట్లకు పైగా అప్పుల్లో ఉన్న కంపెనీను ఎంచుకుంటుందా. భారతీయ బ్యాంకుల్లో తీసుకున్న రుణాలను రిలయన్స్ చెల్లించడం లేదు. దీనికి రక్షణ రంగంలో గాని, విమానాల తయారీలో గాని కనీస పరిజ్ఞానం గాని లేనేలేవు. ఇక ఆరేడు దశాబ్దాల సుదీర్ఘ అనుభవం సాంకేతిక పరిజ్ఞానం ఉన్న ప్రభుత్వ రంగ సంస్థ హిందుస్థాన్ ఏరోనాటికల్ లిమిటెడ్ భాగస్వామ్యం లభించకుండా పోయింది.

మోడీ కుదుర్చుకున్న కొత్త ఒప్పందం వల్ల యుద్ధ సామాగ్రి కొనేటప్పుడు పాటించవలసిన నిబంధనలైన లంచ వ్యతిరేక నిబంధన, కమీషన్ రూపంలో లంచం ఇవ్వడం, తీసుకోవడం శిక్షార్హం అనేవి తొలగించబడ్డాయి. ఫ్రాన్స్ ప్రభుత్వంచే గ్యారెంటీ లేదా ఆ దేశ బ్యాంకు నుంచి పూచీకత్తును సడలించారు. లెటర్ ఆఫ్ కంఫర్ట్ అనే కాగితాన్ని మాత్రం ఇచ్చారు. అనుకున్న ప్రకారం అన్నింటిని సరిగ్గా అందిస్తాం అనే స్వయం ప్రకటిత పత్రం అన్న మాట. దీనికి న్యాయపరమైన గుర్తింపు లేదు. ఈ ఒప్పందాన్ని దస్సాల్ట్ కంపెనీ ఉల్లంఘిస్తే దసాల్ట్ కంపెనీని గానీ, ఫ్రాన్స్ ప్రభుత్వాన్ని గానీ, చేయగలిగేదేమీ ఉండదు. మేక్ ఇన్ ఇండియా అనే మాటను గాలికొదిలేశారు. రాఫెల్ విమానాల ధరల విషయంలో విపరీతమైన పెంపుదలను గమనించవచ్చు. 2008 ధరల ప్రకారం 126 విమానాలకు అయ్యే ఖర్చు 54 వేల కోట్లు. నేడు 36 విమానాలకు కూడా అది సరిపోవడం లేదు. ఈ ఒప్పందం మొత్తం విలువ 59 వేల కోట్లు. ధరలు మూడు రెట్లు పెరిగాయి. కొత్త రాఫెల్ ఒప్పందం ప్రకారం 126 విమానాలకు బదులుగా 36 రెడీమేడ్ విమానాలకు కుదించబడింది. సాంకేతిక పరిజ్ఞానం బదిలీ భారత్‌లో విమానాలు తయారు చేయబడాలనే ఊసే లేకుండా పోయింది. హిందుస్థాన్ ఏరోనాటికల్ లిమిటెడ్ (హెచ్ ఏ ఎల్)లో యుద్ధ విమానాలు

# జో బైడెన్ విదేశాంగ విధానం

*అమెరికా కొత్త అధ్యక్షుడుగా జో బైడెన్ వచ్చినంత మాత్రాన విదేశాంగ విధానంలో, బహుళజాతి సంస్థల ఆర్థిక ప్రయోజనాలు కాపాడడంలో ఎలాంటి మార్పు ఉండబోదని అంటున్నారు* **సంతోష్**

అమెరికా 46వ అధ్యక్షునిగా జో బైడెన్ ప్రమాణ స్వీకారం జనవరి 20 నాడు వైట్ హౌస్‌లో ఉత్కంఠ భరిత వాతావరణం మధ్య జరిగింది. అధ్యక్షుడిగా ఆయన చేసిన మొదటి ప్రసంగంలో నేను 'అమెరికన్ల అందరి అధ్యక్షుడి'ని అన్న ఆశ్వాసన ఇస్తూ, పరిస్థితులు కచ్చితంగా మారతాయన్న భరోసా కల్పిస్తున్న కొత్త అధ్యక్షుడు అమెరికాను ఉన్నతంగా నిలబెడతారని ఆశిద్దాం. కరోనా వ్యాప్తి నియంత్రణ విషయంలో ట్రంప్ ప్రభుత్వం ప్రదర్శించిన నిర్లక్ష్య వైఖరికి బైడెన్ స్వస్తి పలికాడు. అమెరికాలో చీలిన సమాజాన్ని సంఘటితం చేయడం బైడెన్ ముందున్న పెద్ద సవాలు. ట్రంప్ పాలనా కాలంలో మత, వర్గ వివక్షలకు అడ్డులేకుండా పోయింది. జార్జి ఫ్లాయిడ్ హత్య ఘటన, అనంతర ఉద్యమాన్ని సైతం ఆయన శ్వేతజాత్యహంకారాన్ని రెచ్చగొట్టడానికి వాడుకున్నాడు. ముస్లింలను తీవ్రవాదులుగా చిత్రీకరిస్తూ ముస్లిం మెజారిటీ దేశాల నుంచి సాగే వలసలను నిషేధించాడు.

బైడెన్ ప్రభుత్వం దేశంలో ఇప్పటివరకూ సాగిన అక్రమ వలసలన్నింటినీ ఒక క్రమ పద్ధతిన సక్రమం చేసే ఆలోచనలో ఉన్నట్లు విధితమవుతుంది. అధ్యక్షుడుగా బైడెన్ తొలి సంతకాలు చేసి పార్లమెంటు ఆమోదానికి పంపించిన నిర్ణయాలలో వలస విధానం సమూల మార్పులకు చెందిన బిల్లు కూడా ఉండడం హర్షదాయకం. 'శ్వేత జాతి అహంకారాన్ని తప్పకుండా ఓడిస్తామని' చెప్పడం ద్వారా అమెరికాకు వలస వచ్చిన ప్రజల విశ్వాసాన్ని పొందడానికి బైడెన్ ప్రభుత్వం కృషి చేస్తుందని విధితమవుతోంది. వలసవాద నిబంధనల మార్పుతో విదేశీ నిపుణులకు ఊరట కల్పించారు. ముఖ్యంగా భారతీయ వృత్తి నిపుణులకు ఇది ఎంతో ప్రయోజనకరం. ముస్లిం దేశాల నుండి వలసదారుల రాకపై ఆంక్షల సడలింపు వలసదారులకు సానుకూల సంకేతాలిచ్చినట్టయింది. అమెరికాను అన్ని రంగాల్లో ఉన్నతంగా తీర్చిదిద్దాల్సిన అవసరం ఉందని, కరోనా వల్ల లక్షల ఉద్యోగాలు పోయాయని, ఆర్థిక రంగం కుదేలైందంటూనే ఇలాంటి కష్టకాలంలో శక్తియుక్తులన్నీ ప్రోది చేసుకుని ముందుకు సాగాలని బైడెన్ చెప్పడంతో అమెరికన్ యువతీ యువకుల ఉద్యోగ, ఉపాధి అవకాశాలపై ఆశావహ దృక్పథాన్ని కల్పించినట్లయింది.

అమెరికా తొలి ఉపాధ్యక్షురాలిగా ఇండో–ఆఫ్రో–అమెరికన్ మహిళ కమలా హ్యారిస్ ఎన్నిక కావడంతో సహా బైడెన్ పరిపాలనా బృందంలో అత్యధిక సంఖ్యలో భారతీయ అమెరికన్లకు చోటు దక్కింది. కెబినెట్‌లో మహిళల ప్రాధాన్యత పెరిగింది. అయితే భారతీయ అమెరికన్లలో అత్యధికులు డెమోక్రటిక్ పార్టీకి అనుకూలంగా ఉంటున్న చారిత్రక వాస్తవాన్ని మరువరాదు. గతంలో కన్నా ఇప్పుడు కొంత ఎక్కువ దామాషాలో పదవులు లభించాయి. ఈ కారణంగా భారత అమెరికా ఆర్థిక, వాణిజ్య, రాజకీయ సంబంధాల్లో పెను మార్పులు వస్తాయని ఎవరనుకున్నా అది అత్యాశే అవుతుంది. అంతర్గత పాలనాంశాల్లో కొన్ని సర్దుబాట్లు, దిద్దుబాట్లు తప్ప మౌలికంగా అమెరికన్ పాలక వర్గాల స్వభావంలో ఎలాంటి మార్పు ఉండదన్న విషయాన్ని సదా గుర్తుంచుకోవాలి. వారి సామ్రాజ్యవాద వైఖరిలో మార్పు లేదు. కార్పొరేట్ల వాణిజ్య ప్రయోజనాల కోసం, ఆయుధ వ్యాపారాన్ని పెంచుకోవడానికి అమెరికన్ పాలకుల యుద్ధోన్మాదం కొనసాగుతూనే ఉంటుంది.

ట్రంప్ కాలంలో దూరమైన మిత్రదేశాలను దగ్గరచేసుకోవడం బైడెన్‌కు

---

తయారు చేయబడితే యుద్ధ విమానాల సాంకేతికతను హెచ్ఏఎల్ సొంతం చేసుకుని భవిష్యత్తులో స్వయంగా తయారు చేయగలిగి ఉండేది. అంతేకాకుండా లాభాల ప్రమేయం ఉండకుండా పోయేది. ఆ విధంగా తయారీ ఖర్చు కూడా తగ్గేది. ఒకవేళ వస్తే విద్య, వైద్యంపై ఖర్చు పెట్టి ప్రజలకు మేలు చేసే అవకాశం ఉండేది. ప్రైవేట్ కంపెనీకి లాభాలు వస్తే ప్రజలకు ఉపయోగపడేది ఏముంటుంది.

రాఫెల్ ఒప్పందం ప్రకారం భారత్‌లో విమానాలను తయారు చేసేదేమీ ఉండదు. కుదిరిన ఒప్పందం ప్రకారం అమ్మకాల మొత్తంలో సగాన్ని జాయింట్ వెంచర్ అయిన డసాల్ట్ రిలయన్స్ ఎయిరో స్పేస్ లిమిటెడ్ పేరుతో రిలయన్స్ కంపెనీలో డస్సాల్ట్ కంపెనీ పెట్టుబడిగా పెట్టడం వల్ల ఎవరికి ప్రయోజనం. దీని ద్వారా తేలేదేమంటే యుద్ధ విమానాలను కొనడం పేరుతో భారత ప్రభుత్వం నుండి వయా డసాల్ట్ కంపెనీ రిలయన్స్‌కు 30 వేల కోట్లు చేరుతాయి అన్నమాట. సుదీర్ఘ అనుభవం, యంత్రాంగం, మంత్రాంగం ఉన్న హిందుస్థాన్ ఏరోనాటికల్ లిమిటెడ్ 108 విమానాల తయారీ నుండి తప్పించడం వెనుక దానిని మరింత సంక్షోభంలోకి నెట్టి, బలహీనపరిచి, చివరకు ఎత్తివేసే ఆలోచన దాగున్నదనే విషయాన్ని తోసిపుచ్చలేం. బ్యాంకులు, ఎల్ఐసి, రైల్వే, ఉక్కు ఫ్యాక్టరీ మొదలైన ఎన్నో ప్రభుత్వ రంగ సంస్థలను అమ్ముతూ ప్రైవేట్ పరం చేస్తున్నట్లుగా హిందుస్థాన్ ఏరోనాటికల్ లిమిటెడ్‌ను కూడా అడ్డీకి పావుశేరుగా సంతలో అమ్మేయరనే గ్యారెంటీ ఏమీ లేదు. ఇక రక్షణ రంగ సామాగ్రిని ప్రైవేట్ శక్తులు తయారు చేస్తాయన్నమాట. రాఫెల్ యుద్ధ విమానాల ఒప్పందం వెనుక హిందుస్థాన్ ఏరోనాటికల్ లిమిటెడ్‌ను దెబ్బ తీయడం అటు అనిల్ అంబాని డస్సాల్ట్ కంపెనీ, ఇటు పాలకపక్ష పార్టీ, దాని వెనుక ఉన్న భావజాల ప్రతినిధి, వివిధ కీలక అధికార హోదాల్లో ఉన్న రాజకీయ నాయకుల ప్రయోజనాలు ఇమిడి ఉన్నాయని తేలిపోతున్నది. ఇలాంటి ఒప్పందాల కుంభకోణాల ద్వారా ప్రజల శ్రమ సంపద ఎంత మందికి విందు భోజనం అవుతుందో, ప్రజలకు అందకుండా ఎలా ఎగరేసుకుపోవడం జరుగుతుందో తెలుసుకోవచ్చు.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

అసలు పరీక్ష. ఇరాన్, చైనా, ఉత్తరకొరియా, రష్యా తదితర దేశాల విషయంలో ట్రంప్ దుస్సాహసాలు చేశారు. ఇయు లోని పశ్చిమ యూరప్ దేశాలకు దూరమయ్యాడు. మధ్యప్రాచ్యంలో కొత్త ఎత్తులు వేశారు. బైడెన్ ఇంతకు ముందున్న అధ్యక్షుడు ట్రంప్‌లా పెద్ద నోరుతో రెచ్చగొట్టేలా మాట్లాడక పోవచ్చు. కానీ విదేశీ విధానంలో ట్రంప్ అనుసరించిన విధానాన్నే అనుసరించే అవకాశాలు ఎక్కువగా కనిపిస్తోన్నాయి. గత నాలుగేళ్ల ట్రంప్ హయాంలో బెడిసిన అంతర్జాతీయ సంబంధాలను, కూటములను సమీక్షిస్తామని బైడెన్ స్పష్టం చేశారు. ట్రంప్ ఓడిపోయి, బైడెన్ అధికారంలోకి రావడంతోనే అద్భుతాలు జరిగిపోవు. అమెరికాలో అధ్యక్షుడు మారినంత మాత్రాన విదేశీ విధానాలు మారవు. ఆయుధ వ్యాపారం, ప్రపంచ ఆధిపత్యం, బహుళజాతి సంస్థల ప్రయోజనాలను కాపాడే విధంగానే అమెరికా విదేశీ విధానం ఉంటుంది. సామ్రాజ్యవాద ప్రయోజనాలు కాపాడడంలో డెమొక్రటిక్, రిపబ్లికన్ పార్టీల మధ్య ఏలాంటి తేడా ఉండదు.

అమెరికా–మెక్సికో మధ్య గోడ నిర్మాణానికి బైడెన్ నిధులు నిలిపి వేశారు. ఇరాన్‌తో అణు ఒప్పందం పునరుద్ధరణ, అంతర్జాతీయ వాతావరణ ఒప్పందంలోనూ, ప్రపంచ ఆరోగ్య సంస్థలోనూ తిరిగి చేరడం వంటి సానుకూల అంశాలు, దేశీయంగా అందరికి కొవిడ్ వ్యాక్సిన్, అమెరికా రెస్క్యూ ప్లాన్ పేరుతో లక్షా 90 వేల కోట్ల డాలర్ల (రూపాయల్లో దాదాపు 14 లక్షల కోట్ల) ప్యాకేజీని బైడెన్ ప్రభుత్వం ప్రకటించింది. దీంతో ప్రతి అమెరికా పౌరుడి ఖాతాలో రెండు వేల డాలర్లు (ఒక లక్షా 48 వేలు) జమ అయ్యాయి. ఆర్థికంగా కుంగిపోయిన ఇతర రంగాలకు కూడ పెద్ద ఎత్తున ప్యాకేజీలు ప్రకటించింది. అమెరికా 2021–22 ఆర్థిక సంవత్సరానికి ప్రవేశపెట్టబోయే బడ్జెట్‌లో ఆరోగ్యానికి నిధులు అంతగా పెరుగలేదు. కాని మిలిటరీ వ్యయానికి 75,300 కోట్ల డాలర్లు (దాదాపు రు. 56 లక్షల కోట్లు), ట్రంప్ కేటాయించిన దానికంటే 1230 కోట్ల (88 వేల కోట్లు) డాలర్లు ఎక్కువ.

బైడెన్ ప్రమాణ స్వీకారం తరువాత వివిధ దేశాల అధినేతలతో ఫోన్‌లో జరిపిన సంభాషణల్లో ఆసియాలో అమెరికా అనుసరించే విధానం గురించి నొక్కి చెప్పారు. జపాన్ ప్రధాని సుగాతో జరిపిన సంభాషణలో జపాన్‌కు అవసరమైన సాయం అందించేందుకు అమెరికా కట్టుబడి ఉందన్నారు. అమెరికా–జపాన్ పొత్తు, అరమరికలు లేని స్వేచ్ఛా ఇండో–పసిఫిక్ ఒప్పందాలు ఈ ప్రాంతంలో శాంతి, సౌభాగ్యాలకు మూలమలుపు కానున్నాయని అన్నారు. భారత్‌కు కూడా ఇదే విధమైన సంకేతాలు ఇచ్చారు. అమెరికా జాతీయ భద్రతా సలహాదారు జేక్ సులివాన్ భారత జాతీయ భద్రతా సలహాదారు అజిత్ దోవల్‌తో మాట్లాడుతూ, ఇండో–పసిఫిక్ ప్రాంతంలో సన్నిహిత సహకారాన్ని కొనసాగించాల్సిన ప్రాముఖ్యత గురించి ప్రస్తావించారు.

జో బైడెన్ విదేశాంగ విధానంలో ఆసియా అత్యంత ముఖ్యమైన అంశంగా ఉండడమే కాదు, మరింత తీవ్రంగా అది ముందుకొస్తుందన డానికి స్పష్టమైన సంకేతాలు వెలువడుతున్నాయి. ప్రపంచాధిపత్యం కోసం అమెరికా దీర్ఘకాలంగా అనుసరిస్తూ వస్తున్న విధానం ఇక ముందు కూడ కొనసాగనుంది. చైనాపై ముప్పేట దాడి (హైబ్రిడ్ వార్)ని బైడెన్ ప్రభుత్వం తీవ్రతరం చేసే సూచనలూ కనిపిస్తున్నాయి. బైడెన్ విదేశాంగ విధానాన్ని అమలులో పెట్టే బృందం కూర్పు. దాని నడక ఎలా ఉండబోతుందన్నదనే అంశం అటు కొలంబియా దగ్గర నుంచి ఇటు బీజింగ్ వరకు పలు దేశాలు ఆసక్తిగా గమనించాయి. ఆంటోని బ్లింకెన్‌ను విదేశాంగ మంత్రిగా, జాకప్ జేక్ సులివాన్‌ను జాతీయ భద్రతా సలహాదారుగా బైడెన్ నియమించారు. చైనాపై రుద్దుతున్న హైబ్రిడ్ వార్, 30 దేశాలపై అది విధించిన ఆంక్షలు, ఆఫ్ఘనిస్తాన్‌లో తాలిబన్లు సాగిస్తున్న యుద్ధం మొదలైన అంశాలు బైడెన్‌కు సవాళ్లుగా నిలిచాయి.

చైనా చుట్టూ సైనిక వలయం ఏర్పాటు కోసం అమెరికా ఎప్పటి నుంచో యత్నిస్తోంది. దక్షిణ చైనా సముద్రంలో ఘర్షణ వాతావరణాన్ని సృష్టించేందుకు నిరంతరం కుట్రలు పన్నడం అమెరికా విదేశాంగ విధానంలో ఒక సాధారణ అంశం. ఒబామాకు, ట్రంప్‌కు మధ్య తేడా ఎలాంటిదో, ట్రంప్, బైడెన్‌ల మధ్య తేడా కూడా అలాగే ఉంటుంది. చైనా పట్ల ట్రంప్ తీసుకున్న దుందుడుకు వైఖరి సరైనదేనని అమెరికా విదేశాంగ మంత్రి బ్లింకెన్ అన్నారు. మునుపటి విదేశాంగ మంత్రి మైక్ పాంపియో మాదిరే బ్లింకెన్ కూడా చైనాను ఇబ్బంది పెట్టడం కోసం తైవాన్, హాంకాంగ్, సింజియాంగ్‌పై చిచ్చు రగిలించాలని చూస్తున్నారు. శాస్త్ర సాంకేతిక రంగాల అభివృద్ధికి కేంద్రమైన చైనా సిలికాన్ వ్యాలీపై ఆందోళన చెందే కన్నా చైనా మానవ హక్కుల హననం పట్ల యాగీ చేయడమే మేలని బ్లింకెన్ భావిస్తున్నారు. చారిత్రికంగా అమెరికా దృష్టి ఎప్పుడూ యూరప్, లాటిన్ అమెరికా, పశ్చిమాసియాపై ఉంటుంది. కానీ, ఒబామా కాలంలో చైనా శాస్త్ర సాంకేతికాభివృద్ధిలో వేగంగా పురోగమించడం అమెరికాకు ముప్పుగా అనిపించింది. చైనాను ఎలాగైనా కట్టడి చేయాలని అనుకున్నారు.

**చైనా కట్టడికి ఇండో– పసిఫిక్ కమాండ్:**

2007లో జార్జి డబ్ల్యు బుష్ చతుష్టయ కూటమి (క్వాడ్) పేరుతో కొత్త వేదికను ఏర్పాటు చేశారు. ఈ కూటమిలో ఆస్ట్రేలియా, భారత్, జపాన్, అమెరికా సభ్యులుగా ఉన్నాయి. చైనా వ్యతిరేకత, ఒకరి ప్రయోజనాల కోసం ఒకరు మద్దతుగా నిలవడం, సంయుక్త సైనిక విన్యాసాలు నిర్వహించడం ఇవీ స్థూలంగా క్వాడ్ లక్ష్యాలు. 2008లో ఆస్ట్రేలియాలో కెవిన్ రూడ్ ఎన్నిక కావడం, భారత్ ప్రధాని మన్మోహన్ సింగ్ చైనా వ్యతిరేకత దేశ ప్రయోజనాలకు దోహదపడదని భావించి 'క్వాడ్'కు ఎడంగా ఉన్నారు. దీంతో 2017 వరకు క్వాడ్ స్తబ్దుగా ఉంది. దాని బదులు 'పైవోట్ టు ఆసియా' (ఆసియా కీలకం) విధానాన్ని ముందుకు తెచ్చారు. ఈ బాధ్యతను తూర్పు ఆసియా పసిఫిక్ వ్యవహారాల శాఖ సహాయ మంత్రి కుర్తు కాంప్‌బెల్‌కు అప్పగించారు. పరిస్థితులు అనుకూలించక పోవడంతో ఆయన ఆ పదవి నుంచి తప్పుకుని వాషింగ్టన్, హాంకాంగ్‌లలో 'ఆసియా గ్రూపు' పేరుతో ఒక ప్రైవేట్ కన్సల్టెన్సీని ఏర్పాటు చేసుకున్నారు. ట్రంప్ చైనాపై దూకుడుగా వాణిజ్య యుద్ధాన్ని ప్రారంభించారు. ట్రంప్ మిలిటరీ నాయకత్వం ఇండో పసిఫిక్ కమాండ్‌ను ఏర్పాటు చేసింది. చైనాను లక్ష్యంగా చేసుకుని ఈ మిలిటరీ పొత్తుపై ప్రధానంగా కేంద్రీకరించారు. ఆస్ట్రేలియా, భారత్, జపాన్‌లలో అధికారం చేపట్టిన కొత్త రాజకీయ నాయకులు పచ్చి మితవాదులు కావడంతో ట్రంప్ వారితో కలసి క్వాడ్‌ను తిరిగి తెరపైకి తెచ్చారు. క్వాడ్ పునరుద్ధరణలో సహకరించినందుకు కృతజ్ఞతగా ట్రంప్ దిగిపోయే ముందు అమెరికాలో అత్యున్నత పురస్కారమైన 'లెజియన్ ఆఫ్ మెరిట్'ను ఆస్ట్రేలియా (స్కాట్ మోరిసన్), భారత్ (నరేంద్ర మోడీ), జపాన్ (షింజో అబే) లకు ప్రకటించారు.

ఆసియాలో తన ఉనికిని చాటుకోవడానికి, చైనా ఎదుగుదలను దెబ్బ తీయడం కోసం అమెరికా ఈ కూటమిని కొత్తగా తెరపైకి తీసుకొచ్చింది. ప్రపంచ వాణిజ్యంలో హిందూ మహాసముద్రం కీలక భూమిక పోషిస్తోంది. చైనాతో పాటు తూర్పు ఆసియా దేశాలకు మధ్యప్రాచ్యం నుంచి చమురు సరఫరాకు ఇదే కీలక మార్గం. చతుర్భుజ కూటమిలోని అమెరికా, భారత్, జపాన్, ఆస్ట్రేలియాలకు ఇండో–పసిఫిక్ వ్యూహాత్మకంగా ముఖ్యమైంది. ఈ ప్రాంతం ఎలాంటి అలజడులు లేకుండా ప్రశాంతంగా ఉండాలని ఈ కూటమి ఆశిస్తోంది. చైనా

నెమ్మదిగా హిందూ మహాసముద్రంలో తన ప్రాబల్యాన్ని విస్తరించేందుకు ప్రయత్నాలు ముమ్మరం చేసింది. చైనా బెల్ట్–అండ్–రోడ్ ప్రణాళికతో అభివృద్ధి పేరిట ఆయా దేశాలకు రుణాలిస్తు అభివృద్ధి పనులు చేపడుతూ పలు ఆసియా దేశాలను తన ప్రాబల్యంలోకి తెచ్చుకుంటోంది. ఇది అమెరికాకు కంటగింపుగా మారింది.

బైడెన్ అమెరికా అధ్యక్షుడు అయ్యాకా 'క్వాడ్'కు ప్రాధాన్యత పెరిగింది. వెంటనే శిఖరాగ్ర సదస్సు తేదీలు ఖరారయ్యాయి. మార్చి 12న బైడెన్ సమక్షంలో 'క్వాడ్' నాలుగు దేశాల మొట్టమొదటి శిఖరాగ్ర సమావేశం వర్చువల్ సమ్మిట్ డిజిటల్‌గా జరిగింది. 'క్వాడ్' శిఖరాగ్ర సమావేశం జరిగింది. ప్రపంచంపై ఆధిపత్యానికి చైనా ప్రయత్నిస్తున్నదని, దాన్ని సకాలంలో కట్టడి చేయకుంటే ముప్పు కలుగుతుందని అమెరికా నమ్ముతోంది. ఇలాంటి అభిప్రాయమే క్వాడ్‌లోని ఇతర దేశాలకు కూడా ఉంది. జపాన్‌కు దక్షిణ చైనా సముద్ర జలాల్లో, ఆస్ట్రేలియాకు పశ్చిమ పసిఫిక్ ప్రాంతంలో ఆ దేశంతో సమస్యలున్నాయి. భౌగోళికంగా చూస్తే అమెరికాకు చైనాతో సమస్యలేవు. కానీ మొత్తంగా తన ఆధిపత్యానికి ఆ దేశం ఎసరు పెట్టవచ్చని అమెరికా ఆందోళనలో ఉంది. ప్రధానంగా ఆసియా–పసిఫిక్‌పై తన ప్రాబల్యం తగ్గుతుందని అమెరికా ఆందోళన చెందుతుంది.

క్వాడ్ సదస్సులో బైడెన్ మాట్లాడుతూ ఇండో–పసిఫిక్ ప్రాంత దేశాల ఉమ్మడి ఆకాంక్షలను నెరవేర్చుకోవడానికి, పరస్పర సహకారాన్ని పెంపొందించుకోవడానికి క్వాడ్ ఓ సరికొత్త యంత్రాంగమని ఆయన పేర్కొన్నారు. ఇండో–పసిఫిక్ ప్రాంతం ఆంక్షల రహితంగా ఉండడం క్వాడ్ దేశాల సమున్నత భవితవ్యానికి ఎంతో అవసరమన్నారు. ఆ సమావేశంలో కొవిడ్ టీకా, సాంకేతిక పరిజ్ఞానం, వాతావరణ మార్పులపై పరస్పర సమావేశం సహకరించుకోవడానికి అంగీకరించాయి. క్వాడ్‌లో భాగస్వాములైన ఆస్ట్రేలియా, భారత్, జపాన్‌తో బాటు, ఇతర దేశాలతో కలసి చైనాపై ముప్పేట దాడి (హైబ్రిడ్ వార్) సాగించడం, ఒత్తిడి పెంచాలని భావిస్తున్నాయి. అయితే జపాన్, ఆస్ట్రేలియా, ద.కొరియా వంటి దేశాలు చైనాతో వాణిజ్య సంబంధాలను తెంచుకునేందుకు సిద్ధంగా లేవు. వీటి సహకారం లేకుండా అమెరికా ఏమీ చేయలేదు. ఈ దేశాలు చైనాతో కలసి వాణిజ్య కూటమి కట్టాయి. 2020 నవంబర్‌లో ప్రాంతీయ సమగ్ర ఆర్థిక భాగస్వామ్యం (ఆర్‌సిఇపి) ఒప్పందంపై ఇవి సంతకాలు చేశాయి. అమెరికా ఒత్తిడితో భారత్ ఒక్కటే దీనిలో చేరడానికి నిరాకరించింది.

**ట్రాన్స్ పసిఫిక్ భాగస్వామ్యం (టిపిపి):**

చైనా సామాజిక, ఆర్థిక ఎదుగుదలను అడ్డుకోవడమే లక్ష్యంగా ట్రాన్స్ పసిఫిక్ పార్టనర్‌షిప్ పేరుతో వాణిజ్య ఒప్పందాన్ని 2016 ఫిబ్రవరి 4న ఒబామా తీసుకొచ్చారు. దీనిపై ఆస్ట్రేలియా, బ్రూనై, కెనడా, చిలీ, జపాన్, మలేషియా, మెక్సికో, న్యూజిలాండ్, పెరూ, సింగపూర్, వియత్నాం, అమెరికా దేశాలు సంతకాలు చేశాయి. టి.పి.పి చాల పెద్ద వాణిజ్య ఒప్పందం. ఇందులో గల దేశాల వాణిజ్యం 40 శాతం వరకు ఉంటుంది. దాని చుట్టూ పైవోట్ ఆసియాను నడిపించాలని ఒబామా అనుకున్నారు. ఒబామా హయాంలో పైవోట్ టు ఆసియా మరింత విస్తరించింది. అయితే ఒబామా వాణిజ్య విధానాన్ని ట్రంప్ పక్కన పెట్టారు. ట్రాన్స్ పసిఫిక్ భాగస్వామ్య ఒప్పందం నుంచి తప్పుకుంటున్నట్లు ప్రకటించారు. ఆ తరువాత ఒప్పందం నీరు కారిపోయింది.

ట్రంప్ అనుసరించిన విధానాన్నే బైడెన్ కొనసాగించనున్నారన్న సంకేతాలు వెలువడుతున్నాయి. కుర్తు కాంప్‌బెల్‌ను బైడెన్ తిరిగి తీసుకున్నారు. 'ఆసియా జార్'గా పిలువబడే కాంప్‌బెల్ ఈ బాధ్యతలను స్వీకరించిన వెంటనే తన కార్యాలయాన్ని పునర్వ్యవస్థీకరించారు. ముగ్గురు సీనియర్ డైరెక్టర్లను (ఒబామా వెటరన్స్‌గా పేరొందినవారిని) తీసుకున్నారు. వారు ఆండ్రియా కెండాలి టేలర్ (రష్యా, మధ్య ఆసియా వ్యవహారాలు), సుమోనా గుహ (దక్షిణాసియా వ్యవహారాలు). లారా రోజెన్‌బర్గర్ (చైనా వ్యవహారాలు). రోజెన్‌బర్గర్ కొత్త విదేశాంగ మంత్రి బ్లింకెన్‌కు అత్యంత సన్నిహితురాలు. కరోనా నిర్వాహణలో చైనాను బాహాటంగా విమర్శలు చేయడంలో ఆమె ముందున్నారు. చైనాను విమర్శిస్తూ ఆమె గతంలో రాసిన వ్యాసాలు న్యూస్ వీక్‌లోను, ఇతర అమెరికన్ పత్రికల్లోను ప్రచురితమయ్యాయి. మాజీ విదేశాంగ మంత్రి మైక్ పాంపియో మాదిరిగానే నోటి దురుసుతనం ఎక్కువ. ఇండో పసిఫిక్ పట్ల ముఖ్యంగా చైనా విషయంలో అమెరికా విధానం ఎలా ఉండబోతున్నదీ దీనిని బట్టే తెలిసిపోతోంది. బైడెన్ తన పశ్చిమాసియా టీమ్‌కు భిన్నంగా ఆసియా పోర్టుఫోలియోను విస్తరించారు. పశ్చిమాసియా టీమ్‌కు ఒక్కరే డైరెక్టర్.

జపాన్ ప్రయోజనాలు కాపాడతానని బైడెన్ హామీ ఇచ్చారు. 2020 నవంబర్‌లో ఆ దేశ ప్రధాని యోషిడే సుగాతో చైనా–జపాన్ మధ్య ఉద్రిక్తతల గురించి ప్రస్తావిస్తూ 'అమెరికా–జపాన్ వ్యూహాత్మక పొత్తు ఒప్పందంలోని ఆర్టికల్ 5 ద్వారా వస్తే, జపాన్‌కు తాము దన్నుగా ఉంటామని' అన్నారు. బైడెన్ మాటల్లో జపాన్ ప్రయోజనాలు కాపాడేందుకు చైనా సైనిక బలాన్ని ఉపయోగిస్తుందన్న ధ్వని వినిపించింది. బ్లింకెన్ తన నియామకాన్ని ధ్రువీకరించే సెనేట్ ముందు మాట్లాడుతూ, తైవాన్ పెద్ద పాత్ర పోషించాలని అమెరికా కోరుకుంటోందని అన్నారు. తైవాన్‌ను బలోపేతం చేసేందుకు అమెరికా కట్టుబడి ఉందన్నారు. అంతేకాదు, తైవాన్ తనను తాను రక్షించుకునేందుకు అవసరమైన రక్షణ సాయం కూడా అందిస్తామని చెప్పారు. అంటే, ట్రంప్ హయాంలో అందించిన మిలిటరీ సాయాన్ని కొనసాగిస్తామని చెప్పడమే. ఈ రెండు ప్రకటనలను బైడెన్ ప్రభుత్వం చైనాపై హైబ్రిడ్ వార్‌ను కొనసాగించడమే గాక, మరింత తీవ్రతరం చేయొచ్చని అర్థమవుతుంది.

**తెరపైకి ట్రాన్స్ అట్లాంటిక్ భాగస్వామ్యం (టిటిఐపి):**

ట్రాన్స్ అట్లాంటిక్ కూటమిని పునరుద్ధరించనున్నట్లు అమెరికా అధ్యక్షుడు జో బైడెన్ ప్రపంచ నేతలకు తెలియజేశారు. ఫిబ్రవరి 19న జరిగిన మ్యూనిచ్ భద్రతా సమావేశంలో ఆయన ప్రపంచ నాయకులనుద్దేశించి మాట్లాడారు. ప్రపంచ దేశాల్లో ప్రజాస్వామ్యాన్ని పరిరక్షించేందుకు ఈ కూటమి ఏర్పడాల్సిన అవసరమెంతైనా ఉందన్నారు. నాటో కూటమికి అమెరికా పూర్తిగా కట్టుబడి ఉందన్నారు. అమెరికా అధ్యక్షుడు జో బైడెన్ మ్యూనిచ్ భద్రతా వార్షిక సదస్సులో మాట్లాడుతూ ట్రాన్స్ అట్లాంటిక్ కూటమికి తిరిగి ఊపిరి పోయాలన్నాడు. ఉత్తర అమెరికాలోని అమెరికాయేతర ప్రధాన దేశాలు, యూరప్‌లోని ఇయు దేశాలు తమ చారిత్రక, సాంస్కృతిక, రాజకీయ, ఆర్థిక, సామాజిక సంబంధాలను మెరుగు పరచుకోవాలని పిలుపునిచ్చాడు. మూడు అంచల ప్రణాళికను కూడ ఆయన ప్రకటించాడు. అవి ఒకటి, కొవిడ్‌ను పారదోలడం. రెండు, ట్రాన్స్ అట్లాంటిక్ దేశాల సైనిక శక్తికి పునర్బలం కల్పించడం. మూడు, సాంకేతిక ఐక్య వేదికకు సానపట్టడం. 'అమెరికా ఈజ్ బ్యాక్' అంటూ ప్రపంచానికి ఒక స్పష్టమైన సందేశం పంపుతున్నానని బైడెన్ చెప్పారు. ట్రంప్ ప్రభుత్వం అనుసరించిన విదేశాంగ విధానానికి పూర్తి భిన్నంగా తమ విధానం ఉండబోతుందని చెప్పారు. అట్లాంటిక్ దేశాల సంబంధాలు గత కొన్నేళ్లుగా దెబ్బతిన్నాయి, కాల పరీక్షకు నిలిచాయి. ఇప్పుడు యూరప్‌తో తిరిగి సంబంధాలు పెట్టుకోవాలని

అమెరికా నిర్ణయించిందన్నారు. ఈ కూటమి రష్యాను కట్టడి చేయడానికి ఎంతో అవసరమన్నారు.

**సిరియాపై అమెరికా వైమానిక దాడులు:**

సిరియాలోని తీవ్రవాద స్థావరాలే లక్ష్యంగా అమెరికా మరోసారి వైమానికి దాడులతో విరుచుకుపడింది. అమెరికా అధ్యక్షుడిగా జో బైడెన్ బాధ్యతలు చేపట్టిన నెల రోజుల్లోనే దాడులకు అనుమతి ఇవ్వడం గమనార్హం. ఇరాన్ మద్దతుతో పెట్రేగిపోతున్న తీవ్రవాదులు తూర్పు సిరియాలో ఉన్నారనే సమాచారంతో ఫిబ్రవరి 24 రాత్రి అమెరికా ఈ దాడులు చేసింది. సిరియా-ఇరాక్ సరిహద్దుల్లోని ఇరాన్ మిలీషియా బృందాలే లక్ష్యంగా అగ్రరాజ్యం సైన్యాలు ఈ దాడులు చేశాయి. వైమానిక దాడుల్లో భారీగా తీవ్రవాదులు హతమైనట్టు అమెరికా అధికార వర్గాలు తెలిపాయి. ఫిబ్రవరి 24న అమెరికా వైమానిక దాడులు సిరియాకు మద్దతిచ్చే ఇరాన్ తీవ్రవాద బృందాలకు చెందిన పలు స్థావరాలపై కురిపించిన బాంబుల వర్షంలో సిరియాలోని పలు స్థావరాలు ధ్వంసమైనట్లు పెంటగాన్ అధికార ప్రతినిధి జాన్ కిర్బి వెల్లడించారు. ఇరాక్‌లోని అమెరికా సంకీర్ణ దళాలపై ఇరాన్ మద్దతుతో రాకెట్ దాడులు చేసిన సిరియా మిలిటెంట్లపై ప్రతీకారంగా ఈ దాడులు చేశామని అమెరికా రక్షణ శాఖ మంత్రి లాయిడ్ ఆస్టిన్ అన్నారు. మార్చ్ నెల 15న ఉత్తర ఇరాక్‌లో సంకీర్ణ సైన్యాలే లక్ష్యంగా జరిగిన రాకెట్ దాడుల్లో ఓ కాంట్రాక్టర్ మృతి చెందాడు. యుఎస్‌కు చెందిన అధికారి, సంకీర్ణ దళాల సభ్యులు గాయపడ్డారు. 'శిక్ష పడుతుందనే భయం లేనట్లు మీరు నటిస్తున్న తీరు మాకు తెలుసు' కానీ జాగ్రత్త అంటూ ఇరాన్‌ను అమెరికా అధ్యక్షుడు బైడెన్ హెచ్చరించాడు.

**రష్యాపై అమెరికా ఆంక్షలు:**

రష్యాపై అమెరికా ప్రభుత్వం కొత్త ఆంక్షలు విధించింది. దీనికి సంబంధించిన ఉత్తర్వులపై అధ్యక్షుడు బైడెన్ ఫిబ్రవరి 15న సంతకం చేశారు. తాజా ఆంక్షల్లో భాగంగా అమెరికా రష్యాకు చెందిన పలువురు అధికారులను, సంస్థలను లక్ష్యంగా చేసుకుంది. దాదాపు 12 మంది దౌత్యవేత్తలను దేశం నుంచి బహిష్కరించేందుకు వైట్‌హౌస్ చర్యలను ప్రారంభించింది. 2020 అధ్యక్ష ఎన్నికల్లో రష్యా జోక్యం చేసుకుందని ఆరోపిస్తూ అందుకు ప్రతిస్పందనగా ఈ చర్య తీసుకున్నామని వైట్‌హౌస్ పేర్కొంది. ఏప్రిల్ 15న అమెరికన్ ట్రెజరీ శాఖ రష్యా సెంట్రల్ బ్యాంక్, జాతీయ సంపద నిధి, ఆర్థిక మంత్రిత్వ శాఖ నుండి సార్వభౌమ బాండ్లను కొనుగోలు చేయకుండా యుఎస్ బ్యాంకులపై ఆంక్షలు విధించింది. అయితే ఎన్నికల ప్రక్రియలో తాము జోక్యం చేసుకున్నామని చేసే ఆరోపణలను రష్యా పదేపదే ఖండిస్తూ వస్తోంది. అమెరికా ఆంక్షలకు సంబంధించి రష్యా ఉప విదేశాంగ మంత్రి అలెగ్జాండర్ పాంకిన్ మొదట్లోనే హెచ్చరికలు చేశారు. రష్యా సెక్యూరిటీల చుట్టూ విషపూరిత వాతావరణాన్ని సృష్టించేందుకు ఉద్దేశపూర్వకంగా అమెరికా దాడి చేయవచ్చునని ఆయన అన్నారు. కాగా, ఆంక్షలను అమెరికా ప్రభుత్వం సమర్థించుకుంది. వైట్‌హౌస్ జాతీయ భద్రతా సలహాదారు జేక్ సులివాన్ మాట్లాడుతూ... రష్యా నుంచి ఎదురౌతున్న సైబర్ దాడులు, ఎన్నికల్లో జోక్యం నుంచి అమెరికా ప్రయోజనాలను కాపాడుకోవడానికే ఆంక్షలు విధించామని పేర్కొంది. మరోవైపు ఈ ఆంక్షలు దేశాల మధ్య ఘర్షణను పెంచే శత్రు వైఖరి అని రష్యా విదేశాంగ శాఖ పేర్కొంది. రష్యాతో సంబంధాలను సాధారణీకరించాలనే అమెరికా కోరికకు విరుద్ధమని రష్యా తెలిపింది. మరోవైపు క్రిమియా, ఉక్రెయిన్ సరిహద్దుల్లో రష్యా సైన్యాన్ని భారీగా మోహరించింది. ఏప్రిల్ 19న అమెరికా జాతీయ భద్రతా సలహాదారు జెక్ సులివాన్ సిఎన్ఎన్ పత్రికతో మాట్లాడుతూ, న్యాయవాది, రష్యా ప్రతిపక్ష నేత అలెక్సి నావల్నీ(44) ఆరోగ్య పరిస్థితిపై ఆందోళన వ్యక్తం చేస్తూ, అతని ప్రాణానికి ముప్పు వాటిల్లితే తీవ్ర పరిణామాలు ఎదుర్కోవాల్సి ఉంటుందని హెచ్చరించాడు. నావల్నీ చాలా కాలంగా మాస్కో జైలులో ఉన్నారు. ఇయు కూడ రష్యాను హెచ్చరించింది.

**చైనాపై అమెరికా, ఇయు ఆంక్షలు:**

చైనా మానవ హక్కుల ఉల్లంఘనకు పాల్పడుతోందంటూ కొందరు అధికారులపై అమెరికా, ఇయు ఆంక్షలు విధించాయి. నల్గురు చైనా అధికారుల ప్రవేశంపై నిషేధం విధిస్తూ యూరోపియన్ యూనియన్ విదేశాంగ మంత్రి ప్రకటన చేసిన మలిరోజే అమెరికా ఆంక్షలు విధించింది. చైనాకు వాయవ్యంగా ఉన్న స్వయం ప్రతిపత్తి ప్రాంతం షిన్‌జియాంగ్‌లో మైనార్టీ ఉయిగర్‌ల పట్ల ప్రభుత్వం వివక్ష చూపుతోందని, అక్కడ మానవ హక్కులు కాలరాయబడుతున్నాయని, దీనికి ప్రతిస్పందనగానే తాము ఈ ప్రాంత ఉన్నతాధికారులపై ఆంక్షలు విధిస్తున్నామని అమెరికా, ఇయు దేశాలు చెబుతున్నాయి. మైనారిటీలపై మానవ హక్కుల ఉల్లంఘనలకు పాల్పడ్డారంటూ గ్లోబల్ మాగ్నిట్స్కై యాక్ట్ కింద చైనాకు చెందిన వాంగ్ జున్‌ఝెంగ్, చెన్ మింగువోలపై అమెరికా ఆంక్షలు విధించింది. షిన్‌జియాంగ్ వ్యవహారంపై అమెరికా, ఇయు విధించిన ఆంక్షలను చైనా దీటుగా బదులిచ్చింది. పశ్చిమ దేశాలకు చెందిన పది మంది ఉన్నతాధికారులపై ఆంక్షలు విధిస్తున్నట్లు చైనా ప్రకటించింది. ఈ ఆంక్షలకు గురైన వారిలో యూరోపియన్ పార్లమెంటుకు చెందిన చైనా వ్యవహారాల కమిటీ చైర్మన్ రీనార్డ్ బుతికాఫర్, ఇయు పార్లమెంటు-తైవాన్ ఫ్రెండ్‌షిప్ గ్రూపు చైర్మన్ మైఖేల్ గేహ్లర్, ఇయులో భాగస్వాములైన జర్మనీ, బెల్జియం, నెదర్లాండ్స్, లిథువేనియా వంటి దేశాలకు చెందిన కొందరు పార్లమెంటు సభ్యులు ఉన్నారు.

వెనిజులా తాజా ఎన్నికలలో ప్రజల తిరస్కారానికి గురైన తిరుగుబాటుదారుడు గైడోను ఆ దేశ అధ్యక్షుడిగా గుర్తించనున్నట్టు అమెరికా కొత్త విదేశాంగ మంత్రి ప్రకటించడం అందుకు ఒక సూచిక. వెనిజులా, క్యూబా దేశాలపై కఠినమైన ఆర్థిక ఆంక్షలు విధించింది. అటు బైడెన్ ప్రమాణ స్వీకారం జరుగుతుండగానే గాజా స్ట్రిప్‌పై ఇజ్రాయిల్ దాడులు యథావిధిగా కొనసాగుతూనే ఉన్నాయి. బైడెన్ పాలన చేపట్టినప్పటి నుంచి సిరియాపై బాంబు దాడి, చైనాతో ప్రచ్ఛన్న యుద్ధాన్ని మరింతగా పెంచింది. పోలాండ్, ఉక్రెయిన్‌లో నాటో ఉనికి విస్తరించింది. బాల్టిక్స్ రష్యాను బెదిరిస్తూ, కొరియా, జపాన్, ఫిలిప్పిన్స్‌లో కొత్తగా అమెరికా నావికాదళ విన్యాసాలతో పాటు భారత్, నార్వేలకు అను బాంబర్లను కూడా పంపాయి. అమెరికాకు చెందిన 'యుఎస్ఎస్ పాల్ జోన్స్' క్షిపణి విధ్వంసక నౌక లక్షద్వీప్‌కు సమీపంలో భారత ప్రాదేశిక సముద్ర జలాల్లో యుద్ధ విన్యాసాలు జరిపింది. ఏప్రిల్ 7న జరిగిన యుద్ధ విన్యాసాలపై అమెరికా నౌకాదళం ఏడో ఫ్లీట్ అధికారిక ప్రకటన చేశాక గానీ, జరిగిన సంగతి బయటకు రాలేదు. "ఇది మాకు మామూలే. మేం చేసిందంతా కరెక్టే. మాకు ఇక్కడ ఉండటానికి, యుద్ధ విన్యాసాలు జరపడానికి హక్కులున్నాయి. అంతా అంతర్జాతీయ చట్టాల ప్రకారమే నడుచుకున్నా"మని అమెరికా నౌకాదళం ప్రకటన చేసింది. దీనిపై భారత్ వెలిబుచ్చిన అసంతృప్తి, ఆగ్రహాన్ని అమెరికా పట్టించుకోలేదు. ఈ చర్యలన్నీ అమెరికా సామ్రాజ్యవాద విస్తరణ విధానానికి కొనసాగింపుగా ఉన్నాయి.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# ఉద్యమంతోనే ఖాజీపేట రైల్వేకోచ్ ఫ్యాక్టరీ సాధ్యం

*అన్ని వసతులు ఉన్న ఖాజీపేటలో రైల్వేకోచ్ ఏర్పాటుకోసం నిరుద్యోగులు, ప్రజా సంఘాలు, విద్యార్థులు ఐక్యంగా ఉద్యమించి సాధించుకోవాలని అంటున్నారు* **బండి దుర్గాప్రసాద్**

వీరోచిత తెలంగాణ ప్రజల పోరాటం ఫలితంగా తెలంగాణ రాష్ట్రం బిల్లు పార్లమెంట్‌లో ఆమోదం పొంది చట్టం అయింది. రాష్ట్ర పునర్విభజన చట్టంతో తెలంగాణ రాష్ట్రం ఏర్పడింది. ఏడేళ్ల పొద్దు కూడా గడిచిపోతున్నది.

'ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం మా పోరాటం వల్లనే వచ్చిందని తెలంగాణ రాష్ట్ర సమితి', 'తమ మద్దతే కీలకమని' భారతీయ జనతా పార్టీ, 'తెలంగాణ ఇచ్చిందే మేము అని' చెబుతున్న కాంగ్రెస్, తెలంగాణ సాధనను తమకు ఆపాదించుకొని పోటీపడి టిఆర్ఎస్ రాష్ట్రంలో రెండుసార్లు గద్దెనెక్కింది. కేంద్రంలో బిజెపి అధికారంలోకి వచ్చింది. కాంగ్రెస్ ప్రతిపక్ష పార్టీగా పార్లమెంట్‌లో ఉన్నది. పార్టీలకు అధికారం, పదవులు, ఆస్తులు దక్కినవి కానీ తెలంగాణ ప్రజల బతుకులు మాత్రం మారడం లేదు.

1,200 మంది విద్యార్థుల, ఉద్యమకారుల త్యాగం నేడు అపహాస్యమౌతున్నది. లక్షల మంది కేసులు, జైళ్లకు పోయిన ఉద్యమ కారులు, విద్యార్థులు నేడు నిరుద్యోగులుగా, ప్రభుత్వానికి పట్టని నిర్లక్ష్య జీవులు బతుకులీడుస్తున్నారు. తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు బిల్లులో చాలా చిల్లులతో కూడుకున్న జల్లెడవంటి తెలంగాణను ఇచ్చిన కేంద్ర పాలకులు తెలంగాణను మరోసారి మోసం చేస్తున్నారు. నిర్లక్ష్యం చేస్తున్నారు. దానికి రాష్ట్ర పునర్విభజన చట్టం అమలునే రుజువుగా చూడవచ్చు.

ఇక్కడ నిరుద్యోగులకు ఉపాధి కల్పన కోసం తెలంగాణకు కోచ్ ఫ్యాక్టరీ, ములుగులో గిరిజన యూనివర్సిటీ, బయ్యారం ఉక్కు ఫ్యాక్టరీ, ఐటిఆర్ ప్రాజెక్టు అంశాలు రాష్ట్ర పునర్విభజన చట్టంలో పొందుపరిచి, పార్లమెంట్‌లో చట్టం చేసి తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు చేశారు. ఈ ఏడేళ్ల కాలంలో వీటిలో ఒక్కటి పార్లమెంట్ గడప దాటలేదు. తెలంగాణ ప్రజల బతుకులు మారలేదు. ఏడేళ్లుగా పార్లమెంట్ కోల్డ్ స్టోరేజిలో ఉన్న ప్రజాస్వామిక హక్కులు, అంశాలు ఒక్కొక్కటిగా కరిగి కనుచూపు మేరలో కూడా కనపడకుండా పోతున్న దౌర్భాగ్య పరిస్థితిని తెలంగాణ రాష్ట్ర ప్రజలు ఎదుర్కొంటున్నారు. మరోవైపు తెలంగాణ ఉద్యమంలో ముందుకొచ్చిన నీళ్లు, నిధులు, ఉద్యోగాల విషయంలో కంటి తుడుపు చర్యలు చేపట్టి ఏడేళ్లుగా మభ్యపెడుతున్నారు.

**ఖాజీపేట కోచ్ ఫ్యాక్టరీ ఆరు దశాబ్దాల హామీ..**

అందినట్లు అంది చేజారుతున్న కోచ్ ఫ్యాక్టరీ:– నాటి ఆరు దశాబ్దాల సమైక్యాంధ్రప్రదేశ్‌లో గానీ, నేటి ఏడేళ్ల స్వరాష్ట్రం తెలంగాణలో ఖాజీపేట కోచ్ ఫ్యాక్టరీ, జంక్షన్ డివిజన్ సాధన అనేది ఎన్నో దశాబ్దాల ప్రజా ఆకాంక్ష, రాజ్యాంగ బద్ధ హక్కు. అన్ని రకాల అనుకూలతలు ఉన్నప్పటికీ ఇప్పటికే మూడు సార్లు మన వరంగల్ ప్రాంతానికి ఖాజీపేట కోచ్ ఫ్యాక్టరీ వచ్చినట్లే వచ్చి చేజారిపోతున్నది. కేంద్రమంత్రి పి.వి. నరసింహారావు కాలంలో మొదటిసారి కోచ్ ఫ్యాక్టరీ ఖాజీపేటకు మంజూరు చేసి మడికొండ, రాంపూర్ ప్రాంతంలో 1,500 ఎకరాల భూమి కోసం సర్వే కూడా చేశారు. కాని రాజకీయ కారణాలతో పంజాబ్‌కు తరలించారు.

మాజీ ప్రధాని రాజీవ్ గాంధీ హయాంలో ఖాజీపేటకు రెండోసారి కోచ్ ఫ్యాక్టరీ ఏర్పాటు చేస్తామని చెప్పి ఉత్తరప్రదేశ్ రాయబరేలికి తరలించి మొండి చేయి చూపారు. తాజాగా రాష్ట్ర విభజన చట్టంలో 13వ షెడ్యూల్ 10వ అంశంగా తెలంగాణ రాష్ట్రానికి ఖాజీపేట కోచ్ ఫ్యాక్టరీ ఏర్పాటు చేస్తామని పార్లమెంట్‌లో నాటి మన్మోహన్ సింగ్ ప్రధానిగా యుపిఏ ప్రభుత్వం చట్టమే చేసింది. ఇపుడు అసలు కనుచూపు మేరలో కోచ్ ఫ్యాక్టరీ తెలంగాణకు ఇచ్చేది లేదని కేంద్ర హోంశాఖ చావు కబురు చల్లగా చెప్పి చేతులు దులుపుకొనే ప్రయత్నం చేస్తోంది. ఇన్నీ దశాబ్దాలుగా ఈ ప్రాంత పాలకుల నిర్లక్ష్యం కారణంగా మనకు రావాల్సిన కోచ్ ఫ్యాక్టరీ రాకుండా పోతున్నది. రాష్ట్ర విభజన జరిగి ఏడేళ్లుగా ఒక్క అంశం ముందుకు పడకపోవడం వైఫల్యం ఖచ్చితంగా ఈ ప్రాంత పాలకుల పట్టింపులేని నిర్లక్ష్యం అని వేరే చెప్పనవసరం లేదు.

**తాజాగా.....**

సమాచార హక్కు చట్టం కింద అడిగిన ప్రశ్నకి ఈ మేరకు సమాధానం ఇక దేశంలో కోచ్ ఫ్యాక్టరీ పెట్టే ఉద్దేశం కేంద్ర ప్రభుత్వానికి లేదని హోంశాఖ తెలియజేయడం తెలంగాణ ప్రాంతానికి ప్రధానంగా వరంగల్ ఉమ్మడి జిల్లాకు జీర్ణించుకోలేని అంశం. ఈ కేంద్ర నిర్ణయం రాజ్యాంగ విరుద్ధం. తెలంగాణ రాష్ట్రానికి అన్యాయం చేయడమే. దీనిని తెలంగాణ రాజకీయ పార్టీలు, తెలంగాణ సమాజం మొత్తం ఖండించాలి. రాష్ట్ర విభజన చట్టంలో ఖాజీపేటకు కోచ్ ఫ్యాక్టరీ స్థాపన అనే అంశాన్ని కేంద్రం పాతర వేయడాన్ని ప్రతిఘటించడానికి విశాలమైన ఐక్య ఉద్యమ నిర్మాణం ఇవాళ తెలంగాణ ప్రజల ముందుకు ప్రజాస్వామిక కర్తవ్యంగా వచ్చింది.

కోచ్ ఫ్యాక్టరీ, డివిజన్ సాధనతో ఈ ప్రాంత అన్ని వర్గాల అభివృద్ధి, నిరుద్యోగ సమస్య పరిష్కారం కోసం వేలాది ఉద్యోగాల కల్పన, ఈ డివిజన్ పరిధిలోని అన్ని స్టేషన్‌లో పూలు అమ్మే కూలి నుండి ఇక్కడి నగరాల్లోని వాణిజ్య, వ్యాపార అభివృద్ధి కూడా ముడిపడి ఉంది.

తాజాగా కేంద్రం నిర్ణయం ప్రకారం కోచ్ ఫ్యాక్టరీ ఏర్పాటు చేయకుంటే వరంగల్‌తో పాటు తెలంగాణ రాష్ట్రానికి సైతం తీవ్ర స్థాయిలో నష్టం జరుగుతుంది. కోచ్ ఫ్యాక్టరీ ఏర్పాటు అనేది తెలంగాణకు దక్కాల్సిన రాజ్యాంగ బద్ధమైన హక్కు. పార్లమెంట్ సాక్షిగా తెలంగాణ ప్రజలకు ఇచ్చిన హామీని రద్దుచేసే అధికారం కేంద్ర ప్రభుత్వానికి లేదు.

తెలంగాణకు దక్కాల్సిన రైల్వే కోచ్ ఫ్యాక్టరీ సాధన కోసం ఒకవైపు ప్రజా పోరాటాలు, ఈ ప్రాంత రాజకీయ పార్టీలు, ఎంపిలు, ప్రజా ప్రతినిధులు రాజీనామాలకైనా సిద్ధపడి పార్లమెంట్‌లో కేంద్రంపై ఒత్తిడి జమిలీగా జరగాల్సిన అవసరం ఉంది. రైల్వేలను మొత్తం ప్రైవేటీకరణ చేసి ప్రైవేట్ కంపెనీలకు ధారాదత్తం చేయాలని చూడడం అన్యాయం. దేశంలోని సామాన్య ప్రజలకు తీరని అన్యాయం జరుగుతుంది. ఈ నిర్ణయాలను కేంద్రం వెంటనే వెనక్కి తీసుకోవాలని దేశ వ్యాప్తంగా ఐక్య ఉద్యమాలు నిర్మాణం చేయాల్సిన అవసరం ఉంది. ఇప్పటికే వివిధ సెక్షన్‌ల ప్రజలు ప్రైవేటీకరణకు వ్యతిరేకంగా రోడ్డెక్కిన పరిస్థితి ఉన్నది.

భారత రవాణా వ్యవస్థకు గుండెకాయ అయిన రైల్వేలను ప్రైవేట్ పరం చేయడం జాతి వ్యతిరేక చర్య. దీనిని దేశ ప్రజలందరు వ్యతిరేకిస్తున్నారు. ఖాజీపేట కోచ్ ఫ్యాక్టరీ, రైల్వే డివిజన్ సాధన కోసం విశాల ఐక్య ఉద్యమ నిర్మాణం కోసం రైల్వే జెఎసి – ఖాజీపేట డివిజన్ సాధన కమిటీ – ప్రజా సంఘాలు, కార్మిక సంఘాలు, కుల సంఘాలు, వివిధ సామాజిక బృందాలు, ఉద్యమకారులు, జర్నలిస్టులు, న్యాయవాదులు, మహిళా సంఘాలు, దళిత, ఆదివాసీ, మత, మైనారిటీ, సబ్బండ వర్గాలు ఒకే వేదికపై ఒకే పేరుతో, సమష్టి నాయకత్వంలో ఒకే జెండగా, ఒకే ఎజెండాగా కోచ్ ఫ్యాక్టరీ – డివిజన్ పోరాట సమితిగా మార్చ్ 10న రౌండ్ టేబుల్ సమావేశం ద్వారా ఉద్యమం నిర్మాణం, కార్యాచరణ ప్రణాళిక రూపొందించడం జరిగింది.

**ఖాజీపేట రైల్వే డివిజన్ ఎందుకంటే...**

ఖాజీపేట రైల్వే డివిజన్ ఏర్పాటు అనేది చాలా న్యాయ సమ్మతమైనది, సహేతుకమైనది. అన్నిరకాల అవకాశాలున్న ఖాజీపేటను డివిజన్ కేంద్రంగా ఏర్పాటు చేయాలని అనేక సంవత్సరాలుగా కార్మికులు, ఉద్యోగులు, ఈ ప్రాంత ప్రజలు, ప్రజా ప్రతినిధులు డిమాండ్ చేస్తూ ఉద్యమిస్తున్నారు. ఖాజీపేట రైల్వే డివిజన్ ఏర్పాటు డిమాండ్ గొంతెమ్మ కోరికకాదు. సౌత్ సెంట్రల్ రైల్వేలోనే ఆరు డివిజన్లలో అనగా.. సికింద్రాబాద్, హైదరాబాద్, విజయవాడ, గుంటూరు, గుంతకల్లు, నాందేడ్ డివిజన్ల అన్నిటికంటే కూడా మేం కోరుకునే ఖాజీపేట డివిజన్ పరిధిలోనే (సౌత్ సెంట్రల్ రైల్వేలో) 46.8 శాతం ఆదాయం ఈ డివిజన్ నుంచే ఉంటుంది. అదే విధంగా ఈ డివిజన్ పరిధిలో ఇతర డివిజన్ల అన్నింటి కంటే కూడా ఎక్కువ సంఖ్యలో ఉద్యోగులు (సుమారు 12,000 మంది) ఉన్నారు. విశ్రాంత ఉద్యోగులు సుమారు 18 వేల కుటుంబాలు ఉన్నాయి.

ఈ డివిజన్ పరిధిలో మూడు జంక్షన్లు అధికారికంగా పెద్దపల్లి, డోర్నకల్, కారెపల్లి, అనధికారికంగా మానిఘర్, జగ్గయ్యపేట జంక్షన్లు ఉన్నాయి. మొత్తం స్టేషన్‌లు 83 ఉన్నాయి. ఈ డివిజన్ పరిధి హైదరాబాద్ రైల్వే మార్గంలో పెంబర్తి స్టేషన్ వరకు, విజయవాడ మార్గంలో కొండపల్లి స్టేషన్ వరకు, భద్రాచలం మార్గంలో మణుగూరు, ఢిల్లీ మార్గంలో మానిఘర్ స్టేషన్ వరకు, ఫందరీపాణి, ఘట్‌చందూర్ వరకు, లింగంపేట, జగిత్యాల స్టేషన్‌ల వరకు పరిధి ఉండేలా డివిజన్ ఏర్పాటు చేయొచ్చు.

ఖాజీపేట రైల్వే జంక్షన్ డివిజన్ కేంద్రంగా ఏర్పాటు అయితే.. డివిజన్ కార్యాలయం, రైల్వే ఆస్పత్రి, కార్మికుల సంక్షేమ అవసరాలు తీర్చుకోవడానికి ఎక్కువ ఉపయోగం ఉంటుంది. ఒక్క డివిజన్ కార్యాలయంలోనే సుమారు 700 నుంచి వెయ్యి మందివరకు పనిచేసే అవకాశం ఉంటుంది. డివిజన్‌కు ప్రత్యేకమైన బడ్జెట్ కేటాయించడం వల్ల ఈ ప్రాంతం అభివృద్ధి చెందుతుంది. ఇక్కడ ఉన్నటువంటి పాలీక్లినిక్ ఆస్పత్రి డివిజనల్ ఆస్పత్రిగా అప్‌గ్రేడ్ అవుతుంది. కార్మికులు, ఉద్యోగస్తులు, విశ్రాంత ఉద్యోగులు ఖాజీపేటలో డివిజన్ కార్యాలయం ఏర్పడితే తక్కువ సమయంలో వారి సమస్యలను, అవసరాలను తీర్చుకునే అవకాశం ఉంటుంది. అంతేగాకుండా.. డివిజన్ ఏర్పాటు ద్వారా ఖాజీపేట నుంచి అదనపు రైళ్లు ప్రారంభమయ్యే అవకాశం ఉంటుంది. ఇక్కడి నుంచి కొత్త రైళ్లను ప్రారంభించే అవకాశం ఉంటుంది. డివిజన్ కారణంగా ప్రత్యక్షంగా వేలాది మందికి ఉద్యోగ అవకాశాలు దొరుకుతాయి. దాంతో అనేక రకాల వ్యాపారాలు అభివృద్ధి చెందే అవకాశం కూడా ఉంటుంది. ప్రస్తుతం జంక్షన్ ఉన్న ఖాజీపేట అత్యాధునిక సౌకర్యాలతో అభివృద్ధి అయ్యే అవకాశాలు ఉన్నాయి.

ఖాజీపేట డివిజన్, కోచ్ ఫ్యాక్టరీ సాధన కోసం నాలుగు అంచెల విధానంలో కార్యాచరణ ఒకటి.. డిమాండ్ చేస్తున్న డివిజన్ పరిధిలో క్షేత్ర స్థాయిలో ప్రజలను డిమాండ్ సాధనలో భాగస్వాములను చేస్తూ ఉద్యమాన్ని తీవ్రతరం చేయడం. కార్మికులు, ఉద్యోగులు, ప్రజా సంఘాలను కలుపుకుని డిమాండ్ సాధన కోసం ఉద్యమాన్ని ముందుకు తీసుకెళ్లడం.

రెండు.. శాసన సభ వేదికగా కోచ్‌ఫ్యాక్టరీ, డివిజన్ సాధన కోసం డిమాండ్ చేయించడం. దీనికోసం అన్ని పార్టీలను కలుపుకుని ఒకే ఎజెండాగా ముందుకు సాగడం. మూడు.. పార్లమెంట్ సాక్షిగా డివిజన్, కోచ్‌ఫ్యాక్టరీ కోసం ఉమ్మడి చట్టసభల్లో భారత ప్రభుత్వంపైన ఒత్తిడి తేవడం (రైల్వే బోర్డు, రైల్వే మంత్రిత్వ శాఖపైన). నాలుగు.. న్యాయ వ్యవస్థల ద్వారా డివిజన్, కోచ్‌ఫ్యాక్టరీ సాధన కోసం ప్రయత్నం చేయడం.

అత్యున్నత ప్రజా ప్రతినిధుల కేంద్రమైన లోక్‌సభ, రాజ్యసభ సాక్షిగా ఆమోదించబడినటువంటి 2014 ఆంధ్రప్రదేశ్ విభజన చట్టం ఇచ్చిన హామీ ప్రకారం.. ఖాజీపేటలో కోచ్ ఫ్యాక్టరీని విరమించుకునే హక్కు రైల్వే మంత్రిత్వ శాఖకు గానీ, రైల్వే బోర్డుకు గానీ లేదు. ఆంధ్రప్రదేశ్ విభజన చట్టంలో పొందుపర్చిన ఏ అంశాన్నైనా, ఏ ప్రతిపాదననైనా, విరమించుకోవాలనుకున్నా.. లోక్‌సభ, రాజ్యసభ మెజార్టీ సభ్యుల నిర్ణయం ద్వారా మాత్రమే విరమించుకోవాలి. ఇందుకు విరుద్ధంగా రైల్వే మంత్రిత్వ శాఖ, రైల్వే బోర్డు 2021 ఫిబ్రవరి 17న ఆర్‌టిఐకి ఇచ్చిన సమాధానం భారత రాజ్యాంగ స్ఫూర్తికి విరుధం. కాబట్టి ఈ నిర్ణయం పైన మేం సుప్రీంకోర్టులో న్యాయపోరాటం చేయాల్సి ఉంది.

**భారత ప్రభుత్వం చేపడుతున్న ప్రైవేటీకరణ వల్ల కోచ్‌ఫ్యాక్టరీ వస్తోందా?**

ఈ ప్రభుత్వాలకు కాలపరిమితి ఉంటుంది గానీ, పబ్లిక్ సెక్టార్‌కు కాలపరిమితి ఉండదు. ఏ ప్రభుత్వం అయినా ప్రజా వ్యతిరేక నిర్ణయాలు తీసుకున్న సందర్భంలో ప్రజాగ్రహానికి గురైన చరిత్రే మనం చూస్తున్నాం. సంక్షేమ ప్రభుత్వంగా లేనటువంటి ఏ పాలకులైనా, ఏ పార్టీలైనా కాలగర్భంలో కలిసిపోయిన చరిత్రే మనం చూస్తున్నాం. కాబట్టి నేటి బిజెపి కేంద్ర ప్రభుత్వం కార్మిక, కర్షక, ఉద్యోగ, ఇతర వర్గాల ప్రజా వ్యతిరేక విధానాలకు రానున్న ఎన్నికల్లో ప్రజలు కచ్చితంగా బుద్ధిచెబుతారు. ఈ విషయాలను ఆధారం చేసుకుని బిజెపియేతర పార్టీలు ప్రజల సమస్యల ప్రాతిపదికగా నిరసన, ఉద్యమ కార్యాచరణలో పాలుపంచుకుంటే తొందరగా.. ఈ బిజెపి ప్రభుత్వ ప్రజా వ్యతిరేక నిర్ణయాలను అడ్డుకోగలుగుతాం. నియంత్రించ గలుగుతాం. కాబట్టి

# విద్యా సంస్థల మూసివేత పరిష్కారమా?

*కరోనా నియంత్రణకు వైద్య సౌకర్యాలు, వ్యాక్సిన్ సమకూర్చకుండా విద్యా సంస్థలను మూసివేస్తే కోవిడ్ నియంత్రణ అవుతుందా అని ప్రశ్నిస్తున్నారు* **గొడితాల వెంకటేశ్వర్లు**

మానవ వనరుల సృష్టి కేంద్రాలన్నీ మట్టి కొట్టుకు పోతున్నాయి. అత్యంత విలువైన విద్యార్థుల ఆశా సౌధాలను కరోనా కాలమేఘమై కమ్ముకుందా? విద్యా వ్యవస్థను ధ్వంసం చేసిందా? విద్యార్థుల జీవితాలను చిన్నాభిన్నం చేసిందా? విజ్ఞానార్జనకు తీవ్ర విఘాతాన్ని కలిగించిందా? నిజానికి ప్రభుత్వాల దూరదృష్టి, భవిష్యత్ తరాలపై సానుకూల దృక్పథం కొరవడడంతో విద్యా వ్యవస్థలన్నీ దిక్కుతోచని స్థితిలో కొట్టుమిట్టాడు తున్నాయి. ప్రభుత్వ ఆధ్వర్యంలో నడిచే పాఠశాలలు, కళాశాలలు, శిక్షణా కేంద్రాలు విశ్వవిద్యాలయాలు సాంకేతిక విద్యాలయాలు అన్నీ మూతపడ్డాయి. విద్యార్థుల జీవితాలు గందరగోళంలో పడ్డాయి. వీటన్నిటికీ కేవలం కరోనా నే కారణమా? లేక అశ్రద్ధ హ్రస్వదృష్టి గల ప్రభుత్వాల పక్షపాతం, పలాయనవాదం కారణమా? గ్రహించి, గర్హించాల్సిన అవసరాన్ని గురించి చర్చించడమే ఈ వ్యాసం ముఖ్యోద్దేశం.

కరోనా వ్యాధి ప్రబలుతున్న తొలినాళ్లలో అంతులేని హడావిడి చేసి గత విద్యా సంవత్సరాన్ని ముగించారు. పదవ తరగతి విద్యార్థులు పరీక్షలు రాయకుండానే ఉత్తీర్ణులను చేస్తున్నట్లు ప్రకటించి పరీక్షలు నడుస్తున్న దశలో అర్థాంతరంగా లాక్‌డౌన్ పేరుతో ఆ విద్యా సంవత్సరాన్ని ముగించడం జరిగింది. అప్పటికే సిలబస్ అంతా పూర్తి అయింది కనుక గత విద్యా సంవత్సరానికి విద్యార్థులకు అందాల్సిన విజ్ఞానం అందిందనే చెప్పాలి. కానీ ప్రభుత్వ నిర్వాకం వల్ల ప్రతిభగల విద్యార్థులకు అన్యాయమే జరిగింది. ప్రతిభావంతులకు ట్రిబుల్ ఐటీ లాంటి విద్యాసంస్థల్లో సీటు దొరకలేదు. కేవలం ఇంటర్నల్ మార్కుల ఆధారంగా జిపిఎ పాయింట్స్ నిర్ణయించడంతో ఎక్కువ సంఖ్యలో విద్యార్థులు టెన్ బై టెన్ పొందారు. దీంతో వయసు ఎక్కువగా ఉన్న వాళ్లకు సీట్లు కేటాయించడంతో రావాల్సిన వారికి రాకుండా పోయాయి.

కరోనా నేపథ్యంలో పాఠశాలలు, కళాశాలలు, విశ్వవిద్యా లయాలన్నీ మూసివేసి ఈ విద్యా సంవత్సరానికి కూడా సెలవు ఇవ్వడం చూస్తే ప్రభుత్వ వైఖరిలో ఏదో అంతర్గత వ్యూహం దాగివుందని అర్థమవుతుంది. ఇటీవల కేంద్ర ప్రభుత్వం తీసుకొచ్చిన నూతన విద్యా విధానంలో ఆన్‌లైన్ విద్యావిధానాన్ని భాగం చేసిన సంగతి తెలిసిందే. దాన్ని సమర్థించుకోవడానికి రాష్ట్ర ప్రభుత్వం కూడా ఆన్‌లైన్ విద్యా విధానం ప్రత్యామ్నాయ విద్యావిధానంగా చూపించాలి అనుకుంది. అనేక కేంద్ర ప్రభుత్వ ప్రజావ్యతిరేక నిర్ణయాలకు మౌనంగా మద్దతు పలికిన రాష్ట్ర ప్రభుత్వం రాష్ట్రంలోని పాఠశాలలు, కళాశాలల్లో కూడా 2021, సెప్టెంబర్ 1న ఆన్‌లైన్ విద్యకు తెర తీసింది.

ఈ ఆన్‌లైన్ విద్యలో పేద విద్యార్థులకు, గ్రామీణ విద్యార్థులకు విద్య అందకుండా చేసే కుట్ర కొనసాగింది. పేద, మధ్య తరగతి విద్యార్థులు వారి తల్లిదండ్రులు సెల్ ఫోన్లు, కంప్యూటర్ పరికరాలు కొనలేక, అప్పు చేసికొన్నా, నెట్ బ్యాలెన్స్ వేయించుకోలేక, సిగ్నల్స్ లేక మారుమూల ప్రాంతాల విద్యార్థుల అభ్యసనానికి తీవ్ర విఘాతం కలిగింది. అదే సమయంలో ప్రైవేట్, కార్పొరేట్ విద్యా సంస్థల విద్యార్థులకు పట్టణ ప్రాంత విద్యార్థులకు మాత్రం లాభం చేకూరింది. అయితే నష్టపోయింది మాత్రం కేవలం ప్రభుత్వ పాఠశాలలు అక్కడ విద్యనభ్యసించే విద్యార్థులే. దీంతో పరోక్షంగా ఆర్థిక స్తోమత, హంగు ఆర్భాటాలు గల ప్రైవేట్ కార్పొరేట్ విద్యా వ్యవస్థను ప్రోత్సహించినట్లు అయింది. ప్రభుత్వ పాఠశాలల్లో చదివే గ్రామీణ ప్రాంత విద్యార్థులు ఇటు ఆన్‌లైన్ పాఠాలు వినలేక అటు ప్రత్యక్ష బోధన లేక గాలికి తిరగడంతో పిల్లల భవిష్యత్తు పట్ల తీవ్ర ఆందోళన వ్యక్తమవుతున్న నేపథ్యంలో ఒకవైపు ఉపాధ్యాయ సంఘాలు, ప్రజా సంఘాలు, విద్యార్థి సంఘాలు ఒత్తిడి చేసి ప్రత్యక్ష బోధన చేయడానికి పాఠశాలలను తిరిగి తెరవాలని ఎంత కోరినా ప్రభుత్వంలో చలనం రాలేదు.

ఒకవైపు బార్లు, రెస్టారెంట్లు సినిమా హాళ్లు, షాపింగ్ మాళ్లు తెరిచి కరోనా వ్యాప్తికి, ప్రజల నిర్లక్ష్యానికి కారణమైన ప్రభుత్వం పాఠశాలలను మాత్రం తెరవడానికి సాహసం చేయలేదు. కనీస ముందు జాగ్రత్తలు పాటించి, నిరంతరం శానిటేషన్ చేస్తూ పిల్లలకు మాస్కులు, శానిటైజర్ అందించి కనీసం షిఫ్ట్ సిస్టమ్ ద్వారానైనా భౌతిక దూరం పాటిస్తూ ప్రత్యక్ష బోధనకు ఉపక్రమించేలా ముందుకు రాలేదు. దీంతో గ్రామీణ విద్యార్థులు పాఠశాలలకు దూరమై పనిపాటలకు దగ్గరయ్యారు. పాఠశాలలు తెరిస్తే బాగుండునని తల్లిదండ్రులు నెత్తీ నోరూ కొట్టుకున్నారు. ఇంత జరిగినా రాష్ట్ర వ్యాప్తంగా టి. శాట్., డిడి చానల్ ద్వారా ప్రభుత్వం

---

బిజెపి చేస్తున్న ప్రైవేటీకరణ ప్రయత్నాలు ఎక్కువకాలం నిలువలేవు, మనుగడ సాగించలేవనేది చరిత్ర ఆధారంగా మనందరం అర్థం చేసుకోవాలి. ఎందుకనగా, ఈ పబ్లిక్ సెక్టార్ కంటే పూర్వం ప్రైవేట్ సెక్టార్ ఉండేది. ఆ ప్రైవేట్ సెక్టార్ దుష్ఫలితాల, అప్రజాస్వామిక విధానాలవలన సమస్త ప్రజానీకం చేసిన నిరసనల, ఉద్యమ పోరాటాల కారణంగానే పబ్లిక్ సెక్టార్ రంగం బలోపేతమైంది. ఈ విషయాన్ని పాలకులు, ప్రజలు గుర్తుంచుకోవాలి. నిరాశ, అనుమానాలు లేకుండా, మన ముందు తరాలు మనకు సాధించి పెట్టిన హక్కులను కాపాడుకోకపోతే మనందరం చరిత్ర హీనులమవుతాం. కాబట్టి పోరాడుదాం. కోచ్ ఫ్యాక్టరీ, డివిజన్‌ను సాధించుకుందాం.

*(రచయిత జర్నలిస్ట్, కన్వీనర్ ఖాజీపేట రైల్వేకోచ్ ఫ్యాక్టరీ – డివిజన్ పోరాట సమితి)* వీ

ఆన్‌లైన్‌కి అంకితం కావడంతో ప్రైవేట్ పాఠశాలల విద్యార్థులు సైతం ప్రభుత్వ ప్రసార పాఠాలను వినేందుకు సిద్ధపడ్డారు. దీంతో విద్యార్థులంతా ఆన్‌లైన్ పాఠాలు చూస్తున్నట్లు నివేదికలు ఇచ్చేలా అధికారుల మౌఖిక ఆదేశాలతో నూటికి 85 శాతం పిల్లలు ఆన్‌లైన్ పాఠాలు చక్కగా చూస్తున్నారని నివేదికలు తెప్పించుకొని సంతృప్తి పడింది ప్రభుత్వం. ఐతే ప్రైవేట్ పాఠశాలలకు పిల్లలు వచ్చే పరిస్థితి గాని, ఫీజులు చెల్లించే పరిస్థితి గాని లేకుండా పోయింది. దిక్కుతోచని స్థితిలో ప్రైవేట్, కార్పొరేట్ పాఠశాలలు, కళాశాలలు తమ మనుగడ కోసం ప్రభుత్వంపై ఒత్తిడి తేవడం ప్రారంభించాయి. ఆన్‌లైన్‌లో బోధన జరిగినంత కాలం తమ బోధనా సిబ్బందిని తొలగించి ప్రభుత్వ ప్రసారాలతో కాలం గడిపిన ప్రైవేట్ విద్యా మాఫియా ఆర్థికంగా దెబ్బతింటామన్న భయంతో, ఫీజులు వసూలు చేసుకోవడానికి ప్రయత్నాలు మొదలు పెట్టాయి. ప్రభుత్వ పెద్దల్లోనే ప్రైవేట్ ఇంజనీరింగ్ కళాశాలలతో పాటు విద్యా వ్యాపారం చేస్తున్న వాళ్లు ఉండడం ప్రైవేట్ మాఫియాకు కలిసొచ్చింది. దాంతో అప్పటిదాకా వివిధ సంఘాలు తల్లిదండ్రులు బళ్లు తెరవండో అని అరిచి గగ్గోలు పెట్టినా తెరవని ప్రభుత్వం ప్రైవేట్ మీద ప్రేమతో ఎట్టకేలకు 2021, ఫిబ్రవరి 1 నుండి పాఠశాలలు తెరిచి ప్రత్యక్ష బోధనకు అవకాశం ఇచ్చింది. కానీ శానిటేషన్ సిబ్బందిని తొలగించి ఆ బాధ్యత పంచాయతీలకు వదిలివేసింది. కనీస వసతులు ఏర్పాటు చేయకుండా ప్రభుత్వ విద్యా వ్యవస్థల్ని పారిశుద్ధ్యాన్ని పట్టించుకో లేకపోయింది. ఉపాధ్యాయులు పారిశుద్ధ్య కార్మికుల అవతారం ఎత్తాల్సి వచ్చింది. మరి కరోనా భయం ఉన్నా ప్రభుత్వం ఇప్పుడెలా తెరిచింది? ఇక్కడే అసలు కిటుకు దాగుంది. అది కేవలం ప్రైవేట్ కార్పొరేట్ శక్తులకు ఆర్థిక ప్రయోజనాలు కల్పించడానికి తప్ప మరొకటి కాదు.

పాఠశాలలు తెరిచి ప్రైవేట్ కార్పొరేట్ విద్యా సంస్థలు ఫీజులు వసూలు చేసుకోవడానికి సువర్ణ అవకాశాన్ని ఇచ్చింది. దాంతో ప్రైవేట్ యాజమాన్యాలు పరీక్ష ఫీజుకు లింకు పెట్టి ట్యూషన్ ఫీజును, ఒక్క రోజు ప్రత్యక్ష బోధన చేయకపోయినా, పాఠశాలలకు విద్యార్థులు రాకపోయినా సంవత్సరానికి సరిపడే మొత్తం ఫీజు కట్టాల్సిందే నని ముక్కుపిండి వసూలు చేసుకున్నాయి. హాస్టల్ ఫీజును సైతం మొత్తానికి మొత్తం వసూలు చేసుకున్నారు. ఈ దోపిడీ కోసమే పాఠశాలలు పునః ప్రారంభించారు తప్ప మరొకటి కాదన్నది నిష్టుర సత్యం. ఎందుకంటే మొత్తం ఫీజులు వసూలు చేసుకున్న యాజమాన్యాలు సిబ్బందికి జీతాలు చెల్లించకుండా వాళ్లను రోడ్డున పడేసారు. నిజానికి 2020 ఏప్రిల్ కరోనా సమయంలో ప్రభుత్వం తీసుకువచ్చిన జీవో నెంబర్ 46 ప్రకారం ప్రైవేట్ విద్యాసంస్థల యాజమాన్యాలు ఐదు శాతం కంటే ఎక్కువ లాభాలు తీసుకోకూడదని, వసూలు చేసిన ఫీజులో 50 శాతం సిబ్బంది జీతభత్యాలకు ఖర్చు చేయాలని చెప్పారు. అంతేగాక తమ విద్యా సంస్థలో పని చేస్తున్న ఉద్యోగుల సంక్షేమం కోసం 15 శాతం ఖర్చు చేయాలని సూచించడం జరిగింది. కానీ ప్రైవేట్ విద్యా సంస్థలు నిబంధనలకు నీళ్లు ఒదిలి ఒకరిద్దరితో ఆన్‌లైన్ పాఠాలు చెప్పిస్తూ ఫీజులు చెల్లించిన వారికి లింకులు పంపుతామని లేనివారికి లింకులు పంపించకుండా ఇబ్బందులకు గురి చేశాయి ప్రభుత్వం పాఠశాలలు తెరిచింది తమ ఫీజులు వసూలు కోసమే అన్నట్లుగా వ్యవహరించాయి అంతే తప్ప ప్రైవేట్ ఉపాధ్యాయుల సంక్షేమాన్ని, వాళ్ల జీవితాన్ని ఏమాత్రం పట్టించుకోలేదు. దీంతో కొంత మంది ప్రైవేట్ ఉపాధ్యాయులు అప్పులు చేసి జీవితాన్ని వెళ్లదీయలేక ఆత్మహత్యలకు పాల్పడ్డారు. అయితే ప్రభుత్వం వాళ్లు పనిచేస్తున్న విద్యా సంస్థల పై ఎటువంటి చర్యలు తీసుకోకుండా వారిని ఆదుకునే ప్రయత్నం కూడా చేయలేదు. ప్రైవేట్ విద్యాసంస్థలు కళాశాలల ఫీజుల వసూళ్లు పూర్తయ్యేవరకు చూసింది. ప్రభువు దయతో తమ కార్యం ముగియగానే మళ్లీ కరోనా విజృంభిస్తుందని హాస్టళ్లు స్కూళ్లలో కరోనా వస్తే ఎలా అని లేని భయాన్ని సృష్టించడంతో 2021, మార్చి 23 నుండి తిరిగి పాఠశాలలను మూసివేసింది ప్రభుత్వం. దీనికి కారణాన్ని ప్రభుత్వం సహజంగానే కరోనా సెకండ్ వేవ్‌ను సాకుగా చూపింది.

ఒకవైపు బార్లు, రెస్టారెంట్లు, సినిమా హాళ్లు రాజకీయ ప్రచార ఊరేగింపులు బహిరంగ సభలు కొనసాగిస్తూనే కేవలం పాఠశాలలను మూసివేయడం వెనుక ఆంతర్యం ఏమిటి? ప్రైవేట్ కార్పొరేట్లకు బలం చేకూర్చడానికి, ప్రభుత్వ సంస్థలను నిర్వీర్యం చేయడానికి తప్ప మరొకటి కాదని బడుగు బలహీన వర్గాల వారు అభిప్రాయ పడుతున్నారు. ఎందుకంటే బడులు మూసివేసిన తర్వాత కూడా నారాయణ, చైతన్య వంటి కళాశాలలు, కొన్ని పబ్లిక్ స్కూల్స్ మూత పడలేదు. టాప్ బ్యాచ్‌ల పేరుతో, ఫ్రీ టెన్త్ పేరుతో నడుస్తూనే ఉన్నాయి. ఇక్కడ నష్టపోయింది కేవలం ప్రభుత్వ పాఠశాలలు, కళాశాలలు, అక్కడ చదివే విద్యార్థులు మాత్రమే.

పాఠశాలలు తెరవండి అన్నప్పుడు తెరవకపోవడం, తీరా ఎమ్మెల్సీ ఎలక్షన్స్ వచ్చేముందు విద్యావంతుల్ని, ఉపాధ్యాయుల్ని, పట్టభద్రులను మభ్య పెట్టడానికి పాఠశాలలు తెరిచినట్లే తెరిచి ఎలక్షన్స్ ముగిసీ ముగియగానే ప్రైవేట్ వాళ్ల వసూళ్లు పూర్తికాగానే తిరిగి మూసి వేయడం వెనుక ప్రభుత్వ పక్షపాతం, పలాయన వాదం అవగతమౌతుంది. కనుక బడుల మూసివేతకు కరోనా మాత్రమే కారణం కాదు. కరోనా మాటున కంటికి కనిపించని ప్రభుత్వ విద్యా వ్యవస్థను ధ్వంసం చేసే కుట్ర ఏదో దాగి ఉందని అర్థమవుతుంది.

దేశ భవిష్యత్తుకు పునాదిరాళ్లను తయారుచేసే విద్యా వ్యవస్థ పట్ల ప్రభుత్వాలకు దూరదృష్టి, చిత్తశుద్ధి లేకపోవడం అత్యంత విచారకరం. విద్యా సంవత్సరమంతా అరకొర జ్ఞానాన్వేషణతో అటు ఇటు కాని ఆన్‌లైన్ అభ్యాసంతో గందరగోళ పరిస్థితుల్లో తాత్కాలిక ఆనందానికి విద్యార్థులందరినీ పై తరగతులకు ప్రమోట్ చేసినా వారి భవిష్యత్తు శూన్యం అనే చెప్పాలి. ఎటువంటి ప్రాక్టికల్ నాలెడ్జ్, పరిశోధన అనుభవం, ల్యాబ్ టెక్నిక్ లేని పాఠశాల కళాశాల విద్య, విద్యార్థులను ఏ తీరాలకు చేరుస్తుందో ఊహించవచ్చు. కనుక కరోనా లేదా కరోనా లాంటి మరో ఉపద్రవాన్ని సాకుగా చూపి సామాన్య బడుగు బలహీన వర్గాల విద్యావకాశాలను కాలరాయకుండా దాన్ని అధిగమించడానికి ప్రాప్తకాలజ్ఞతని వదిలిపెట్టి దీర్ఘదర్శిలా వ్యవహరించాలి. రాబోయే విద్యా సంవత్సరంలో అయినా పకడ్బందీగా నిర్వహించడానికి ప్రణాళికలు రచించుకోవాలి. ప్రస్తుత కరోనా విజృంభణను దృష్టిలో ఉంచుకొని పాఠశాలల నిర్వహణకు సరైన దిగ్దర్శనానికి దృష్టి సారించాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

*(రచయిత సూర్యపేట జిల్లా డిటిఎఫ్ కార్యదర్శి)* వీ

# ఆంధ్రప్రదేశ్‌లో కోవిడ్ - విద్యా సంస్థలకు సెలవు

***పాఠశాలలను మూసివేసే బదులు మొదటి నుండి కోవిడ్ నియమ నిబంధనలను పాటించి, ప్రజలను సంసిద్ధులను చేసి ఉండాల్సిందని అంటున్నారు* చిమ్మె. జాన్ బర్నబాస్**

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో కరోనా వైరస్ విజృంభిస్తుందనే విషయంలో భాగంగా పాఠశాల విద్యాశాఖ 1-9 తరగతుల విద్యార్థులకు విద్యా సంస్థలను మూసివేస్తూ, ముందు తరగతులకు ప్రమోట్ చేస్తూ ఉత్తర్వులు జారీ చేశారు. ఈ ఉత్తర్వులు 2021 ఏప్రిల్ 20 నుంచి అమల్లోకి వస్తాయి. మొత్తం విద్యార్థులందరూ భవిష్యత్తులో తిరిగి పాఠశాలలు తెరిచేంతవరకూ ఇళ్ల వద్దనే కాలక్షేపం చేయాలి. వారి భవిష్యత్తు తల్లిదండ్రులపై వేస్తూ పాఠశాల విద్యాశాఖ ఈ నిర్ణయం తీసుకున్నది.

దాదాపు విద్యార్థినీ విద్యార్థులంతా కేవలం 4-14 సంవత్సరాల వయస్సులోపు వారే. ప్రభుత్వ పాఠశాలల్లో చదివే విద్యార్థులంతా దాదాపుగా పేద, మధ్యతరగతి కుటుంబాలకు చెందినవారే అయి ఉంటారు. వీరి ఇళ్ల దగ్గర కూడా సరియైన వసతులు ఉండవు. చదువుకునే వాతావరణం కూడా ఉండీ, ఉండక ఉంటుంది. క్రమశిక్షణతో కూడిన జీవన విధానం కుటుంబాలలో కొరవడి ఉంటుంది. వీటిని అధిగమించి విద్యార్థినీ విద్యార్థులు పెరుగవలసి ఉంటుంది. మళ్లీ విద్యా సంస్థలు తెరిచేంతవరకూ కాలం గడపవలసి ఉంటుంది. ప్రభుత్వ పాఠశాలల్లో పెట్టే మధ్యాహ్న భోజనం, తినడానికి ఇచ్చే చిక్కీలు (గట్టం) కొద్దో, గొప్పో చదువుకోడానికి ఉపయోగపడేవి. కాని ఇంటిదగ్గర అవి ఏమీ ఉండవు కాబట్టి వారిలో కొంత ఆలోచనా ధోరణి మారే అవకాశం ఉంటుంది. నాణ్యమైన ఆహారం ఇంటిదగ్గర లభించే పరిస్థితి ఉండదు. పైగా ఉమ్మడి కుంటుంబాలలో, కుటుంబ సభ్యులు ఎక్కువగా ఉంటారు కాబట్టి వారి మధ్య చదువు కొనసాగడం కష్టంగా ఉంటుంది.

సామాన్య కుటుంబాలలో ఏ రోజుకారోజు కష్టపడుతూ తమ జీవనం కోసం సంపాదించుకుంటూ పిల్లలను పోషిస్తూ ఉంటారు తల్లిదండ్రులు. ఇప్పుడు పిల్లలందరూ ఇంటిదగ్గరే ఉండేసరికి వారిని చూసుకోవడానికి ఇంకో మనిషి అవసరమవుతారు. పాఠశాలల్లో ఆడుకుంటూ ఆనందంగా గడిపే బాల బాలికలంతా ఈ కరోనా దుర్భర పరిస్థితులలో ఇళ్లకు పరిమితమై టీవీలకు, సెల్‌ఫోన్‌ల వినియోగంలో కాలం గడుపుతూ కొన్ని అవలక్షణాలను ఒంట బట్టించుకుంటారు. దీనివలన పిల్లలలో దుష్ట సంకల్పాలు, దుష్ట ఆలోచనలు, పాశ్చాత్య సంస్కృతి నీలినీడలు పడే అవకాశం ఉంటుంది. అంతేకాకుండా కేవలం యంత్రాలను, వస్తువులను ప్రేమించే సంస్కృతి పెరిగిపోతుంది. ఇంట్లో ఉన్న పెద్దలు కానీ లేదా సోదరీ సోదరుల మాటలకన్నా సెల్‌ఫోన్, టీవీలకు ప్రాధాన్యతనిచ్చే పరిస్థితి పెరిగిపోతుంది. తద్వారా ఒకరికొకరు గొడవలు పడే అవకాశం లేకపోలేదు. ప్రభుత్వం కూడా ఇంత వెను వెంటనే పాఠశాలలను మూసివేసే బదులు, మొదటి నుంచి కోవిడ్ నియమ నిబంధనలను సరిగా పాటించి, ప్రజలను సంసిద్ధులను చేసి ఉండుంటే కోవిడ్ విస్తృతి ఇంత తీవ్రంగా ఉండేది కాదు. అంతేకాకుండా సినిమా హాళ్లు, బార్లు, రెస్టారెంట్లు, మద్యం అంగళ్లు, చికెన్ - మటన్ మార్కెట్‌ల వద్ద ఏమాత్రం మాస్క్‌లు లేకుండా ప్రజలు విచ్చలవిడిగా ప్రవర్తించారు. 'ఎక్కడనో, ఎవరికో వచ్చింది, నాకు కోవిడ్ రాదులే' అనే భావనతో చాలా మంది మాస్క్‌లు లేకుండా, శానిటైజర్‌లు లేకుండా, సామాజిక దూరం పాటించకుండా, గుంపులు, గుంపులుగా తిరుగుతూ కరోనా వ్యాప్తికి కారకులయ్యారు. దీనికి ప్రభుత్వ యంత్రాంగం ఉదాసీనత ముఖ్య కారణం. దాదాపుగా 8 నెలల నుంచి ఏమాత్రం పర్యవేక్షణ లేకుండా పోయింది. 2020 మార్చ్ 22 నుంచీ కరోనా విలయతాండవం చేస్తున్నప్పటికీ కేవలం 4 నెలలు కఠిన నిబంధనలు అమలు జరిపీ తర్వాత కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు చేతులెత్తేసినాయి. తర్వాత వివిధ శాఖలలో కరోనా విజృంభించడానికి కారకులయ్యారు.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో 2020 నవంబర్ 2 నుంచీ పాఠశాలలు తెరువబడ్డాయి. దాదాపుగా 6 నెలలు ప్రభుత్వ సెలవు దినములు మినహాయిస్తే అన్ని పాఠశాలలు నిరాఘాటంగా కొనసాగాయి. దాదాపు 75 శాతం విద్యార్థుల పాఠ్యాంశాల సిలబస్ కూడా అయిపోయింది. కేవలం నెల రోజులలో పరీక్షలు జరుపవలసి ఉండగా ఈ కరోనా వైరస్ విలయతాండవం చేయడంతో చాలా చోట్ల విద్యార్థినీ విద్యార్థులు, ఉపాధ్యాయినీ ఉపాధ్యాయులు కరోనా భారిన పడ్డారు. కొందరు మృత్యువాత పడ్డారు. అందుచేత రాష్ట్ర ప్రభుత్వం పాఠశాలలను మూసివేయాలనే నిర్ణయానికి వచ్చింది. కేవలం 10వ తరగతి పరీక్షలు మాత్రం యథావిధిగా జరుగుతాయని, ఇంటర్మీడియట్ వారికి కూడా పరీక్షలు యథావిధిగా కొనసాగుతాయని ప్రకటించింది రాష్ట్ర ప్రభుత్వం.

అయితే అన్నీ కోవిడ్ నియమ నిబంధనలు పాటిస్తూనే జరుగుతాయని రాష్ట్ర ప్రభుత్వం వెల్లడించింది. 10వ తరగతి వారికి కేవలం ఒక్క పూట ఉదయం 8-12.30 నిమిషాల వరకు పాఠశాల జరుగుతాయి. ఇక్కడ కూడా కోవిడ్ నిబంధనలు పాటిస్తూ, ఏమైనా మిగిలిన సిలబస్ ఉంటే దానిని త్వరగా పూర్తి చేయడానికి మాత్రమే ఉపయోగించుకుంటారు. మే నెలంతా ఇదే విధంగా పాఠశాలలు కొనసాగి జూన్ 7 నుంచి పదవ తరగతి పరీక్షలు ప్రారంభమై జూన్ చివరికి ముగిస్తామని పాఠశాల విద్యాశాఖ ప్రకటించింది.

విశ్వవిద్యాలయాలలో కూడా ఇదే పరిస్థితి ఉంది. ఆంధ్రప్రదేశ్‌లో ప్రసిద్ధి చెందిన విశాఖపట్టణం ఆంధ్ర విశ్వవిద్యాలయం ఇప్పటికే మూసివేయబడింది. దాదాపు 102 పాజిటివ్ కేసులు రావడంతో వసతి

గృహాలన్నింటినీ ఖాళీ చేయించి విద్యార్థినీ విద్యార్థులను అధికారులు ఇళ్లకు పంపించి వేశారు. కరోనా వైరస్ కట్టడికి కఠిన చర్యలు తీసుకోవడం తప్పనిసరి అయింది. ప్రజల ఆరోగ్యం కన్నా మించినది ఏదీ లేదనే భావన కరోనా వ్యాపించిన తర్వాత గానీ అందరికీ అర్థం కాలేదు. ప్రకృతి సిద్ధంగా లభించే గాని, మంచినీరు శుభ్రంగా లేకపోవడం కృత్రిమమైన జీవనపు అలవాట్లు, చెట్లు, ప్రకృతి సంపద సరిగా కాపాడుకోలేకపోవడం కూడా కారణం. ఆక్సిజన్ సరియైన పాళ్లలో నేడు సమాజంలో అందుబాటులో లేదు. ఇది విచారకరం. ఈ

ప్రకృతి విసిరిన సవాలు ముందు మనిషి ఎంత చిన్నవాడో ఈ 'కరోనా' వైరస్ తేల్చిపారేసింది. దేశంలో రోజుకూ దాదాపుగా 2 1/2 లక్షల కరోనా కేసులు నమోదవుతున్నప్పటికీ, మౌలిక సదుపాయాలు ఆసుపత్రుల సంసిద్ధత లేకపోవడం, కరోనా బాధితులను చేర్చుకోవడానికి అన్ని పరికరాలు, సౌకర్యాలతో కూడిన పెద్ద ఆసుపత్రులు లేకపోవడం, గత అనుభవం నుండి ప్రభుత్వాలు మేలుకొనకుండా, ఏమాత్రం గుణపాఠాలు నేర్చుకోకుండా ప్రవర్తించిన దానికి మలివిడత కరోనా విజృంభనకు అనేక మంది సామాన్య పౌరులు బలిపశువులు కావలసిన పరిస్థితి నెలకొనింది.

కరోనాపై విజయం సాధించామని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు నాడు ఎంతో ఘనంగా చెప్పినప్పటికీ, భవిష్యత్తులో ముప్పు వాటిల్లబోతుందని, నిర్లక్ష్యం వహిస్తే భారీ మూల్యం చెల్లించుకోవలసి వస్తుందని నాడే ఎంతో మంది వైద్యులు, నిపుణులు హెచ్చరించారు. ప్రైవేట్ వైద్య సంస్థలు పూర్తిగా చేతులు ఎత్తేసిన నేపథ్యంలో ప్రభుత్వ రంగంలో మౌలిక సౌకర్యాలు మెరుగు పరుచుకోవలసిన తక్షణావసరాన్ని ఎంతో వైద్యరంగ నిపుణులందరూ హెచ్చరించారు. అయినప్పటికీ ఈ ప్రభుత్వాలు మేలుకొనలేదు. ఇవాళ కోవిడ్ రోగులకు ఆసుపత్రులలో పడకలు దొరకని పరిస్థితి నెలకొనిందంటే అందుకు కారణం ఆరోగ్య రంగంలో మౌలిక సౌకర్యాల కల్పనపై ప్రభుత్వానికి శ్రద్ధలేకపోవడం, పట్టింపు లేకపోవడం.

దేశంలో ఇప్పటికి 10 కోట్ల మందికి టీకాలు వేసినట్లు చెబుతున్నది కేంద్ర ప్రభుత్వం. అయితే పలు రాష్ట్రాలు కోవిడ్ వ్యాక్సిన్ కొరతను ఎదుర్కొంటున్నాయి. అధిక ముప్పు పొంచి ఉన్నవారికి ప్రాధాన్యమిస్తూ మొదట 30 కోట్ల మందికి టీకాలు వేసే బృహత్ కార్యక్రమం దేశంలో జనవరి 16న ప్రారంభమైంది. కాని ఇప్పటికీ కనీసం దానిలో మూడవ వంతు కూడా పూర్తి కాలేదు. వ్యాక్సినేషన్ పూర్తికాని పరిస్థితిలోనే టీకాల కొరత ఏర్పడినట్లు ప్రచారమవ్వడం ప్రజలలో ఆందోళన కలిగిస్తోంది.

టీకా తయారీకి ముడి పదార్థాల కొరత నెలకొనిందని, అమెరికా చట్టం వలన దిగుమతులకు ఇబ్బందులు ఎదురవుతున్నాయని సీరమ్ సంస్థ నెల రోజుల క్రితమే కేంద్రానికి విన్నవించినప్పటికీ ప్రయోజనం లేకపోయింది. కేంద్రం కోవిడ్ కేసులు పెరిగిపోతున్న దృష్ట్యా నియంత్రణ వ్యూహాలకే ప్రాధాన్యమిస్తూ మే 1 నుండి 18 సంవత్సరాలు నిండిన ప్రతి ఒక్కరూ వ్యాక్సినేషన్ చేయించుకోవాలని ప్రకటించింది. ఇప్పటివరకూ 45 సంవత్సరాలు నిండినవారు మాత్రమే వ్యాక్సినేషన్‌కు అర్హులనే నియమాన్ని సడలించింది. వ్యాక్సినేషన్ అనేది ప్రధాన కార్యక్రమంగా కేంద్రం ప్రకటించింది. దేశంలో ఇప్పటికే చాలా ప్రాంతాలు లాక్‌డౌన్ ప్రకటించాయి.

ఢిల్లీ, మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, ఉత్తరప్రదేశ్, తెలంగాణ రాష్ట్రాలలో రాత్రిపూట కర్ఫ్యూ విధించారు. ఇప్పటికే గత ఏడాది విధించిన లాక్‌డౌన్ నుంచి ప్రజల ఆర్థిక పరిస్థితి ఇంకా మెరుగుపడలేదు. దేశ ఆర్థిక వ్యవస్థ కుదేలయింది. శ్రమజీవుల బతుకులు తలకిందులయ్యాయి. జీవనాధారం కోల్పోయి పట్టణ ప్రాంతాల్లో 12 కోట్ల మంది, పల్లెల్లో 28 కోట్ల మంది కొత్తగా పేదరికంలో కూరుకుపోయారన్న విశ్లేషణలు కూడా ఉన్నాయి. రాబోయే రోజుల్లో గత ఏడాది మాదిరిగా లాక్‌డౌన్ విధించకుండా ఉండాలంటే అందరూ ఖచ్చితంగా నిర్దిష్ట జాగ్రత్తలు పాటించాల్సిందే. ప్రతి ఒక్కరూ మాస్కులు ధరించాలి. శానిటైజర్లు వాడాలి. సామాజిక దూరం పాటించాలి. వ్యక్తిగతంగా ఇలాంటి జాగ్రత్తలు తీసుకుంటే కొద్దో గొప్పో కరోనాను నివారించవచ్చు. అంతేకాకుండా ప్రజలు కోవిడ్ పరీక్షలు విస్తృతంగా చేయించుకొని, టీకాలు వేయించుకోవడం ద్వారా సమిష్టి కృషితోనే కరోనాను ఎదుర్కోవచ్చు. ప్రజలు కొన్నాళ్లు స్వీయ నియంత్రణ పాటిస్తే కరోనా వైరస్‌ను కట్టడి చేయవచ్చు. కరోనా నియంత్రణకు లాక్‌డౌన్ ఒక్కటే సరిపోదు. ప్రజారోగ్య చర్యలు తప్పనిసరి చేయడం ద్వారానే కరోనాను కట్టడి చేయడం సులభం అవుతుందని ప్రపంచ ఆరోగ్య సంస్థ (డబ్ల్యుహెచ్ఒ) కూడా ప్రకటించింది.

మారుతున్న పరిస్థితులలో పుట్టుకొస్తున్న కొత్త కొత్త వైరస్‌లను, వ్యాధులను ఎదుర్కోవడం ఎలా అన్నది మన ముందున్న మిలియన్ డాలర్ల ప్రశ్న! పెద్ద పెద్ద ఆసుపత్రులలో సైతం వైద్యులకు, నర్సులకు, పర్సనల్ ప్రొటెక్షన్ ఎక్విప్‌మెంట్ (పిపిఇ) అయిన గ్లౌజులు, బాడీ సూట్లు, మాస్కులు అందుబాటులో లేవు. ముంబాయిలోని ఒక ఆసుపత్రిలో ముగ్గురు డాక్టర్లు, 26 మంది వైద్య సిబ్బందికి కరోనా సోకడంతో ఆ ఆసుపత్రిని మూసివేశారంటేనే ఈ దేశంలోని వైద్య ఆరోగ్య శాఖ దుస్థితికి ఈ పరిస్థితి అద్దం పడుతోంది. మనదేశంలో నివారించదగ్గ వ్యాధులతో సరియైన సమయంలో వైద్యం అందక ప్రతి సంవత్సరం 12 లక్షల మంది చనిపోతున్నారని ఒక అధ్యయనం తెలియజేస్తున్నది.

ఇప్పటి వరకూ మనలను పాలించిన పాలకులు ప్రజల ఆరోగ్యం, కుటుంబ సంక్షేమం పట్ల చూపిన నిర్లక్ష్యానికి ఈ అధ్యయనాలే సాక్ష్యం. దీనికి ప్రధాన కారణం ప్రజారోగ్యాన్ని తీవ్రమైన అంశంగా ప్రభుత్వాలు గుర్తించకపోవడమే. ఆరోగ్యశ్రీ లాంటి ప్రభుత్వ ఆరోగ్య పథకం వల్ల పేద, మధ్యతరగతి వారికి ఒనగూరే మేలుకన్నా, ప్రైవేట్ ఆసుపత్రులకు మిగిలే లాభాలు అధికం. జబ్బు ముదిరాక అందించే ద్వితీయ, తృతీయ స్థాయి సేవలు లాభాదాయకం కాబట్టి ప్రైవేట్ రంగం వీటిపైనే ఎక్కువ నిధులు ఖర్చుపెడుతోంది. ప్రజల ప్రాథమిక ఆరోగ్యాన్ని నిర్లక్ష్యం చేసే ప్రభుత్వ ఆరోగ్య స్కీములు, కార్పొరేట్ వైద్యశాలలకు లాభసాటి వ్యాపారంగా మారాయి తప్ప మరొకటి కాదు. 'ప్రాథమిక చికిత్స' లక్ష్యంగా ప్రభుత్వ ఆసుపత్రులు పనిచేయాలి.

ప్రభుత్వాలకు ఇప్పటికైనా కనువిప్పు కలగాలి. ఆర్థికాభివృద్ధితో పాటుగా ప్రజల ప్రాథమిక ఆరోగ్య అవసరాలు కూడా ముఖ్యమనే విషయాన్ని గుర్తించాలి. గత అనుభవాలను, ప్రస్తుత పరిస్థితులను బేరీజు వేసుకొని లోతైన, పటిష్టమైన అవగాహనతో ప్రజల ఆరోగ్య అవసరాలను తీర్చే బృహత్ ప్రణాళిక కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు చేపట్టాలి. ప్రజల

# తిరుపతిలో దొంగలు పడ్డారు!

***మన దేశంలో ఎన్నికలు ఒక తంతుగా మారాయని, అర్థ బలమూ, అంగ బలమూ ఉన్నవాళ్లే దొంగ ఓట్లతో గెలుస్తారని తిరుపతి ఎన్నికలు మరోసారి రుజువు చేశాయని అంటున్నారు* ఎం.కె. కుమార్**

ఎక్కడా ఘర్షణ లేదు. ఎవరూ కొట్టుకోలేదు. దౌర్జన్యాలతో అధికార పార్టీ ప్రజలను భయభ్రాంతులను చేయలేదు. డబ్బులు పంచలేదు. పంచుతున్నారని అడ్డుపడలేదు. పోలీసులు లాఠీ చార్జీ జరుపలేదు. అట్లని అంత ప్రశాంతంగా తిరుపతి ఉప ఎన్నిక జరగలేదు. పోలింగ్ రోజు తిరుపతి నగరాన్ని వందలాది బస్సులు, కార్లు, ట్రాక్టర్లు ఆక్రమించాయి. తిరుపతి చుట్టు పక్కల మామిడి తోపులు, కళ్యాణమండపాలు, అతిథి గృహాలు బయట వ్యక్తులతో నిండి పోయాయి.

దొంగతనంగా సృష్టించిన బోగస్ ఓటర్ ఐడీ కార్డులు తిరుపతి వీధుల్లో యాదేచ్ఛగా దొరికాయి. ఓటరు స్లిప్‌లతో బయటి నుండి వచ్చిన వ్యక్తులు తిరుపతి బూత్‌ల్లో బారులు తీరారు. ప్రశ్నించి నిలేసిన చోట వాళ్ళు పారిపోయారు. పుంగనూరు, మదనపల్లె, తంబళ్లపల్లె, పీలేరు, పలమనేరు నియోజకవర్గాల నుంచి వాళ్ళు వచ్చినట్టు వారి మాట తీరును బట్టి తెలుస్తుంది. కడప జిల్లా రాజంపేట, కోడూరుల నుంచీ కూడా తిరుపతికి వేల మంది తరలించ బడ్డారు. పోలీసులు ఏమి తెలియనట్లే నిమ్మకుండి పోయారు. బూతుల్లో అన్ని పార్టీల ఏజెంట్లు నోరు మెదపలేదు. ప్రధాన ప్రతిపక్ష పార్టీ తెలుగుదేశం ఏజెంట్లు అధికార పార్టీకి అమ్ముడు పోయారు. మొత్తం 26 మంది అభ్యర్థులు నిలబడ్డారు. ఇందులో ఐదుగురు మినహా పోలింగ్ రోజు ఎవ్వరూ కనపడ్డేదు. ఏజెంట్లు మౌనంగా ఉండటంతో పోలింగ్ సిబ్బంది ఏం మాట్లాడలేదు.

భారతీయ జనతా పార్టీ (బిజెపి), తెలుగు దేశమ్ పార్టీ (టిడిపి), ఇతర పార్టీలు ప్రభుత్వాన్ని పెద్ద ఎత్తున విమర్శించాయి. తిరుపతి లోక్ సభ ఉప ఎన్నికలలో పోలింగ్ సందర్భంగా పెద్ద సంఖ్యలో నకిలీ ఓట్లు వేసినట్లు ఆధారాలతో సహా మీడియా ప్రజలకు చూపించింది. స్థానిక ఎన్నికలలో ఏకపక్ష విజయం సాధించిన తరువాత మరోసారి తన బలాన్ని నిరూపించడానికి వైఎస్ఆర్ కాంగ్రెస్ ఉప ఎన్నికలో 3 లక్షల మెజారిటీకి పైగా ఓట్లను పొందటానికి ప్రయత్నించింది. వై.వి.సుబ్బా రెడ్డి, పంచాయతీ రాజ్ మంత్రి పెద్దిరెడ్డి రామచంద్రారెడ్డి, ఉప ముఖ్యమంత్రి కె. నారాయణస్వామి తదనుగుణంగా ముందస్తు ప్రణాళికను రచించారు.

పోలింగ్ రోజు ఉదయం నుండి, టిడిపి, బిజెపి, వారి పోటీదారులతో సహా కాంగ్రెస్ పార్టీల నాయకులు వివిధ పోలింగ్ బూత్‌ల వద్ద రెడ్ హ్యాండెడ్‌గా పట్టుబడిన బోగస్ ఓటర్ల విషయాన్ని వీడియో సాక్ష్యాలతో ప్రజలకు, సోషల్ మీడియా నోటీసుకు తీసుకువచ్చారు. ఎన్నికల కోడ్‌ను తీవ్రంగా ఉల్లంఘించారు. ఆ విషయాన్ని ఎన్నికల సంఘం దృష్టికి తీసుకువచ్చినప్పటికీ, వైయస్ఆర్సిపి నాయకుల దుర్వినియోగం కొనసాగింది.

బూత్లను స్వాధీనం చేసుకోవడం, ఎన్నికలను రిగ్గింగ్ చేయడం, హింసను కలిగించే ఉద్దేశ్యంతో చాలా మంది నకిలీ ఓటర్లు బయట నుంచి వచ్చారు. బయటి వ్యక్తులు నకిలీ ఎపిక్ కార్డులతో ఓటు వేశారు. ఈ నకిలీ ఓటర్లు చాలామంది వారి పేర్లు, వారి తండ్రి, జీవిత భాగస్వామి పేరు, వారి చిరునామాను చెప్పలేకపోయారు. ఇవన్నీ వీడియో క్లిప్‌లలో ప్రజలు చూశారు. తిరుపతిలో వైఎస్ఆర్‌సిపి మంత్రి పెద్దిరెడ్డి రామచంద్రరెడ్డి స్థానికేతరుడు. ఆయన తిరుపతిలో ఉండాల్సిన అవసరం లేదు. అయినా ఆయన తిరుపతిలో ఉండి అన్నీ తానై నడిపించారు. తమాషా ఏంటంటే ఎన్నికల చట్టాన్ని సరిగా అమలు చేయాలని కోరినందుకు, నకిలీ ఓటర్లను పట్టుకున్నందుకు స్థానిక టిడిపి నాయకులను అరెస్టు చేశారు. అందువల్ల దొంగ వోటింగ్ కు పాల్పడింది.

స్థానిక పిఎల్ఆర్ కన్వెన్షన్ హాలు వద్ద నుంచి వందల మంది వైసిపి నాయకులు వివిధ వాహనాల్లో బయలు దేరారు. ఇది అటవీ శాఖ మంత్రికి సంభందించిన కల్యాణ మండపం. బయటి వారు వచ్చి ఓట్లు వేసేస్తున్నారంటూ మాజీ ఎంఎల్ఎ సుగుణమ్మ, టిడిపినాయకులు నరసింహయాదవ్‌లు రోడ్డుపై బైటాయించి నిరసన వ్యక్తం చేశారు. తిరుపతి అర్బన్ ఆఫీసులో ఫిర్యాదు చేశారు. వైసిపి నాయకులు ఇలా దొంగ ఓట్లు వేయడంపై వామపక్ష పార్టీలు నిరసన వ్యక్తం చేశాయి. స్థానిక గాంధీ విగ్రహం ఎదుట ధర్నా నిర్వహించారు. అలాగే బిజెపి అభ్యర్థి రత్నప్రభ వెస్టు పోలీసు స్టేషన్ వద్ద నిరసన వ్యక్తం చేశారు. సాయంత్రం 7:30 గంటలకు కోదండరామస్వామి ఆలయం ముందు

---

‘జీవించే హక్కు’ను భారత రాజ్యాంగం ఆర్టికల్ 21 తెలియజేస్తోంది. ప్రస్తుత కరోనా మహమ్మారిని తరిమికొట్టడానికి శాస్త్రీయ, సాంకేతిక పరిజ్ఞానాన్నంత వాడి ప్రజలకు మెరుగైన వైద్యం అందించడానికి దేశవ్యాప్తంగా కరోనా టెస్టింగ్ సెంటర్లను పెంచాలి. టీకాలు వేసే ప్రక్రియను కూడా పెంపొందించాలి. కరోనా రోగానికి మందులను ఉచితంగా పంపిణీ చేయాలి. ప్రజలు అన్ని జాగ్రత్తలు తీసుకునేలా ప్రభుత్వం పెద్ద ఎత్తున ప్రచారం చేపట్టాలి. ప్రజల ఆరోగ్యం కన్నా మించినది ఏదీ లేదని గ్రహించాలి. ప్రజలు కూడా వ్యక్తిగత క్రమశిక్షణ పాటించాలి. మాస్కులు ధరించాలి. సామాజిక దూరం పాటించాలి. గుంపులు – గుంపులుగా తిరగరాదు. మన ఆరోగ్యమే మన భవిష్యత్తును నిర్ణయిస్తుంది.

*(రచయిత న్యాయవాది, ఒపిడిఆర్ రాష్ట్ర కమిటీ సభ్యులు)* వీ

ధర్నా నిర్వహించారు.

పాపానాయుడు పేటలోనూ, తిరుపతిలో నిర్వహించిన పద్ధతిలోనే రేణిగుంట, పాపానాయుడు పేటలో వైసిపి నాయకులు దొంగ ఓట్లు వేసేందుకు విఫలయత్నం చేశారు. వాలంటీర్లను, సచివాలయ ఉద్యోగులను విచ్చలవిడిగా ఈ ఎన్నికల్లో వైసిపి వాడుకుంది. ఎస్‌వియు క్యాంపస్‌లో పీలేరు ఎమ్మెల్యే చింతల రామచంద్రారెడ్డి బావమరిది హరీష్‌రెడ్డి, వైసీపీ విద్యార్థి విభాగం రాయలసీమ అధ్యక్షుడు హరిప్రసాద రెడ్డి తదితరులు పెద్దసంఖ్యలో దొంగ ఓటర్లతో మకాం వేశారు. అక్కడి నుంచే నగరంలోకి దొంగ ఓటర్లను పంపించారు. టీడీపీ, బీజేపీ నేతలు అడ్డుకునేందుకు చేసిన యత్నాలు ఏమాత్రం ఫలించలేదు.

2019 సాధారణ ఎన్నికల్లో వైసీపీ ఎంపీ అభ్యర్థి బల్లి దుర్గా ప్రసాద్ 2.28 లక్షల ఓట్ల మెజార్టీతో గెలుపొందారు. లోక్‌సభ పరిధిలోని ఏడు అసెంబ్లీ నియోజకవర్గాల్లో తిరుపతి మినహా మిగిలిన ఆరు చోట్ల వైసీపీకి మెజార్టీ దక్కింది. చిత్తూరు జిల్లా పరిధిలోని శ్రీకాళహస్తిలో 32,919, సత్యవేడులో 42,196 ఓట్ల ఆధిక్యత వైసీపీకి లభించింది. తిరుపతి సెగ్మెంట్‌లో మాత్రం టీడీపీ అభ్యర్థి పనబాక లక్ష్మికి 3,578 ఓట్లు ఎక్కువగా వచ్చాయి. ప్రస్తుతం ప్రభుత్వం మీద ప్రజల్లో వ్యతిరేకత ఉన్న నేపథ్యంలో ఈ మెజార్టీ టీడీపీకి పెరుగుతుందని భావించిన వైసీపీ నేతలు దొంగ ఓట్లు పోల్ చేసుకోవడానికి తిరుపతిని ఎంచుకున్నారు.

రెండు వారాల ముందు నుంచే ఇద్దరు మంత్రులు, ఎమ్మెల్యేలు, నేతలు ఇక్కడ మకాం వేశారు. ఆయా డివిజన్లలో దొంగ ఓట్లకు ప్రణాళిక రచించారు. దీనికోసం ఉపసర్పంచికి 10, సర్పంచికి 20, వార్డు సభ్యుడికి 50 మందిని పిలుచుకుని రావాలని ఆదేశాలిచ్చినట్లు ప్రచారం జరుగుతోంది. ప్రతి డ్వాక్రా సంఘం నుంచి కనీసం ఇద్దరికి తగ్గకుండా తీసుకు రావాలని ఆర్‌పీలకు, గ్రూప్ లీడర్లను ఆదేశించారు. ఆ విదంగా ప్రత్యేక వాహనాల్లో వేరే ప్రాంతాల నుండి ప్రజల్ని తిరుపతికి తరలించారు. ఎవరైనా అడిగితే దర్శనాల పేరు చెబుతూ భక్తుల్లా ముందుకు కదిలారు.

తిరుపతి నగరంలో స్థానికేతరులు ఉండకూడదు. పార్టీలకు, ఇతర ప్రాంతాల వారికి కళ్యాణ మండపాలు, గదులు ఇవ్వకూడదు. 144 సెక్షన్ అమల్లో ఉన్నందున గుంపులుగా తిరగకూడదు. ఇదీ పోలింగ్ ముందర పోలీసువారి హెచ్చరిక. ముందు నుంచీ నిబంధనలు, హెచ్చరికలతో హడావిడి చేసిన పోలీసులు, చివరకు ప్రేక్షక పాత్ర వహించారు. తిరుపతిలోని పీఎల్‌ఆర్ కన్వెన్షన్ వద్ద వున్న వారిని ప్రశ్నించగా పాస్‌పోర్టు కోసమని కొందరు, ఆస్పత్రికి వచ్చామని మరికొందరు, సరదాగా వచ్చామంటూ ఇంకొందరు సమాధానమిచ్చారు. ముఖ్యమంత్రి ఆదేశాలతో వేలాది మందిని తిరుపతికి తీసుకొచ్చి దొంగ ఓట్లు వేయించారని, సమాచారమిచ్చినా పోలీసులు పట్టించుకోలేదు. .

ఎస్పీ కార్యాలయం ముందే దొంగ ఓటర్లు వస్తున్నారన్న సమాచారంతో ప్రతి పక్ష నాయకులు ఎస్పీ కార్యాలయం ముందు కాపు కాశారు. 40 మందితో అటుగా వచ్చిన ఓ ప్రైవేట్ వాహనాన్ని అడ్డుకున్నారు. డ్రైవర్ వద్దనున్న ఓటరు జాబితాను స్వాధీనం చేసుకున్నారు. సుమారు 25శాతం దొంగ ఓట్లు పోలయ్యాయని ప్రతి పక్షాల వాదన. టీడీపీ, బీజేపీ నాయకులు గుర్తించిన దొంగ ఓటర్లు వందల్లో ఉన్నారు. తానే సుమారు 70మంది నకిలీలను గుర్తించి పోలింగ్ కేంద్రంలోని పోలీసులకు అప్పగిస్తే ఒక్కరిపైనా కేసు నమోదు చేయలేదని బీజేపీ నేత శాంతారెడ్డి పేర్కొన్నారు. ఎస్వీ హైస్కూల్ పోలింగ్ కేంద్రం వద్ద దొంగ ఓట్లు వేయించడానికి పాకాల, చంద్రగిరికి చెందిన కొందరిని వైసీపీ నేతలు తీసుకొచ్చారు. 'ఒకరి ఓటు ఇంకొకరు వేయడం తప్పు కదా.. పైగా చదువుకున్నావు' అని ఆంధ్రజ్యోతి విలేకరి ప్రశ్నించారు. దీంతో 'మీ తిరుపతి వాళ్లకు కరోనా వస్తుందని భయంతో ఇళ్లలోనే ఉన్నారు. మాకు ఆ భయం లేదు కాబట్టి వాళ్ల బదులు మేము ఓటేస్తున్నాం...తప్పేంటి..' అంటూ సమాధానమివ్వడం గమనార్హం.

టీపీపీఎం పాఠశాలలో దొంగ ఓట్లు వేసేందుకు ఉదయం 8.30 గంటలకే పాకాల, చంద్రగిరి, గుర్రంకొండ ప్రాంతాలకు చెందిన వారు క్యూలో చేరారు. ఎస్వీ హైస్కూల్ పోలింగ్ బూత్‌లో దొంగ ఓట్లు వేసేందుకు వచ్చిన పీలేరు, కలకడ ప్రాంతాలవారికి ఉదయం 9.30 గంటలకు వైసీపీ నేతలు టిఫిన్ ప్యాకెట్లను అందించారు. మంచినీళ్ల గుంట వద్ద పాఠశాలలోని పోలింగ్ కేంద్రంలో దొంగ ఓట్లు వేసేందుకు వచ్చిన వారిని ఉదయం 9.45 గంటల సమయంలో ఎమ్మెల్యేలు భూమన కరుణాకరరెడ్డి, చెవిరెడ్డి భాస్కరరెడ్డి పలకరించారు. పరసాల వీధి మున్సిపల్ పాఠశాల పోలింగ్ కేంద్రంలో దొంగ ఓట్లేసేందుకు వచ్చి స్థానికేతర యువకులకు అమ్మవారి ఆలయం ముందు ఉదయం 10 గంటలకు వైసీపీ నేతలు సూచనలిచ్చారు. మధ్యాహ్నం 12 గంటల ప్రాంతంలో ఆర్ఎస్ మాడవీధిలోని మున్సిపల్ స్కూల్లో దొంగ ఓట్లు వేసేందుకు పలమనేరు ప్రాంతంలోని నెల్లిపట్టు నుంచి కర్ణాటక రిజిస్ట్రేషన్ వాహనంలో మహిళలు వచ్చారు.

వైసీపీ నాయకులు దొంగ ఓట్ల తంతుకు ఎస్వీయూ క్యాంపస్ ను కూడా అడ్డాగా మార్చు కున్నారు. పీలేరు ఎమ్మెల్యే చింతల బావమరిది హరీష్‌రెడ్డి, వైసీపీ విద్యార్థి విభాగం రాష్ట్ర కన్వీనర్ హరిప్రసాద్‌రెడ్డి, పీలేరు నియోజకవర్గ వైసీపీ నాయకులు ఎస్వీయూ క్యాంపస్‌కు చేరుకున్నారు. 13వ డివిజన్ పరిధిలోని ఓటర్ల జాబితాతో దొంగ ఓట్ల తంతు సాగించారు. పీలేరు నుంచి తీసుకొచ్చిన వారికి నకిలీ ఓటరు గుర్తింపు కార్డులు అందజేసి దొంగ ఓట్లే వేయించారు. టిడిపి చీఫ్ చంద్రబాబు నాయుడు అధికార పార్టీని "ప్రజాస్వామ్యాన్ని అపహాస్యం చేసారు" అని విరుచుకుపడ్డారు. "మాకు ఇలాంటి ఎన్నికలు ఎందుకు అవసరం? బోగస్ ఓటర్లను తిరుపతి వీధుల్లోకి తీసుకువచ్చారు. పోలీసులు వారిని ఎలా అనుమతించారు?" అని అడిగాడు. వైయస్ఆర్ కాంగ్రెస్ చేసిన స్థూల ఉల్లంఘనలను దృష్టిలో ఉంచుకుని తిరుపతి అసెంబ్లీ విభాగంలో తాజా పోల్ ఆదేశించాలని డిమాండ్ చేస్తూ ఆయన ముఖ్య ఎన్నికల కమిషనర్‌కు మరో లేఖ పంపారు.

అయితే తిరుపతి లోక్‌సభ సెగ్మెంట్ విస్తరించి ఉన్న నెల్లూరు, చిత్తూరు జిల్లాల కలెక్టర్లు బోగస్ ఓటర్లను అణిచివేసేందుకు, న్యాయమైన పోల్‌ను నిర్వహించడానికి పటిష్టమైన చర్యలు చేపట్టినట్టు ఎన్నికల సంఘం తెలిపింది. రాష్ట్ర డైరెక్టర్ జనరల్ గౌతమ్ సవాంగ్, శాంతియుత వాతావరణంలో పోలింగ్ ప్రక్రియ కొనసాగిందని చెప్పారు. ప్రతి ఒక్కరూ తమ ఓటు హక్కును నిర్భయంగా ఉపయోగించారని పేర్కొన్నారు. ఆ విధంగా ఆయన ముఖ్యమంత్రి పట్ల ఆయనకున్న విధేయతను ప్రకటించుకున్నారు.

దొంగ ఓట్ల విమర్శలను రాష్ట్ర పంచాయతీరాజ్ శాఖ మంత్రి పెద్దిరెడ్డి రామచంద్రారెడ్డి విమర్శించారు. ప్రశాంతంగా జరుగుతున్న ఎన్నికల వేళ దొంగ ఓట్లను రాద్ధాంతం చేయడం టిడిపికి తగదన్నారు. టిడిపినే దొంగ ఓట్లుకు పురమాయించి అది వైసీపీ చేయిస్తున్నట్టు రాద్ధాంతం చేయడం విడ్డూరంగా ఉందన్నారు. చంద్రబాబునాయుడు ముందే వేసిన పథకం ప్రకారం అతనికి సంబంధించిన మీడియా వర్గం బస్సులో వెళుతున్న వారి దగ్గరికి వెళ్లి మీరు ఎక్కడి నుంచి వచ్చారు, ఎక్కడకు పోతున్నారని ప్రశ్నలు వేసి వీరంతా దొంగ ఓట్లు అని టీవీలో చూపించడం దారుణమన్నారు. ఊళ్లకు వెళ్లే వాళ్ళు బస్సుల్లో వెళ్లక దేంట్లో వెళతారని ప్రశ్నించారు. పోలింగ్ బూత్‌ల్లో సైతం ఏబీఎన్, టీవీ ఫైవ్ కెమెరాలు వెళ్లి అక్కడ భయభ్రాంతులు సృష్టిస్తున్నాయని విమర్శించారు. ఈ ఘటనలపై ఎన్నికల కమిషన్‌కు ఫిర్యాదు చేస్తామని తెలిపారు.

తనను వీరప్పన్‌తో పోలుస్తూ ఎర్రచందనం స్మగ్లర్‌గా లోకేష్ ట్వీట్ చేయడం ఏంటని ప్రశ్నించారు. టీడీపీ కార్యకర్తలు పది మంది దగ్గర తాను స్మగ్లర్ అని చెప్పిస్తే రాజీనామా చేస్తానని సవాల్ విసిరారు. తాను అటవీశాఖ మంత్రిగా ఉన్నప్పుడు 24 గంటలు వన్ ప్లస్ ఆర్మీ గార్డులా పని చేయించానని గుర్తు చేశారు. . కళ్యాణ మండపంలో వేలాది మంది ఉన్నారంటూ మాజీ ఎమ్మెల్యే సుగుణమ్మ, మాజీ తుడా చైర్మన్ నరసింహ యాదవ్ రోడ్డుపై బైఠాయించి ధర్నా చేయడం సరైంది కాదన్నారు. ఉప ఎన్నికల్లో గెలవలేక టిడిపి తమపై బురద జల్లుతుందని విమర్శించారు. టిడిపి తీరుపై తామే కేంద్ర ఎన్నికల కమిషన్ కు ఫిర్యాదు చేస్తామని హెచ్చరించారు. ప్రతిపక్ష పార్టీలు పెద్ద ఎత్తున బోగస్ ఓట్లు వేశాయని, ఎన్నికలను రద్దు చేయాలని కోరినప్పటికీ, ఎన్నికల సంఘం పట్టించు కోలేదు. బి జే పి అభ్యర్థి రత్నప్రభ తిరుపతి ఉప ఎన్నిక ను రద్దు చేయాలని హై కోర్టు ను ఆశ్రయించింది.

మొత్తానికి ఆంధ్రప్రదేశ్‌లోని తిరుపతి (ఎస్సీ) లోక్‌సభ నియోజకవర్గానికి జరిగిన ఉప ఎన్నికలో 64.29 శాతం పోలింగ్ నమోదైంది. నియోజకవర్గంలో మొత్తం 17,10,699 మంది ఓటర్లలో 10,99,784 మంది తమ ఓటు హక్కును వినియోగించుకున్నారని ఎన్నికల సంఘం తెలిపింది. నియోజకవర్గం 2019 సార్వత్రిక ఎన్నికలలో 78.9 శాతం ఓటింగ్ సాధించింది. కోవిడ్ కేసులు పెరిగినప్పటికీ ఏప్రిల్ 17న 64.29 శాతం పోలింగ్ జరిగింది. సత్యవేడు (ఎస్సీ) అసెంబ్లీలో అత్యధికంగా 72.68 శాతం పోలింగ్ నమోదైంది. తరువాత సూళ్లూరుపేట (ఎస్సీ) 70.93 శాతం, శ్రీకళహస్తి 67.77 శాతం, సర్వే పల్లి 66.19 శాతం, గుడూరు (ఎస్సీ) 63.81 శాతం, వెంకటగిరి 61.50 శాతం లో పోలింగ్ నమోదైంది. తిరుపతిలో అత్యల్పంగా 50.58 శాతం పోలింగ్ నమోదైందని రాష్ట్ర చీఫ్ ఎలక్టోరల్ ఆఫీసర్ (సీఈఓ) కె విజయానంద్ తెలిపారు.

నేడు ప్రపంచంలోని దాదాపు అన్ని దేశాలు బూటకపు ప్రజాస్వామ్య నిర్మాణంలోకి వచ్చాయి. యుఎస్ఎ, గ్రేట్ బ్రిటన్, ఫ్రాన్స్, కెనడా వంటి దేశాలలో ఉదారవాద ప్రజాస్వామ్యం స్థాపించబడింది. కమ్యూనిస్ట్ దేశాలలో రాజకీయ, ఆర్థిక వ్యవస్థను సామాజీకరించడం ఆగిపోయింది. ఉదార ప్రజాస్వామ్యం సోషలిస్ట్ ప్రజాస్వామ్యం రెండూ రాజకీయ ప్రజాస్వామ్యపు రూపాలుగా పరిగణించబడతాయి. ఎందుకంటే ఈ వ్యవస్థలు ఆర్థిక, రాజకీయ, సామజిక దోపిడీపై ఆధార పడి ఉంటాయి.

నేడు ప్రజాస్వామ్యం వాడుకలో ఉన్న అన్ని దేశాలలో, రాజకీయ ప్రజాస్వామ్యం కంటే మెరుగైన వ్యవస్థ మరొకటి లేదని ప్రజలు నమ్ముతారు. రాజకీయ ప్రజాస్వామ్యం ఓటింగ్ హక్కులను ఇచ్చిందనడంలో సందేహం లేదు. కానీ అది ఆర్థిక సమానత్వ హక్కును కొల్లగొట్టింది. పర్యవసానంగా, ధనిక –పేదల మధ్య స్థూల ఆర్థిక అసమానత ఉంది. ప్రజల కొనుగోలు సామర్థ్యంలో అపారమైన అసమానత, నిరుద్యోగం, దీర్ఘకాలిక ఆహార కొరత, పేదరికం, సమాజంలో అభద్రత సర్వ సాధారణమై పోయింది. భారతదేశంలో ప్రబలంగా ఉన్న ప్రజాస్వామ్యం కూడా రాజకీయ ప్రజాస్వామ్యం మాత్రమే. అంతే కాకుండా ఇది ఒక ప్రత్యేకమైన దోపిడీ వ్యవస్థ అని నిరూపించబడింది. భారత రాజ్యాంగాన్ని మూడు రకాల దోపిడీదారులు సృష్టించారు.

బ్రిటిష్ సామ్రాజ్యవాదులు, భారత సామ్రాజ్యవాదులు, భారత పెట్టుబడిదారులకు ప్రాతినిధ్యం వహిస్తున్న పాలక పార్టీలు. భారత రాజ్యాంగంలోని అన్ని నిబంధనలు ఈ అవకాశవాదుల ప్రయోజనాలను మరింతగా దృష్టిలో ఉంచుకుని రూపొందించబడ్డాయి. ప్రజలను మోసగించడానికి, ప్రజలకు సార్వత్రిక ఓటుహక్కు లభించింది. లక్షలాది మంది భారతీయులు పేదలు, నిరక్షరాస్యులు. అయినప్పటికీ దోపిడీదారులు, తప్పుడు వాగ్దానాలు చేయడం, బెదిరించడం, పరిపాలనా అధికారాన్ని దుర్వినియోగం చేయడం, ఓటు రిగ్గింగ్ వంటి పద్ధతుల ద్వారా ఓటర్లపై పదేపదే విజయం సాధిస్తారు.

ఇది ప్రజాస్వామ్యపు ప్రహసనము. వారు ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసిన తర్వాత, ఐదేళ్లపాటు అవినీతిని పెంచడానికి, రాజకీయ దౌర్జన్యానికి పాల్పడటానికి వారికి తగినంత అవకాశం లభిస్తుంది. తరువాతి ఎన్నికలలో అదే అసంబద్ధత పునరావృతమవుతుంది. స్వాతంత్ర్యం వచ్చినప్పటి నుండి భారతదేశంలో ఈ రకమైన రాజకీయ అవకాశవాదం కొనసాగుతోంది. పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన యూరప్ దేశాలతో ఆర్థిక సమానత్వం పొందాలంటే భారతదేశం ప్రజాస్వామ్య వ్యవస్థను అనుసరించాలని గత ముప్పై ఐదు సంవత్సరాలుగా రాజకీయ పార్టీలు అభిప్రాయపడుతున్నాయి. ఈ వాదనకు మద్దతుగా, వారు అమెరికా, గ్రేట్ బ్రిటన్, చైనా, సోవియట్ యూనియన్ ఉదాహరణలను ఉదహరించారు. రాజకీయ నాయకులు ఎన్నికల సమయంలో తమకు అనుకూలంగా ఓటు వేయాలని ఓటర్లను కోరుతున్నారు. నేడు లక్షలాది మంది భారతీయ పౌరులు జీవిత కనీస అవసరాలను కోల్పోతున్నారు. తగినంత ఆహారం, దుస్తులు, గృహనిర్మాణం, విద్య, వైద్య చికిత్సలను పొందటానికి కష్టపడుతున్నారు. కొద్దిమంది మాత్రమే అపారమైన సంపద, విలాసాలను పొందుతున్నారు.

ప్రజాస్వామ్యపు స్పష్టమైన లోపాలలో ఓటింగ్ ఒకటి. పరిపాలన సార్వత్రిక ఓటు హక్కుపై ఆధారపడి ఉంటుంది. అంటే, ఓటు వేసే హక్కు వయస్సు మీద ఆధారపడి ఉంటుంది. ప్రజలు ఒక నిర్దిష్ట వయస్సుకి చేరుకున్న తర్వాత, ఉత్తమ అభ్యర్థిని ఎన్నుకోవటానికి వారికి అవసరమైన సామర్థ్యం ఉందని భావించబడుతుంది. చాలా సందర్భాల్లో ఇది సంఘవిద్రోహ పద్ధతులపై కూడా ఆధారపడి ఉంటుంది. ప్రపంచమంతటా, ఎన్నికల ప్రక్రియలో డబ్బు ఆధిపత్య పాత్ర పోషిస్తుంది.

దాదాపు అన్ని సందర్భాల్లో, ధనవంతులు, శక్తివంతులు మాత్రమే ఎన్నుకోబడతారు. ఓటింగ్ తప్పనిసరి లేని దేశాలలో, తరచుగా జనాభాలో కొద్ది శాతం మాత్రమే ఎన్నికల ప్రక్రియలో పాల్గొంటారు.

ప్రజాస్వామ్యం విజయవంతం కావడానికి అవసరమైనవి నైతికత, విద్య, సామాజిక-ఆర్థిక-రాజకీయ చైతన్యం. దేశంలో సందేహాస్పదమైన వ్యక్తులు, స్వార్థ ప్రయోజనాలు ఉన్నవారు అధికారానికి ఎన్నుకోబడతారు. బందిపోట్లు, హంతకులు కూడా ఎన్నికలలో నిలబడి ప్రభుత్వాన్ని ఏర్పాటు చేస్తారు. ప్రపంచంలోని దాదాపు అన్ని దేశాలలో, ప్రజలకు రాజకీయ స్పృహ లేదు. మోసపూరిత, వివేకవంతులైన రాజకీయ నాయకులు ప్రజలను కలవరపెట్టడానికి, అధికారాన్ని సాధించడానికి ఈ లోపాన్ని సద్వినియోగం చేసుకుంటారు. వారు లంచం, ఓటు రిగ్గింగ్, బూత్ స్వాధీనం, ఓట్ల కొనుగోలు వంటి అనైతిక పద్ధతులను ఆశ్రయిస్తారు. ప్రస్తుత ప్రజాస్వామ్య వ్యవస్థలో, అన్ని రకాల అనైతిక, అవినీతి పద్ధతులకు సమాజాన్ని వక్రీకరించే అవకాశం ఇవ్వబడింది. ప్రస్తుత వ్యవస్థ స్వభావం ఏమిటంటే, ఇది పెట్టుబడిదారులకు అనుకూలంగా ఉంటుంది. పరిపాలనను అనైతిక, అవినీతి శక్తులకు అందిస్తుంది.

ఉదార ప్రజాస్వామ్య దేశాలలో, పెట్టుబడిదారులు రేడియో, టెలివిజన్, వార్తాపత్రికల వంటి మాస్ మీడియాను తారుమారు చేస్తారు. సోషలిస్ట్ ప్రజాస్వామ్యాలలో అధికారులు దేశాన్ని విధ్వంసం అంచుకు నడిపిస్తారు. ప్రజాస్వామ్యపు రెండు రూపాల్లో, నిజాయితీగల, సమర్థులైన నాయకులు సమాజంలో ఉద్భవించటానికి తక్కువ అవకాశాలు ఉంటాయి. వాస్తవంగా ప్రజల ఆర్థిక విముక్తికి అవకాశం లేదు.

రాజకీయ ప్రజాస్వామ్యం దేశ ప్రజలకు శాపంగా మారింది. ఆర్థిక శక్తి సామాన్య ప్రజల చేతుల్లో ఉండాలి. జీవిత కనీస అవసరాలు అందరికీ హామీ ఇవ్వాలి. ప్రజల ఆర్థిక విముక్తిని నిర్ధారించడానికి ఇదే మార్గం. అందుకే ప్రజలు ఓటుకు నోటు తీసుకుంటున్నారు. పాలకులు దోపిడీ చేస్తున్నా పెద్దగా ఆశ్చర్య పడటం లేదు. పట్టణాల్లో అయితే ప్రజలు ఓటింగుకు దూరంగా ఉంటున్నారు. తిరుపతి లో జరిగింది అదే. లక్షల మెజారిటీ వస్తుందని ఆశించిన వైఎస్సార్సీపీకి పట్టణ ప్రజల ఓటింగ్ నిరాసక్తత వాళ్లను కుంగదీసింది. అందుకే వారు నకిలీ ఓటర్ ను సృష్టించి పబ్బం గడుపుకోవాలని ప్రయత్నించారు. తిరుపతి ఉప ఎన్నిక ఒక స్పష్టమైన సందేశాన్ని అయితే రాష్ట్ర ప్రజలకు ఇచ్చింది. అది ఎంటంటే ప్రజాస్వామ్య వ్యవస్థలో ఎన్నికలు ఒక తంతు మాత్రమే. ఎన్నికల్లో ఏ పార్టీ అధికారంలోకి వచ్చినా సామాన్య ప్రజలకు ఒరిగేది ఏమీ లేదు. ఇలాంటి సందర్భంలో ఎన్నికల కమిషన్ కఠినమైన చర్యలు తీసుకోవడం చాలా అవసరం. లేకపోతే అది ప్రజాస్వామ్యాన్ని అపహాస్యం చేస్తుంది. తిరుపతి పార్లమెంటరీ నియోజకవర్గంలోని తిరుపతి అసెంబ్లీ విభాగంలో ఎన్నికల ప్రక్రియను రద్దు చేయాలి. తిరుపతి లో తిరిగి పోలింగ్ నిర్వహించాలి.

*(రచయిత పౌరహక్కుల సంఘం సభ్యులు)*

## కె.పి. సుబ్బారావు మృతి

*పౌరహక్కుల సంఘం నాయకుడు, ఆంధ్రా యూనివర్సిటీ ప్రొ. కె.పి. సుబ్బారావు ఏప్రిల్ 23న విశాఖపట్నంలో కరోనా బారిన పడి మృతిచెందారు. ఆయన ఆంధ్రా యూనివర్సిటీ ఆర్ఎస్‌యు నాయకుడుగా, జననాట్యమండలి విశాఖ బృందంలో గాయకుడిగా, కళాకారుడిగా పనిచేశారు. వక్తగా, లలిత సహచరుడిగా, విప్లవ-దళిత రాజకీయాల సమన్వయం కోసం కృషిచేశారు. పౌరహక్కుల సంఘం నాయకత్వ బాధ్యతలు నిర్వహించారు. విశాఖలో నిర్వహించిన ప్రజా ఉద్యమాలలో పాల్గొనేవారు.*

## ఒద్దిరాజు వేణుగోపాల్‌రావు మృతి

*కవి, సాహితీవేత్త ఒద్దిరాజు వేణుగోపాల్‌రావు(72) ఏప్రిల్ 24న మరణించారు. టైఫాయిడ్ జ్వరంతో ఆయన వరంగల్ అర్బన్ జిల్లా హన్మకొండలోని గాంధీనగర్‌లోని తన స్వగృహంలో మృతిచెందారు. తెలంగాణలో మొదటి తెలుగు పత్రిక నిర్వాహకులైన ఒద్దిరాజు సోదరుల్లో ఒకరైన ఒద్దిరాజు రాఘవ రంగారావు కుమారుడే వేణుగోపాల్‌రావు. ఆయన ఆర్మీ అధికారిగా పదవీ విరమణ చేసిన తరువాత 'సహృదయ' సంస్థలో సాహిత్య సాంస్కృతిక సేవలందించారు.*

# తెలంగాణ ఆర్థిక నిర్వహణపై కాగ్ విశ్లేషణ

***తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వ ఆర్థిక విన్యాసాల డొల్లతనాన్ని, దుబారాను ఎత్తిచూపుతూ, అలాగే నీటి పారుదల ప్రాజెక్టులు సకాలంలో పూర్తి కానందున ఖర్చు పెరిగిందని కాగ్ ఆక్షేపించిందంటున్నారు డా. ఎ. పున్నయ్య***

స్వతంత్ర భారతంలో స్వయం ప్రతిపత్తిగల సుప్రీంకోర్టు, ఎన్నికల సంఘం, యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమిషన్ మాదిరిగా భారత ప్రజాస్వామ్యంలో కంప్ట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ ఆఫ్ ఇండియా (కాగ్) కూ విశిష్టమైన అధికారాలున్నాయి. ఇది కేంద్ర, రాష్ట్ర ఆర్థిక కార్యకలాపాలను డేగకళ్లతో వీక్షిస్తూ ప్రజాధనాన్ని రక్షిస్తుంది. ఆర్థిక అవకతవకలపై పారదర్శక నివేదికలకు పట్టం కడుతుంది. 1949 మే 30న డా.బి.ఆర్. అంబేద్కర్ రాజ్యాంగ పరిషత్ సమావేశంలో ప్రసంగిస్తూ పార్లమెంట్ అమోదించే వ్యయాలు పరిధి దాటుతున్నాయా, మార్పు చేర్పులేమైన చోటుచేసుకున్నాయా అనే విషయాన్ని కాగ్ మాత్రమే పారదర్శకంగా పరిశీలిస్తుందన్నారు. ఈ పారదర్శకత ప్రజాస్వామ్యానికి వెన్నెముక లాంటిది. రాజ్యాంగంలోని 5వ భాగంలో 148 నుంచి 151 అధికరణల ప్రకారం ఏర్పాటయిన ఈ సంస్థ అధికార పరిధి విస్తృతమైనది.

**కాగ్ విశిష్టత:**

దేశంలో ఆడిట్, అకౌంట్స్ విభాగంలో పదేళ్లకి పైగా అనుభవమున్న ప్రభుత్వ కార్యకలాపాల్లో నిష్ణాతుడైన వ్యక్తిని కాగ్‌గా రాష్ట్రపతి నియమిస్తారు. ఇతను శాసనం ద్వారా ఏర్పడిన భారత రాజ్యాంగం పట్ల శ్రద్ధానిష్ఠలను కలిగిఉంటాను, దేశ సార్వభౌమత్వాన్ని, ఆఖండతను సమర్థిస్తాను, భావ రాగద్వేషాలకు అతీతంగా బాధ్యతలు నిర్వహిస్తాను, రాజ్యాంగాన్ని, చట్టాలను నిలబెడతాను అని ప్రమాణం చేస్తాడు. రాజ్యాంగ బద్ద సంస్థల అధికారుల్లో కాగ్ మాత్రమే ఈ విధంగా ప్రమాణం చేస్తారు. కాగ్‌కు ఎలాంటి మకిలి అంటకుండాఉండేందుకు కాగ్ అధికారి పదవీ విరమణ అనంతరం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల్లో ఎలాంటి పదవి చేపట్టరాదని నిబంధనలున్నాయి. కావున ఈ అధికారి నిర్వహించే ఆర్థిక నిర్వహణ విధులు సుప్రీంకోర్టు ప్రధాన న్యాయాధికారి విధుల కంటే కూడా ప్రధానమైనవి. ఇవి ప్రజాస్వామ్యానికి కవచం లాంటివని అంబేద్కర్ ప్రస్తావించారు. కాగ్ ప్రభుత్వ శాఖల ఆర్థిక లావాదేవీలపై, దుబారా, అవినీతిపై నివేదిక ఇస్తుంది. అత్యంత ప్రామాణికమైన, ఈ నివేదికలు ప్రభుత్వాలు తేలికగా తీసుకోకుండా గౌరవించాలి. ఈ క్రమంలో సుప్రీంకోర్టు, హైకోర్టు న్యాయమూర్తులు సహితం రాజ్యాంగాన్ని సక్రమంగా నిలబెట్టే కీలక బాధ్యతలు కాగ్‌పైఉంచారు. 1981లో అకౌంటెంట్ జనరల్ కేసు తీర్పులో సహితం సుప్రీంకోర్టు కాగ్ అధికారులు అత్యున్నత అధికారులుగా పేర్కొనడం గమనార్హం.

దేశ ఆర్థిక వ్యవస్థ నిర్వహణలో కాగ్ ఒక కీలకమైన యంత్రాంగాన్ని కలిగి ఉంది. కేంద్ర ప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వాలు, ప్రభుత్వరంగ సంస్థలు, ప్రభుత్వ ఆర్థిక సహకారంతో నడిచే స్వతంత్ర సంస్థలు, కార్పొరేషన్లు సంపాదించే ఆదాయాలను, చేసే వ్యయాలనూ మొత్తంగా కొన్ని సార్లు నమూనా తీసుకుని, కొన్నిసార్లు లెక్కలు వేసి ఎక్కడ ఆదాయం కోల్పోవడం జరిగిందో, ఎక్కడ వృథా వ్యయం జరిగిందో ఎత్తిచూపుతూ కూలంకషమైన నివేదికలను సమర్పించడం కాగ్ పని. రాబడులు, విక్రయం, నిల్వల లాంటి వ్యవహారం కంటే వ్యయానికి సంబంధించిన ఆడిట్‌లో కాగ్‌కు ఎక్కువ స్వేచ్ఛ ఉంటుంది. ప్రభుత్వ వ్యయంలో వివేకం, శ్రద్ధ, మిత వ్యయం లాంటి మంచి లక్షణాలు వృద్ధం, దుబారా లాంటి చెడు లక్షణాలను కాగ్ వ్యాఖ్యానిస్తోంది. దేశంలో ఉన్న సుమారు 1400 ఖాతాలను తనిఖీ చేస్తుంది. రాజ్యాంగ నిర్దేశం ప్రకారం కాగ్ తన నివేదికలను కేంద్ర ప్రభుత్వానికి సంబంధించినవైతే రాష్ట్రపతికి, రాష్ట్ర ప్రభుత్వాలకు సంబంధించినవైతే రాష్ట్ర గవర్నర్‌కు సమర్పించాలి. వారు ఆ నివేదికలను పార్లమెంట్‌లో లేదా శాసన సభలో ప్రవేశ పెట్టవలసిందిగా సంబంధిత ప్రభుత్వాలను ఆదేశిస్తారు.

**తెలంగాణ వ్యయాలు – సమగ్ర తనిఖీ విశ్లేషణ:**

తెలంగాణ ప్రభుత్వం బడ్జెట్ కేటాయింపులో భారీ అంకెలతో గారడీ చేస్తూ ప్రజాధనాన్ని దుర్వినియోగ పరుస్తూ ప్రజలను మభ్యపెడుతున్న విషయాలు కాగ్ బట్టబయలు చేసింది. అంకెలు చూసి సంబరపడడం తప్ప ఆచరణలో ఏమీ లేదని ధ్రువపరిచింది. మార్చి 26న తెలంగాణకు సంబంధించి కాగ్ సమర్పించిన ఏడు నివేదికలను శాసనసభ బడ్జెట్ సమావేశాల చివరి రోజున ప్రవేశపెట్టారు. కాగ్ ఈ ఏడు నివేదికల్లో రాష్ట్ర ప్రభుత్వం డొల్లతనాన్ని, దుబారాను ఎత్తిపడుతూ స్వతంత్ర వ్యయ నియంత్రణపై దృష్టి పెట్టాలని అభిప్రాయపడింది.

**ఒక స్వతంత్ర వ్యయ నియంత్రణ వ్యవస్థను ఏర్పాటు చేయాలి:**

మొదటగా రాష్ట్ర శాసనసభ ఆమోదం లేని ఖర్చులు, ఆమోదించిన కేటాయింపులకు మించిన ఖర్చులు జరగకుండా ఆర్థిక శాఖ చర్యలు తీసుకోవాలని కాగ్ హెచ్చరించింది. ఇప్పటికే అయిన అధిక ఖర్చుల క్రమబద్ధీకరణకు ప్రాధాన్యత ఇవ్వాలని శాసనసభ ఆమోదం లేకుండా చేసే అధిక ఖర్చులను నియంత్రించేందుకు రాష్ట్ర ప్రభుత్వం ఒక స్వతంత్ర వ్యయ నియంత్రణ వ్యవస్థను ఏర్పాటు చేయాలని కాగ్ సూచించింది. 2014-18కి సంబంధించిన కేటాయింపులకు మించి చేసిన రు. 55,517 కోట్ల అధిక ఖర్చును రాష్ట్ర ప్రభుత్వం క్రమబద్ధీకరించుకోవాల్సి

ఉందని పేర్కొంది. బడ్జెట్ అంచనాలకు, వాస్తవాలకు మధ్య తేడాను కనిష్ఠ స్థాయికి తగ్గించే విధంగా ఆర్థిక శాఖ బడ్జెట్ తయారీ ప్రక్రియను హేతుబద్ధం చేయాలని సూచించింది. బడ్జెట్ కేటాయింపులు లేకుండా ఉపపద్దు స్థాయిలో ప్రభుత్వం ఖర్చు చేసినట్టు కాగ్ పేర్కొంది. కొన్నేళ్లుగా ప్రభుత్వం మార్కెట్ రుణాలపై అధికంగా ఆధారపడడంతో చెల్లింపుల బాధ్యతలు పెరిగాయని కాగ్ అభిప్రాయపడింది. ఆర్థిక సంవత్సరం చివరి మూడు నెలల్లోనే 34 శాతం ఖర్చు చేయడం వలన అనేక అనర్థాలు జరుగుతాయని కాగ్ అభిప్రాయపడింది. ప్రత్యేక నిధి కింద కేటాయించిన ఎస్సి, ఎస్టి నిధులు కూడా సరిగా ఖర్చు పెట్టకపోవడాన్ని కాగ్ తప్పుపట్టింది. రాబోయే ఏడేళ్లలో రు. 76,262 కోట్ల అప్పు తీర్చాల్సి ఉందని విశ్లేషించింది.

**వివిధ నివేదికల విశ్లేషణ:**

కాగ్ సమర్పించిన ఏడు నివేదికలను మార్చ్ 26న శాసనసభ బడ్జెట్ సమావేశాల చివరి రోజున ప్రవేశపెట్టారు. ఈ ఏడు నివేదికలూ కలిసి 900 పేజీలున్నాయి. ఈ నివేదికలోని సారాంశం సంక్షిప్తంగా ఈ కింది విధంగా చేర్చించనైనది.

మొదటి నివేదికలో సింగరేణి కాలరీస్ పనితీరును, రాష్ట్ర ప్రభుత్వ ఆర్థిక రంగం, ప్రభుత్వ రంగ సంస్థల ఆర్థిక ప్రవర్తనను మదింపు వేసింది. 2014-15 నుంచి 2018-19 మధ్య కాలంలో ప్రభుత్వ రంగ సంస్థల్లో రాష్ట్ర ప్రభుత్వం రుణాలు, సబ్సిడీ, గ్రాంట్ల కింద 52,219.41 కోట్ల పెట్టుబడి పెట్టగా, ప్రధానంగా విద్యుత్ రంగంలో 29,263.92 కోట్ల పెట్టుబడి పెట్టినట్లు వివరించింది. ప్రభుత్వానికి ముందుచూపు లేకపోవడంతో సింగరేణి కాలరీస్‌లో మెగా పవర్ ప్రాజెక్టు పాలసీ ప్రయోజనాల విషయంలో రు. 293.55 కోట్ల మేర సుంకం ద్వారా వచ్చే రాయితీని కోల్పోవాల్సి వచ్చింది. అధికారుల అసంబద్ధ నిర్ణయాలతో ఆదిలాబాద్ జిల్లా జైపూర్ వద్ద ఆరు వందల మెగావాట్ల సామర్థ్యంతో చేపట్టిన సింగరేణి థర్మల్ పవర్ ప్లాంట్ కోట్లాది రూపాయల సుంకాల రాయితీని కోల్పోయినట్లు కాగ్ ధ్రువీకరించింది.

రెండో నివేదిక వాణిజ్య పన్నులు, రాష్ట్ర ఎక్సైజ్, రిజిస్ట్రేషన్ - స్టాంపులు, రవాణా, లాండ్ రెవెన్యూ, గనులు వంటి రాష్ట్ర ప్రభుత్వ రెవెన్యూ రంగ శాఖలకు సంబంధించిన లెక్కల మదింపులో అనేక అక్రమాలు గుర్తించింది. 13 సబ్-రిజిస్ట్రార్ ఆఫీసుల్లో రిజిస్టర్ అయిన దస్తావేజుల లావాదేవీలు తప్పుగా వర్గీకరించడం, వ్యవసాయేతర భూములకు వ్యవసాయ కేటగిరీలో తక్కువ చార్జీ వసూలు చేసి ప్రభుత్వ ఆదాయానికి గండి కొట్టినారు. దీనితో రెవెన్యూ బకాయిలు 2019 మార్చ్ నాటికి రు. 13,011 కోట్లుగా ఉన్నాయి. వాణిజ్య పన్నుల శాఖలో 1,084 కేసుల్లో అధికారులు రు. 538 కోట్ల మేర వ్యాట్‌ను తక్కువగా తేల్చారు. అర్హత లేని వస్తువుల పైనా ఇన్పుట్ ట్యాక్స్ క్రెడిట్‌ను అనుమతించారు. డీలర్లు ఆలస్యంగా పన్ను చెల్లించినా వడ్డీ, జరిమానా విధించలేదని కాగ్ తప్పుపట్టింది. రైస్ మిల్లర్లకు అనుచిత లబ్ధి కలిగేలా పౌరసరఫరాల సంస్థ వ్యవహరించింది. ధాన్యం రవాణా, రైస్ మిల్లింగ్‌కు సంబంధించి క్వింటాకు రు. 3కు బదులు రు. 2.50 వసూలు చేశారు. దీంతో రు. 5.77 కోట్ల మేర నష్టం వాటిల్లింది. ముడి బియ్యం మిల్లింగ్ చార్జీలను రు. 15 నుంచి రు. 30కు, బాయిల్డ్ రైస్ (ఉప్పుడు బియ్యం) చార్జీలు రు. 25 నుంచి రు. 50కి పెంచి, మిల్లర్లకు రు. 34 కోట్లు ప్రయోజనం చేకూర్చారు. రాష్ట్ర వ్యాప్తంగా 8 జిల్లాల్లోని 24 మండలాల్లో రు. 1096 కోట్ల విలువైన 12,666 ఎకరాల అసైన్డ్ భూములు అన్యాక్రాంతం అయ్యాయి. ఈ భూమి విలువ రు. 1,096.45 కోట్లు ఈ భూములను స్వాధీనం చేసుకోవడంలో ప్రభుత్వం విఫలమైంది. దేవాదాయ శాఖలో 20,124 ఎకరాల భూమి ఆక్రమణకు గురైతే కేవలం 3,488 ఎకరాల భూములకు సంబంధించి మాత్రమే ట్రిబ్యునల్స్‌లో కేసులు వేశారు. మిగిలిన భూములు ప్రైవేట్ వ్యక్తులకు చెందుటకు సహకరించారని కాగ్ ధ్రువీకరించింది.

దేవాదాయ భూములు 87,236 ఎకరాల మేర ఉంటే అందులో 59,899 ఎకరాల భూమికి పట్టాదారు పాసు పుస్తకాలు తీసుకోలేదు. 6(ఏ) కేటగిరీకి చెందిన 14 దేవాలయాలకు గాను పదింటిలో కార్యనిర్వహణ అధికారులు ఆలయాల్లో జమ అయిన 91.87 కిలోల బంగారాన్ని డిపాజిట్ చేయకపోవడాన్ని కాగ్ తప్పుపట్టింది. దీన్నిబట్టి ప్రభుత్వ ఆదాయానికి గండిపడి ఎవరి ప్రయోజనాల పంటపండిందో అర్థం చేసుకోవచ్చు.

మూడో నివేదికలో హైదరాబాద్ తాగునీటి పథకం నిర్వహణ గురించీ, సాధారణ, సాంఘిక రంగానికి చెందిన వెనుకబడిన వర్గాల సంక్షేమం, ఆరోగ్యం, వైద్యం, కుటుంబ సంక్షేమం, పురపాలన, పట్టణాభివృద్ధి, ప్రణాళిక, యువజన సంక్షేమం, పర్యాటక రంగం, సంస్కృతి రంగం వంటి శాఖల్లో కేటాయింపుల అమలు తీరును పరిశీలించింది. ఈ పరిశీలనలో సికింద్రాబాద్ సెయింట్ ఆన్స్ స్కూల్‌కు 20 ఎకరాల భూమిని ఎకరాకు రు. 1.50 లక్షలకే కేటాయించిన విషయాన్ని కాగ్ వెలికితీసింది. వెంకట్రామారెడ్డి విద్యా సంస్థకు ఎకరం భూమిని రు. 1కే కేటాయించారని, ఈ భూ కేటాయింపుల్లో కూడా రు. 117.40 కోట్ల మేర అనుచిత లబ్ధిని చేకూర్చారని కాగ్ తెలిపింది. జిహెచ్ఎంసి పరిధిలో దుకాణాలపై రు. 2.70 కోట్ల మేర ఆబ్కారీ పన్ను తక్కువ విధించారు. క్లబ్ లైసెన్సుదారులపై అదనపు అంతర్గత వినియోగ పన్ను, జనాభా 5 వేలు దాటిన చోట్ల పన్ను విధించకపోవడంతో ప్రభుత్వానికి కోట్లల్లో నష్టం జరిగినట్లు కాగ్ గుర్తించింది.

నిబంధనలకు విరుద్ధంగా రెండో పిజి చేసేందుకు ఐదుగురు విద్యార్థులకు, డిగ్రీ చేయడానికి ఒక విద్యార్థికి ఉపకార వేతనాలు మంజూరు చేసినట్టు కాగ్ నివేదిక వెల్లడించింది. 'మహాత్మ జ్యోతిబాపూలే బిసి విదేశీ విద్యానిధి' పథకం కింద అనర్హులైన 18 మంది విద్యార్థులకు రు. 1.90 కోట్ల ఉపకార వేతనాలను ప్రభుత్వం చెల్లించినట్లు పేర్కొంది. 2016-19 మధ్యకాలంలో 749 మంది విద్యార్థులకు ఉపకార వేతనాలు మంజూరు చేసినట్టు తెలిపింది. విదేశాల్లో విద్యనభ్యసించే 300 మంది బిసి విద్యార్థులకు ఏటా రు. 20 లక్షలు ఈ పథకం కింద ఇస్తున్నారని గుర్తు చేసింది.

తెలంగాణ ఆవిర్భావం నుండి విద్యారంగంపై ప్రభుత్వ దృష్టి తులనాత్మకంగా తక్కువగా ఉన్నట్టు కాగ్ గుర్తించింది. రవాణా, విద్య, క్రీడలు వంటి విషయాల్లో తలసరి ఖర్చు తగ్గింది. ఆధునిక ఆర్థిక వ్యవస్థ అభివృద్ధి మానవ వనరులపై ఆధారపడింది. విద్యారంగాన్ని అభివృద్ధి

చేయకపోతే భవిష్యత్ తెలంగాణకే ప్రమాదం. తెలంగాణ ప్రభుత్వం పునరాలోచించి విద్యపైన కేటాయింపులు పెంచాలి. నమూనాగా పిడికెడు మంది గురుకుల విద్యార్థులను చూపి మొత్తం విద్యారంగంగా భ్రమింపచేస్తున్నారు. రాష్ట్ర వ్యాప్తంగా అయిదు లక్షల మందికి నాణ్యమైన విద్యను అందించుకుంటూ 60 లక్షల మంది విద్యార్థుల భవిష్యత్తు గాలికి వదలడం విచారకరం.

ఎలక్ట్రానిక్ వైద్య డేటా నిర్వహణకు సంబంధించిన కేంద్ర ప్రభుత్వ పథకం - ఇహెచ్ఎంఎస్ ప్రాజెక్ట్ సరిగా అమలు కావడం లేదని తెలిపింది. కేంద్ర ప్రభుత్వానికి చెల్లించాల్సిన 31.69 లక్షలు ప్రజా పన్నుల శాఖలో ఉన్నాయని గుర్తించింది. ఇదే ఖాతా నుంచి గుత్తేదారుకు రు. 22.88 కోట్లు విడుదల చేసి లబ్ధి కలిగించారని కాగ్ నిర్ధారించింది. నిమ్స్??? వైద్య పరికరాల కొనుగోలుకు రు. 27 కోట్లు కేటాయిస్తే వాటిని సిబ్బంది జీతభత్యాలకు మళ్లించారని, ఇలా పలు శాఖల్లో జరిగిందని పేర్కొంది. అలాగే సామాజిక సేవలకు అధిక ప్రాధాన్యం (40.45 శాతం) దక్కిందని, ఇది సంక్షేమానికి ఎక్కువ ప్రాధాన్యమిస్తున్న విషయాన్ని తెలియజేస్తోందని అభిప్రాయపడింది.

షెడ్యులు కులాలు, షెడ్యులు తెగల అభివృద్ధి కోసం కేటాయిస్తున్న నిధులు పెరిగినప్పటికీ ఖర్చు కావడం లేదు. 2018-19లో ఎస్‌సిల అభివృద్ధికి రు. 16,452 కోట్లు, ఎస్‌టిలకు రు. 9,693 కోట్లను ప్రభుత్వం కేటాయించింది. ఎస్‌సిలకు కేటాయించిన నిధుల్లో 62 శాతం, ఎస్‌సిల నిధుల్లో 52 శాతం ఖర్చు చేయలేదు. 2016-17లో ఎస్‌సిల నిధుల్లో 60 శాతం, ఎస్‌టిల నిధుల్లో 57 శాతం మాత్రమే వ్యయం అయ్యాయి.

నాలుగో నివేదికలో ప్రభుత్వ ద్రవ్య వ్యవహారాలకు సంబంధించి బడ్జెట్ కేటాయింపులను, వ్యయాలను, నిర్వహణను మదింపు చేసినది. అవసరం లేకున్నా అప్పుచేసింది. రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థ, హైదరాబాద్ మెట్రో రైలు లిమిటెడ్, తెలంగాణ తాగు నీటి సరఫరా సంస్థలు భారీ నష్టాలను నమోదు చేశాయి. మొత్తం పిఎస్‌యుల సమగ్ర నష్టాల్లో ప్రధాన వాటా వీటిదే ఉంది. కాళేశ్వరం సాగు నీటి ప్రాజెక్టు సంస్థ తక్షణ అవసరం లేకున్నా రు. 539.56 కోట్ల అధిక రుణం తీసుకోవడం వల్ల రు. 8.51 కోట్ల వడ్డీ ఎక్కువగా చెల్లించాల్సి వచ్చిందని కాగ్ పేర్కొంది.

తెలంగాణ రాష్ట్ర పారిశ్రామిక మౌలిక సదుపాయాల సంస్థ నిబంధనల ఉల్లఘించి తక్కువ ధరకే ఓ ప్రైవేట్ సంస్థకు భూమి విక్రయించడం వల్ల 4.47 కోట్లు నష్టం వాటిల్లిందని కాగ్ తెలిపింది. పన్ను పరిధిలోకి వచ్చే ఆదాయన్ని వాస్తవికంగా అంచనా వేయకపోవడం, పన్ను రిటర్నులు ఆలస్యంగా దాఖలు చేయడం కారణంగా ముందస్తు పన్ను చెల్లించడంలో ఐదు ప్రభుత్వ రంగ సంస్థలు విఫలమైనందున రు. 20.34 కోట్ల జరిమానాలు, వడ్డీ చెల్లించాల్సి వచ్చినట్లు కాగ్ వెల్లడించింది. రాష్ట్రంలో పెట్టుబడి వ్యయం తగ్గుతుండగా రెవెన్యూ వ్యయం పెరుగుతోంది. 2018-19లో రెవెన్యూ వ్యయం పెరగడానికి రైతుబంధు కారణమని కాగ్ అభిప్రాయపడింది. రైతుబంధు కారణంగా వ్యవసాయానికి తలసరి ఖర్చుకు అగ్ర ప్రాధాన్యం దక్కింది.

ఐదో నివేదికలో వివిధ శాఖల కింద ఉన్న ప్రభుత్వ రంగ సంస్థల పనితీరుకు సంబంధించినది. ఇందులో విద్యుత్ రంగం గురించీ, కాళేశ్వరం ఇరిగేషన్ ప్రాజెక్ట్ కార్పొరేషన్ లిమిటెడ్ గురించీ చర్చించారు. విద్యుత్ రంగ సంస్థల పనితీరుపై అధ్యయనం చేసిన కాగ్ 2014 నుంచి 2019 మధ్య నష్టాలు పెరిగినట్లు తెలిపింది. 2018-19లో విద్యుత్ పిఎస్‌యులు మొత్తం టర్నోవర్ రు. 66,979.90 కోట్లుగా ఉండగా ఇది తెలంగాణ జిఎస్‌డిపిలో 7.78 శాతానికి సమానమని పేర్కొంది. ఈ 8 పిఎస్‌యులు 2014-15లో 1,907.03 కోట్ల నష్టాలతో ఉండగా 2018-19లో నష్టాలు 5,433 కోట్లకు పెరిగినట్లు వెల్లడించింది. సింగరేణి కాలరీస్, జెన్‌కో, ట్రాన్స్‌కో సంస్థలు 5,287.60 కోట్ల లాభాలను ఆర్జించినట్లు కాగ్ వెల్లడించింది. టిఎస్ఎస్‌పిడిఎల్, ఎన్‌పిడిసిఎల్ ఈ రెండు సంస్థలు 8,018.70 కోట్ల నష్టాన్ని చవి చూసినట్లు పేర్కొంది.

2014-19 మధ్య విద్యుత్ రంగ పిఎస్‌యులలో పెట్టుబడిపై వాస్తవ రాబడి రేటు ప్రతికూలంగా 10.23 శాతం నుంచి 17.64 శాతం మధ్యలోఉన్నట్లు వెల్లడించింది. ఇదే ఐదు సంవత్సరాల్లో డిస్కంల భారీ నష్టాలు చవిచూడడం వల్లే విద్యుత్ రంగ సంస్థలు మొత్తంగా నష్టాలను చవిచూశాయని కాగ్ అభిప్రాయపడింది. విద్యుత్ రంగ పిఎస్‌యులలో మూలధన పెట్టుబడి 17,770.46 కోట్లని, పేరుకుపోయిన నష్టాలు 28,426.43 కోట్లని, వాటి నికర విలువ రు. 10,655.97 కోట్ల ఋణాత్మకంగాఉన్నట్లు పేర్కొంది. టిఎస్ ట్రాన్స్‌కో 2016 డిసెంబర్ నుంచి 2019 మార్చ్ వరకు బట్వాడా విధానమునకు కట్టుబడకపోవడం వల్ల రాష్ట్ర డిస్కంలు 44.67 కోట్లు నివారించదగిన అదనపు వ్యయం వచ్చిందని పేర్కొంది కాగ్.

74 విద్యుత్తేతర ప్రభుత్వ రంగ సంస్థల్లో 20 నిష్క్రియంగా ఉన్నట్లు కాగ్ పేర్కొంది. మిగిలిన 54 పిఎస్‌యులలో 51 ప్రభుత్వ కంపెనీలు 3 శాసనబద్ధ సంస్థలున్నాయి. 2018-19 సంవత్సరంలో వీటి మొత్తం టర్నోవర్ 17,279.16 కోట్లు కాగా ఇందులో రాష్ట్ర ప్రభుత్వం పెట్టుబడి 29,083.42 కోట్లు ఉన్నట్లు తెలిపింది. క్రియాశీలకంగా ఉన్న ఈ 54 పిఎస్‌యులకు 2014-19 మధ్యలో 4,238.79 కోట్ల నష్టాలు వచ్చాయి. తెలంగాణ రాష్ట్ర గిడ్డంగుల సంస్థ 57.39 కోట్లు, రాష్ట్ర అటవీ అభివృద్ధి సంస్థ 47.36 కోట్లు, రాష్ట్ర ఖనిజాభివృద్ధి సంస్థ 22.54 కోట్లు, రాష్ట్ర సాంకేతిక సేవల సంస్థ 12.43 కోట్లు లెక్కల లాభాలను ఆర్జించగా, రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థ ప్రణాళిక లోపించి 928.66 కోట్ల నష్టాలను నమోదు చేసినట్లు కాగ్ పరిశీలనలో వెల్లడైంది.

రాష్ట్ర ప్రభుత్వం 2014-19 నడుమ ప్రధాన ప్రాజెక్టులపై రు. 1,01,877 కోట్లు ఖర్చు పెట్టింది. అయితే మొత్తం 26 ప్రాజెక్టుల్లో 20 ప్రాజెక్టులు జాప్యమయ్యాయి. పర్యవసానంగా ప్రాజెక్టుల అంచనా వ్యయం రు. 1,87,848 కోట్లకు పెరిగిందని, తద్వారా ఆశించిన ప్రయోజనాలు, ఆర్థికవృద్ధి అందకుండా పోయాయని కాగ్ అభిప్రాయపడింది. ఇక ప్రభుత్వం పూచీకత్తుగా ఉన్న అప్పుల్లో 65 శాతం మేర మిషన్ భగీరథ, కాళేశ్వరం ప్రాజెక్టులవేనని కాగ్ తెలిపింది. కాళేశ్వరం ప్రాజెక్టుకు రు. 27,990 కోట్లు పూచీకత్తు ఇవ్వగా మిషన్ భగీరథ కోసం తెలంగాణ వాటర్ సప్లై కార్పొరేషన్‌కు రు. 23,014 కోట్ల మేర పూచీకత్తు ఇచ్చినట్లు వెల్లడించింది. మిషన్ భగీరథ లాంటి పథకాలకు మాత్రం బడ్జెట్ కంటే ఎక్కువే ప్రభుత్వం ఖర్చు చేసిందని కాగ్ తెలిపింది.

ప్రధాన ప్రాజెక్టుల విషయంలో బడ్జెట్ కేటాయింపులకు, చేసే ఖర్చులకు పొంతన లేదు. 2017-18లో పాలమూరు - రంగారెడ్డి

ఎత్తిపోతల పథకానికి బడ్జెట్‌లో రు. 11,010 కోట్లు ప్రతిపాదించగా వాస్తవంగా ఖర్చు చేసింది మాత్రం రు. 709 కోట్లు (6.43 శాతం) మాత్రమే. అదే సంవత్సరం వడ్డీలేని రుణాల కింద బడ్జెట్‌లో రు. 265 కోట్లు కేటాయించి అందులో ఒక్క పైసా కూడా ఖర్చు చేయలేదు. అదే సంవత్సరం వరంగల్, కరీంనగర్, రామగుండం, నిజామాబాద్ పురపాలక సంస్థలకు బడ్జెట్‌లో రు. 700 కోట్లు పెట్టినా సుమారు రు. 100 కోట్లే ఖర్చు చేసింది.

సాగునీటి పారుదల, వరదల నియంత్రణకు బడ్జెట్ కేటాయింపులు అంతకు ముందు సంవత్సరంతో పోలిస్తే 2018-19లో తగ్గాయి. సాగునీటి పారుదల రంగంపై పెడుతున్న భారీ పెట్టుబడుల వల్ల ఏర్పడ్డ ప్రయోజనాలను మదింపు చేసి వాటి ఫలితాలను సంకలనం చేయాల్సిన అవసరం ఉందని కాగ్ అభిప్రాయపడింది. శ్రీశైలం ఎడమగట్టు కాల్వలో భాగమైన దిండి జలాశయ ప్రాజెక్టులో పనులు ఆలస్యంగా ప్రారంభించడం వలన రు. 76.86 కోట్ల మేర అదనపు వ్యయాన్ని ప్రభుత్వం భరించాల్సిన పరిస్థితి ఏర్పడిందని కాగ్ తెలిపింది. మొబిలైజేషన్ అడ్వాన్సులను తిరిగి వసూలు చేయడంలో వైఫల్యం కారణంగా రు. 429 కోట్లు వసూలు కాలేదని ఆడిట్‌లో గుర్తించింది.

ఖమ్మం జిల్లా రాజీవ్‌సాగర్ దుమ్ముగూడెం ఎత్తిపోతల ప్రాజెక్టులో మొబిలైజేషన్ అడ్వాన్సును కాంట్రాక్టర్ల నుంచి ప్రభుత్వం వసూలు చేయలేకపోయింది. రు. 276 కోట్ల మొబిలైజేషన్ అడ్వాన్సును, దానిపై వడ్డీనీ వసూలు చేస్తామని ప్రభుత్వం పేర్కొన్నా 2019 జూన్ నాటికి దానిపై ఎలాంటి సమాచారం రాలేదని కాగ్ పేర్కొంది. ఆరో నివేదిక రెవెన్యూ రంగపు పనితీరును చర్చించింది. రాష్ట్ర ప్రభుత్వం చెల్లించాల్సిన అప్పు 2019 మార్చి నాటికి 1,65,164 కోట్లకు చేరుకుంది. అంతకు ముందు ఏడాదితో పోలిస్తే పెరుగుదల 16 శాతం ఎక్కువ. వడ్డీ చెల్లింపులు రెవెన్యూ రాబడులను హరిస్తున్నట్టు కాగ్ ఆందోళన వ్యక్తం చేసింది. వచ్చే ఏడేళ్లలో రు. 76,262 కోట్ల రుణాలను చెల్లించాల్సి ఉందని పేర్కొంది.

ఏడో నివేదికలో సాధారణ, సాంఘిక, ఆర్థిక సేవా రంగాల గణాంకాలను మదింపు చేసింది. నియోజకవర్గ అభివృద్ధి కార్యక్రమంలో నిధులు ఖర్చు చేస్తున్నా వినియోగ పత్రాల సమర్పణ మాత్రం సరిగా ఉండట్లేదు. దీంతో నిధుల ఖర్చుపై అవగాహన లేకుండా పోయిందని తెలిపింది. ప్రభుత్వరంగ సంస్థలకు రుణాలు ఇచ్చేముందు వాటికున్న సామర్థ్యాన్ని ప్రభుత్వం నమోదు చేయాలని సూచించింది. ఆర్‌బిఐ వద్ద రాష్ట్ర ప్రభుత్వం విధిగా నిర్వహించాల్సిన రోజువారీ కనీస నిల్వ (రు. 1.38 కోట్లు) 197 రోజులు మాత్రమే నిర్వహించగలిగినట్టు పేర్కొంది. రాష్ట్ర ప్రభుత్వంలో ఆర్థిక క్రమశిక్షణ లోపించిందని ఆ నివేదికలో కాగ్ విమర్శించింది. ప్రభుత్వం బడ్జెట్ కేటాయింపులు లేకుండా ఖర్చుపెడుతోందని ప్రభుత్వ ప్రతిష్ఠాత్మక పథకాలకు మాత్రం కేటాయింపులకు అనుగుణంగా నిధుల విడుదల, ఖర్చు చేయడం లేదని తెలిపింది. కాగ్ విడుదల చేసిన ఏడు నివేదికల్లో రాష్ట్ర ప్రభుత్వం అంకెల గారడీని, డొల్లతనాన్ని, దుబారాను ఎత్తి పట్టింది.

**ముగింపు :**

సాంకేతికంగా కాగ్ నివేదికలు ఒక రకమైన శవపరీక్షల లాంటివి. ఈ శవపరీక్ష ద్వారా జరిగిపోయిన తప్పులను సరిదిద్దలేం, కోల్పోయిన ఆదాయాలను, దుబారా చేసిన వ్యయాలను తిరిగి పునరుద్ధరించలేం. కాని మొత్తంగా ప్రజా ధనానికి ఎంత నష్టం జరిగిందో తెలుసుకోవడానికి వీలుంది. ప్రభుత్వం ఆర్థిక వ్యవస్థ నిర్వహణలో ఎంత అరాచకంగా ఉందో తెలుసుకోవడానికి ఈ నివేదికలు ఉపయోగపడతాయి. నిజానికి ఈ నివేదికల పరమార్థం ఏమిటి? చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకోమని చెప్పడం కాదు.

గత నివేదికల ఆధారంగా ఆర్థిక అవకతవకలను సరిదిద్దుకోవాలని చెప్పడం. నివేదికలపై చర్చించడని హెచ్చరించడం. ఇప్పటికైనా ఆర్థిక క్రమశిక్షణ గుర్తించమనడం. క్రమశిక్షణ లేని ఆర్థిక వ్యవహారాలపై దృష్టి మళ్లించండని కోరడం ప్రభుత్వ విచక్షణారహిత విధానాలను సమీక్షించండని అక్షింతలు వేయడం. స్వీయనియంత్రణతో ఆర్థికాభివృద్ధికి, నిజాయతీగా వ్యవహరించండని బోధించడం. పొంతనలేని వ్యయాలతో జవాబుదారీతనం లేని నిర్లక్ష్యానికి స్వస్తిపలకండని ప్రబోధించడం కానీ ఈ ప్రబోధాన్ని, కాగ్ ఈ పరోక్ష హెచ్చరికల్ని చెవిన పెట్టువారెవరు. ప్రజా ధనానికి కాపులకాయాల్సిన ప్రజా ప్రతినిధులు అవినీతిపరులై దోచుకున్నపుడు. కాగ్ నివేదికలు కాగితపు పులి గాండ్రింపులుగానే మిగులుతాయి తప్ప ఆచరణకు నోచుకోవు.

చట్టసభల్లోని ప్రజా ప్రతినిధులు నిజంగా చర్చిస్తే, ప్రభుత్వ అక్రమాలను నిలదీస్తే, భవిష్యత్తులో అటువంటి తప్పులు మళ్లీ జరిగే అవకాశం లేకుండా చూడవచ్చు. కానీ ప్రతిపక్షమే లేని చట్టసభల్లో స్వపక్షం కళ్లు, నోరు మూసుకుని తన కాలాన్ని పూర్తిచేసుకో జూస్తుంది కాని, కనీస వాస్తవాలను గ్రహించలేని అంధకారంలో ఉండడం ప్రజాస్వామ్యంలో అత్యంత విచారకరం.

*(రచయిత అసిస్టెంట్ ప్రొఫెసర్, తెలంగాణ విశ్వవిద్యాలయం)* వీ

*(.. 4వ పేజీ తరువాయి)*

*అన్ని వ్యాసాలు పాఠకులకు సామాజిక అవగాహనను పెంచేవిగా ఉన్నాయి. ముఖ్యంగా సంపాదకీయంలో చెప్పినట్లుగా కేంద్రం చేపడుతున్న ప్రభుత్వ విధానాలు ప్రజలకు రాబోయే కాలంలో అనేక ఇబ్బందులకు గురిచేసే అవకాశం ఉంది. ఇప్పటి వరకు ఎంతో కొంత ప్రజలకు ఉపయోగపడుతున్న 'ప్రభుత్వ రంగం' అనే ప్రజారంగ సంస్థలను ప్రైవేటీకరణ పేరుతో కొద్ది మంది వ్యక్తులకు, ప్రైవేట్ రంగ సంస్థలకు అప్పగించడం వల్ల భవిష్యత్తులో భారతదేశంలో ప్రభుత్వ రంగ సంస్థలు చాలమట్టుకు మూతపడే అవకాశం ఉంది. ఈ ప్రజారంగ సంస్థలను కాపాడుకోవలసిన అవసరం ప్రజలకు ఉంది. సామాన్య ప్రజల సంక్షేమాన్ని దృష్టిలో ఉంచుకొని ప్రభుత్వాలు సంస్కరణలు చేపట్టాలి కాని సంపన్నులను ఉద్ధరించడానికి కాదు. ముఖ్యంగా దేశంలోని సంపదను, సహజ వనరులను కార్పొరేట్ సంస్థలకు కట్టబెట్టే ప్రయత్నాలకు ప్రజలు అడ్డుకట్ట వేయవలసిన అవసరం ఉంది. అదే మాదిరిగా ప్రజాస్వామ్య దేశంలో ప్రజలకు ప్రభుత్వ విధానాలు నచ్చని పరిస్థితులలో నిరసన తెలిపే హక్కు ఉంటుంది. ఇందులో భాగంగా ఉద్యమాలు చేస్తున్న రైతులు, రచయితలు, కవులు, కార్మికులు, మేధావులపైన కక్ష సాధింపు చర్యలు చేపట్టడంలు ప్రజాస్వామ్యానికి ప్రమాదకరం.*

**– బోరెడ్డి మధుసూదన్‌రెడ్డి**
సిద్దిపేట

# ధీమాలేని బీమా

*ప్రైవేటు పెట్టుబడిదారులను బీమా రంగంలోకి ఆహ్వానించడమంటే ప్రజలు దాచుకున్న సొమ్ము భద్రతను ప్రమాదంలోకి నెట్టినట్లేనని అంటున్నారు* **ఆర్. లక్ష్మి**

'జీవిత బీమా' సంస్థ 1956లో ప్రత్యేక చట్టం ద్వారా 'ప్రభుత్వ రంగ సంస్థ' అయింది. ఈనాటికీ నూటికి నూరు శాతం ప్రభుత్వ రంగ సంస్థగానే మూడు పువ్వులు – ఆరు కాయలుగా దూసుకుపోతోంది. 1956లో ఈ సంస్థలో ప్రభుత్వ పెట్టుబడి రు. 5 కోట్లు. తరువాత ప్రభుత్వం ఈ సంస్థలో పెట్టుబడి పెట్టింది ఏమీ లేదు.

ఎల్ఐసి సంస్థ స్వయంగా రు. 32 లక్షల కోట్ల ఆస్తులు సంపాదించుకున్నది. రు. 100 కోట్ల మూలధనం ఉంది. ఈ సంస్థకు ఉన్న రిజర్వు నిధుల ప్రకారం సాలీనా రు. 3.5 లక్షల కోట్ల నుండి రు. 4.5 లక్షల కోట్ల వరకు పెట్టుబడి పెట్టగల సామర్థ్యం ఉంది.

ఎల్ఐసి భౌతిక ఆస్తుల విలువ బ్యాలెన్స్ షీట్ ప్రకారం రు. 2,500 కోట్లు మాత్రమే. కానీ మార్కెట్ విలువ మరిన్ని రెట్లు అధికం. ముంబైలో ఉన్న ఆఫీస్ మార్కెట్ విలువే రు. 2,000 కోట్ల వరకు ఉంటుందని అంచనా. ఈ ఒక్క అంశం ఆధారంగానే సంస్థ మొత్తం విలువను అంచనా వేయవచ్చు.

ఇక 'పారదర్శకత' విషయంలోనూ ఎల్ఐసి తన ప్రత్యేకతను చాటుకుంది. సెంట్రల్ ఇన్ఫర్మేషన్ కమిషన్ నిర్వహించిన ట్రాన్స్‌పరెన్సీ ఆడిట్‌లో ఎల్ఐసి 97 శాతం పారదర్శకతతో 'ఎ' గ్రేడ్‌లో నిలబడింది. కారణం – సంస్థ బోర్డు ప్రతి త్రైమాసికానికి ఒకసారి సంస్థ పనితీరును బహిరంగ ప్రకటనల ద్వారా వెల్లడిస్తుంది. ప్రతి నెలా ఐఆర్‌డిఎకు ఇన్సూరెన్స్ రెగ్యులేటరీ తన పనితీరుకు సంబంధించి నివేదికలు పంపుతుంది. జమా ఖర్చులు, లెడ్జర్లు నిర్వహిస్తూ పార్లమెంట్ పరిశీలనకు సైతం సదా సంసిద్ధంగా ఉంచుతుంది.

ఈ సంస్థ నిరర్థక ఆస్తులు 1 శాతానికి లోపే. ఏనాడో ప్రభుత్వం పెట్టుబడిగా పెట్టిన రు. 5 కోట్ల మూలధనానికి ఇటీవలి వరకు సంస్థ డివిడెండ్ల రూపంలో చెల్లించిన సొమ్మే రు. 2,600 కోట్లకు పైగా ఉంటుంది. పన్నుల రూపేణా చెల్లించినది మరో రు. 10,000 కోట్లు. ఇవిగాక గృహ నిర్మాణం, నీటిపారుదల వంటి సంక్షేమ కార్యక్రమాలలోనూ విస్తారంగా నిధులను అందిస్తూ చేయూతగా ఉంటోంది. అటువంటి సంస్థను కొద్ది కొద్దిగా అమ్మివేసే ఉద్దేశంతో చట్ట సవరణ కూడా తేవడం అంటే ప్రజల నమ్మకాన్ని దుర్వినియోగం చేయడమే.

కారణం – జీవిత బీమా సంస్థ ఇంతగా విస్తరించి వెలుగొందడానికి మూలం దేశ పౌరులే. సామాన్యుడి భవిష్యత్తుకు ధీమా కల్పిస్తున్న కారణంగానే క్రమక్రమంగా నమ్మకం కుదిరి పాలసీదారుల సంఖ్య పెరగడం, తద్వారా సంస్థ వ్యాపారం పెరగడం, తద్వారా ఆస్తులు పెరగడం వంటివన్నీ దశాబ్దాల పరిణామ క్రమంలో జరిగాయి. ఇప్పుడు కళ్లుచెదిరే ఆ ఆస్తుల గురించి, నిధుల గురించి సంస్థనే అమ్మడానికి నిర్ణయించడమంటే పాలసీదారుల ప్రయోజనాలను పణంగా పెట్టినట్లే.

**ప్రజా ప్రయోజనాల విషయానికి వస్తే** – జీవిత బీమా సంస్థలో పాలసీదారుల సంఖ్య 29 కోట్లు. గ్రూప్ ఇన్సూరెన్స్ మరో 11 కోట్లు. సంస్థ మిగులు నిధులతో 5 శాతం ప్రభుత్వానికి డివిడెంట్‌గా ఇస్తోంది. మిగిలిన 95 శాతం పాలసీదారులకు బోనస్ రూపంలో చెల్లిస్తోంది. సంస్థ మొత్తం ఆస్తులు 31 లక్షల కోట్లు. లైఫ్ ఫండ్ 28 లక్షల కోట్లకు పైమాటే. అంటే వెంటనే మొత్తం పాలసీదారుల క్లెయిమ్స్ చెల్లించవలసి వచ్చినా ఏమాత్రం ఆర్థిక ఇబ్బందులు తలెత్తవు. ఈ సంస్థ పొరు బాకీలు సైతం చాలా తక్కువ. సంస్థ మొత్తం ఆస్తుల్లో 1 శాతానికి లోపే (0.8 శాతం).

పాలసీదారుల క్లెయిమ్‌ల చెల్లింపులలోనూ ప్రైవేట్ బీమా సంస్థలకన్న జీవిత బీమా సంస్థ అగ్ర స్థానంలో ఉంది. ప్రైవేట్ బీమా రంగంలో చెల్లింపులలో తిరస్కరణకు గురవుతున్న క్లెయిమ్‌లు 2.83 శాతం ఉండగా, ఎల్ఐసిలో అది 0.43 శాతం మాత్రమే. 1990 లలో ప్రారంభమైన ఆర్థిక సంస్కరణల నేపథ్యంలో జీవిత బీమా సంస్థలోనూ లిబరలైజేషన్ ప్రక్రియ మొదలైంది. ఇటువంటి వాతావరణంలోనూ – ప్రైవేట్ బీమా సంస్థల నుండి ఎదురైన గట్టి పోటీని తట్టుకొని దేశంలోని బీమా రంగంలో ఎల్ఐసి ఇప్పటికి 73 శాతం వాటాతో అగ్రగామిగా కొనసాగుతోందంటే కారణం పాలసీదారుల విశ్వాసాన్ని చూరగొనగలగడమే. దానికి కారణం ఉంది.

ఎల్ఐసి పెట్టుబడుల్లో అత్యధిక శాతం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ సంస్థలలోనే ఉంటాయి. 2019 నాటికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ సంస్థలలో ఎల్ఐసి పెట్టుబడులు సుమారు 25 లక్షల కోట్లు. మొత్తం పెట్టుబడులు 29.84 లక్షల కోట్లలో ఇవి 82 శాతం అంటే ఈ 82 శాతం పెట్టుబడులు వాపసు గ్యారంటీ ఉన్న పెట్టుబడులన్న మాట. ప్రజల సొమ్ము – ప్రజల భద్రత, ప్రజల సంక్షేమం అన్న అంశాలను ప్రాతిపదికగా చేసుకున్న కారణంగానే సంస్థ పెట్టుబడుల విషయంలో అంత ఆచితూచి వ్యవహరిస్తుంది.

2008 నాటి ఆర్థిక మాంద్యంలో దెబ్బతిన్న సంస్థలలో బీమా సంస్థలూ ఉన్నాయి. అనంతర కాలంలో ప్రైవేట్ బీమా సంస్థల నిర్వహణ వ్యయాలు 17.5 శాతం వరకు పెరిగిపోగా, తద్విరుద్ధంగా ఎల్ఐసి నిర్వహణ ఖర్చులు 3 శాతానికి పైగా తగ్గాయి. ఆర్థిక రంగంలో చోటుచేసుకుంటున్న మార్పులు, పరిణామాలను నిరంతరం అప్రమత్తతతో, జాగరూకతతో గమనిస్తూ తదనుగుణంగా మార్పులు, చేర్పులతో వ్యవహరిస్తూ పోవడం వల్లనే ఇదంతా సాధ్యపడింది.

**వివిధ కమిటీలు – సిఫార్సులు** – పి.వి. నరసింహారావు హయాంలో మల్హోత్రా కమిటీ ఎల్ఐసిలో మూల ధనాన్ని 50 శాతానికి తగ్గించి మిగిలిన శాతాన్ని పెట్టుబడులుగా స్వీకరించాలని సూచించింది.

వాజపేయి హయాంలో నియమించబడిన డెలాయిట్ కన్సల్టెన్సీ

# రిటైర్మెంట్ వయస్సు పెంపు ఎవరికి ప్రయోజనం ?

*రాష్ట్రంలో నిరుద్యోగం పెచ్చరిల్లిపోతుండగా ఉద్యోగుల విరమణ వయస్సు పెంచి, యువతకు ఉపాధి కల్పించడం అసాధ్యమని అంటున్నారు* **డి. శ్రీనివాసులు**

తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం ప్రభుత్వ ఉద్యోగుల రిటైర్మెంట్ వయస్సును 61 సంవత్సరాలకు పెంచుతూ రాష్ట్ర శాసనసభలో ఉద్యోగ విరమణ వయస్సు సవరణ చట్టం 3/2021 చేసి 30 మార్చి 2021 నుండి అమలయ్యే విధంగా ఉత్తర్వులు వెలువరించింది. ఈ ఉత్తర్వులవల్ల ఉద్యోగ వర్గాలలో మిశ్రమ స్పందన వెలువడినా, నిరుద్యోగ యువతలో ఆగ్రహావేశాలను నింపింది. సాధారణ ప్రజలలో ప్రభుత్వ ఉద్యోగుల పట్ల అసూయను పెంచింది. ప్రభుత్వ ఉద్యోగులు, నిరుద్యోగుల మధ్యన వైషమ్యాలు పెంచింది. నిరుద్యోగుల దృష్టిలో ఉద్యోగులను స్వార్థపరులుగా, దోషులుగా ముద్ర వేసింది. లక్షలాది ఉద్యోగాలు ఖాళీగా ఉన్నా నింపకుండా నిరుద్యోగులను మోసగిస్తున్న ప్రభుత్వం తన వైఫల్యాన్ని కప్పి పెడుతూ, నెపాన్ని ఉద్యోగుల మీదకు నెట్టి, కేవలం ఉద్యోగ విరమణ వయస్సు పెంపు మూలంగానే నియామకాలు ఆగిపోతాయి అనే అపోహలు పెరిగి ప్రభుత్వోద్యోగులను నిందించే విధంగా పరిస్థితులు కల్పించింది.

రిటైర్మెంట్ వయసు పెంచడం ప్రతిపాదన ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో రాజశేఖర్ రెడ్డి ముఖ్యమంత్రిగా, రోశయ్య ఆర్థిక మంత్రిగా ఉన్న కాలం నాటి నుండి ఉంది. ఆనాడు ఉన్న రాష్ట్ర దుర్బల ఆర్థిక స్థితి దృష్ట్యా రిటైర్మెంట్ సమయంలో ఉద్యోగులకు చెల్లించవలసిన బెనిఫిట్స్ గ్రాట్యుటీ, కమ్యుటేషన్, లీవ్ ఎన్ క్యాష్‌మెంట్ మొదలైనవి చెల్లించలేని దశలో అట్టి చెల్లింపులు వాయిదా వేయడంలో భాగంగా రిటైర్మెంట్ వయసు పెంపు ద్వారా ఆర్థిక భారాన్ని వాయిదా వేసే ఆలోచన చేశారు. కానీ నిరుద్యోగ వర్గాల నుంచి వచ్చిన ఒత్తిడిని ఫీడ్ బ్యాక్‌గా తీసుకుని వయసు పెంపు ఆలోచన విరమించుకున్నారు. అంతకు పూర్వం 1983లో కూడా తెలుగుదేశం మొదటిసారిగా అధికారంలోకి వచ్చి ఎన్‌టిఆర్ ముఖ్యమంత్రిగా, నాదెండ్ల భాస్కర్ రావు ఆర్థికశాఖ మంత్రిగా ఉన్న సమయంలో రిటైర్మెంట్ వయసు మార్పు దుమారం రేగింది. 1983లో మొదటిసారి ముఖ్యమంత్రి పదవి చేపట్టిన ఎన్.టి.ఆర్ అప్పటికే 58 సంవత్సరాలుగా ఉన్న ఉద్యోగ విరమణ వయసు 55కు కుదిస్తూ 16 ఫిబ్రవరి1983న ఉత్తర్వులిస్తూ ఆ రోజువరకు 55 సంవత్సరాల పైబడిన ఉద్యోగులందరూ 28 ఫిబ్రవరి 1983 సాయంత్రం నిర్బంధ ఉద్యోగ విరమణ చెయ్యాలని ఆదేశించారు. ఉద్యోగ వర్గాల్లో రిటైర్మెంట్ వయస్సు తగ్గింపు కలకలం లేపింది. ఆనాడు రాష్ట్రంలో ఉన్న నిరుద్యోగితను కారణంగా చూపుతూ యువతకు ఉద్యోగాలు కల్పించాలంటే 55 సంవత్సరాల పైబడిన వారిని ఉద్యోగం నుండి తప్పించడం అనివార్యమని తెలుగుదేశం ప్రభుత్వం ప్రకటించింది. 55 సంవత్సరాల పైబడిన వారితో పనిచేయించుకుని యువతను ఖాళీగా కూర్చోబెట్టడం సబబుగా లేదని, యువతకు ఉద్యాగాలు కల్పించడం సముచితంగా ఉంటుందని నీతి మాటలు వల్లించారు. ఈ ఉత్తర్వులపై చాలా దుమారం రేగింది. ఉద్యోగ వర్గాలు ప్రభుత్వం పై దుమ్మెత్తి పోశాయి. ఉద్యోగ వర్గాల నుండి, విపక్షాల నుండి తీవ్ర వత్తిడి వచ్చింది.

1984 ఆగస్టులో ఆర్థిక మంత్రిగా ఉన్న నాదెండ్ల భాస్కర్ రావు అదును చూసి ఎన్.టి.ఆర్ ప్రభుత్వాన్ని కులదోసి 16 ఆగస్టు 1984న అడ్డదారిలో అప్రజాస్వామికంగా ముఖ్యమంత్రి అయ్యారు. ఎన్.టి.ఆర్. మీద అభిమానం ఉన్న ప్రజలు, కింది స్థాయి తెలుగుదేశం నాయకత్వం తిరగబడింది. రాష్ట్రంలో అనిశ్చితి ఏర్పడింది. పరిపాలన అస్తవ్యస్తంగా మారింది. ఈ సందర్భంలో అధికారగణం, ఉద్యోగులను శాంతపరచి తనవైపు తిప్పుకోవడానికి ముఖ్యమంత్రి నాదెండ్ల భాస్కర్ రావు ఆర్డినెన్సు 24/1984 ద్వారా 23 ఆగస్టు 1984న ఉద్యోగ విరమణ వయస్సును

---

ఎల్ఐసిని అత్యున్నత స్థాయి కార్పొరేట్ నమూనాగా తీర్చిదిద్దడానికి అనువుగా అధిక మొత్తంలో పెట్టుబడులను ఉపసంహరించి ప్రైవేట్ పెట్టుబడులను ఆహ్వానించాలని సలహా ఇచ్చింది. అయితే అప్పటి స్థితిగతులు, వాతావరణం వేరు. ముఖ్యంగా గడిచిన 30 సంవత్సరాలలో సంస్థ అనూహ్యమైన రీతిలో అభివృద్ధి సాధించింది.

**అన్నీ కుంటిసాకులే** – ప్రైవేట్ పెట్టుబడుల కారణంగా సంస్థ పనితీరు మెరుగుపడుతుంది. సామాన్యుడు వాటాదారు అవుతాడు. పనితీరు విషయానికి వస్తే ఎల్ఐసి అన్ని బీమా సంస్థల కంటే ముందు వరుసలో ఉందన్న విషయాన్ని పై అంశాలన్నీ స్పష్టం చేస్తున్నాయి. ఔత్సాహికులో, జిజ్ఞాసువులో అయిన ఏ కొద్దిమందో తప్ప సాధారణ పౌరులెవరూ తమ కష్టార్జితాన్ని పణంగా పెట్టిన దృష్టాంతాలేవీ స్టాక్ మార్కెట్ చరిత్రలో లేవు. కుబేరుల సంగతి వేరు.

2020 ఆర్థిక సంవత్సరం చివరకు 40 కోట్ల పాలసీదారులు ఉన్న ఎల్ఐసికి 1956 నాటి బీమా చట్టం ప్రకారం ప్రభుత్వం ధర్మకర్తే కాని, వ్యాపారం తన పనికాదని చేతులు దులుపుకోవడానికి ఎల్ఐసి ప్రభుత్వంలోని వ్యక్తుల స్వంత వ్యాపార సంస్థ కాదు.

ప్రజల సొమ్ము భద్రత తీసుకున్నా – ఆ సొమ్మును వినియోగించడంలో ఎల్ఐసి తీసుకుంటున్న జాగ్రత్తలన్నీ పైన చర్చించడం జరిగింది. ఇకపోతే క్లెయిమ్సు పరిష్కారానికి సంబంధించిన ప్రస్తావన వస్తే – క్లెయిమ్సు పరిష్కారానికి సంబంధించిన 30కి పైగా క్లాజులలో ఎల్ఐసి ఇంచుమించు అన్ని క్లాజులు/సందర్భాలను కవర్ చేస్తుండగా, వివిధ ప్రైవేట్ బీమా సంస్థలు వాటి వాటి లెక్కలు లాభ నష్టాల బేరీజుల ఆధారంగా కొన్ని క్లాజులను మినహాయిస్తున్నాయి. ఆ సమాచారాన్ని నిశితంగా పరిశీలించినా ప్రైవేట్ రంగాన్ని బీమా రంగం (ఎల్ఐసి) లోకి ఆహ్వానించడం తమ భవిష్యత్తుకు సంబంధించిన ప్రణాళికలకై ధీమా నిమిత్తం జీవిత బీమాలో ప్రజలు దాచుకుంటున్న సొమ్ము భద్రతను ప్రమాదంలోకి నెట్టినట్లే. వీ

*(రచయిత సామాజిక కార్యకర్త)*

మళ్లీ 58 సంవత్సరాలకు పెంచారు. ఉద్యోగ విరమణ వయసు 58 నుండి 55కు తగ్గిస్తున్నప్పుడు నిరుద్యోగితను కారణంగా చూపిన ఆర్థిక శాఖ మంత్రి నాదెండ్ల భాస్కరరావు తాను ముఖ్యమంత్రి కాగానే యూ టర్న్ తీసుకుని ఉద్యోగులను ప్రసన్నం చేసుకోవడానికి రిటైర్మెంట్ వయసు మళ్లీ 58కి పెంచారు. ఈ రెండు సందర్భాల్లో కూడా ప్రభుత్వం తాను అమలు చేయాలనుకున్న విధానాలకు సంబంధించి సాకులు వెతుక్కుని, తమ నిర్ణయానికి సాధికారత కల్పించడం కొరకు పాకులాడారే తప్ప సహేతుకంగా నిర్ణయాలు తీసుకుని అమలు చేయలేదు.

తెలంగాణలో ప్రభుత్వ ఉద్యోగుల రిటైర్మెంట్ వయసు పెంపు అనేది ఉద్యోగుల నుండి వచ్చిన డిమాండ్ కాదు. రిటైర్మెంట్ వయసు పెంపు తెలంగాణ రాష్ట్ర సమితి 2019 అసెంబ్లీ ఎన్నికల మేనిఫెస్టోలో పేర్కొన్న 19వ అంశం. అదే మేనిఫెస్టోలో 3వ అంశంగా నిరుద్యోగ యువతకు నెలకు 3016 చొప్పున నిరుద్యోగ భృతి కల్పిస్తామన్నారు. కానీ నిరుద్యోగ భృతిని ఇప్పటి వరకు అమలు చేయలేదు. తెలంగాణ ఉద్యమ కాలంలో, తెలంగాణలో అధికారంలోకి వచ్చి మొదట్లో అనేక హామీలు ఇచ్చిన ప్రస్తుత ముఖ్యమంత్రి ఏ ఒక్క హామీ నిలబెట్టుకోలేక పోయారు. ప్రతి ఇంటికొక ఉద్యోగం, దళితులకు మూడు ఎకరాల భూమి, దళితుడే తెలంగాణ తొలి ముఖ్యమంత్రి, రెండు పడక గదుల ఇళ్లు, ఉద్యోగాల్లో కాంట్రాక్ట్ విధానం రద్దు, కాంట్రిబ్యూటరీ పెన్షన్ విధానం రద్దు లాంటి హామీలు గుప్పిస్తూ ఇందులో ఏది తప్పినా తల నరుక్కుంటానన్నారు. కానీ ఏది జరుగలేదు. తెలంగాణ సబ్బండ వర్గాలు తెలంగాణ ఉద్యమంలో గంపెడాశతో పాల్గొన్నాయి. అందరూ కూడా తెలంగాణ వస్తే తమ బాధలు తీరుతాయని ఎదురు చూశారు. అందరికీ నిరాశే మిగిలింది. హామీలు నెరవేర్చకపోవడం మాత్రమే కాక ఇచ్చిన హామీలను నెరవేర్చమని అడిగే, ప్రశ్నించే గొంతుకల పై నిర్బంధాన్ని ప్రయోగిస్తున్నారు. ప్రజా ఉద్యమం ద్వారా ఏర్పడిన తెలంగాణలో ప్రజలు ప్రజాస్వామికంగా నిరసన తెలిపే హక్కును కోల్పోయారు. తెలంగాణ ఏర్పడిన తర్వాత నిరుద్యోగుల పరిస్థితి పెనం మీద నుండి పొయ్యిలో పడ్డట్టుగా మారిపోయింది.

తెలంగాణ ఉద్యమంలో ఉద్యోగులు, విద్యార్థులు, నిరుద్యోగ యువత కీలక భూమిక పోషించారు. భావజాల వ్యాప్తిలో ఉద్యోగ, ఉపాధ్యాయులు ముందు ఉండగా ఉద్యమం ఉవ్వెత్తున ఎదిగించడంలో విద్యార్థులు, నిరుద్యోగ యువత పని చేసింది. తెలంగాణ వస్తే ఇంటికో ఉద్యోగం అన్న నినాదం నిరుద్యోగ యువతలో ఆశలు రేకెత్తించింది. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో మన బతుకులు ఎలాగు బాగుపడవు, తెలంగాణ వస్తే, తాము కాకపోయినా తమ తరువాత తరాలైనా బాగుపడతాయని.... చివరకు ఆత్మబలిదానాలకు కూడా సిద్ధమై తెలంగాణ ఉద్యమాన్ని విజయ తీరం వైపు నడిపించారు. కానీ తీరా తెలంగాణ వచ్చిన తర్వాత పరిస్థితి తారుమారైంది. ఆంధ్ర పాలకులకు బదులుగా తెలంగాణ పాలకులు అధికారంలోకి వచ్చారు. కానీ పాలనా స్వభావం, పాలన తీరులో ఏమాత్రం మార్పు రాలేదు. దోపిడీదారు మారాడే తప్ప దోపిడీ స్వభావం, దోపిడీ విధానం ఏమాత్రం మారలేదు. ఉద్యమ కాలంలో వెల్లువెత్తిన ప్రజల ఆకాంక్షలు వెనక్కి నెట్టబడ్డాయి. తన వాగ్ధాటితో ప్రజలను మభ్యపెడుతూ నిరంతరం రాజకీయాలు ఎన్నికల చుట్టూ తిప్పుతూ, ఓటు బ్యాంకు రాజకీయాలు నడుపుతూ పాలన సాగిస్తున్నారు. ఈ సందర్భంలో ఉద్యోగ విరమణ వయసు 61 సంవత్సరాలకు పెంచడం కేవలం రాజకీయ ప్రయోజనాల కొరకే కానీ ప్రజల్లో ఏ ఒక్క వర్గానికి ప్రయోజనం చేకూర్చేది కాదు.

ఉద్యోగ విరమణ వయస్సు 61 సంవత్సరాలకు పెంచుతామని 2019 అసెంబ్లీ ఎన్నికలలో హామీ ఇచ్చి, ఇప్పుడు నల్గొండ, హైదరాబాద్ పట్టభద్రుల ఎంఎల్‌సి ఎన్నికల సందర్భంగా అమలుకు శ్రీకారం చుట్టారు. ఈ డిమాండ్ ఉద్యోగ వర్గాల నుంచి వచ్చిన డిమాండ్ కానే కాదు. 61 సంవత్సరాలుగా నిర్ణయించడానికి సరైన హేతుబద్ధత కూడా లేదు. మన నుండి విడిపోయిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఉద్యోగుల రిటైర్మెంట్ వయస్సు 60 సంవత్సరాలకు పెంచింది కాబట్టి భూస్వామ్య ఆధిపత్య భావజాలం ఉన్న తెలంగాణ ముఖ్యమంత్రి వారికన్నా ఒక సంవత్సరం ఎక్కువ చేసి 61 సంవత్సరాలుగా ప్రకటించారు. ఈ నిర్ణయం ఉద్యోగ వర్గాలను కానీ, నిరుద్యోగులను కానీ గమనంలోకి తీసుకుని చేసిన హేతుబద్ధ నిర్ణయం కాదు. ప్రభుత్వం కేవలం ప్రస్తుత ఆర్థిక దుస్థితి నుండి బయటపడడానికి వేసిన ఎత్తుగడ మాత్రమే. ఈ ఉత్తరువు వల్ల మూడు సంవత్సరాల పాటు రాష్ట్రంలో ఎలాంటి ఉద్యోగ విరమణలు ఉండవు కాబట్టి మూడు సంవత్సరాల పాటు ఉద్యోగ విరమణ సందర్భంలో చెల్లించే గ్రాట్యుటీ, కమ్యుటేషన్, లీవ్ ఎన్ క్యాష్‌మెంట్ మొదలైన చెల్లింపులు కూడా ఉండవు. ఈ మూడు సంవత్సరాలలో 2021 మార్చి నుండి డిసెంబర్ వరకు 7,954 మంది, 2022 జనవరి నుండి డిసెంబర్ వరకు 9,213 మంది, 2023 జనవరి నుండి డిసెంబర్ వరకు 9,231 మంది, 2024 జనవరి నుండి ఫిబ్రవరి వరకు 1,700 మంది చొప్పున మొత్తం 28,108 మంది ఉద్యోగుల రిటైర్మెంట్ వాయిదా పడుతుంది. సగటున సంవత్సరానికి 9,300 మందికి రిటైర్మెంట్ చెల్లింపులు వాయిదా వేసి అదే ఖర్చుతో పిఆర్‌సి అమలు చేయడం కోసం ప్రభుత్వం లోపాయకారి నిర్ణయం చేసింది. ప్రభుత్వం ప్రకటించినట్లుగా ప్రజల ఆయుష్షు ప్రమాణాలు పెరగడం వల్ల రిటైర్మెంట్ వయస్సు పెంచామనడం శుద్ధ అబద్ధం. ఇక రెండో పార్శ్వాన్ని పరిశీలిస్తే రిటైర్మెంట్ వయస్సు పెంపు వల్లనే నిరుద్యోగులకు ఉద్యోగాలు రాకుండా పోతున్నాయి అనడం కూడా అర్ధ సత్యమే. ఎందుకంటే రాష్ట్రంలో లక్షా తొంభై ఒక వెయ్యికి పైగా ఉద్యోగాలు ఖాళీగా ఉన్నాయని అని పిఆర్‌సి నివేదిక తెలుపుతుంది. వాటిని భర్తీ చేయడానికి ప్రభుత్వం దగ్గర ఎలాంటి ప్రణాళిక ఇప్పటివరకు లేదు. నిజంగానే నిరుద్యోగులకు న్యాయం చేయదలుచుకుంటే ఉపాధి కల్పించదలుచుకుంటే ఈ ఖాళీలను ఎప్పటికప్పుడు భర్తీ చేయవచ్చు. అలా చేయకుండా ఖాళీలను ఖాళీగానే ఉంచుతూ నిరుద్యోగులను రోడ్లపైనే వదిలేసింది. పైగా ఉద్యోగులకు, నిరుద్యోగులకు మధ్యన రిటైర్మెంట్ వయసు పెంపు చిచ్చుపెట్టింది.

తెలంగాణ రాష్ట్ర పబ్లిక్ సర్వీస్ కమిషన్ (టిఎస్‌పిఎస్‌సి) వెలువరించిన గణాంకాల మేరకు రాష్ట్రంలో ఉద్యోగాల కోసం టిఎస్ పిఎస్‌సి పోర్టల్‌లో రిజిస్టర్ చేయించుకున్న వారు 25 లక్షల మంది కాగా, ఇంకో 10 లక్షల మంది రిజిస్ట్రేషన్ చేయించుకోకుండా ఉన్నారు. మొత్తంగా 35 లక్షల మంది ఉద్యోగార్థులు రాష్ట్రంలో ఉండగా, తెలంగాణలో గత ఆరున్నర సంవత్సరాలలో 110 నోటిఫికేషన్‌ల ద్వారా భర్తీ చేసింది కేవలం 35,724 ఉద్యోగాలు మాత్రమే. వేతన సవరణ కమిషన్ ఇచ్చిన రిపోర్టు మేరకు తెలంగాణ రాష్ట్రంలో వివిధ డిపార్ట్‌మెంట్లలో ఉన్న ఖాళీలు మొత్తం 1,91,126. వీటికి తోడు కొత్త జిల్లాల ఏర్పాటు, కొత్త రెవెన్యూ డివిజన్ కొత్త మున్సిపాలిటీలు కొత్త గ్రామ పంచాయతీల ఏర్పాటు వల్ల కార్యాలయాల సంఖ్య పెరిగింది. దానికి అనుగుణంగా ఉద్యోగుల సంఖ్యను కూడా పెంచవలసి ఉంది. కానీ ఇప్పటివరకు ఒక్క ఉద్యోగాన్ని కూడా అదనంగా కల్పించకుండా పాత వారితోనే ఖాళీలు పోను మిగతా వారితో నెట్టుకొస్తున్నారు. క్యాడర్ స్ట్రెంత్ రీ ఆర్గనైజ్ చేసి ఇప్పుడున్న ఉద్యోగాలకు అదనంగా 30 శాతం ఉద్యోగాలు పెంచవలసిన అవసరం ఉంది. అలా పెంచితే మరో 1 లక్ష 50 వేల కొత్త ఉద్యోగాలు అదనంగా సృష్టించబడతాయి. తద్వారా మొత్తం ఖాళీలు దాదాపు 3 లక్షల 50 వేలు అవుతాయి. 610 ఉత్తర్వులను అతిక్రమించి అక్రమంగా తెలంగాణలో దాదాపు లక్షన్నర మంది ఆంధ్రా

ప్రాంతానికి చెందిన వారు తెలంగాణలో ఉద్యోగాల్లో ఉన్నారని తెలంగాణ ఉద్యమ కాలంలో వెల్లడయింది. ఇవన్నీ కలిపితే మొత్తంగా 5 లక్షల ఉద్యోగాలు ఖాళీగా ఉన్నాయి. వీటన్నింటినీ నింపవలసి ఉన్నది. అర్హత గల నిరుద్యోగులకు, వారి నైపుణ్యాలకు అనుగుణంగా స్వయం ఉపాధి కల్పించాలి. రాష్ట్ర పారిశ్రామిక విధానాన్ని సవరించి పరిశ్రమలలో ఉపాధి అవకాశాలు పెంచాలి. ఆపైన మిగిలిన నిరుద్యోగులకు నిరుద్యోగ భృతి అందజేయవలసి ఉంది. 2019 ఎన్నికల ప్రణాళికలో ప్రకటించిన నెలసరి నిరుద్యోగ భృతి 3,016 రూపాయల హామీ ఇచ్చిన ప్రభుత్వం ఇప్పటివరకు ఆ మాటే ఎత్తడం లేదు.

ఖాళీలు భర్తీ చేయడం, ఉద్యోగ ఉపాధి అవకాశాలు కల్పించడం ప్రభుత్వాల కనీస బాధ్యత. కానీ తెలంగాణ ప్రభుత్వం అందుకు భిన్నంగా ఉన్న ఉద్యోగాలను తొలగించే కార్యక్రమం చేపట్టింది. మహాత్మా గాంధీ జాతీయ గ్రామీణ ఉపాధి హామీ పథకంలో పని చేస్తున్న ఫీల్డ్ అసిస్టెంట్లను రాష్ట్ర వ్యాప్తంగా 7,500 మందినీ ఉద్యోగం నుంచి తొలగించింది. వారు తమ గౌరవ వేతనం పెంచాలని సమ్మె చేస్తున్న క్రమంలో భూస్వామ్య భావజాలం తలకెక్కిన ప్రభుత్వం వారి నిరసన సహించలేక వారిని ఉద్యోగాల నుండి తొలగించింది ఆర్‌టిసి సమ్మె సమయంలో ఆర్‌టిసి కార్మికులను కూడా తొలగించింది. కానీ మళ్లీ ఉద్యోగాల్లోకి తీసుకుంది. కానీ ఎన్‌ఆర్‌ఇ.ఇఎస్ ఫీల్డ్ అసిస్టెంట్‌లను ఉద్యోగాల్లోకి తీసుకోలేదు. అదే విధంగా మిషన్ భగీరథ, హార్టికల్చర్, హౌసింగ్ సొసైటీ డిపార్ట్‌మెంట్లలో కాంట్రాక్ట్ అవుట్ సోర్సింగ్‌లో పనిచేస్తున్న సుమారు పదివేల మందిని, గత సంవత్సరం విద్యాశాఖలో కాంట్రాక్ట్ అవుట్ సోర్సింగ్‌లో పనిచేస్తున్న 11 వేల మందిని ఉద్యోగాల నుండి తొలగించింది. కేంద్ర ప్రభుత్వ గణాంక విభాగం ఆధ్వర్యంలో నిర్వహించే పీరియాడిక్ లేబర్ ఫోర్స్ సర్వే (పిఎల్‌ఎఫ్‌ఎస్) వెలువరించిన గణాంకాల ప్రకారం పట్టభద్రులు, ఆపైన చదువుకున్న వారిలో దేశంలో నిరుద్యోగ రేటు 21.6 కాగా, తెలంగాణలో నిరుద్యోగ రేటు 33.9గా ఉంది. అంటే తెలంగాణలో మూడో వంతుకు పైగా ఉన్నత విద్యావంతులైన యువత ఉపాదిలేక ఉస్సూరుమంటూ కాలం వెళ్లబుచ్చుతున్నది. సెంటర్ ఫర్ మానిటరింగ్ ఇండియన్ ఎకానమీ (సిఎంఐఇ) వెలువరించిన గణాంకాల ప్రకారం రాష్ట్రంలో కార్మికులలో నిరుద్యోగ రేటు 2014లో 7.7 ఉండగా, 2019-20లలో 27.4కు చేరుకుంది.

ప్రభుత్వాలు నిరుద్యోగ సమస్యను సామాజిక సమస్యగా పరిగణించాలి. కానీ రాష్ట్రంలో ఓటు బ్యాంకు రాజకీయాలు తీవ్రంగా అమలు చేస్తూ ఏ రంగంలో ప్రజలకు తాయిలాలు ప్రకటిస్తే ఎక్కువ ఓట్లు వస్తాయో, ఏయే రంగాలలో అభివృద్ధి పేరిట పెట్టుబడులు పెడితే ఎక్కువ కమీషన్లు వస్తాయో ఆయా రంగాలకు మాత్రమే ప్రాధాన్యతనిస్తూ నిరుద్యోగులను నిర్లక్ష్యం చేస్తున్నారు. ఈ వైఖరి కారణంగానే నిరుద్యోగ సమస్య గతంలో ఎన్నడూ లేని స్థానానికి చేరుకుంది. ఉపాధి కల్పనపై ప్రత్యేక విధానాలు రూపొందించాల్సిన ఆవశ్యకతను ప్రభుత్వం గుర్తించడం లేదు. అందువల్లనే నిరుద్యోగ సమస్య తీవ్రరూపం దాల్చింది. ఇలాంటి పరిస్థితులలో ఉద్యోగుల రిటైర్మెంట్ వయసు పెంచడం ప్రభుత్వ బాధ్యతారాహిత్యం అవుతుంది. ఖాళీలు భర్తీ చేసి, ఉపాధి కల్పించడంలో వైఫల్యం చెందిన ప్రభుత్వం ఇటు నిరుద్యోగులను, ధరల సూచి, ద్రవ్యోల్బణంకు అనుగుణంగా వేతనాల పెంపు అమలు చేయకుండా, అటు ఉద్యోగులను రెండు వర్గాలను ప్రభుత్వం మోసం చేస్తోంది. ఉద్యోగ విరమణ వయసు పెంపు ద్వారా ఉద్యోగ వర్గాల ఓట్లు, నిరుద్యోగ భృతి హామీ ద్వారా నిరుద్యోగుల ఓట్లు కొల్లగొట్టడం కోసమే ఈ రెండు హామీలు ఎన్నికల ప్రణాళికలో చేర్చారు. ఇందులో ఆర్థికంగా నష్టం లేని, రిటైర్మెంట్ చెల్లింపులు వాయిదా వేస్తూ ఆర్థిక వెసులుబాటు కల్పించే అంశమైన ఉద్యోగ విరమణ వయసు పెంపును రెండు పట్టభద్రుల ఎంఎల్‌సి ఎన్నికల ఓట్ల అదును చూసి అమలు చేస్తున్నారు. కానీ ఆర్థికంగా భారం పడే నిరుద్యోగ భృతి కల్పనను పక్కకు పెట్టేశారు. కాళేశ్వరం లాంటి ప్రాజెక్టులకు రీడిజైన్ పేర అంచనాలకు మించి ఖర్చు చేసి, రాష్ట్రాన్ని అప్పుల పాలు చేసి, ఉద్యోగులకు వేతనాలు కూడా సరైన సమయంలో ఇవ్వలేని బలహీన ఆర్థిక స్థితికి చేరుకున్న ప్రభుత్వం, క్షీణించిన ఆర్థిక స్థితి నుండి బయటపడడం కోసం రిటైర్మెంట్ చెల్లింపులు చేయలేని దశలో ఉద్యోగుల రిటైర్మెంట్ వయస్సు పెంచింది. ఉద్యోగుల రిటైర్మెంట్ వయసు పెంపు కేవలం ప్రభుత్వ ప్రయోజనమే అనేది నిర్వివాదాంశం.

ఉద్యోగ ఉపాధి కల్పన ప్రభుత్వం అమలు చేసే ఆర్థిక విధానాల మీద ఆధారపడి ఉంటుంది. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో జరిగిన అస్తవ్యస్త పారిశ్రామికాభివృద్ధి వలన రెండు తరాల తెలంగాణ ప్రజలు తమ న్యాయమైన హక్కు అయిన ఉద్యోగాలు పోగొట్టుకున్నారు. ప్రస్తుత తెలంగాణలో ఆర్థిక, పారిశ్రామిక విధానం తెలంగాణ భూమి పుత్రులకు ఉద్యోగ ఉపాధి కల్పన ప్రధాన లక్ష్యంగా పెట్టుకుంటుందని తెలంగాణ సమాజం ఆశించింది. కానీ ప్రస్తుతం తెలంగాణలో అమలు చేస్తున్న ఆర్థిక, పారిశ్రామిక విధానాలు కూడా ప్రపంచ బ్యాంకు నిర్దేశించిన ఆర్థిక కట్టుబాట్లకు లోబడే అమలవుతున్నాయి. పరిశ్రమలు స్థాపించే కార్పొరేట్లపై ఉద్యోగ కల్పన షరతులు విధించడం లేదు. చాలా పరిశ్రమలు శ్రమ ఆధారిత పరిశ్రమలు కావు. పెట్టుబడి ఆధారిత పరిశ్రమలు కావడం వల్ల ఎక్కువ ఉద్యోగాలు కల్పించబడవు, ఉన్నత స్థాయి స్వయంచాలిత, సాంకేతిక నైపుణ్యంతో నడవడం వల్ల అవి సృష్టించే ఉద్యోగాలు కూడా చాలా తక్కువ. పారిశ్రామిక విధానానికి మూడు కీలక ప్రయోజనాలు ఉండాలి 1) స్థానిక వనరులను స్థానిక ప్రజల ప్రయోజనాల కొరకు వినియోగించాలి, 2) స్థానిక వనరులలో అదనపు వనరులు ప్రవేశపెట్టి ఆర్థిక వ్యవస్థను బహుముఖంగా విస్తరించాలి, 3) స్థానిక ఉద్యోగ, ఉపాధి కల్పనకు సహకరించి నిరుద్యోగాన్ని పోగొట్టగలగాలి. కానీ ప్రస్తుతం అమలవుతున్న పారిశ్రామిక విధానం స్థానిక వనరులను కొల్లగొట్టి బహుళజాతి సంస్థలకు, పరాయి ప్రాంతాలకు అప్పగించడానికి దోహదం చేస్తుంది. స్థానిక వనరులలోకి అదనపు వనరులను ప్రవేశపెట్టడానికి బదులు ఈ ఆర్థిక వ్యవస్థ నుంచి వచ్చిన ఫలాలను ఇతర ప్రాంతాలకు తరలించుకుపోతున్నారు. ఉపాధి కల్పనకు గోరంత సహకరిస్తూ కొండంత నిరుద్యోగానికి దారితీస్తున్నది. పారిశ్రామిక వేత్తలు తెలంగాణ ఆర్థిక వ్యవస్థలోనికి కొద్దిపాటి పెట్టుబడులు పెడుతున్నా, వారు పొందుతున్న రాయితీలు, ఆర్జిస్తున్న లాభాల దృష్ట్యా చూసినప్పుడు ఈ పరిశ్రమలు ఇక్కడున్న సంపదను తరలించుకు పోవడానికి తప్ప స్థానిక సంపదను పెంచడానికి, తెలంగాణ నిరుద్యోగ యువతకు ఉపాధి కల్పించడానికి ఏమాత్రం దోహదం చేయడం లేదనేది స్పష్టం అవుతుంది. ప్రపంచ బ్యాంకు నిర్దేశిత ఆర్థిక విధానాల నుండి వైదొలగకుండా కేవలం జిమ్మిక్కులు ప్రయోగించి రిటైర్మెంట్ వయస్సు పెంచడం లేదా తగ్గించడం చేసి నిరుద్యోగాన్ని అరికట్టడం సాధ్యం కాదు. కాబట్టి ప్రపంచ బ్యాంక్ నమూనా ఆర్థిక, పారిశ్రామిక విధానాలను విడనాడాలని ప్రభుత్వాలపై పోరాడుతూ, పెరుగుతున్న నిరుద్యోగ రేటు దృష్టిలో పెట్టుకుని ఖాళీల భర్తీ కోసం, పబ్లిక్ ప్రైవేట్ రంగంలో ఉద్యోగ ఉపాధి అవకాశాల పెంపు కోసం ప్రజలు, నిరుద్యోగులు, ఉద్యోగులు, మేధావులు, ప్రజాస్వామిక వాదులు ప్రభుత్వంపై ఒత్తిడి తేవాల్సి ఉంది.

*(రచయిత జనగామ జిల్లా టిపిటిఎఫ్ అధ్యక్షులు)* వీ

# అసంబద్ధ పిఆర్‌సికి అభిషేకాలెందుకు?

***ఉద్యోగులకు హక్కుగా రావాల్సిన వేతన సవరణను ముఖ్యమంత్రి దయా దాక్షిణ్యంగా భావించడం ఉపాధ్యాయ, ఉద్యోగ ఉద్యమాలకు అవమానకరమని అంటున్నారు* చుంచు శ్రీశైలం**

రాష్ట్రంలో ఉద్యోగ, ఉపాధ్యాయులకు 11వ వేతన సవరణ కోసం రాష్ట్ర ముఖ్యమంత్రి అసెంబ్లీలో 30 శాతం ఫిట్మెంట్ ప్రకటించారు. పిఆర్‌సి నివేదికలో ఫిట్మెంట్ శాతం 7.5గా ఉండబోతోందని లీకులిచ్చి తిట్టించుకున్న నోళ్లతోనే కీర్తించుకునే నాటకాన్ని రక్తి కట్టించారు. తాను ఎంతటి దయార్ద్ర హృదయుడో గుర్తించాలంటే ఆ మాత్రం స్క్రీన్ ప్లే అవసరమని తనకు తెలిసినంతగా మరెవ్వరికీ తెలియదని మరోసారి రుజువయ్యింది. ముఖ్యమంత్రి ప్రకటన వెలువడిన వెంటనే కొన్ని సంఘాలు, కొంతమంది నాయకులు ముఖ్యమంత్రి చిత్రపటానికి పాలతో అభిషేకిస్తూ, బ్యాండ్ మోతలు, నృత్యాలతో పులకిరించిపోయారు. తాము పొందబోయే ప్రయోజనాల కంటే వ్యక్తపరుస్తున్న హర్షధ్వానాలు పదింతలు ఎక్కువగా ఉన్నాయి. ఈ ప్రతిస్పందన వార్తా పత్రికలలో ప్రచురిస్తున్న విధంగా వరాల జల్లు, జీతాల జాతర, డబుల్ ధమాకా, ట్రిపుల్ ధమాకా వంటి శీర్షికలకు సరిగ్గా సరిపోతుంది.

ఉపాధ్యాయ, ఉద్యోగుల ప్రతిస్పందనకు వీళ్లు పేరు పెడుతున్నారా లేక వీళ్ల రాతలకు అనుగుణంగా వాళ్లు ప్రవర్తిస్తున్నారా లేక రెండు వర్గాలు ఒకే యజమాని, ఒకే బానిస భావజాలాన్ని కలిగి ఉన్నాయా అనేది ఆలోచించాల్సి ఉంది. ఇవన్నీ చూస్తున్న సాధారణ ప్రజానీకం మాత్రం ఉద్యోగ వర్గాలకు ఇప్పటివరకు పొందనిది, ముందెన్నడూ కనీవినీ ఎరుగనిది, ఊహించని వరమేదో ప్రసాదించినట్లుగా, అకస్మాత్తుగా అద్భుతమేదో జరిగినట్లుగా భావిస్తున్నారు. ఈ భావన ప్రజల్లో ఉద్యోగ ఉపాధ్యాయ వర్గాల పట్ల ఈర్ష్యను పెంచి, ప్రజా మద్దతు దూరం కావడానికి ఒక కారణంగా నిలుస్తోంది. ఉద్యోగుల పట్ల ప్రభుత్వ వైఖరి, ప్రజా ప్రతినిధుల వ్యాఖ్యలు ఈ దూరాన్ని మరింత పెంచుతూనే ఉంటాయి. దీనివల్ల జరిగిన, జరుగుతున్న, జరగబోయే నష్టం గురించి ఉద్యోగ సంఘాల నాయకులకు తెలియంది కాదు. అయినప్పటికీ, తాము ఏ వ్యవస్థకైతే ప్రాతినిధ్యం వహిస్తున్నారో దాని ఉమ్మడి ప్రయోజనాల కంటే తమ వ్యక్తిగత ప్రయోజనాలు నెరవేర్చుకోవడమే ప్రధానంగా భావిస్తున్నారు.

కొన్ని ఉపాధ్యాయ, ఉద్యోగ సంఘాల నాయకులు ముఖ్యమంత్రి దృష్టిలో తన అనుకూలురుగా, అనుచరులుగా ముద్ర వేసుకోవడం ఒక్కటే ప్రధానంగా భావించి అందుకోసం పోటీ పడుతున్నారు. ఈ స్వార్థపూరిత ఆలోచనలే బానిస భావజాలానికి దారి చూపుతాయి. తమ హక్కులు తాము పోరాడి సాధించుకున్నప్పటికీ అవి ప్రభువుల వారు దయాదాక్షిణ్యాలతో పొందుకున్న అనుగ్రహంగా భావించేలా చేస్తున్నాయి. ప్రభుత్వాలు, దాని అధినేతలు తాము నిర్వర్తించాల్సిన చట్టబద్ధ, రాజ్యాంగ విధిత, పాలనాపరమైన విధులు, బాధ్యతలు అప్పుడప్పుడు నిర్వర్తిస్తూ భజనలు, పొగడ్తలు, ఆరాధనలు, అభిషేకాలను అభిలషిస్తున్నారు. రాజకీయ నాయకులకు ఇది సహజం కావచ్చు, కానీ ఉద్యోగ సంఘ నాయకులకు మాత్రం అసహజం, అసహ్యం కూడా. సాధించినది అసంపూర్తి, అసంబద్ధం అయినప్పటికీ వేడుకలకు మాత్రం కొదువ లేదు. సమాజానికి బాధ్యత వహించే గురువులై ఉండి అధికార పార్టీ బాధ్యత మోస్తూ గులాబీ పాటలకు చిందులేసేంతగా దాసోహం అవ్వాల్సినంత ప్రయోజనం ఏం ఒనగూరిందో ప్రజల ముందు పెట్టాలి. తమ అభిషేకాలతో నడయాడే నాయకులను సృష్టించి సమాజాన్ని ఏ రాచరికపు అంచుల వైపు, ఇంకెంత మూర్ఖపు భావజాలం దిశగా తీసుకెళ్లనున్నారో ఆలోచించుకోవాలి.

**వేతన సవరణ ఇప్పుడే మొదలయ్యిందా?**

పెరిగిన నిత్యావసర ధరలు, జీవన వ్యయానికి అనుగుణంగా ప్రభుత్వంలో భాగమైన ఉద్యోగ ఉపాధ్యాయులకు శాస్త్రీయంగా లెక్కించి వేతనాలు పెంచడం కేంద్రంలో ప్రతీ 10 సంవత్సరాలకు, రాష్ట్రాల్లో 5 సంవత్సరాలకు ఒకసారి అత్యంత సాధారణంగా జరిగే ప్రక్రియ. ఇది ప్రభుత్వాల బాధ్యత, ఉద్యోగుల హక్కు. కాల క్రమేణా సహజంగా జరగాల్సిన ఈ ప్రక్రియ అసాధారణమైనదిగా, ఎన్నికల సమయంలో వెదజల్లే తాయిలాల్లో ఒకటిగా, పాలకుల దయాదాక్షిణ్యాల మీద అమలయ్యే ఒక అనుగ్రహ సంక్షేమ పథకంలా తయారైంది. ఇది రాజకీయ అవసరాల కోసం ఉపయోగించే తారక మంత్రంగా రాజకీయ నాయకులు ఉపయోగిస్తుంటే , గొర్రె కసాయినే నమ్మినట్లుగా కొంతమంది ఉద్యోగ ఉపాధ్యాయ నాయకులు సమిష్టి ప్రయోజనాలు పనంగా పెట్టి వ్యక్తిగత ప్రయోజనాలు పొందడానికి పాలాభిషేకాలతో పాలకులను ప్రభువులుగా మార్చుతూ రాజు దైవాంశ సంభూతుడనే రాజరికపు శాసనాన్ని తిరిగి ప్రతిష్టించేందుకు తాపత్రయపడుతున్నారు.

**పిఆర్‌సిలో ఉద్యోగ, ఉపాధ్యాయులకు ప్రయోజనమెంత?**

2018 జులై నుంచి అమలు కావాల్సిన నూతన వేతనాలు ముఖ్యమంత్రి ప్రకటన ప్రకారం 2021 ఏప్రిల్ నుంచి అమలులోకి రానున్నాయి. అంటే 33 నెలల వేతనాలను ఉద్యోగులు కోల్పోయినట్లుగా స్పష్టమవుతోంది. గతంలో ఇంతగా ఆలస్యం అయిన సందర్భాలు లేవు. ఒకవేళ ఆలస్యమయ్యే పరిస్థితులలో మధ్యంతర భృతి (ఐ.ఆర్) అందించి జీత నష్ట నివారణకు కృషి చేసేవారు. తెలంగాణ ప్రభుత్వం ఆ దిశగా ఒక్క అడుగు కూడా వేయకపోగా జీతాల పెంపుకై సాంస్కృతిక, రాష్ట్ర, జాతీయ పండుగల పేర్లతో అనేక గడువులు విధిస్తూ, వార్తా పత్రికలకు లీకులు ఇస్తూ వచ్చిన సంగతి అప్పుడే మర్చిపోతే అది ఆత్మహత్య సాదృశ్యమే అవుతుంది. పత్రికలు జీతాల జాతర, డబుల్, ట్రిపుల్ ధమాకా వంటి ప్రధాన శీర్షికలతో ఎన్నోసార్లు పాలకులను అభిషేకించాయి. పథకం ప్రకారం ఉద్యోగ ఉపాధ్యాయులను సమాజంలో చులకన చేసి, ప్రజల్లో వ్యతిరేకతను ప్రోది చేశారు.

ప్రస్తుత వేతన సవరణ వల్ల నికర వేతనంలో పెరుగుదల కనిష్టంగా

5 వేల నుంచి గరిష్టంగా 17 వేల రూపాయలు మాత్రమే. ఉద్యోగుల్లో అత్యధికంగా ఉన్న సీనియర్ అసిస్టెంట్ లేదా అంతకంటే కింది స్థాయి ఉద్యోగుల వేతన పెరుగుదల అంతంత మాత్రమే. కొద్ది సంఖ్యలో ఉండే గెజెటెడ్ స్థాయి ఉద్యోగులకు మాత్రమే గరిష్ట ప్రయోజనం కలుగుతుంది. అందులోనూ పెరగనున్న మూల వేతన స్లాబులను అనుసరించి ప్రావిడెంట్ ఫండ్, ప్రభుత్వ జీవిత బీమా, వృత్తిపన్ను వంటి నెలవారీ మినహాయింపులు కూడా పెరిగేవే. ఇంకా వేతన సవరణ కమిషన్ సూచన మేరకు ఇంటి అద్దె భత్యం (ఎచ్ఆర్ఎ) ను తగ్గించినా, ఆరోగ్య పథకాని (ఇఎచ్ఎస్)కి 1శాతం జీతాన్ని కత్తిరించినా, నూతన పెన్షన్ పథకం (సిపిఎస్) కొరకు మూలవేతనం, డి.ఏ.పై ఉద్యోగి వేతన కోత 10 నుంచి 14 శాతంకు పెంచినా నికర ఆదాయంలో పెరుగుదల బహు స్వల్పమే. వేతన జీవుల అసంతృప్తిని కమ్మేస్తూ, పాలకులను అత్యంత శక్తివంతమైన దేవతామూర్తులుగా కీర్తించడం ప్రజాస్వామ్యానికి గొడ్డలి వేటు వంటిది.

**12 నెలల బకాయిల మతలబేంటి?**

కోల్పోయిన 33 నెలల్లో 12 నెలల బకాయిలు చెల్లిస్తామని ప్రభువుల వారు ఘనంగా మరో వరాన్ని ప్రకటించడం జరిగింది. పెరిగిన జీతాన్ని 21 నెలల బకాయిలు చెల్లించకుండా, చెల్లించే 12 నెలల బకాయిలు ఉద్యోగ విరమణ సమయంలో గ్రాట్యుటీతో కలిపి చెల్లిస్తామని షరతు విధించడం కొసమెరుపు. దీనిని సరిగ్గా అర్థం చేసుకోవాల్సి ఉంది. ఉద్యోగ విరమణ వయసు పెంపు నిర్ణయం వల్ల 12 నెలల వేతన బకాయిల చెల్లింపు మూడేండ్ల తర్వాత మొదలై ముప్పై ఏండ్ల వరకు కొనసాగుతుంది. 12 నెలల బకాయిలు సుమారుగా ఒక లక్ష రూపాయలు అనుకుంటే మూడేళ్ల తర్వాత తీసుకునే వాళ్లకు ప్రస్తుతంతో పోల్చుకుంటే కొంతమేరకే నష్టం కానీ, 30 ఏండ్ల తర్వాత పొందే వాళ్లకు అప్పటి రూపాయి మారకం విలువలో ఒక వెయ్యి రూపాయలతో సమానం కావచ్చు. గతంలో మాదిరిగా ప్రోవిడెంట్ ఫండ్‌లో జమ చేసినా ప్రభుత్వం నిర్దేశించిన వడ్డీ ప్రకారం కొంత పెరుగుదల ఉండేది. అంటే 12 నెలల బకాయిలు చెల్లించకపోవడం ప్రభుత్వ దివాలకోరు తనానికి నిదర్శనం.

**ఉద్యోగ విరమణ చేసిన వారికి న్యాయం జరిగేనా?**

2021 ఏప్రిల్ నుంచి రానున్న వేతన సవరణ, 2018 జులై 1 నుంచి నోషనల్‌గా అమలులోకి రానున్న విషయం తెలిసిందే. 2021 ఏప్రిల్ లేదా గత 12 నెలల బకాయిల చెల్లింపులు జరిపితే, దానికి ముందు (2018 జూలై 1 తర్వాత) విరమణ పొందిన వారికి కూడా 12 నుంచి 16 లక్షలకు పెంచిన గ్రాట్యుటీని అందజేయాలి. అలాగే అర్హతను బట్టి 2 లేదా 3 నోషనల్ ఇంక్రిమెంట్లు కలిపి, చివరి మూల వేతనం ఆధారంగా పొందుతున్న పెన్షన్లు సవరించినప్పుడు మాత్రమే న్యాయమైన వారి ప్రయోజనాలు కొంతమేరకు కాపాడినట్లు అవుతుంది. నూతన వేతన స్కేళ్లు అమలుతో పాటు ఎన్నో సందిగ్ధతలకు ఇంకా స్పష్టత లేనే లేదు.

**మానవీయతకు పాడె కట్టనున్న సిపిఎస్ ఫ్యామిలీ పెన్షన్**

2004 సెప్టెంబర్ 1 నుంచి రాష్ట్రంలో అమలులోకి వచ్చిన అమానవీయ నూతన పెన్షన్ పథకాన్ని రద్దు చేయాలని ఏళ్ల తరబడి ఉద్యమిస్తుంటే అంతకంటే అమానవీయ పరిస్థితులను సృష్టించనున్న ఫ్యామిలీ పెన్షన్ సౌకర్యాన్ని కల్పిస్తున్నట్లు ప్రకటించారు. పైకి మాత్రం గొప్ప ఊరటగా కనిపిస్తున్నప్పటికీ, ఉద్యోగులు భావిస్తున్నప్పటికీ సమకాలీన కుటుంబ, సామాజిక, నైతిక విలువల నేపథ్యంలో ఈ అంశాన్ని పరిశీలిస్తే ఒళ్లు గగుర్పాటుకు గురికాక తప్పదు. విధి నిర్వహణలో ఉండి మరణిస్తే ఫ్యామిలి పెన్షన్ అందిస్తామని ప్రకటించారు. సర్వీసులో ఉండి అనారోగ్యంతో, ప్రమాదవశాత్తు మరణించిన వారి కుటుంబాలకు కొంత ఊరట, భద్రత లభించడం వాస్తవం. కానీ ఇలా ఫ్యామిలీ పెన్షన్ పొందే వారి శాతం సంవత్సరానికి దాదాపుగా 2 శాతం మించకపోవచ్చు. ఇది ఎక్కువగా ఆశించదగినది కూడా కాదు. ఉద్యోగులు 90 శాతం మంది సర్వీసు పూర్తి చేసి ఉద్యోగ విరమణ పొందే అవకాశం ఉంటుంది.

పూర్తికాలం సర్వీస్ చేసి విరమణ పొందితే స్టాక్ మార్కెట్ల మీద ఆధారపడే అనిశ్చిత పెన్షన్ తప్ప భద్రత, హామీతో కూడిన పెన్షన్ పొందే అవకాశం ఉండదు. అంటే ఒక ఉద్యోగి తన ఉద్యోగ విరమణ దగ్గరపడుతున్న కొద్దీ కుటుంబ సంక్షేమం, పోషణ, బాధ్యతల కొరకు తాను చనిపోతే బాగుండును (అప్పుడే పూర్తి పెన్షన్ పొందవచ్చు కాబట్టి) అనే మానసిక క్షోభను అనుభవించడం తథ్యం. ఆ విధంగా విరమణ దగ్గరవుతున్న కొద్దీ ఆత్మహత్యలను ప్రేరేపించడానికి ఫ్యామిలీ పెన్షన్ సౌకర్యం తోడ్పడుతుంది. అలాగే ఇప్పటికే కారుణ్య నియామకాల కోసం, ఇన్సూరెన్స్ డబ్బుల కోసం తండ్రిని చంపిన కొడుకులు, భర్తను చంపిన భార్య, భార్యను చంపిన భర్త వంటి అమానవీయ సంఘటనలు నిత్యకృత్యంగా మారాయి. రాబోయే రోజుల్లో మరింతగా విలువలు, ఆప్యాయతలు, అనుబంధాలు దిగజారే సంకేతాలు స్పష్టంగా కనపడుతున్నాయి. ఇన్ని అసంబద్ధాలతో కూడిన ప్రభుత్వ నిర్ణయాలను లోతుగా అధ్యయనం చేయకుండా మనువాద సంస్కృతిలో కొట్టుకపోతూ అభిషేకాలతో ఆరాధిస్తే ఉద్యోగ, ఉపాధ్యాయ సమాజానికి తీరని ద్రోహం చేసినవారవుతారు.

**ఉపాధ్యాయ ఉద్యమ చరిత్రను మననం చేద్దాం**

ప్రభుత్వం వేతన సవరణ అమలు నిర్ణయం వెనుక దాగి ఉన్న అనేక పోరాటాలను గుర్తించాలి. హక్కులను కూడా వరాలుగా మార్చుతున్న విధానాలను ప్రశ్నించాలి. మూడేళ్ల కాలంలో మండల, జిల్లా, రాష్ట్ర స్థాయిలో జరిగిన అనేక ఆందోళనలు, దీక్షలు, నిరసనలు, ధర్నాలు, అసెంబ్లీ ముట్టడి వంటి కార్యక్రమాలు, ఎన్నికల రాజకీయాల్లో చూపిన వ్యతిరేకత, ఎదుర్కొన్న అరెస్టులు, నిర్బంధాలు ప్రభుత్వానికి అనివార్యతను సృష్టించాయన్న వాస్తవాన్ని విస్మరించరాదు. అంతకంటే ముందు ఎన్నో పోరాటాలు, ఎంతో మంది నాయకుల త్యాగాలను స్మరిస్తేనే, నేడు పొందుతున్న ప్రయోజనాలేవీ ఆయాచితంగా వచ్చినవి కాదన్న నిజం గ్రహించగలుగుతాం. ఇంక్రిమెంట్లు, డి.ఏ.లు, వేతన సవరణలు, డి.ఏ. మెర్జ్ స్కేళ్లు, రీ గ్రూపింగ్ స్కేళ్లు, అప్రయత్న పదోన్నతులు, సెలవు నిబంధనలు, పెన్షన్లు, కారుణ్య నియామాలు వంటి ఎన్నో ప్రయోజనాలను పొందడం వెనుక దశాబ్దాల ఉపాధ్యాయ వీరోచిత ఉద్యమ కృషి ఉంది. నాటి జాయింట్ కమిటీ ఆఫ్ టీచర్స్ యాక్షన్ (జెసిటిఎ), ఆంధ్రప్రదేశ్ ఉపాధ్యాయ సంఘాల సమాఖ్య (ఎఫ్ఎపిటిఒ), జె.ఏ.సి., ఉపాధ్యాయ సంఘాల సంయుక్త కార్యాచరణ సమితి (జెఎసిటిఒ) వంటి ఐక్య ఉద్యమాల నుండి విచ్ఛిన్నతలను, విభజనలను ఎదుర్కొంటూ సాగుతున్న నేటి యుఎస్‌పిసిల, వంటి నాయకత్వాల పోరాట తత్వం ఉంది.

ఉద్యమ ఫలాలను నేడు పాలకులు వెదజల్లే వరాలుగా మార్చితే, దానికి మనమే భజనలు చేస్తుంటే చరిత్ర క్షోభిస్తుంది. ఉద్యమ పునాదుల మీద నిర్మించబడ్డ పీఠంపై కూర్చున్న ముఖ్యమంత్రి గారికి ఆ గొప్పదనాన్ని

# చిక్కుల్లో మహారాష్ట్ర ప్రభుత్వం

***మహారాష్ట్ర హోం మంత్రి దేశ్‌ముఖ్ అవినీతి వెలుగులోకి రావడంతో రాష్ట్ర పోలీసులకు, ఎన్ఐఎకు మధ్య, కేంద్ర ప్రభుత్వానికి రాష్ట్ర ప్రభుత్వానికి మధ్య వైరుధ్యాలు పెరిగాయని అంటున్నారు* నర్సింహ**

మహారాష్ట్రలో శివసేన, కాంగ్రెస్, ఎన్‌సిపిలతో కూడిన 'మహావికాస్ ఆఘాడి' ప్రభుత్వం 2019 నవంబర్ నుంచి అధికారంలో ఉంది. మహారాష్ట్ర కోవిడ్‌తో పాటు సరికొత్త అవినీతి సమస్యను ఎదుర్కొంటుంది. ఫిబ్రవరి 25న ముంబై నగరంలోని అల్టా మౌంట్ రోడ్‌లోని ముఖేశ్ అంబానీ 27 అంతస్థుల (అంటిలియా) ఇంటి ఎదుట పేలుడు పదార్థాలు, ఒక బెదిరింపు లేఖ ఉన్న స్కార్పియో వాహనాన్ని గుర్తించారు. ఆ వాహనం ఎవరిదో, ఎందుకు అక్కడ పెట్టారో విచారణ చేసే బాధ్యతను ముంబాయి క్రైం ఇంటిలిజెన్స్ యూనిట్‌కు అప్పగించారు. ఆ యూనిట్ సచిన్ వాజే అనే అసిస్టెంట్ పోలీస్ ఇన్‌స్పెక్టర్ (ఎపిఐ) ఆధీనంలో పనిచేస్తోంది. మరోవైపు తన వాహనం కనిపించడం లేదని ఫిబ్రవరి 18 నాడే ఫిర్యాదు చేసిన స్కార్పియో యజమాని థానేకు చెందిన కార్ల అలంకరణ సామాగ్రి వ్యాపారి మన్‌సుఖ్ హీరెన్ మార్చ్ 5న హత్యకు గురయ్యాడు. ఈ సంఘటన దేశాన్ని దిగ్భ్రాంతి పరచడంతో పాటు మహారాష్ట్ర, ఢిల్లీలో ప్రకంపనలు రేపింది.

ఈ కేసు లోతుపాతుల్ని తవ్వుతున్న ఎన్‌కౌంటర్ల స్పెషలిస్టుగా పేరుపొందిన ముంబై పోలీసు అధికారి (ఎపిఐ) సచిన్ వాజేను హిరెన్ హత్యతో సంబంధముందన్న ఆరోపణతో మార్చ్ 13న జాతీయ పరిశోధన సంస్థ (ఎన్ఐఎ) అదుపులోకి తీసుకోవడంతో మహారాష్ట్ర రాజకీయాలు వేడెక్కాయి. 16 సంవత్సరాల పాటు సస్పెన్షన్‌లో ఉన్న ఓ పోలీసు అధికారిని (సచిన్ వాజే) తిరిగి ఎందుకు విధుల్లోకి ఎలా తీసుకున్నారు. ఆయన్ని ముఖ్యమంత్రి ఠాక్రే ఎందుకు వెనకేసు కొస్తున్నారు? అని మహారాష్ట్ర బిజెపి తీవ్రంగా విమర్శించింది. సస్పెన్షన్‌లో ఉన్న పోలీసు అధికారిని తిరిగి విధుల్లోకి ఎందుకు తీసుకున్నారంటే... దీని కోసం ఒక కమిటీని ఏర్పాటు చేశారు. ఈ కమిటీలో ఐఎఎస్‌లు ఉన్నారు. వీరంతా వాజేను తిరిగి తీసుకోవాలని సిఫారసు చేశారట. వారు ప్రతిపాదిస్తే... ఆఘమేఘాల మీద రాజకీయ నాయకులు ఆమోదముద్ర వేశారు. ఎన్ఐఎ అభ్యర్థన మేరకు ముంబై కోర్టు వాజేను 15 రోజుల కస్టడీకి అనుమతించింది. అంబాని ఇంటి ముందు, పేలుడు పదార్థాలతో దొరికిన వాహనం గత కొద్ది నెలలుగా వాజే ఆధీనంలోనే ఉందని, అసలు ఆదివారం ముందు దొంగిలించబడిందనే ఫిర్యాదు కూడ నిజం కాదని, ఆ ఫిర్యాదును నమోదు చేసుకొమ్మని థానే పోలీసుల మీద ఒత్తిడి చేసింది వాజేనని, అసలు హిరెణ్ చాలకాలంగా వాజేకు సన్నిహిత మిత్రుడని ఎన్ఐఎ రోజుకొక రకమైన వార్త పత్రికలకు విడుదల చేస్తోంది.

ముఖ్యమంత్రి ఠాక్రే, ఆయన మంత్రులు అసిస్టెంట్ పోలీసు ఇన్‌స్పెక్టర్ సచిన్ వాజేను సమర్థిస్తూ, ఎన్ఐఎ చొరబాటును విమర్శిస్తుండగా, ప్రతిపక్ష బిజెపి ముఖ్యమంత్రి ఠాక్రే అసమర్థుడని, హోం మంత్రి అనిల్ దేశ్‌ముఖ్‌ను వెంటనే మంత్రి పదవి నుంచి తొలగించాలని పత్రికల్లో వార్తలు హోరెత్తాయి. పత్రికల్లో, ఎలక్ట్రానిక్ మీడియాలో ప్రభుత్వ సమర్థన, ప్రతిపక్ష విమర్శన వార్తలకు తోడుగా ముంబై పోలీస్ కమీషనర్‌గా, పంజాబ్ పోలీస్ డైరెక్టర్ జనరల్‌గా పనిచేసిన జూలియో రెబెరోతో సహా ఎందరో పరిశీలకులు ఈ పరిణామాల మీద విపరీత వ్యాఖ్యానాలు చేశారు. ఈ వివాదం రోజు రోజుకు తీవ్రమవుతోంది. హిరెన్ హత్య, సచిన్ వాజే అరెస్టు, హోం మంత్రి అనిల్ దేశ్‌ముఖ్ అవినీతి మహారాష్ట్ర ప్రభుత్వానికి అప్రతిష్ఠాకరంగా పరిణమించడంతో సమర్థవంతంగా వ్యవహరించలేక పోయాడని ముంబై పోలీసు ఉన్నతాధికారి పరమ్ బీర్ సింగ్‌ను మార్చి 17న ప్రభుత్వం అప్రధానమైన హోం-గార్డ్ విభాగానికి బదిలీ చేసింది.

బదిలీ ఉత్తర్వులు అందుకొన్న పరమ్ బీర్ సింగ్-హోం మంత్రి అనిల్ దేశ్‌ముఖ్ తన కింది అధికారులకు బలవంతపు నెలవారీ వసూళ్ల లక్ష్యాలు నిర్దేశించారంటూ, మహానగరంలోని బార్లు, డాన్స్‌పబ్‌ల నుంచి రు.100 కోట్లు వసూలు చేయాలని ఎపిఐ సచిన్ వాజేను ఆదేశించారని, అంతేగాక ముంబైలో ఆత్మహత్య చేసుకున్న దాద్రా నగర్ హవేలీ ఎంపి మోహన్ దేల్కర్ సింగ్‌ది ఎవరి ఒత్తిడితోనో జరిగిన ఆత్మహత్యగా కేసు నమోదు చేయాలని ఒత్తిడి చేశారని ఆరోపిస్తూ ముఖ్యమంత్రికి రాసిన లేఖ సంచలనం సృష్టించింది. ఎన్ఐఎ కస్టడీలో ఉన్న సచిన్ వాజే సైతం అనిల్ దేశ్‌ముఖ్‌తో పాటు మరో మంత్రి అనిల్ పరాబ్ పైనా బలవంతపు వసూళ్ల ఆరోపణలు గుప్పించడం పెను రాజకీయ దుమారమే లేపింది. రాష్ట్ర హోంమంత్రి అనిల్ దేశ్‌ముఖ్‌పై అవినీతి కుంభకోణం ఆరోపణ అట్టుడికించినట్టు ఉడికిస్తుంది. నేషనలిస్టు కాంగ్రెస్ పార్టీ (ఎన్‌సిపి)కి

---

ఉద్యమాలకు, ఉద్యమకారులకు ఇవ్వడం ఎంతమాత్రం నచ్చదు. ఆ ప్రతిష్టను తన అనుచరులకు ఇవ్వాలన్న ఉద్దేశంలో భాగంగానే తన ప్రకటనలో అభిషేక నాయకుల పేర్లను ప్రస్తావించి మేకపోతు గంభీర్యాన్ని ప్రదర్శించారు. తన అనుకూల సంఘాలను బలోపేతం చేస్తూ, ఉద్యమ సంఘాల, నాయకుల స్ఫూర్తిని దెబ్బతీయాలన్న కుతంత్రం కూడా ఈ ప్రకటనలో మిళితమై ఉంది. ప్రభుత్వ సేవకులుగా అంటే ప్రజా సేవకులుగా ఉండడం కంటే పాలకులను సేవించే వాళ్లుగానే ఉండాలనుకుంటూ, నాయకులమని చెప్పుకుంటున్న కొంతమంది రాష్ట్ర వ్యాప్తంగా యాత్ర చేసి ముఖ్యమంత్రి ధన్యవాద సభలు నిర్వహిస్తామని ప్రకటించడం సిగ్గుచేటు. ఇది సమిష్టి ప్రయోజనాల తాకట్టుకు, బానిసత్వానికి పరాకాష్ట. ఈ మోకరిల్లే విధానాలను క్షేత్ర స్థాయిలో ఉద్యోగ, ఉపాధ్యాయులు ఎండగట్టకపోతే తాము చరిత్ర హీనులుగా మిగులుతారు. ఈ వాస్తవాన్ని ఎంత త్వరగా గ్రహిస్తే అంతే త్వరగా ఐక్య ఉద్యమం ద్వారా తమ వర్గ ప్రయోజనాలు కాపాడుకోగలరు. పాలకులు సృష్టిస్తున్న విభేదాలు, చీలికలలో పావుగా మారితే భవిష్యత్ మొత్తాన్ని మూల్యంగా చెల్లించక తప్పదు.

*(రచయిత ఉపాధ్యాయులు,*
*టిపిటిఎఫ్ జిల్లా కౌన్సిలర్, మహబూబాబాద్)* వీ

చెందిన హోం మంత్రి అనిల్ దేశ్‌ముఖ్‌పై ముంబై మాజీ పోలీసు కమీషనర్ పరం బీర్ సింగ్ పేల్చిన అతి శక్తివంతమైన బాంబు పాలక శివసేన - ఎన్‌సిపి- కాంగ్రెస్ పార్టీల కూటమిని కలవరపెడుతుంది.

ఎన్‌సిపి పార్టీ పరువు కాపాడుకునే యత్నంలో శరద్ పవార్ ఇది తీవ్ర విషయమని ప్రకటించారు. హోం మంత్రిపై ఎటువంటి చర్య తీసుకుంటారో మీ ఇష్టమంటూ ముఖ్యమంత్రి ఉద్ధవ్ ఠాక్రేకు స్వయంగా లేఖ కూడా రాశారు. ఒకవైపు వాజేను అరెస్టు చేసిన ఎన్ఐఎ, మరోవైపు పరం బీర్ సింగ్ దర్యాప్తు కోరిన సిబిఐ కేంద్ర ప్రభుత్వం చెప్పు చేతల్లోని దర్యాప్తు సంస్థలు కావడం ఈ వ్యవహారంపై అనుమానాలు కలిగించడం సహజం. భారత రాజకీయాలు ఎంత అవినీతి కూపంలో కూరుకుపోయి ఉన్నాయో స్పష్టమవుతుంది. మరోవైపు దేశీయంగా 22 రాష్ట్రాలకు చెందిన 2,556 మంది ఎంఎల్ఏలు, ఎంపిలపై క్రిమినల్ నేరాభియోగాలున్నట్లు, మాజీల్ని కూడా కలిపితే ఆ సంఖ్య 4,442కు చేరుతున్నట్లు కోర్టు సహాయకుడి (అమికస్ క్యూరీ)గా విజయ్ హన్సారియా నిరుడు సెప్టెంబర్‌లో 'సుప్రీం' న్యాయపాలికకు నివేదించారు. ఆరోపణలు ప్రత్యారోపణలతో ముంబై ప్రజలు విస్తు పోతున్నారు.

హోం మంత్రి అనిల్ దేశ్‌ముఖ్ ముంబై మహానగరంలోని బార్లు, రెస్టారెంట్ల నుంచి నెలకు వంద కోట్ల రూపాయలను సచిన్ వాజే ద్వారా వసూలు చేసేవాడని వార్త గుప్పుమనడంతో మహారాష్ట్ర రాజకీయాలు వేడెక్కాయి. ఒక హోం మంత్రి ఎన్‌కౌంటర్ స్పెషలిస్టుగా పేరున్న కింది స్థాయి పోలీసు అధికారి ద్వారా ఇంత పెద్ద మొత్తం అక్రమ వసూళ్లు జరిపించడమనేది కేవలం సినిమాలలో మాత్రమే సాధ్యమవుతుంది. అయితే దేశం మొత్తం మీద పోలీసులకు వసూళ్ల బాసులు అని పేరున్న సంగతి మనందరికి తెలిసిందే. వీధుల్లో చిరు వ్యాపారాలు చేసుకునేవారి నుంచి నిర్భయంగా లంచాలు తీసుకునే కానిస్టేబుల్‌తో ప్రారంభమయ్యే ఈ అవినీతి, స్టేషన్ హౌస్ ఆఫీసర్, ఆ పైన దిగ్భ్రాంతికరంగా ఐపిఎస్ అధికారులు, వారి రాజకీయ యజమానుల వరకూ విస్తరించి ఉందన్న వార్తలు మనం విని ఉన్నాం. మన రాజకీయ నాయకులు గల్లీ దాదాల కంటే దారుణంగా మామూళ్ల వసూళ్లు చేసే స్థాయికి దిగజారి పోవడం నిజంగా విషాదమే. దేశంలోని ప్రజాస్వామ్య వాదులు... నిజాయితీ గల పౌరులు ఈ సంఘటనను చూసి షాక్ అయ్యారు. రాజకీయాలు ఇంత దిగజారి పోయాయా అని ముక్కున వేలేసుకొనే స్థితికి వచ్చారు.

పోలీసు ఉన్నతాధికారి పరమ్ బీర్ సింగ్ తన బదిలీని రద్దు చేయాలని, హోం మంత్రి అనిల్ దేశ్‌ముఖ్‌పై విచారణ జరిపించాలని కోరుతూ మార్చి 17న ముంబై హైకోర్టులో కేసు వేశాడు. ఆ తదుపరి పరమ్ బీర్ సింగ్ హైకోర్టులో పిటిషన్ దాఖలు చేయగా, "రాజ్యాంగం చట్టబద్ధమైన పాలనను తలపెట్టింది రాజకీయ మద్దతున్న గుండాల పాలనను కాదు" అని హైకోర్టు తీవ్రమైన వ్యాఖ్యలు చేసింది. దాన్ని విచారించిన హైకోర్టు అయితే ప్రతివాది అయిన దేశ్‌ముఖ్‌కు నోటీసు ఇచ్చి ఆయన వాదన వినకుండానే హైకోర్టు సిబిఐ ప్రాథమిక దర్యాప్తుకు ఆదేశించింది. అవినీతి ఆరోపణలపై ప్రాథమిక దర్యాప్తు జరపాల్సిందిగా సిబిఐని ఆదేశించిన దృష్ట్యా, అనిల్ దేశ్‌ముఖ్ ఏప్రిల్ 5న 'నైతిక కారణాలతో' తన రాజీనామాను ముఖ్యమంత్రి ఠాక్రేకు సమర్పించారు. ఆయన దాన్ని వెంటనే గవర్నర్‌కు పంపగా ఆయన ఆమోదించారు. అడ్వకేట్ జైశ్రీ పాటిల్, మోహన్ బిడె, ఘన్‌శ్యాం ఉపాధ్యాయ దాఖలు చేసిన ప్రజా ప్రయోజన వ్యాజ్యంపై హైకోర్టు సిబిఐ ప్రాథమిక దర్యాప్తును ఆదేశిస్తూ, 15 రోజుల్లో దర్యాప్తు పూర్తి చేయాలని ఆదేశించింది. దర్యాప్తులో లభించే ప్రాథమిక సాక్ష్యాధారాల ఆధారంగా చార్జిషీటు దాఖలు చేయాలో లేదో తదుపరి నిర్ణయిస్తారు.

అవినీతి, హత్య ఆరోపణలతో రెండు మాసాలుగా ఎన్నో మలుపులు తిరుగుతున్న చిత్ర, విచిత్ర భయానక గాథలో సమాధానాలు దొరకని ప్రశ్నలు, ఆశ్చర్యకరమైన క్లిష్ట సమస్యలు ఎన్నో ఉన్నాయి. మహారాష్ట్ర పోలీసు వ్యవస్థకు సంబంధించి ఏది సత్యమో ఏది అసత్యమో చెప్పలేని మహా రసవత్తర నాటకమొకటి కొద్ది వారాలుగా ప్రదర్శితమవుతుంది. తప్పుడు సాక్ష్యాలు సృష్టించడం, సాక్ష్యాధారాలు తారుమారు చేయడం, సాక్షిని హత్య చేయడం, నేరస్థులైన అధికారులను రక్షించడం, రాజకీయ నాయకుల కోసం వందల కోట్ల రౌడీ మామూళ్లు వసూలు చేసిపెట్టడం వంటి అనేక పనులు పోలీసు అధికారులు చేశారని, చేస్తున్నారని బైటపడుతుంది. నలుగురైదుగురు అధికారులు అరెస్టయి నేరారోపణలు ఎదుర్కొంటున్నారు.

సిపిగా పనిచేసిన పరమ్ బీర్ సింగ్ పెద్ద అవినీతిపరుడంటూ ఓ మాజీ పోలీస్ అధికారి ఆరోపించడం తాజాగా చర్చనీయాంశ మయింది. "గమ్ దేవీ పోలీస్ ఠాణాలో నేను పనిచేస్తున్న సమయంలో సస్పెండయ్యాను. అప్పట్లో ఆయన ఏసిబి చీఫ్‌గా ఉన్నారు. నన్ను తిరిగి విధుల్లోకి తీసుకునేందుకు రు. 2 కోట్ల లంచం డిమాండ్ చేశారు" అని సిఐ అనుదీప్ డాంగ్ వెల్లడించారు. దీనిపై మహారాష్ట్ర హోంశాఖ అదనపు కార్యదర్శికి ఫిర్యాదు చేశానన్నారు. "ఇదంతా ఓ కుట్ర, రాష్ట్రంలో శాంతి భద్రతల పరిస్థితి దిగజారిందన్న నెపంతో రాష్ట్రపతి పాలన విధించేందుకు బిజెపి కుట్ర పన్నింది" అని శివసేన తన పార్టీ పత్రిక సామ్నాలో రాసిన సంపాదకీయంలో పేర్కొనడం విడ్డూరంగా ఉంది.

రెండు మాసాలుగా మహారాష్ట్ర రాజకీయ పరిణామాలను సద్వినియోగం చేసుకుని రాష్ట్రపతి పాలన విధించి తిరిగి ఎన్నికలకు వెళ్లడానికి కేంద్రం పావులు కదుపుతుంది. ఇందులో భాగంగానే మహారాష్ట్ర బిజెపి నాయకుడు మాజీ ముఖ్యమంత్రి ఫడ్నవీస్ బృందం గవర్నర్ శ్రీ భగత్ సింగ్ కోషియాదీని కలిసి మహారాష్ట్ర ప్రభుత్వం 100 అక్రమాలకు పాల్పడిందని, ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి నుంచి వీటిపై వివరణాత్మక నివేదికను తెప్పించుకుని రాష్ట్రపతికి పంపాలని గవర్నర్‌ను అభ్యర్థించారు. ఒకవైపు దేశంలోనే అత్యధికంగా కరోనా వ్యాప్తి ఆందోళన కలిగిస్తుండగా, మరోవైపు హోం మంత్రిపై పోలీసు అధికారి చేసిన ఆరోపణల పర్యవసానాలు తీవ్రంగా పరిణమిస్తున్నాయి. శివసేన, నేషనల్ కాంగ్రెస్ పార్టీ(ఎన్‌సిపి), కాంగ్రెస్ సంకీర్ణ ప్రభుత్వం అధికారంలో ఉన్న మహారాష్ట్ర ప్రభుత్వాన్ని ఎలాగైనా సంకటంలోకి నెట్టాలని భారతీయ జనతా పార్టీ కేంద్ర ప్రభుత్వం మొదటి నుంచి ప్రయత్నాలు చేస్తున్నాయి.

మాఫియా ముఠాలకు కేంద్రమైన ముంబై గతంలో బయటపడిన కేసులు ఎలాంటివో తెలుసు. ఏ రాజకీయ పార్టీ అయినా ముంబై లాంటి ఆర్థిక రాజధాని నగరాన్ని చేజేతులా వదులుకోదు. మహారాష్ట్ర అంటేనే రాజకీయ పార్టీలు డబ్బు ముద్రించే ఫ్యాక్టరీ. దేశంలో జరిగే ఎన్నికలకు ఫండింగ్ అక్కడి నుంచే వస్తుంది. అన్నీ రాజకీయ పార్టీలకు ముంబై కామధేనువు. ఇటీవలే నేషనల్ క్రైం రికార్డ్స్ బ్యూరో విడుదల చేసిన తాజా నివేదిక దేశంలో అత్యంత అవినీతి నగరంగా ముంబై వరుసగా నాలుగోసారి రికార్డుకెక్కింది. ఎన్నిక తర్వాత మరో ఎన్నిక ... నాయకుడి తర్వాత మరో నాయకుడు ఇలా ముంబై వాసులు నిత్యం పోలీసులు, రాజకీయ నాయకులు, మాఫియాల గుప్పిట్లో బిక్కు బిక్కుమంటూ బతకాల్సిన పరిస్థితి. ముంబైలో దేశ్‌ముఖ్ మామూళ్ల వసూళ్ల కేసు ఇటు రాజకీయ నాయకులకు, అటు పోలీసులకు కంటిమీద కునుకు లేకుండా

చేస్తోంది. ఒకవేళ వాజే వాస్తవాలు వెల్లడిస్తే ఇంకా ఎందరు నాయకుల పేర్లు వెలుగులోకి వస్తాయో చూడాలి.

రాజకీయంగా గతంలో ఏక శరీరులుగా మెసులుకొని అధికారాన్ని కూడా పంచుకున్న బిజెపి, శివసేనలు 2019 నవంబర్ అసెంబ్లీ ఎన్నికల తర్వాత పాలక పగ్గాల కోసం ఎలాంటి వ్యూహ ప్రతివ్యూహాలు పన్నాయో తెలిసినవే. గత ఎన్నికల్లో బిజెపి అతి పెద్ద పార్టీగా అవతరించినా ఈ సారి ముఖ్యమంత్రి పదవి తమకే చెందాలంటూ శివసేన భీష్మించుకోవడంతో కాంగ్రెస్‌ను కూడా ఒప్పించి ప్రస్తుత ఐక్య సంఘటన ప్రభుత్వం ఏర్పాటు కావడానికి శరద్ పవార్ విజయవంతంగా నడిపించిన చాణక్యం ఇక్కడ ప్రస్తావించుకోదగింది. రాజకీయ శత్రుత్వాలను తీర్చుకోవడంలో అందుకోసం ఎలాంటి అప్రజాస్వామిక పన్నాగాలనైనా ప్రయోగించడంలో కేంద్ర పాలక పక్షానికి ఉన్న నేర్పు అపారమని పలు పరిణామాలు ఎత్తి చూపాయి. ప్రత్యర్థులపై నేరారోపణ చేసి, అరెస్టుచేసి, తాపీగా సాక్షాలు సృష్టించుకొని, న్యాయ వ్యవస్థను సానుకూలంగా మలుచుకొని నిర్దోషులకు శిక్షలు వేయించడంలో, అదే విధంగా ఎంతటి నేరస్థులైన నిర్దోషులుగా బయటికి రావడం మోడీ పాలనలో మనం చూస్తూనే ఉన్నాం. అందువల్ల ఈ కేసు దర్యాప్తు ఎలాంటి పరిణామాలకు దారితీస్తుందో వేచి చూడాలి.

మన్ సుఖ్ హిరెణ్ అనే వ్యక్తి శవమై కన్పించిన కేసులో తనకు ఎలాంటి సమస్యలు రాకుండా ఉండేందుకే పోలీస్ కమిషనర్ తనపై ఈ ఆరోపణలు చేశారని హోం మంత్రి అనిల్ దేశ్‌ముఖ్ ప్రత్యారోపణ చేశారు. ఈ ఆరోపణలు, ప్రత్యారోపణలు ఒక సత్యాన్ని వెల్లడించాయి. చేసిన పాపాలు ఎప్పటికైనా బయటపడతాయనేదే ఆ సత్యం. అవును, రాజకీయ నేతలు, పోలీసు అధికారులు గతంలో చేసిన పాపాలే ఇప్పుడు వారికి సమస్యలుగా పరిణమించాయి. మహారాష్ట్రలో, ఆ మాటకొస్తే యావద్భారతంలో రాజకీయ నాయకులు పోలీసుల మధ్య న్యాయవిరుద్ధ సంబంధాలు తేటతెల్లంగా పలుమార్లు బహిర్గత మయ్యాయి. పోలీస్ కమిషనర్‌ను బదిలీ చేయకుండా ఉన్నట్లయితే రాజకీయ నాయకుల ఆదేశాల గురించి ఒక్కమాట కూడా మాట్లాడి ఉండేవారు కాదని నిశ్చితంగా చెప్పవచ్చు. థానే కాలువలో మన్ సుఖ్ హీరణ్ శవాన్ని కనుగొని ఉండకపోయి ఉన్నట్టయితే ముఖేశ్ అంబానీ ఇంటి వద్ద పేలుడు పదార్థాల వాహనం కేసు ఇంత రచ్చకెక్కేదే కాదు.

ఇంతకీ సచిన్ వాజే నేపథ్యం ఏమిటి? 1990లో పోలీసు శాఖలో చేరిన వాజే మొదట రెండు సంవత్సరాలు గడ్చిరోలి జిల్లాలో నక్సలైట్ ప్రభావిత ప్రాంతాలలో పని ప్రారంభించి, మితిమీరిన అధికారాన్ని, హింసను ప్రయోగించి ఉన్నతాధికారుల మెప్పు పొందాడు. అలా 1992లో ముంబాయి శివార్లలోని థానేకు బదిలీ అయి, అతి త్వరలోనే 'ఎన్‌కౌంటర్ స్పెషలిస్టు'గా పేరు పొందాడు. స్వయంగా జులియో రెబిరో రాసిన ప్రకారం వాజేకు 1997 నుంచి 2004లో సస్పెన్షన్‌కు గురయ్యే వరకూ, కేవలం ఎనిమిది సంవత్సరాలలో 63 మందిని ఎన్‌కౌంటర్లలో చంపినందుకు పోలీస్ డిపార్ట్‌మెంట్‌లో ఖ్యాతి పొందాడు. అయితే ఘాట్కోపర్‌లో 2002లో జరిగిన బాంబు పేలుళ్ల సందర్భంగా అరెస్టు చేసిన వారిలో ఖాజా యూనస్ అనే యువకుడిని లాకప్‌లో చిత్రహింసలు పెట్టి హత్య చేసిన కేసులో 2004లో మరొక పదమూడు మంది పోలీసు అధికారులతో పాటు వాజే సస్పెన్షన్‌కు గురయ్యాడు. 2007లో పునర్నియామకం కోసం దరఖాస్తు పెట్టుకుని, అది తిరస్కరణకు గురయ్యాక, 2008లో ఉద్యోగానికి రాజీనామా చేసి శివసేన కార్యకర్తగా మారాడు. ప్రైవేట్ దర్యాప్తు సంస్థను నెలకొల్పి, ముంబైలో జరిగే కార్పొరేట్ నేరాల, బెదిరింపుల, అక్రమ వసూళ్ల కేసుల్లో దర్యాప్తు చేయడం ప్రారంభించాడు. శివసేన అభ్యర్థిగా శాసనసభకు పోటీ చేయడానికి కూడ ప్రయత్నించాడు. 2019 నవంబర్‌లో శివసేన ఎన్‌సిపి కాంగ్రెస్ ఐక్యసంఘటన ప్రభుత్వం ఏర్పడిన తర్వాత వాజే దశ తిరిగింది. 'కొవిడ్ అసాధారణ ఒత్తిడిని తట్టుకోవడానికి అదనపు బలగాలు అవసరం' అనే పేరుతో 2020 జూన్ 5న వాజే పునర్నియామకం థానే పోలీస్‌స్టేషన్‌లో జరిగింది. కీలకమైన క్రైం ఇంటిలిజెన్స్ యూనిట్ బాధ్యతలు అప్పగించారు. సచిన్ వాజేకు రాజకీయ నాయకుల, పోలీసు అధికారుల అండదండలు పుష్కలంగా ఉన్నాయి.

ముంబైలో 1750 బార్లు రెస్టారెంట్లు, ఇతర వ్యాపార సంస్థలుంటాయని ఒక్కొక్క దాని నుంచి రు. 2-3 లక్షల వరకు వసూలు చేసినా నెలకు 40 నుంచి 50 కోట్లు జమ అవుతాయని వాజేకి హోంమంత్రి వివరించి చెప్పారని ముఖ్యమంత్రికి రాసిన లేఖలో పరంబీర్ సింగ్ పేర్కొన్నారు. దీనితో దేశ్‌ముఖ్ రాజీనామా కోసం డిమాండ్ పెరిగి పెద్దదయింది. జాతీయ స్థాయి నాయకుడుగా లబ్ధప్రతిష్ఠుడైన శరత్ పవార్‌కే అపఖ్యాతి అంటుకునే పరిస్థితి తలెత్తింది. ఈ ఆరోపణ తక్షణమే అధికార కూటమికి మచ్చ తెచ్చి పెట్టింది. కాని దీని మూలాలను ఛేదించడం, నిజా నిజాలను నిర్ధారించడం మామూలుగా అయితే అంత తేలిక కాబోదు. మహా రాష్ట్ర సంఘటనలు ముంబై పోలీసులకు, ఎన్ఐఎ మధ్య, శివసేనకు ఆర్ఎస్ఎస్ మధ్య, మహారాష్ట్ర ప్రభుత్వానికి, కేంద్ర ప్రభుత్వం మధ్య ఘర్షణగా వ్యక్తమవుతున్నాయి.

ఈ ఉదంతంపై న్యాయపోరాటం ఎలా ఉన్నప్పటికీ, మహారాష్ట్ర ప్రభుత్వం పరువు ప్రతిష్ఠ దెబ్బతిన్నాయని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఆరోపణ లేఖ అందగానే హోంమంత్రిని తప్పించి దర్యాప్తుకు ఆదేశించి ఉన్నట్లయితే అది నిజాయితీగా ఉండేది. పూణేలో 22 ఏళ్ల మహిళ ఒకరు ఆత్మహత్య చేసుకున్న ఘటనలో ఆరోపణలతో శివసేనకు చెందిన సంజయ్ రాథోడ్ మంత్రి పదవికి రాజీనామా చేశారు. ఆరోపణలతో రాజీనామా చేసిన రెండవ మంత్రి అనిల్ దేశ్‌ముఖ్. 'వాజెగేట్'గా పిలవబడుతున్న వివాదం తదుపరి ప్రభుత్వంపై ప్రతిపక్ష బిజెపి రాష్ట్రం నుంచి కేంద్రం వరకు ఒత్తిడి పెంచింది. శివసేన తమతో తెగతెంపులు చేసుకుని ప్రత్యామ్నాయ ప్రభుత్వం ఏర్పాటు చేసిన పదహారు మాసాల కాలంలో ప్రభుత్వాన్ని ఇరకాటంలో పెట్టడమే పనిగా బిజెపి పనిచేస్తుంది. ప్రభుత్వాన్ని కూలదోసి ఎన్నికలు జరిపించడం దాని ప్రధాన లక్ష్యం.

శివసేన, బిజెపిలు రెండు ఫాసిస్టు విధానాలను అమలుచేసే పార్టీలే. ఒకవైపు నేరస్తులను కాపాడే పని శివసేన చేస్తుంటే, మరోవైపు తప్పుడు సాక్ష్యాధారాలను సృష్టించే పనిలో బిజెపి నిమగ్నమై ఉంది. ఈ పరిస్థితులు ఒక్క మహారాష్ట్రకే పరిమితమై లేవు. ఎంఎల్ఏల ఫిరాయింపులు, ప్రభుత్వాలను కూల్చడం, రాజకీయ నాయకులు- పోలీసులు కుమ్మక్కై హత్యలు, లూటీలు చేయడం దేశవ్యాప్తంగా సాధారణమై పోయాయి. సచిన్ వాజే కేసును కేంద్ర ప్రభుత్వం తనంతట తానుగా ఎన్ఐఎకు అప్పగించింది. అంబానీ ఇంటికి చేరువలో కనుగొన్న ఎయువిని, థానే వ్యాపారి మన్‌సుఖ్ హీరణ్ ఆత్మహత్య కేసు దర్యాప్తును కూడా ఎన్ఐఎ చేపట్టింది. నేరాలు రాజకీయాలు కలగలసినట్లుగా కనిపిస్తున్న ఈ కేసుల్లో రాజకీయ ఒత్తిళ్లకు అతీతంగా క్షుణ్ణంగా దర్యాప్తు జరుగుతుందా? ఈ దర్యాప్తు ప్రకంపనలు అనిల్ దేశ్‌ముఖ్‌తో ఆగవని, మరికొందరి పీఠాలూ కదులుతాయని కమలనాథులు చెబుతున్న జోస్యం-మహారాష్ట్ర రాజకీయాల్ని మరింత ఉద్విగ్న భరితం చేయనున్నాయా? వేచి చూడాలి.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# ఇక రాష్ట్రాలు ఉనికిలో ఉండవా!

*ఢిల్లీ లెఫ్టినెంట్ గవర్నర్‌కు సర్వాధికారాలు కట్టబెట్టడంతో ఎన్నికయిన ముఖ్యమంత్రి నామమాత్రం అయ్యాడు, ఇది ఫెడరల్ స్వభావానికి విఘాతం అంటున్నారు* **సతీష్ బైరెడ్డి**

పార్లమెంట్‌లో సంఖ్యాబలం ఉంటే చాలు ఏ చట్టమైనా చిటికెలో చేసేస్తాం అనే ధోరణిని ప్రదర్శిస్తోంది కేంద్ర ప్రభుత్వం. దేశం అంటే రాష్ట్రాలతో సంబంధం లేకుండా అంతా తానే అనే వైఖరిని నరేంద్ర మోడీ ప్రభుత్వం అనేక సందర్భాల్లో బయటపెడుతున్నది. రాజ్యాంగ సూత్రాలు,పార్లమెంటరీ నియమాల పట్ల కనీస గౌరవం కూడా చూపకుండా మెజార్టీ ఉంటే చాలు ఏమైనా చేసుకోవచ్చు అనే దురుసుతనం మితిమీరిపోతున్నది. జమ్మూకశ్మీర్ రాష్ట్ర ప్రతిపత్తిని రద్దు చేయడం మొదలు కుంటే మొన్నటి వ్యవసాయ చట్టాల వరకు అనేక బిల్లులను మూజువాణి ఓటుతో నెగ్గించుకుంటున్నది. గత మార్చిలో గవర్నమెంట్ ఆఫ్ నేషనల్ కాపిటల్ టెర్రిటరీ ఆఫ్ ఢిల్లీ అనే బిల్లును కూడా ఇలాగే ఆమోదింపజేసింది. ప్రతిపక్ష పార్టీలు అధికారంలో ఉన్న రాష్ట్రాల్లో అక్కడి ప్రభుత్వాలను తన అధికారాన్ని,డబ్బును, పలుకుబడిని ఉపయోగించి పడగొట్టడం తదుపరి అధికారాన్ని హస్తగతం చేసుకోవడం బీజేపీ కి పరిపాటయ్యింది. ఇది సాధ్యం కాదు అనుకున్న చోట గవర్నర్ వ్యవస్థను ఉపయోగించో,అక్కడి ముఖ్యమంత్రులను సామ దాన దండోపాయాలతో తన చెప్పు చేతుల్లో పెట్టుకొనే పనిని చేస్తున్నది. ఈ రెండు సాధ్యం కావు అనుకున్న పరిస్థితుల్లో తన చేతిలోనే ఉన్న అధికారాన్ని ఉపయోగించి ఆ ప్రభుత్వాలను నామమాత్రంగా మార్చే పనిని పెట్టుకున్నది. సరిగ్గా ఢిల్లీ విషయంలో పార్లమెంట్‌లో ప్రవేశపెట్టిన బిల్లు ద్వారా అదే చేసింది.

1991లో 69వ రాజ్యాంగ సవరణ ద్వారా 239 ఆర్టికల్‌ను రాజ్యాంగ 3వ భాగంలో చొప్పించడం ద్వారా దేశ రాజధాని అయిన ఢిల్లీ ప్రత్యేక రాష్ట్రమయ్యింది. అయితే దేశ రాజధాని కాబట్టి, దాని నైసర్గిక, రాజకీయ ప్రాధాన్యత రీత్యా పోలీసు, ప్రజాభద్రత మరియు భూ వ్యవహారాలను కేంద్ర ప్రభుత్వం చేతిలో ఉంచడం జరిగింది. ఈ రాజ్యాంగ నిబంధనల మేరకే గడచిన రెండు దశాబ్దాలకు పైగా బిజెపి, కాంగ్రెస్ ప్రభుత్వాలు అక్కడ పాలన కొనసాగించాయి. సంపూర్ణ రాష్ట్ర ప్రతిపత్తి కలిగిన రాష్ట్రాల్లో మాదిరిగా కాకుండా లెఫ్టినెంట్ గవర్నర్ పేరుతో కేంద్ర ప్రభుత్వ ప్రతినిధి ఒకరు ఆ రాష్ట్ర ప్రభుత్వ వ్యవహారాలకు,కే ంద్రానికి మధ్య వారధిగా వ్యవహరించాలి. దేశ రాజధానిలో అనేక దేశాల రాయబార కార్యాలయాలు ఉండటం, అంతర్జాతీయ ప్రాధాన్యత గల వ్యవహారాలు ఇక్కడే జరుగుతాయి కాబట్టి పూర్తి స్థాయిలో రాష్ట్ర ప్రతిపత్తి కాకుండా లెఫ్టినెంట్ గవర్నర్ సాయంతో అక్కడ ప్రజలెన్నుకున్న అసెంబ్లీ, ముఖ్యమంత్రి మంత్రుల వ్యవస్థ మనుగడలో ఉంటూ వస్తున్నది. కేంద్రంలో మోడీ–షాల అధికారం, ప్రభావం,పలుకుబడి మొదలయ్యాక దేశ వ్యాప్తంగా రాష్ట్రాలను బలహీన అపరిచే,మొత్తంగా సమాఖ్య వ్యవస్థను నిర్వీర్య పరిచే చర్యలు నిరంతరం ఏదో ఒక రూపంలో జరుగుతున్నాయి.

మోడీ 'హవా' నడుస్తున్న కాలంలో, రెండవ సారి భారీ మెజార్టీ వచ్చి అధికారంలోకి వచ్చిన కొద్ది రోజుల్లోనే ఆమ్ ఆద్మీ పార్టీ భారీ మెజారితో ఢిల్లీలో రాష్ట్ర ప్రభుత్వం ఏర్పాటు చేయడం మోడీ–షా ల ద్వయం జీర్ణించుకోలేకపోతున్నది. రెండవ సారి మోడీ మరింత మెజారిటీ తో కేంద్రంలో అధికారంలో వచ్చినా కూడా ఢిల్లీ రాష్ట్ర అసెంబ్లీ ఎన్నికల దగ్గరికి వచ్చే సరికి ఆమ్ ఆద్మీ ప్రభంజనాన్ని అడ్డుకోలేకపోవడమే కాదు పని విధానంలో కేజ్రీ వాల్ తో పోటీ పడలేకపోయాడు. పైగా దేశ వ్యాప్తంగా మోడీ హవా ఉంటే గీ ఆమ్ ఆద్మీ నన్ను సవాల్ చేయడమేంటి అనే అక్కసు పెరిగిపోయింది. మొదటి సారీ కేజ్రీవాల్ అధికారంలోకి వచ్చినప్పటినుండి ఆమ్ ఆద్మీ ని ఇబ్బంది పెట్టేలా, తన ప్రతినిది అయిన లెఫ్టినెంట్ గవర్నర్‌ను వాడుకోవడం, ఎన్నికైన ప్రజా ప్రభుత్వాన్ని దేనికి కొరగాకుండా,అసలు ఆ ప్రభుత్వ అస్తిత్వాన్నే నిరాకరించేలా లెఫ్టినెంట్ గవర్నర్ రూపంలో కేజ్రీవాల్ ప్రభుత్వ పనికి అడ్డురావడం పెద్ద ఎత్తున మొదలు పెట్టింది. కనీసం తన ప్రభుత్వంలో తనకవసరమైన అధికారులను కూడా నియమించుకునే స్వేచ్ఛ కూడా లేకుండా లెఫ్టినెంట్ గవర్నర్ ద్వారా మంత్రాంగాన్ని కొనసాగించింది. అత్యంత కీలకమైన నిర్ణయాలు, చట్టాల విషయంలో ఢిల్లీ అసెంబ్లీ ఆమోదించిన బిల్లులను తిప్పి పంపడమో,తిరస్కరించడమో చేయడం ద్వారా లెఫ్టినెంట్ గవర్నర్ కేంద్ర ఎజెండాను బాగానే ముందుకు తీసుకుపోయాడు. చేసేది ఏమి లేక పాపం కేజ్రీవాల్ వీధి పోరాటాలకు దిగాల్సి వచ్చింది.

చిలికి చిలికి గాలి వాన అన్నట్టు ఈ ఇద్దరి మధ్య గొడవ కాస్త కోర్టు మెట్లెక్కింది. ముందుగా ఢిల్లీ హైకోర్టు లెఫ్టినెంట్ గవర్నర్ కే సర్వాధికారాలుంటాయని తన తీర్పును చెప్పింది. ఈ తీర్పును కేజ్రీవాల్ ప్రభుత్వం సుప్రీం కోర్టులో సవాల్ చేయడంతో 2018 జులై లో అత్యున్నత న్యాయస్థానం తన తీర్పును వెలువరించింది. లెఫ్టినెంట్ గవర్నర్ రాజ్యాంగ స్ఫూర్తిని నిలబెట్టేలా వ్యవహరించాలని, ప్రజల చేత ఎన్నికైన ప్రభుత్వానికి స్వతంత్రంగా వ్యవహరించే రాజ్యాంగ బద్ధ అధికారం ఉంటుందని, లెఫ్టినెంట్ గవర్నర్ అధికారాలు పరిమితమైనవని, ప్రతి దాంట్లో జోక్యం చేసుకోవడం కుదరదని స్పష్టంగా పేర్కొన్నది. అతి ముఖ్యమైన, వివాదాలు తలెత్తుతాయన్న అంశాల పైన మాత్రమే లెఫ్టినెంట్ గవర్నర్ ముందస్తు అనుమతులు తీసుకోవాలని, ప్రతి దానికీ ప్రజా ప్రభుత్వ నిర్ణయాలను ప్రశ్నించే అధికారం లెఫ్టినెంట్ గవర్నర్ కు లేదని చెప్పింది. అత్యంత ప్రాధాన్యతా అంశాలు, ఇతర రాష్ట్రాలతో,కేంద్రంతో ఘర్షణ తలెత్తే అంశాలు,రాజ్యాంగ పరమైన అంశాలు మరే ఇతరమైన విశాల అంశాల విషయంలో మాత్రమే లెఫ్టినెంట్ గవర్నర్ రాష్ట్రపతికి నివేదించాలని ఇతర అంశాలన్నీ సాధారణ రాష్ట్రాల్లో మాదిరిగానే ఎన్నికైన ప్రభుత్వాల వలెనే వ్యవహరించవచ్చునని విస్పష్టంగా పేర్కొన్నది.

కేంద్ర ప్రభుత్వం మార్చ్‌లో ప్రవేశపెట్టిన గవర్నమెంట్ ఆఫ్ నేషనల్ కాపిటల్ టెర్రిటరీ ఆఫ్ ఢిల్లీ సవరణ బిల్లు,అటు తర్వాత రాష్ట్రపతి ఆమోద ముద్రతో చట్టంగా తయారైన ప్రక్రియ అంతా రాజకీయ దురుద్దేశంతో

# రాజకీయ సిద్ధాంతవేత్తగా మార్క్స్

***మార్క్స్‌ను రాజనీతి శాస్త్రజ్ఞుడిగా, సమ సమాజ స్వాప్నికుడిగా అర్థం చేసుకోవాలంటే, అతని రచనలను కూలంకషంగా అధ్యయనం చేయాలని  అంటున్నారు* కొండూరి వీరయ్య**

**కా**రల్ మార్క్స్ పేరు వినగానే మనకు గుర్తొచ్చేది వర్గాలు, వర్గదోపిడీ, వర్గపోరాటం, విప్లవం. డిగ్రీలో రాజనీతిశాస్త్రం పాఠాలు వినేటప్పుడు కూడా అదనపువిలువను, వర్గపోరాటాన్ని సిద్ధాంతీకరించిన మేధావిగానే మార్క్స్‌ను పరిచయం చేశారు. డిగ్రీ చివరి సంవత్సరంలో నాగార్జున విశ్వవిద్యాలయం ఇచ్చిన ప్రశ్నాపత్రంలో "మార్క్ సమాజాన్ని వర్గాలుగా విభజించి, వర్గపోరాటం అనే సూత్రాన్ని ప్రతిపాదించటంతో సమాజంలో హింసకు దారితీసింది. వివరించండి' అన్న ప్రశ్న నాకు గుర్తున్నంత వరకూ 10 మార్కుల ప్రశ్నగా వచ్చింది. సమాజ పరిణామంలో హింసకు ఓ ముఖ్యమైన పాత్ర ఉందన్నది చరిత్ర గుర్తించిన వాస్తవం. మార్క్స్ చేసిందల్లా ఈ విషయాన్ని బయటికి చెప్పటమే. అదేవిధంగా సమాజం వర్గాలుగా విభజితమై ఉందన్న వాస్తవం మార్క్స్ ఆవిష్కరించింది కాదు. ప్లేటో మొదలు నేటి వరకూ రాజనీతి శాస్త్రజ్ఞులకున్న అవగాహనే. ఈ వర్గాల మధ్య జరిగే పోరాటమే అంతిమంగా చరిత్ర గతిని మారుస్తుందన్నదే మార్క్స్ జోడింపు. ఈ వర్గాల్లో నిరంతరం దాష్టీకం చేసే వాడే, దోపిడి చేసేవాడే గెలుస్తాడన్న అవగాహన స్థానంలో దోపిడీకి, దాష్టీకానికి గురయ్యేవాడు కూడా గెలిచే అవకాశం ఉంది అన్న వాస్తవాన్ని గుర్తించింది మాత్రం మార్క్సే అన్నదాంట్లో సందేహం లేదు.

ప్రపంచీకరణ తీవ్రమైన సంక్షోభానికి లోనైన 2008 తర్వాతి నుండీ గత దశాబ్దకాలంలో మార్క్స్ రచనల పట్ల విశేషమైన ఆసక్తి పెరిగింది. జర్మనీ భాషలో పెట్టుబడి గ్రంథాన్ని పునర్ముద్రించారు. ఇంగ్లాండ్ రాణి ప్రపంచ ప్రఖ్యాతి చెందిన ఆర్థికవేత్తలను ఆహ్వానించి సంక్షోభానికి మూలాలు వెతికే దిశగా చర్చలు జరిపారు. ఆ సందర్భంగా నేటి సంక్షోభం గురించి మార్క్స్ ఏమన్నాడు అని ఆమె ప్రశ్నించటం రెండు విషయాలను సూచిస్తోంది. మొదటిది పెట్టుబడిదారీ వ్యవస్థ చలనసూత్రాల గురించిన అధ్యయనం చేస్తున్న 20, 21వ శతాబ్ది ఆర్థికవేత్తలు, నోబెల్ బహుతి గ్రహీతలెవ్వరూ ఈ వ్యవస్థ చలన సూత్రాలు, మనుగడ కొనసాగింపు సామర్థ్యం గురించి మార్క్స్‌ను మించిన కొత్త ఆవిష్కరణలేవీ చేయలేకపోయారన్నది మొదటి అంశం. ఈ దశాబ్దకాలంలో ప్రపంచంలో మార్క్స్ పట్ల పెరుగుతున్న ఆదరణ మార్క్సిజం పట్ల పెరుగుతున్న ఆదరణగా పరిగణించరాదన్నది రెండో అంశం. నేటి విశ్లేషణలన్నీ మార్క్స్‌ను కేవలం పెట్టుబడిదారీ వ్యవస్థ చలన సూత్రాలు ఆవిష్కరించిన ఆర్థికవేత్తగానే పరిగణిస్తున్నాయి. ఆయన మేధస్సును అంతవరకే పరిమితం చేస్తున్నాయ్ననది పై సందర్భం మనకు తెలియచేస్తున్న విషయం.

మార్క్సిజం మూడు మూలాధారాలపై నిలిచి ఉన్న శాస్త్రమన్న లెనిన్ విశ్లేషణ అందరికీ పరిచయమే. జర్మన్ తత్వశాస్త్రం, ఇంగ్లాండ్‌లో

---

కూడుకున్న ప్రతీకార చర్యగా కనపడుతుంది. సుప్రీంకోర్టు తీర్పు, రాజ్యాంగ స్ఫూర్తిని నిలబెట్టేలా ఉండాల్సిన చట్టం మరింత దుర్మార్గంగా, మొత్తంగా అసలు ఢిల్లీ రాష్ట్ర ప్రభుత్వ ఉనికినే ప్రశ్నార్థకం చేస్తున్నది. ఇటు రాజ్యాంగ సూత్రాల మేళవింపుగాని, సుప్రీం కోర్టు తీర్పు స్ఫూర్తి గాని ఈ చట్టంలో కనిపించగా పోగా మొత్తంగా కేంద్ర ప్రభుత్వ ప్రతినిధి అయిన లెఫ్టినెంట్ గవర్నర్ యే అసలైన పాలకుడు అనేలా ఈ చట్టం రూపొందించబడింది. ఈ చట్టం ప్రకారం ఇకనుండి ఢిల్లీ ప్రభుత్వం ఏ పని చేయాలన్నా లెఫ్టినెంట్ గవర్నర్ ముందస్తు అనుమతి తీసుకోవాల్సిందే. తాను తిప్పి పంపిన, లేదా తిరస్కరించిన ఏ అంశం కూడా చెల్లనేరదు. లెఫ్టినెంట్ గవర్నర్ ఏ విషయాన్ని అయినా రాష్ట్రపతికి నివేదించవచ్చు. అసలు లెఫ్టినెంట్ గవర్నర్‌తో విభేదించే అధికారమే లేదు.

నిజానికి రాజ్యాంగ సూత్రాల ప్రకారం గవర్నర్ అయినా లెఫ్టినెంట్ గవర్నర్ అయినా రాష్ట్రాల మంత్రి మండలి సూచనలకు అనుగుణంగానే పనిచేయాలని, మంత్రి మండలి తీసుకున్న ఏ నిర్ణయాన్ని అయినా సహేతుకమైన వివరణ లేకుండా తిరస్కరించే, తిప్పి పంపే అధికారం లేదని స్పష్టంగా కనిపిస్తుంది. ఇప్పుడు కేంద్రం తీసుకొచ్చిన ఈ చట్టం ద్వారా అది కాస్తా తిరగబడింది. ఇప్పుడు లెఫ్టినెంట్ గవర్నర్ దాయాదాక్షిణ్యాల మీద ఆధారపడి ఎన్నికైన ప్రజా ప్రభుత్వాలు పని చేయాల్సిన స్థితిని ఈ చట్టం తీసుకొచ్చింది. మూడు కీలకమైన ప్రధానంగా భూ సంబంధ వ్యవహారాలు, పోలీసింగ్,  ప్రజా భద్రతా వ్యవహారాల విషయంలో ప్రత్యేకించి దేశ రాజధాని ప్రాంతం కాబట్టి అర్థం చేసుకోవచ్చు అసలు మొత్తంగా ఒక మున్సిపాలిటీ కంటే హీనంగా ఒక రాష్ట్ర ఉనికిని దిగజార్చే చర్య పూర్తిగా రాజ్యాంగ వ్యతిరేకమైనదే కాకుండా, తాను ఏ పార్లమెంటరీ ఎన్నికల వ్యవస్థ ద్వారా అధికారంలోకి వచ్చిందో వాటి మౌళిక సూత్రాలను తుంగలో తొక్కే అప్రజాస్వామిక చర్య ఇది.

ఢిల్లీ రాష్ట్ర ప్రభుత్వానికి మాత్రమే ప్రస్తుతం పరిమితం కావొచ్చు గానీ బిజెపి, సంఘ్ పరివార్ ఎజెండా అయిన  'అఖండ హిందూ భారత్' నిర్మాణంలో గీ రాష్ట్రాల లెక్క ఎంత. అంతా కేంద్రీకృతం కావాలి. అన్ని వ్యవస్థలు తమ చెప్పు చేతుల్లో ఉండాలి. ఒకే దేశం ఒకే ఎన్నిక,ఒకే చట్టం,ఒకే భాష, ఒకే సంస్కృతి... ఇలా ఒకే ఒకే..అనుకునే ఫాసిస్టు ఎజెండాను అమలు చేయ చూస్తున్న బిజెపికి రాష్ట్రాల స్వతంత్ర వ్యవహార శైలి ఏ మాత్రం గిట్టదు. తన గుప్పిట్లోకి గుంజుకోవడం అనే ఈ దుర్మార్గం ఢిల్లీలో మొదలైనా ఇది దేశం అంతటికీ, అన్ని రాష్ట్రాలకి పాకిపోతుంది. ఏ స్వతంత్ర వ్యవస్థను మనుగడలో ఉండనివ్వదు. పార్లమెంటరీ రాజకీయాల్లో తలమునకలైన రాజకీయ పార్టీలు దేశ వ్యాప్తంగా రాబోయే ఈ ప్రమాదాన్ని ఎదుర్కునేల సన్నద్ధం కాకపోతే తమకు తాము పార్టీలుగా, రాజకీయ సంస్థలుగా చెప్పుకునే అవకాశం కోల్పోతారు సుమా...

*(రచయిత ఆంగ్ల ఉపన్యాసకులు)* వీ

తెరమీదకు వచ్చిన పెట్టుబడిదారీ వ్యవస్థ చలనశీల సూత్రాల అధ్యయనం, ఫ్రెంచ్ సమాజంలో చోటుచేసుకున్న రాజకీయ పరిణామాల విశ్లేషణ మార్క్సిజానికి గల మూడు మూలాధారాలు. కాలక్రమంలో మొదటిది గతితార్కిక చారిత్రక భౌతికవాదంగానూ, రెండోది రాజకీయ అర్థశాస్త్రంగానూ క్రోడీకరించబడ్డాయి. ఈ మూడింటిలో మార్క్సిస్టు ఆర్థికశాస్త్రం గురించిన విశ్లేషణలు కోకొల్లలు. మార్క్సిస్టు తాత్విక పునాదిగా ఉన్న జర్మన్ భావజాల విశ్లేషణ గురించి ప్రత్యేకంగా చిరపరిచితమైన రచనలు లేకపోయినా మార్క్సిస్టు తాత్విక సిద్ధాంతం అని పిల్చుకునే చారిత్రకభౌతికవాదం, గతితార్కిక భౌతికవాదాలను మార్క్స్-ఏంగెల్స్ అనంతర కాలంలో క్రోడీకరించారు. అవే క్రోడీకరణలు ప్రపంచవ్యాప్త వామపక్ష ఉద్యమ శిక్షణా కేంద్రాల్లో పాఠ్యాంశాలుగా బోధించబడుతున్నాయి. మార్క్సిస్టు విద్యాభ్యాసంలో అంతగా ప్రాచుర్యం పొందని కోణం ఓ రాజనీతిజ్ఞునిగా మార్క్స్ పాత్ర, నడుస్తున్న చరిత్రను మార్క్స్ ఎలా అధ్యయనం చేశాడన్న కోణాలు.

థామస్ హాబ్స్ లెవియథాన్ లాగానో, అరిస్టాటిల్ పాలిటిక్స్ లాగానో, ప్లేటో రిపబ్లిక్ లాగానో, హెగెల్ ఫిలాసఫీ ఆఫ్ రైట్ లాగానో తన రాజకీయ అవగాహనను మార్క్స్ ఓ రచనలో మనకు అందుబాటులోకి తేలేదు. మార్క్సిస్టు రాజకీయ అవగాహనను పుణికి పుచ్చుకోవాలంటే మార్క్స్ రచనలనేకం చదవాల్సి ఉంటుంది. మార్క్స్ వాంగ్మయంలో నేటికీ ప్రచురణకు నోచుకోని రచనలు, వ్యాఖ్యానాలు ఇంకా ఉన్నాయంటే ఆయన జీవితకాలంలో సాగించిన అధ్యయనాల సాంద్రత, తీవ్రతను గమనించవచ్చు. రాజనీతి శాస్త్రజ్ఞుడిగా మార్క్స్ గురించి తెలుసుకోవటానికి సాగించిన అధ్యయనం ఫలితమే ఈ వ్యాసం.

రాజనీతి శాస్త్రజ్ఞుడిగా మార్క్స్‌ను అర్థం చేసుకోవాలంటే ఆయన రచనా క్రమాన్ని పరిశీలించాలి. రాజకీయ అంశాలపై మార్క్స్ రచనలను మూడు తరగతులుగా విభజించవచ్చు. కమ్యూనిస్టు ప్రణాళిక రాయడానికి ముందు సాగించిన రచనలు, కమ్యూనిస్టు ప్రణాళిక నుండి ఫ్రాన్స్‌లో అంతర్యుద్ధం అన్న ఉపన్యాసం వరకూ సాగిన రచనలు, పెట్టుబడి గ్రంథం ముసాయిదా ప్రతులు పూర్తి చేసిన తర్వాత రష్యా పరిణామాల నేపథ్యంలో యూరోపేతర దేశాల చరిత్రను అధ్యయనం చేయడానికి సాగించిన రచనలు. వీటిలో చివరి దశాబ్దకాలంలో సాగించిన అధ్యయనాల ఆధారంగా రాసుకున్న చిత్తు ప్రతులు ఈ మధ్యనే వెలుగుచూడనారంభించాయి. వీటిలో కొన్నింటిని మార్క్స్ ఆన్ మార్జిన్స్ పేరుతో ఓ గ్రంథంగా కెవిన్ ఆండర్సన్ వెలువరించారు.

రెండో దశలో మార్క్సిస్టు రాజకీయ అవగాహనకు అద్దంపట్టే రచనలు ఫ్రాన్స్ పరిణామాలపై మార్క్స్ సాగించిన విశ్లేషణలు. మార్క్స్ తాను జర్మన్ భావజాలం గ్రంథంలో ప్రతిపాదించిన చారిత్రక భౌతికవాద సూత్రాలను సమకాలీన ఫ్రెంచి పరిణామాలను విశ్లేషించడానికి వర్తింపచేశారు. లూయీ బోనపార్తే 18వ బ్రూమెయిర్, ఫ్రాన్స్‌లో వర్గపోరాటాలు, ఫ్రాన్స్‌లో అంతర్యుద్ధం నిర్దిష్ట పరిస్థితులను నిర్దిష్టంగా అధ్యయనం చేసిన ప్రయత్నాలే. ఈ మూడు రచనల్లోనూ సమకాలీన రాజకీయ పరిణామాల విశ్లేషణతో పాటు ఆ పరిణామాలకు నాయకత్వం వహించిన లేదా ప్రభావితం చేసిన వ్యక్తులు, వారి వర్గనేపథ్యం గురించిన అంచనాలు కూడా మనం చూడొచ్చు. పాలకవర్గ కూటమి నిర్మాణం, ఆర్థిక సంక్షోభాల రాజకీయ ప్రభావం, కార్మికవర్గ నాయకత్వ పాత్ర, రైతాంగపు సమరశీల లక్షణం, సోకాల్డ్ ప్రజల ద్వారా ఎన్నికైన నెపోలియన్ ప్రజలపై సాగించిన అణచివేత వంటి అంశాల గురించి ఈ రచనల్లో మార్క్స్ వ్యక్తం చేసిన అంచనాలతో చిన్నా చితకా బేధాభిప్రాయాలు, భిన్నాభిప్రాయాలు ఉన్నప్పటికీ ఆధునిక చరిత్రకారులు స్థూలంగా ఏకీభవిస్తున్నారు.

19వ శతాబ్ది యూరప్‌లో చోటుచేసుకున్న జనతాప్రజాతంత్ర విప్లవాల్లో (సోషల్ డెమొక్రటిక్ రివల్యూషన్స్) నాటి కార్మికవర్గం కీలక పాత్ర పోషించింది. యూరప్‌లో ప్రజాస్వామ్యం, సంస్కరణల కోసం సాగిన ఉద్యమాన్నే మార్క్స్ ఏంగెల్స్‌లు సోషల్ డెమొక్రటిక్ ఉద్యమంగా నిర్వచించారు. ఫ్రాన్స్‌లో రెండో రిపబ్లిక్‌కు పునాదులు పడినకాలం 19వ శతాబ్ది తొలి అర్ధభాగం. ఈ కాలంలో నిరంతరం మారుతూ వచ్చిన వర్గ పొందికలు, కూటముల విశ్లేషణ మనకు ఫ్రాన్స్ గురించిన మార్క్స్ రచనల్లో కనిపిస్తుంది. ప్రజాస్వామిక పోరాటం దశలో కార్మికవర్గం, మధ్యతరగతిల ఐక్య సంఘటనను మార్క్స్ సమర్థించాడు. మొదటి కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ రూపంలో కార్మికవర్గానికి తనదైన రాజకీయ శక్తి సమకూరిన తర్వాత కార్మికవర్గం-మధ్యతరగతి కూటమి కార్మికవర్గ నాయకత్వంలో నడవాలని సూత్రీకరిస్తాడు. ఈ దిశగా ఫ్రాన్స్‌లో వర్గపోరాటాలు అన్న గ్రంథంలో కార్మికవర్గం పెటిబూర్జువా ఆదర్శాలు, భావవాదం నుండి బయటపడటం విప్లవకర వర్గంగా తనను తాను మల్చుకునే ప్రక్రియలో కీలక సందర్భమని చెప్తాడు. 1850 దశకంలో యువ హెగెలియన్లతో విడగొట్టుకుంటూ శాస్త్రీయ సోషలిజం, కమ్యూనిజం సిద్ధాంతీకరణ దిశగా అడుగులు వేస్తున్న మార్క్స్ ఏంగెల్స్‌లు 1848-51 మధ్య ఫ్రాన్స్, జర్మనీ దేశాల్లో జరిగిన విప్లవాల్లో కార్మికుల ప్రత్యక్ష కార్యాచరణను ఆసక్తిగా గమనించారు. అధ్యయనం చేశారు. ఒక్క మాటలో చెప్పాలంటే మార్క్స్, ఏంగెల్స్‌లు జర్మన్, ఫ్రాన్స్‌లు భూస్వామ్య రాచరిక వ్యవస్థల నుండి తమ కళ్ల ముందే బూర్జువా ప్రజాస్వామ్య వ్యవస్థలు అవతరిస్తున్న పరిణామాన్ని చూడగలిగారు. ప్రతి సమాజం ఓ దశ నుండి మరో దశకు మారుతున్న తరుణాన్ని చాలామంది ఆ సమాజంలో పౌరులుగా ఉంటారు. సమాజం తనకు కేటాయించిన స్థానాన్ని బట్టి తమవంతు కర్తవ్య నిర్వహణలో నిమగ్నులై ఉంటారు. కానీ మార్క్స్ ఏంగెల్స్‌లు అటువంటి పరిణామాన్ని నిబిడాశ్చర్యంతో నువ్వు అన్నట్లు వీక్షించటానికి మాత్రమే పరిమితం కాలేదు. ఆ మార్పుకు చోదకశక్తులైన వర్గాలు, వాటి స్వభావం, తర్వాత ఏర్పడిన రాజ్యాంగ యంత్రం, మానవాళి అంతిమ విముక్తి మార్గమైన కమ్యూనిజం సాధనగా కార్మికవర్గం నాయకత్వంలో జనబాహుళ్యం ప్రయాణించడానికి సిద్ధమైనప్పుడు ఈ రాజ్యాంగయంత్రం పోషించే పాత్రలను మదింపు వేసే చరిత్రకారుల పాత్ర పోషించారు. ఈ సందర్భంగానే 1848లో ఫ్రెంచి రిపబ్లిక్ ఆవిష్కృతమైన సందర్భంగా లండన్‌లో జరిగిన ఫెస్టివల్ ఆఫ్ నేషన్స్ సభలో మాట్లాడుతూ ఏంగెల్స్ " ప్రజాస్వామ్యం ఇప్పుడు కార్మికవర్గ సూత్రం అయ్యింది. జనబాహుళ్య స్వభావాన్ని సంతరించుకుంది. ఈ వాస్తవాన్ని, ప్రజాస్వామ్యపు నిజమైన అర్థాన్ని జనం గుర్తించగలిగి ఉండొచ్చు. గుర్తించలేకపోవచ్చు. కానీ ప్రజాస్వామ్యం అంటే సామాజిక సమానత్వం అన్న మౌలిక భావనను మాత్రం అందరూ అర్థం చేసుకుని ఉంటారు. కమ్యూనిస్టు శక్తులు బలోపేతం అవ్వాలంటే ఈ ప్రజాస్వామిక జనబాహుళ్యంతో ఏదో ఓ మోతాదులో జతకట్టాల్సి ఉంటుంది." అని ప్రకటిస్తాడు.

మార్క్స్ 1847లో కమ్యూనిస్ట్ లీగ్‌లో చేసిన ఓ ప్రసంగంలో యూరోపియన్ దేశాలు సోషలిజం సాధించడానికి ముందు బూర్జువా విప్లవం దశ గుండా ప్రయాణం చేయాల్సి ఉందన్న అంచనాను వ్యక్తం చేస్తాడు. 1848 ఫిబ్రవరి నాటి ఫ్రాన్స్ పరిణామాలను ఈ అంచనా (సమాజం నాలుగు దశల్లో సోషలిస్టు దశకు ప్రయాణిస్తుందన్న సూత్రీకరణ) వెలుగులోనే విశ్లేషిస్తాడు. ఈ క్రమంలోనే ఫ్రాన్స్‌లో భూస్వామ్య వ్యవస్థ, కార్పొరేటిజం, కులీన వర్గాలకు ప్రయోజనాలు

సమకూర్చే పద్ధతులు వంటి వాటిని సమూలంగా ధ్వంసం చేసినప్పుడు నిజమైన ప్రజాస్వామిక వ్యవస్థలోకి ప్రవేశించగలుగుతారని, అటువంటి ప్రజాస్వామిక వ్యవస్థ కార్మికవర్గ భౌతిక ప్రయోజనాలు ముందుకు తీసుకెళ్లేందుకు దోహదం చేస్తుందని వ్యాఖ్యానిస్తాడు. జనతా ప్రజాస్వామిక విప్లవం దశలో బూర్జువావర్గం అసంపూర్ణంగా వదిలిన కర్తవ్యాలను నెరవేర్చే క్రమంలో కార్మికవర్గం రైతాంగంతో జతకట్టాల్సి ఉంటుందని తద్వారా బూర్జువావర్గంపై ఆధిపత్యాన్ని సంపాదించ గలుగుతుందని, ఈ ప్రయత్నంలో విజయం సాధించడం అనేది కమ్యూనిస్టుల నాయకత్వంలోని కార్మికవర్గపు క్రియాశీలతపైనే ఆధారపడి ఉంటుందని విశ్లేషిస్తాడు.

ఫ్రాన్స్‌లో పిడికెడు మంది కులీన వర్గాలకు చెందిన వ్యక్తులు మొత్తం పార్లమెంటరీ వ్యవస్థను తమ కనుసన్నల్లో నడిపించుకుంటూ ఉదారవాద నియంతృత్వం దిశగా దేశాన్ని నడిపిస్తున్న తరుణంలో జనతా ప్రజాస్వామ్య సాధనే ప్రథమ కర్తవ్యంగా ఉంటుందని అంచనాకు వచ్చాడు. ఈ అవగాహనతోనే మార్క్స్, ఏంగెల్స్‌లు 'సంస్కరణలు' అన్న పత్రిక ప్రతిపాదించిన కార్యక్రమాన్ని పూర్తిగా సమర్థిస్తారు. స్వాగతిస్తారు. 1848 నాటి విప్లవాల నేపథ్యంలో ఈ పత్రిక భారీ పరిశ్రమలను జాతీయపరం చేయడం, చిన్న తరహా ఖార్ఖానాలను క్రమంగా సహకార వ్యవస్థలోకి బదలాయించడం వంటి ప్రతిపాదనలు ముందుకు తెచ్చింది. నాటి రాచరిక వ్యవస్థలో ఫ్రెంచి పెటీ బూర్జువావర్గం మనుగడ సాగించడానికి కీలకమైన రుణాలు, మార్కెట్ నియంత్రణల విషయంలో వివక్షకు గురికావడంతో నాటి విప్లవంలో ఈ వర్గం కార్మిక వర్గం, రైతాంగంతో జతకడుతుంది. 1848 ఫిబ్రవరి తిరుగుబాటు బూర్జువావర్గంపై కార్మికవర్గపు తిరుగుబాటునీ, ఈ తిరుగుబాటు జయాపజయాలు కార్మికవర్గ మద్దతు పొందిన సంస్కరణవాదుల కూటమికి పెటీ బూర్జువా వర్గానికి ప్రాతినిధ్యం వహిస్తున్న జాతీయవాదులకు మధ్య జరిగే పోరాటంపైనే ఆధారపడి ఉంటుందని అంచనా వేశాడు. పెట్టుబడిదారీ వ్యవస్థలోనూ దాన్ని వెన్నంటి వస్తున్న రాజ్యాంగయంత్ర స్వరూప స్వభావాల్లోనూ వస్తున్న మార్పులను గమనించాలని, తదనుగుణంగా ఉద్యమ నినాదాలు, లక్ష్యాలు మార్చుకోవాలన్న సూచనలు ఈ రచనల్లో మనకు వ్యక్తమవుతున్నాయి. విస్తృతమైన సమాచారం, ఆయా వర్గాల ప్రతినిధుల రాజకీయ ఆర్థిక ఎజెండాలు మనకు స్పష్టంగా కనిపిస్తున్నా నేడు ఎవరు ఏ వర్గమో అంచనా వేయడంలో తరచూ తడబడుతూ తప్పుడు ఎత్తుగడలు వేయడం, తర్వాత తీరిగ్గా ఆత్మవిమర్శ చేసుకోవటం మనకు కనిపిస్తున్న పరిణామం.

నానాటికీ విప్లవకర వర్గంగా మారుతున్న కార్మికవర్గాన్ని కట్టడి చేయడానికి బోనపార్తే నాయకత్వంలో ఫ్రాన్స్ పాలకవర్గం తమ మిత్రకూటమిని పునః నిర్మించుకుంది. అప్పటి వరకూ ఈ మొత్తం పరిణామాలకు దూరంగా ఉన్న రైతాంగాన్ని, ఊగిసలాడుతున్న పెటీబూర్జువా వర్గాన్ని తమతో కలుపుకురావడానికి కావల్సిన వ్యూహాన్ని రచించింది. పోలీసు యంత్రాంగాన్ని ఉపయోగించింది. ఈ పరిస్థితుల్లో దిశా నిర్దేశం చేయదగ్గ స్థాయిలో కార్మికవర్గ పార్టీల నిర్మాణం, సైద్ధాంతిక స్పష్టత, ఆయా సమాజాల్లో వర్గ నిర్మాణం, వర్గ పొందికల గురించిన అంచనాలు లేకపోవడం వంటి అనేక అంశాలు పాలకవర్గపు సామర్థ్యాలకు తోడై జూన్ 1851 నాటికి విప్లవం జ్వాల చల్లారింది. అప్పటి వరకూ తనను తాను రాజ్యాంగం ద్వారా అధికారానికి వచ్చిన ప్రజాస్వామ్య వాదినని చెప్పుకుంటూ ఊగిసలాడే వర్గాల మద్దతు కూడగట్టుకున్న బోనపార్తే రాత్రికి రాత్రి తనను తాను చక్రవర్తిగా ప్రకటించుకున్నాడు.

ఈ పరిణామాలన్నీ అత్యంత దగ్గరగా పరిశీలించిన మార్క్స్ సోషల్ డెమొక్రాట్లు, వారికి పునాదిగా ఉన్న పెటీబూర్జువా వర్గం గురించి మార్క్స్ కొత్తగా ప్రారంభించిన పత్రికలో రాస్తూ ఏంగెల్స్ ఈ వర్గం కంటిముందు ఏ ప్రమాదమూ కనిపించనంత వరకూ అత్యంత విప్లవకర స్వభావం కలిగినదిగా కనిపిస్తుంది. మాట్లాడుతుంది. ఎప్పుడైతే ఉద్యమం ఊపందుకుంటుందో, నాయకత్వం తమ చేజారిపోతుందన్న భావన కలుగుతుందో, ఉద్యమకారులు సాయుధులవుతారో అటువంటప్పుడు ఉద్యమాన్ని చీల్చి మితవాద శక్తులతో చేతులుకలపడానికి వెనకాడదని జర్మన్ పెటీ బూర్జువా వర్గాన్ని విమర్శిస్తాడు. ఎల్బర్ఫీల్డ్‌లో బర్గర్లు నిస్సత్తువకు లోనుగావడం, ఫ్రాంక్‌ఫర్ట్‌లో వామపక్షవాదులు ఎటూ తేల్చుకోలేకపోవడం, బ్రూనో బ్రెటానో ఉద్దేశ్యపూర్వకంగా మోసపూరిత చర్యలకు పాల్పడటం వంటి సందర్భాలు, పరిణామాలు గమనించిన తర్వాత కార్మికవర్గం సాయుధులవకుండా ఈ పెటీబూర్జువావర్గం ఉద్యమబాటలో నిలువలేదన్న నిర్ధారణకు వస్తారు మార్క్స్-ఏంగెల్స్‌లు. ఈ అనుభవంతోనే ఫ్రాన్స్ పరిణామాలను మదింపు వేసిన మార్క్స్ ఏంగెల్స్‌లు 1848 తర్వాత ఫ్రాన్స్‌లో పాలకవర్గకూటమి పొందికలోనూ, దానికి నాయకత్వపు వర్గపునాదిలోనూ వస్తున్న మార్పులను నమోదు చేస్తారు. పెటీబూర్జువా వర్గం కార్మికులు, మధ్యతరగతితో కలిసి ప్రజాతంత్ర కూటమికి ప్రాతినిధ్యం వహించడానికి బదులుగా తన పరిమిత, సంకుచిత వర్గపునాదిని కాపాడుకోవడానికి సిద్ధపడింది. ప్రపంచీకరణ దశలో భారత రాజకీయాల్లో ప్రాంతీయ బూర్జువాల పాత్రను అంచనా వేసేటప్పుడు గుర్తు పెట్టుకోవాల్సిన కీలకాంశం ఇది.

ఫ్రాన్స్‌లో వర్గపోరాటాలు అన్న రచనలో మూడో అధ్యాయం ఓ రకంగా 1848-50 పరిణామాలను సమీక్షించి పాఠాలు నమోదుచేసే ప్రయత్నం. కార్మికవర్గం పార్లమెంటరీ ప్రజాస్వామ్యపు భ్రమల నుండి బయపడిందనీ, ఈ పోరాటాలు, అనుభవాలు, పరాజయాల నుండే తన అంతిమ లక్ష్యమేమిటో గుర్తించిందనీ చెప్తాడు. ఫ్రాన్స్‌లో పెట్టుబడిదారీ వ్యవస్థ అసమాన అభివృద్ధి విప్లవోద్యమానికి ఆటంకం కాబోదని, నిజానికి విప్లవోద్యమాన్ని ముందుకు తీసుకెళ్లే అవకాశాలు తెచ్చిపెడుతుందనీ అంచనా వేస్తాడు. పారిస్‌లో కార్మికవర్గం వ్యూహాత్మక స్థానంలో ఉండటం వలన 1848 తిరుగుబాట్లకు తెరతీయగలిగిందన్న అంచనాను మనముందుంచుతాడు. పారిశ్రామిక పెట్టుబడి ద్రవ్యపెట్టుబడి పంచన చేరడం, ఫ్రాన్స్ బూర్జువావర్గం, ఇంగ్లాండ్ బూర్జువావర్గం పంచన చేరడంతో ద్రవ్యపెట్టుబడి గుత్తాధిపతులు, భూస్వాములకు వ్యతిరేకంగా రైతాంగం, వృత్తిదారులు, కార్మికులు, వస్తూత్పత్తి రంగంలోని పరిశ్రమల యాజమాన్యం మధ్య విశాల కూటమి ఏర్పడటానికి కావల్సిన భూమిక సిద్ధమవుతుందని విశ్లేషిస్తాడు. ఆయా వర్గాల ప్రయోజనాలు కాపాడుకోవడానికి కావల్సిన రీతిలో వర్గచైతన్యం పొందటమన్నది ఆయా స్థల కాలాల్లోని భౌతిక పరిస్థితులను బట్టి ఉంటుందని సూత్రీకరిస్తూ గతంలో యాభయ్యేళ్లకు వివిధ వర్గాలు, వాటి చైతన్యం పతాక సన్నివేశానికి చేరితే ఈ మూడేళ్లల్లో (1848 ఫిబ్రవరి నుండి 1851 మధ్యకాలంలో) కొన్ని వారాల్లోనే పలు వర్గాలు తమ వర్గచైతన్యాన్ని సంతరించుకున్నాయని చెప్తాడు. నిరంతరం సాగే పోరాటాలు వాటి తీవ్రత, ఆయా పోరాటాల్లో వివిధ వర్గాలు ఏ రూపంలో భాగస్వాములవుతున్నారు అన్న వాస్తవికత ఆధారంగానే ఆయా వర్గాల చైతన్యం రూపుదిద్దుకుంటుందన్న విషయాన్ని మనకు వివరిస్తారు. ఉదాహరణగా సోషలిస్టు భావాలతో పరిచయం, సాంగత్యం, మితవాద ప్రభుత్వాల వాగ్దానభంగం వంటి సందర్భాల్లో రైతాంగంలో నిద్రాణంగా ఉన్న పోరాట తత్వాన్ని బయటికి తీస్తుందని వివరిస్తారు. ఇదే విషయాన్ని

వక్కాణిస్తూ "పార్టీ ఆఫ్ ఆర్డర్ (బోనపార్తే నాయకత్వంలోని పార్టీ)కి వ్యతిరేకంగా వివిధ వర్గాలు తమ వర్గ పరిధిని అధిగమించి దిగువనున్న తరగతుల పారిశ్రామికీకరణ పూర్వపు, ఆదర్శవాద రిపబ్లికన్ సాంప్రదాయాలతో పాటు బూర్జువా వర్గంలో ఓ ముక్కను తమతో కలుపుకుని ప్రజాతంత్ర కూటమిని నిర్మిస్తాయి" అని సూత్రీకరిస్తాడు. విశాల ప్రజాతంత్ర కూటమిని ఏర్పాటు చేయడంలో పారిశ్రామికీకరణ పూర్వపు ప్రజాతంత్ర ధోరణులను, సంస్కృతిని ఆధునిక ప్రజాతంత్ర ఉద్యమంతో మేళవించాల్సిన అవసరం ఈ సందర్భంగా వర్తమాన కమ్యూనిస్టుల లక్ష్యంగా ఉండాలన్న వాస్తవాన్ని పై ప్రస్తావన రూఢీపరుస్తుంది.

కార్మికవర్గ ప్రభుత్వం ప్రభావం, పలుకుబడి పెరుగుతున్న తరుణంలో బూర్జువావర్గం కార్మికవర్గం పట్ల కవ్వింపు చర్యలకు పాల్పడుతుంది. దీనికి ప్రతిగా కార్మికవర్గ నాయకత్వం తమ శక్తిసామర్థ్యాలు, భౌతికపరిస్థితులు, మిగిలిన జనబాహుళ్యపు సన్నద్ధత గురించిన అంచనా లేకుండా పూర్తిస్థాయి తిరుగుబాటుకు సిద్ధమవుతుంది. జూన్ తిరుగుబాటుగా గుర్తింపు పొందిన ఉద్యమంలో కార్మికవర్గం ఉమ్మడి నాయకత్వం, వ్యూహం, ఎత్తుగడలు లేకుండా తిరుగుబాటుకు సిద్ధమవడం బూర్జువావర్గపు కవ్వింపు చర్యలు ఫలితమేనని మార్క్స్ విశ్లేషిస్తాడు. ఈ ప్రయత్నంలో పూర్తిగా పరాజయం పాలైన కార్మికవర్గం బూర్జువా వర్గాన్ని గద్దెదించాలని, సంకీర్ణ రాజ్యం స్థానంలో సంపూర్ణ కార్మిక రాజ్యం కోసం పోరాడాలన్న నినాదాలను తెరమీదకు తెస్తుంది. అంతిమంగా కార్మికవర్గ విప్లవ ప్రయత్నాలను జయప్రదంగా తిప్పికొట్టిన పాలకవర్గాలు తమ మధ్య అధికారాన్ని పంచుకునే మంతనాల్లో పడతాయి. పార్లమెంటరీ పరిమితులను అధిగమిస్తూ తమ వర్గ ప్రయోజనాలను కాపాడుకోవడానికి గాను కార్యనిర్వాహక వర్గపు అధికారాలను మరింత బలోపేతం చేస్తారు.

సాయుధులైన కార్మికవర్గం 1848 ఫిబ్రవరి విప్లవంలో పెటీ బూర్జువా వర్గాన్ని ముందుకు నెడతారు. కానీ సదరు పెటీ బూర్జువావర్గం 1848 జూన్ నాటికి కార్మికవర్గంతో తెగతెంపులు చేసుకుంటుంది. ఈ అనుభవాల తర్వాత జూన్ 13 నాటి పరిణామాలు పెటీబూర్జువా వర్గపు నిజ స్వభావాన్ని బట్టబయలు చేసిన తర్వాత కార్మికవర్గం క్రమంగా బూర్జువా ప్రజాస్వామ్యంపై భ్రమలు వదులుకుని సోషలిస్టు పంథా దిశా ప్రయాణించడమొక్కటే తమ విముక్తికి మార్గమన్న వాస్తవాన్ని గుర్తిస్తారు. ఈ ప్రయత్నాల పర్యవసానంగా పాలకవర్గాలు కార్మికవర్గాన్ని నియంత్రించటానికి అవసరమైతే వందేళ్ల క్రితం తిరస్కరించిన రాచరికానికి అధికారం అప్పగించటానికి కూడా వెనకాడరన్న వాస్తవాన్ని మార్క్స్ స్పష్టం చేస్తాడు. ఈ పరిణామాలు ముందువెనకలుగా అన్ని వర్ధమాన దేశాల్లోనూ తర్వాతి కాలంలో కనిపించాయి. ఉదాహరణకు ఇరాన్, ఇండొనేషియాల్లో కమ్యూనిస్టు పార్టీల నాయకత్వంలోని కార్మికవర్గ పురోగమనాన్ని అడ్డుకోవడానికి సామ్రాజ్యవాదం మధ్యయుగాల ఆలోచనా ధోరణులకు ప్రాతినిధ్యం వహించే ఇస్లామిక్ ఛాందసవాద శక్తులను గద్దెనెక్కించిన వైనాన్ని గుర్తు తెచ్చుకోవచ్చు. లాటిన్ అమెరికాలో ప్రజాతంత్ర తిరుగుబాట్లను అణచివేయటానికి నయావలసవాదానికి పట్టుగొమ్మలుగా ఉన్న వర్గాలకు అధికారం అప్పగించేందుకు అవసరమైతే రక్తపాతానికి కూడావెనకాడని వైనం 1970 దశకం నాటి చీలిలోనూ, 21వ శతాబ్దంలో వెనిజులాలోనూ కనిపిస్తోంది. భారతదేశంలో మోడీ గద్దెనెక్కటాన్ని కూడా మనం ఈ నేపథ్యంలో చూడొచ్చు.

అంతిమంగా 1851లో బోనపార్తే కుట్రపూరితంగా గద్దెనెక్కడానికి దారితీసిన పరిస్థితుల విశ్లేషణను 1948-51 మధ్య పరిణామాలపై తన అంచనాను ఆత్మపరిశీలనతో మదింపు వేయడానికి సందర్భంగా ఉపయోగించుకుంటాడు మార్క్స్. ఈ మూడేళ్ల కాలంలో కార్మికవర్గ ప్రభుత్వం కాలం కంటే ముందు పరిగెట్టిందని, భౌతిక పరిస్థితులు తయారు కాకముందే విప్లవానికి తెరతీయడం, తన శక్తికి మించిన లక్ష్యాలు నిర్దేశించుకోవడంతో ఈ తిరుగుబాట్ల వైఫల్యం అనివార్యమైందని సూత్రీకరిస్తాడు. పెటీ బూర్జువావర్గం మే, జూన్ మాసాల నాటికే పార్టీ ఆఫ్ ఆర్డర్ పంచన చేరి కార్మికవర్గంతో తెగతెంపులు చేసుకుంది. భూస్వామ్య ధనాఢ్యులు, ద్రవ్యపెట్టుబడి వర్గాల మధ్య ఉన్న వైరుధ్యాన్ని పరిష్కరించలేని పార్టీ ఆఫ్ ఆర్డర్ చివరకు బోనపార్తే తుపాకి రాజ్యానికి బలవుతుంది. అధికారం కోసం పోటీపడే ప్రతి వర్గమూ తనకంటే దిగువనున్న సమరశీల వర్గంతో జతకట్టడానికి బదులు తనపైనున్న ఆధిపత్య వర్గంతో సహజీవనానికి సిద్ధమయ్యింది. లూయీ బ్లాంక్వి నాయకత్వం కొరవడిన కార్మికవర్గం పెటీబూర్జువావర్గంతో పోటీపడి ప్రజాతంత్ర సంస్కరణల ఎజెండాను నెత్తికెత్తుకుంది. తమచేత ఛీత్కారానికి గురైన మతాధిపతులు, మతాధిపతులు, కులీనవర్గాలు లూయీ బోనపార్తే ప్రాపకంలో గద్దెనెక్కడం చూసి సామాన్య జనం విస్తుపోయారు. ప్రత్యామ్నాయ కార్యక్రమాన్ని ముందుంచడంలో విఫలమైన రైతాంగం నెపోలియన్ తరహా సంస్కరణలు అన్న ప్రచార పటాటోపానికి బలైంది. 2014 నాటి గుజరాత్ నమూనా ప్రచార హోరు ఈ సందర్భంగా గుర్తు చేసుకోవచ్చు. కార్మికవర్గం, రైతాంగం, జనబాహుళ్యం ప్రభుత్వాన్ని కూలదోసేందుకు సన్నద్ధమైనందున బూర్జువావర్గం లూయీ బోనపార్తే వంటి నిరంకుశుడికి పగ్గాలు అప్పగించలేదు. పాలకవర్గంలో తలెత్తిన రాజ్యాంగపర విభేధాలు బూర్జువావర్గ ప్రయోజనాలకు నష్టదాయకం అని గుర్తించినందువల్లనే ఈ పనికి ఒడిగట్టింది.

1848-51 నాటి ఫ్రాన్స్ పరిణామాలకు 2014 నాటి భారతదేశ రాజకీయ చిత్రపటానికి కొన్ని అంశాల్లో సారూప్యత కనిపిస్తోంది. ప్రజాస్వామిక వ్యవస్థలో పెరుగుతున్న తమ ప్రాతినిధ్యాన్ని తమ కార్యక్రమ లక్ష్యాలకనుగుణంగా ఎలా వినియోగించుకోవాలన్న విషయంలో కమ్యూనిస్టు పార్టీల్లో సైద్ధాంతిక గందరగోళం ఉందేమో కానీ వర్గ శత్రువులకు అటువంటి గందరగోళం లేదు. కమ్యూనిస్టుల ప్రభావాన్ని నియంత్రించాలన్న వారి లక్ష్యం స్పష్టం. ఈ దిశగానే రగిలిందే సింగూర్ కొలిమి. ఆ మంటల్లో బెంగాల్ వామపక్ష సంఘటన ప్రభుత్వాన్ని కాల్చేసే వరకూ దానికి పాలకవర్గమే ఆజ్యం పోసిందన్న వాస్తవం తాజా ఎన్నికల ప్రచారంలో మమతాబెనర్జీ స్వయంగా ఒప్పుకున్నారు. ఈ విషయంపై దృష్టి సారించాల్సిన ఉద్యమ నిర్మాతలు మాత్రం మరో దిక్కు చూస్తూ ఉండిపోయారు. వీటి పర్యవసానాలే 2014 ఎన్నికల ఫలితాలు. 1851లో లూయీ బోనపార్తే ప్రచారానికి, 2014 ఎన్నికల సందర్భంలో మోడీ ప్రచారానికి మధ్య అనేక సారూప్యతలు కొట్టొచ్చినట్లు కనిపించాయి. ఉదాహరణకు ఒక్కటి ప్రస్తావించుకుందాం. 1848-1851 మధ్య కాలంలో ఫ్రాన్స్‌లో ఉవ్వెత్తున ఎగిసిన ప్రజాతంత్ర విప్లవ జ్వాలను అరాచకంతో పోలుస్తాడు లూయీ బోనపార్తే. 1850 దశకంలో ఫ్రాన్స్‌లో ప్రజాతంత్ర ఉద్యమానికి, విస్తరిస్తున్న సోషలిస్టు ఆకాంక్షలకు వ్యతిరేకంగా పాలకవర్గాలన్నీ అరమరికలను పక్కన పెట్టి ఏకమైనట్లే 1999 తర్వాత కాలంలో భారతదేశంలో జాతీయ గుత్తపెట్టుబడిదారులు, ప్రాంతీయ బూర్జువాలు విదేశీ గుత్తపెట్టుబడి పంచన చేరాయి. తదనుగుణంగా దేశంలో విధానాల దిశ మారింది. దాని ఫలితంగానే చివరకు కాంగ్రెస్ వంటి వర్గ శత్రువు సైతం దాని ఫలితంగా అధికారానికి వచ్చిన యుపిఎ 1,2లను పాలనా వ్యవస్థ వైఫల్యాలకు చిహ్నాలుగా చూపించడంలో ఈ దేశపు పాలకవర్గం జయప్రదం అయ్యింది. ఆ కొద్దిపాటి ప్రజానుకూల విధానాలు కూడా సహించలేని పాలకవర్గం ఏకమై నమ్మిన బంటువంటి మోడీని గద్దెనెక్కించింది. 1851 తర్వాతి కాలంలో కనీస ప్రాథమిక

# సామాజికవేత్త మనముందు పెట్టిన ప్రశ్నలు

***వెస్లీ స్వచ్ఛంద సంస్థల పరిధిలోనే పనిచేస్తూ పేదల వెనుకబడిన వర్గాల పట్ల సామాజిక వివక్షను ఎత్తిచూపుతూ ఎన్నో ప్రశ్నలు లేవనెత్తారని అంటున్నారు* హేమలలిత**

సామాజికవేత్త చార్లెస్ వెస్లీ మిసా కోవిడ్ కారణంగా హాస్పిటల్‌లో చేరి కోలుకొని దాని మూలంగా వచ్చే అనారోగ్య సమస్యలను ఎదుర్కొంటూ అమరుడయ్యారు. 63 సంవత్సరాల చార్లెస్ 20-21వ శతాబ్దపు సామాజిక చరిత్ర మార్పులో భాగమై మన ముందు అనేక ప్రశ్నలను, జీవితానుభవాలను వదిలిపెట్టి వెళ్లారు. చార్లెస్ వెస్లీ క్రైస్తవ కుటుంబం నుంచి వచ్చి మైనార్టీ దళిత నేతగా ఎదిగారు. ఈ జీవిత గమనంలో అనేక ప్రశ్నలు తనకుతాను వేసుకున్నాడు. మనకు కొన్ని ప్రశ్నలను వదిలిపెట్టి పోయారు. అతని జీవిత చరిత్రను గమనిస్తే మనకు ఈ విషయం స్పష్టంగా అర్థం అవుతుంది. గతించిన శతాబ్దంలో స్వాతంత్ర్యం వచ్చిందనుకున్న తరుణంలో స్వేచ్ఛ లేని సమాజంలో అతను పుట్టాడు. ఇప్పుడు కూడా దేశంలో దళిత, మైనార్టీ, స్త్రీలపై దాడులను విశ్లేషిస్తే ఈ దాడులు బాధితులకే పరిమితం కాలేదు. మద్దతునిచ్చిన ప్రగతిశీల శక్తులను బాధించి, బంధించి జైళ్లపాలు చేయడం కోరేగాంవ్, ఇతర కేసులలో చూస్తాం. విప్లవ శక్తులనే కాకుండా హక్కుల కోసం పోరాడే స్వచ్ఛంద సంస్థల కార్యకర్తలైన బిస్మార్క్ డయాస్ (గోవా), 83 సం॥ల ఆదివాసీ హక్కుల జెస్విట్ ఫాదర్ స్వామి (జార్ఖండ్) మొదలగు వారిపై అక్రమంగా కేసులను బనాయించి అరెస్ట్ చేసి భయభ్రాంతులకు గురి చేస్తున్నారు.

చార్లెస్ వెస్లీ స్వంత ఊరు ఉమ్మడి ఆదిలాబాద్‌లోని లస్కర్‌పేటలో ప్రజలు దొరల అఘాయిత్యాలకు వ్యతిరేకంగా నక్సలైట్ ఉద్యమానికి మద్దతునిచ్చి కార్యకర్తలను కడుపులో పెట్టుకొని కాచి కాపాడారు. ఆనాటి ప్రజల నుంచి పొందిన స్ఫూర్తి న్యాయాన్యాయాల పట్ల అవగాహన తనను ఉత్తేజపరిచిందని చెప్పేవాడు. ఆ ఊరి దొర హత్యా ఘటన అతని ఆలోచనలకు పదును పెట్టిన తనకున్న పరిమితుల రీత్యా స్వచ్ఛంద సంస్థల బాటని ఎంచుకొని ప్రజల వద్దకు వెళ్లాలనే ప్రయాణం మొదలుపెట్టానని తానే స్వయంగా చాలా సార్లు చెప్పుకున్నాడు. నిబద్ధతతో ప్రజల అభివృద్ధిని ఆనాటి అవగాహన, అనుభవాన్ని బట్టి ఎంచుకున్నాడు. ఇక్కడే అతను ఎప్పుడూ ఒక ప్రశ్నను ప్రజా సంఘాల ముందు ఉంచేవారు. ప్రజల పట్ల అంకితభావం కలిగిన వ్యక్తులు స్వచ్ఛంద సంస్థలలోనూ ఉన్నారని, వారిని కలుపుకొని ప్రజా సంఘాలు ఎందుకు గుర్తించడం లేదని, ఐక్య సంఘటనలలో ఎందుకు భాగం చేయలేకపోతున్నారని మొదటి ప్రశ్న వేసేవారు. పదేపదే అతను ఎంచుకున్న మార్గం వేరే అవ్వొచ్చు కానీ లక్ష్యం పట్ల అతను ఎప్పుడూ చిత్తశుద్ధితో స్పందించేవాడు.

అనేక సమస్యల బరువు కింద అణచివేయబడుతూ అంటరానితనానికి, అంధకారమయ గతంతో అతని తల్లిదండ్రులు క్రైస్తవాన్ని స్వీకరించడం జరిగిందని ఆయనే చెప్పారు. అందుకే తనని తాను దళిత్ కంటే ఒక క్రైస్తవునిగానే గుర్తించమని కోరేవారు. అలా అని దళితుల స్థితిగతులను అంచనా వేయలేదని కాదు. అసమానమైన సమాజంలో ఈ అణిచివేయబడిన వర్గాలకు స్వేచ్ఛ, అవకాశాలు ఉండి ఉంటే అందరికంటే రెండు అడుగులు దళితులు ముందే ఉండే వారని భావించారు. అణచివేత బంధనాలను తెంచివేసి బానిసత్వంలో నుంచి తోటివారి విముక్తిని కోరారు. దళిత కులాలకి చెంది వారి జీవన విధానాలతో అనుబంధం ఉన్న తన ఆత్మకథను నిజాయితీగా రాస్తానని తన 60వ జన్మదినం సందర్భంగా ప్రకటించారు. క్రైస్తవం ఇచ్చిన చదువుతో సమాజానికి సేవ చేయాలనే ఆశయాన్ని తన మార్గంలో ఎంచుకొని ఎన్నో ఒడిదుడుకులను అధిగమించడానికి ఎంతో కష్టపడ్డాడు.

1970లలో మొదలైన స్వచ్ఛంద సంస్థల శకంలో తన వృత్తిని 80లలో ప్రారంభించారు. అప్పట్లో ఆ కార్యకర్తలకు వృత్తి, ప్రవృత్తి ఒక్కటే. రాత్రులు నిద్ర కాచి పల్లెల్ని ఆటపాటలతో మేల్కొల్పడం మొదలు వారికి కావాల్సిన అవసరాలు, ప్రాధాన్యతలు తెలుసుకొని సంఘటితపరచడం అతి ముఖ్యమైనది. ఆ ఎరుక ప్రజల పట్ల నిబద్ధతతో తనని తాను మార్చుకుంటూ ఈ నేలతల్లి నిజమైన బిడ్డగా ఎదిగాడు. సుమారు 40 ఏళ్లుగా అంటే 1980 అక్టోబర్ 2 / 2020 వరకు మలుపులు తిరిగిన అతని జీవితంలో అనేక మైలురాళ్లని శోధించి, సృష్టించి సంయమనం పాటిస్తూ నడిచివెళ్లేవాడు. 1980వ సంవత్సరంలో అతను మహబూబ్‌నగర్ జిల్లా ప్రజలతో కలిసి పని చేయాలని సంఘాలని కట్టారు. స్త్రీలు, యువకులు, పురుషులతో కలిపి గ్రామ కమిటీలు ఏర్పరిచారు. ప్రజలని సంఘటితపరచడానికి ప్రభుత్వం నుంచి వచ్చే ఫలాలను అందజేయడానికి కృషి చేశారు. స్వచ్ఛంద సంస్థల భాషలో చెప్పాలంటే ఇది కమ్యూనిటీ డెవలప్‌మెంట్ కింద వస్తుంది. తెలంగాణలో వెనకబడ్డ ఉమ్మడి మహబూబ్‌నగర్ జిల్లాలో అంటరానితనం, రెండు

---

హక్కులు, రిపబ్లికన్ రాజ్యాంగాన్ని ధ్వంసం చేస్తూ సాగిన బోనపార్టే పాలన తరహాలోనే భారతదేశంలో మోడీ పాలన సాగుతోంది. 1848 విప్లవం ప్రజలందరికీ సార్వత్రిక ఓటు హక్కును గ్యారంటీ చేస్తే ప్రతీఘాత శక్తులు గద్దెనెక్కిన తర్వాత ఆమోదించిన ఓ పార్లమెంటరీ తీర్మానం ద్వారా ఆ హక్కులను తిరస్కరిస్తుంది. అదే విధంగా భారతదేశంలో రాజ్యాంగం గ్యారంటీ చేసిన పౌరసత్వాన్ని 75 ఏళ్ల తర్వాత తిరిగి మోడీ ప్రభుత్వం తిరగదోడి పౌరసత్వాన్ని పొందడానికి కొత్త అర్హతలను నిర్ధారిస్తుంది. నేటి మోడీ ప్రభుత్వం తన ఆధిపత్యానికి, పీడనకు మనువాద హిందూమతాన్ని ఆలంబనగా చేసుకుంటున్నట్లే నాడు బోనపార్టే క్రైస్తవ మతాన్ని ఆలంబనగా చేసుకున్నాడు. ఈ సారూప్యత మితిమీరుతున్న మితవాద మతోన్మాద పాలక కూటమి విషయంలో ఉన్నంత స్పష్టంగా ప్రత్యామ్నాయ శక్తులు, విధానాల విషయంలో లేదన్న పరిమితిని పాఠకులు దృష్టిలో ఉంచుకోవాలి.

*(రచయిత జర్నలిస్టు)* వీ

గ్లాసుల పద్ధతి ప్రబలంగా ఉన్న రోజులవి. అంటరానితనం ఇప్పటిలా ముసుగు వేసుకొని లేదు. దీంతో అవమానంతో అతని హృదయం కృంగి పోయింది. అదే జిల్లాలో ఉన్న జోగినీ వ్యవస్థ సంకెళ్లలో ఉన్న ఆడపిల్లలకు వారి కోసం పనిచేసేవారికి అండగా నిలిచారు. తనకంటే ముందు వేల తరాలుగా సాధించలేకపోయిన విజయాలను సాధించడానికి కష్టించారు. అలా అంటరానితనం, కుల, లింగ వివక్ష, పేదరికంలో బతుకుతున్న కుటుంబాలను సంఘటితపరచడానికి ప్రయత్నించారు.

దళిత స్త్రీ అస్తిత్వ ఉద్యమాలు, కుల దురహంకారానికి బలైన కారంచేడు ఉద్యమంతో ఆధిపత్య సమాజపు దౌర్జన్యాన్ని ప్రశ్నిస్తూ దళితుల జీవిత కథా వస్తువులు సమాజం ముందు విసిరివేయబడ్డారు. బడుగు బలహీన వర్గాల సామాజిక స్థితిగతులు మరింతగా ప్రభుత్వ సరళీకృత విధానాల వల్ల ఛిద్రమయ్యాయి. అప్పుడే కమ్యూనిటీ డెవలప్‌మెంట్ నుంచి హక్కుల వైపు కొన్ని స్వచ్ఛంద సంస్థలు తమ దిశను మార్చుకున్నాయి. ఆత్మగౌరవ పోరాటాలకు అనేక మంది ఉద్యమించారు. రైతు కూలీ సంఘం పరిధిని దాటి అంబేద్కర్ శత జయంతి సందర్భంగా ఉమ్మడి తెలుగు రాష్ట్రాల్లో సైకిల్ యాత్రలో మహబూబ్‌నగర్ జిల్లాలోని కార్యకర్తలను చార్లెస్ వెస్లీ కదలించారు. అప్పటి ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లోని 23 జిల్లాల నుంచి కదలిన దళిత సైన్యం ప్రతి ఊరిలోని ఆధిపత్య శక్తులను ప్రశ్నిస్తూ హైదరాబాద్‌కు చేరింది. 1990లో వచ్చిన స్త్రీవాద ఉద్యమ కార్యకర్తలతోనూ, వారి కార్యక్రమాలలోనూ పాల్గొనేవారు. అలాగే దళిత సమాజంలోని వివక్ష రూపాలని, స్త్రీలపై హింసని దళిత స్త్రీలు ఎదుర్కొని నిలబడాలని కోరేవారు. దళిత సమాజంలో కూడా పితృస్వామ్య దౌర్జన్యాలు, లింగ వివక్ష ప్రతిఫలించే భావజాలం చూసి ఎంతోమంది దళిత స్త్రీల నాయకత్వంతో ఎదగడానికి తనవంతుగా కృషి చేశారు. 1995లో వచ్చిన మాదిగ దండోరా ఉద్యమానికి చేయూతనిచ్చి సబ్‌క్యాస్ట్‌ల మధ్య ఉన్న వైరుధ్యాలను తొలగించడానికి, ఇదే సందర్భంలో ఆయన మిత్రురాలైన భూపతి సుమతి లాంటి దళిత ఉద్యమకారిణిలతో నేషనల్ దళిత్ ఫోరాన్ని ఏర్పాటు చేసిన వారితో పాటు అన్ని రాష్ట్రాలలోను ప్రయాణం చేసి కార్యర్తలకు మద్దతుగా దేశమంతటా నిలిచారు.

చార్లెస్ వెస్లీ ఎప్పటికప్పుడు తన అవగాహనను పెంచుకుంటూ తనను తాను విస్తరించుకుంటూ వెళ్లేవాడు. 2000 సంవత్సరంలో ప్రభుత్వ విధానాలు మరింతగా పౌరహక్కులకు వ్యతిరేక విధానాలను రూపొందించడం జరిగింది. అందులో ముఖ్యంగా కార్పొరేట్ శక్తులకు దేశంలోని వనరులన్నింటినీ ప్రభుత్వం స్వాధీనపరుస్తున్నప్పుడు, సమాజంలోని రైతాంగ శ్రామిక దళితులు జీవించే హక్కుని కోల్పోతున్నప్పుడు తెలుగు రాష్ట్రాలలో ప్రత్యేక పోరాటాలు ఉవ్వెత్తున ఎగిశాయి. అందులో పోలేపల్లి, కాకినాడ, కాకరపల్లి, సోంపేట ఉద్యమాలకు బయటి నుంచి తన సహాయ సహకారాలని అందించారు. సమాజంలోని అన్ని వర్గాలు దళారి ప్రభుత్వం విధివిధానాలకు బలి అవుతున్నారని గ్రహించారు. దళిత హక్కులు, స్త్రీల హక్కులు, సకల పీడిత హక్కులు మానవ హక్కులే అని వాటిని సాధించే దిశగా ఏర్పడ్డ రెసిస్టెన్స్ ఫోరం (2004) బొంబాయిలో చార్లెస్ వెస్లీ పాల్గొన్నారు. భూమి శ్రమ జీవులదేనని దేశమంతా రైతులతో కలిసి పాదయాత్ర చేశారు.

ఎక్కడ ఎలాంటి అణచివేత జరిగినా అక్కడ తాను ఉండాలని జాతి, కులం, మతం మినహాయింపు లేకుండా ప్రత్యక్షమయ్యి మేధాపాట్కర్, ఇతర సామాజికవేత్తలతో, వేదికలతోనూ ఐక్య సంఘటనలను ఏర్పాటు చేశారు. దేశంలోని ప్రజాస్వామిక శక్తులతో కలిసి పని చేయాలని నేషనల్ అలయెన్స్ ఆఫ్ దళిత్ ఆర్గనైజేషన్ అనే దేశస్థాయి సంస్థను స్థాపించారు. ఉభయ తెలుగు రాష్ట్రాలతో పాటు కేరళ, తమిళనాడు, కర్ణాటక, కలకత్తా, పంజాబ్, ఢిల్లీ లాంటి మరియు అనేక రాష్ట్రాలలోని సంస్థలతో, వ్యక్తులతోనూ పని చేయడం ప్రారంభించారు. వ్యక్తిగతంగా అతనెప్పుడూ స్వలాభం కోసం, వ్యక్తిగత ఆస్తి కోసం, విలాసాల కోసం బతకలేదు. తాను వచ్చిన సమాజంలోని హిందూ మతాన్ని (బ్రాహ్మణీయ భావజాలాన్ని) వ్యతిరేకించి దళిత బహుజనులు సంఘటితం కావాలని కోరుకున్నారు. దేశంలో హిందూ జాతీయవాదం బలపడుతూ మైనార్టీల మీద దాడి చేస్తున్నప్పుడు అతడు సచార్ కమిటీ రిపోర్టుపై అధ్యయన వేదికలు నిర్వహించారు. ఎంతోమంది ముస్లిం మైనార్టీ మిత్రులతో కలిసి పని చేశారు. ఒరిస్సాలోని కాందమాల్ మంగుళూరు ఘటనలలో క్రైస్తవులపై దాడులు జరిగినప్పుడు ఆయా సమూహాలతో కలగలసి నడిచారు. కులం రానురాను సమాజంలో వేళ్లూనుకొని పోవడం చూసి కుల రహిత సమాజాన్ని, ఇతర బలహీన వర్గాల పోరాటాలను సమర్థించేవారు. దేశంలోని ఆర్థిక వ్యవస్థ ఆధిపత్య శక్తుల చేతుల్లోకి వెళ్లిపోవడం పట్ల ఎరుకతో లాల్‌నీల్ శక్తులు ఐక్యతతో ముందుకు కదలాలని, రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకోవాలని ఆశించాడు. దేశ భవిష్యత్తుకు ఈ శక్తుల సమీకరణ అవసరమని గుర్తించారు. అందుకే అతని ఇల్లు రాజకీయవాసులకు కూడా ఆశ్రయాన్ని ఇచ్చింది. స్వచ్ఛంద సంస్థల ఆచరణల నుంచి, సంస్కరణవాదుల నుంచి హక్కుల వైపుకు పయనిస్తూ విశాలతత్వాన్ని అలవర్చుకొని లాల్‌నీల్ శక్తులతో కలగలిసిపోయేవారు. అయినా ఈ శక్తుల ఐక్యత సాధ్యమవుతుందా అని నిరంతరం ప్రశ్నించేవారు. ఈ ప్రశ్నను మేధావి వర్గానికి కూడా సంధించేవారు. ఇది అతని రెండవ ప్రశ్నగా మన ఆలోచనలకు పదును పెడుతూ సమాజం ఈ సందిగ్ధ సందర్భంలో సమాధానాన్ని కోరుతుంది.

ఇక మూడవ ప్రశ్న. సమాజం మార్పుకు గురవుతున్న తరుణంలో మానవ సంబంధాలు కూడా మార్పుకు గురవ్వడం సహజం. కుటుంబ వ్యవస్థ కూడా అనేక ఆటుపోట్లను ఎదుర్కొంటుంది. అయినా కుటుంబం పట్ల తన బాధ్యతలను విడిచిపెట్టలేదు. అశాంతిలోని కలయిక కంటే ప్రశాంతతలోని దూరమే నయమనుకున్నాడు. కానీ తనలోని వెలితిని, సహవాసాన్ని మిత్రులు, సహ ఉద్యోగులతో పంచుకున్నారు. వారి జీవితాల్లో పెనవేసుకుపోయారు. వ్యవస్థ గోడలు బద్దలు కొట్టి బయటకు వస్తే ప్రపంచం చాలా విశాలంగా కనిపించినా చివరాఖరిలో కోవిడ్ బాధితుడై ఐసియులో ఉన్నప్పుడు శ్వాస ఎగవేస్తున్నా తలనిండా సుడిగాలి లాంటి ప్రశ్నలు కల్లోల పరిచాయి. ఎక్కడ ఉండాలో, ఎటు పోవాలో తెలియక/పోవాల్సి వచ్చినా కుటుంబం వైపు వెనుదిరగలేక అల్లాడిపోయాడు. చివరికి స్వచ్ఛమైన స్నేహ బంధాలు భౌతికంగా తనను బతికిస్తాయని ఆశించాడు. నమ్మాడు.

కోవిడ్ మనుషుల మధ్య భౌతిక దూరాన్ని పెంచి, భయపెట్టి మానసికంగా దగ్గరైనా ఆప్యాయతా, పర్సనల్ టచ్‌ను తరిమేసింది. మిత్రుల దగ్గర అపస్మారక స్థితికి చేరుకోవడానికి ముందు ఒక చివరి ప్రశ్న వేశాడు. చివరినాళ్లలో కుటుంబం నుంచి విడువడి లేదా వదిలివేయబడి ఒకే ఆలోచనా ధోరణి ఉన్న వాళ్లు ఒకే చోట బతకగలమా? అని ప్రశ్నించాడు. ఈ ప్రశ్న నేను బాగుపడ్డాక ఆలోచిస్తాను. అందరూ ఆలోచించాలని! కూడా అన్నాడు. విదేశాల్లో ఇది సాధ్యమేనని రెండు, మూడు ఉదాహరణలు ఉటంకించాడు. కానీ భారతదేశ సామాజిక నేపథ్యం గురించి ఆలోచించాలన్నప్పుడు ఈ ప్రశ్నను మన సమాజం ముందు పెట్టాలని కోరారు. అవే అతని చివరి మాటలు కూడా. కుటుంబాల్లోని కొత్తతరం ఉపాధి కోసమో, తమ అభివృద్ధి కోసమో వివిధ ప్రాంతాలకో, విదేశాలకో తరలిపోతుంటే వృద్ధాశ్రమాలలో బతికేదాని కంటే చివరి రోజుల్లో సామూహిక జీవితం ఎంత బావుంటుందో కదా అనే అతను వేసిన ఆలోచనా బీజం అందరికీ వర్తిస్తుంది.

కుటుంబంలోని వ్యక్తుల మధ్య సత్సంబంధాలు లేకపోయినట్లైతే వీటి

# సామాజిక బాధ్యతను గుర్తుచేసే వ్యాసాలు

- వంగాల సంపత్ రెడ్డి



**భిన్న సందర్భాలు**

పి. పాండురంగ వరప్రసాదరావు

ప్రచురణ : ఆంధ్రప్రదేశ్ టీచర్స్ ఫెడరేషన్ కృష్ణా, గుంటూరు జిల్లా శాఖలు

ప్రతులకు : ఎపిటిఎఫ్ రాష్ట్ర కార్యాలయం. చెన్నుపాటి-సింగరాజు భవన్, 29-7-22 విష్ణువర్ధనరావు వీధి, సూర్యారావు పేట విజయవాడ-2;

ఫోన్ : 0866-2433505

వెల రు. 60,
పేజీలు 174

ఏ పి టి ఎఫ్ కృష్ణ గుంటూరు జిల్లా శాఖల సంయుక్త ఆధ్వర్యంలో ప్రచురించబడిన "భిన్న సందర్భాలు" అనే వ్యాసాలను పాండురంగ వరప్రసాదరావు గారు రాశారు. ఈ పుస్తకంలో 29 వ్యాసాలు ఉన్నాయి. విద్యార్థి దశలోనే మార్క్సిస్ట్ ప్రాపంచిక దృక్పథంతో సమాజాన్ని శాస్త్రీయంగా పరిశీలించడం మొదలుపెట్టిన పి. పాండురంగ వరప్రసాదరావు 30 సంవత్సరాల బోధనా జీవితంతో పాటు సుదీర్ఘ కాలం ఉపాధ్యాయ ఉద్యమ నాయకుడిగా తాను పొందిన అనుభవాల సమాహారమే ఈ వ్యాసాల సంకలనం.

పాలకవర్గ ఆర్థిక విధానాలపై, సాహిత్యంపై, విభిన్న అంశాల మీద వ్యాసాలు ఉన్నా ఎక్కువ వ్యాసాలు విద్యారంగం మీద కనిపిస్తున్నాయి. దానికి కారణం రచయిత బోధనా రంగంలో ఉండడం, ఉపాధ్యాయ ఉద్యమ నాయకుడుగా పని చేయడం.

1947 ఆగష్టు 15 తరువాత భారతదేశ పాలకవర్గం విద్యా రంగం పట్ల చూపిన నిర్లక్ష్యం, 1990 దశకంలో వచ్చిన నూతన ఆర్థిక సంస్కరణలు విద్యను వ్యాపార సరుకుగా మార్చిన తీరును రచయిత విశ్లేషించాడు. ముఖ్యంగా గత మూడు దశాబ్దాలుగా పాలకవర్గాలు విద్యా రంగం పట్ల చూపిస్తున్న నిర్లక్ష్యాన్ని విశ్లేషించే ప్రయత్నం చేశాడు. విద్యను శ్రామిక వర్గాలకు దూరం చేసే పాలకవర్గ ప్రయత్నాల్ని నిరసించాడు. విద్య ప్రైవేటీకరణకు బాటలు వేస్తున్న జాతీయ విద్యా విధానం 2020 అసలు రూపాన్ని బయటపెట్టి పాలకులు ప్రజా వ్యతిరేక నిర్ణయాలు ఎలా తీసుకుంటారో విశ్లేషించాడు. కాంట్రాక్టు, అవుట్ సోర్సింగ్ విధానాలు విద్యారంగాన్ని ప్రైవేటీకరణ దిశగా ఎలా నెడుతున్నాయో వివరించాడు. హేతుబద్ధీకరణ పేరుతో పాఠశాలలను మూసివేయడంలోని హేతువును ప్రశ్నించాడు. యుజిసి రద్దును నిరసించాడు. సామాజిక శాస్త్రాలకు తగ్గుతున్న ప్రాధాన్యతను చూసి ఆందోళన పడ్డాడు. పాలకులు సాంకేతిక విద్యకు ఇస్తున్న అనవసన ప్రాధాన్యాన్ని నిరసించాడు.

భారతదేశంలో అమలవుతున్న ఎఫ్ఆర్‌డిఏ ప్రజా హక్కులను ఎలా కాల రాస్తుందో, జిఎస్‌టి పన్నుల విధానం ప్రజలకు ఎంత నష్టదాయకమో వివరించాడు. రూపాయి పతనం ఎలా జరిగిందో తద్వారా తలెత్తిన పరిణామాలను విశదీకరించాడు. ఆత్మనిర్భరతలోని డొల్లతనాన్ని ఎండగట్టాడు. ఆత్మనిర్భరత అంతిమంగా కార్పొరేట్ల ప్రయోజనాలకేనని విపులీకరించాడు. కేంద్రప్రభుత్వం అమలు చేస్తున్న కంట్రిబ్యూటరీ పెన్షన్ స్కీంను వ్యతిరేకించాడు. ఒక విధంగా ఈ విధానం మానవ హక్కుల ఉల్లంఘనగా రచయిత భావించాడు. గ్రీసు సంక్షోభానికి కారణాలను వెతికాడు. అమెరికా సామ్రాజ్యవాదానికి పశ్చిమాసియా ఏ విధంగా బలవుతున్నదో లెబనాన్ మీద ఇజ్రాయిల్ చేసిన దాడి క్రమంలో చర్చించాడు.

రెండు సెజ్ కథలు - ఒక విశ్లేషణ చదివితే రచయితకు సాహిత్యం పట్ల గల ఆసక్తి మనకు తెలుస్తుంది. అలాగే సాహిత్యం ఎలా ఉండకూడదో, ఎలా ఉండాలో స్పష్టంగా మనముందు ఉంచుతాడు. కొడవటిగంటి సైన్స్ వ్యాసాలను కూడా విశ్లేషించే ప్రయత్నం చేశాడు. స్లమ్ డాగ్ మిలియనీర్, అవతార్ సినిమాలపై చేసిన విశ్లేషణ పాండురంగ వరప్రసాదరావు గారి సామాజిక దృక్కోణాలు వివరిస్తుంది.

ఇటీవల పాలకవర్గాలు రైతుల, కార్మికుల హక్కులను హరించే విధంగా చేసిన చట్టాలను నిరసించాడు. రైతులు, కార్మికులు ఈ చట్టాలకు వ్యతిరేకంగా పోరాడాలని నినదించాడు. నూతన ప్రజాతంత్ర వ్యవస్థ ఏర్పాటు అయ్యే వరకు అంటే సామాజిక వ్యవస్థలో మౌలిక మార్పులు వచ్చేవరకు రిజర్వేషన్లు కొనసాగాలని భావించాడు. ప్రజాతంత్ర విద్య కోసం సామాజిక మార్పు కోసం, పెద్ద ఎత్తున పోరాటాలను నిర్మించడం తక్షణ అవసరమని రచయిత భావించాడు.

ప్రకృతీ సమాజ చలనాల అంతః సారమే శాస్త్రీయ విజ్ఞానమనీ, ఆ శాస్త్రీయ విజ్ఞానాన్ని అందించే ప్రజాతంత్ర వ్యవస్థ కోసం పోరాడాలనీ, అప్పుడు మాత్రమే శాస్త్రీయ ప్రజాతంత్ర విద్యావిధానం రూపొందించుకోవడంలో ముందడుగు వేస్తామని ప్రకటించాడు.

మొత్తంగా ఈ పుస్తకంలో సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పోరాడవలసిన ఆవశ్యకతను, ప్రభుత్వ రంగంలో ఉన్న విద్యారంగాన్ని ప్రైవేటీకరించడానికి భారత పాలక వర్గాలు చేస్తున్న ప్రయత్నాలను అడ్డుకోవాలనీ పిలుపునిస్తున్నాడు. అంతే కాకుండా శాస్త్రీయ విజ్ఞానాన్ని అందించే ప్రజాతంత్ర వ్యవస్థ కోసం, ప్రజాతంత్ర విద్యావిధానం కోసం పోరాటాలు నిర్మించడం అత్యంత అవసరమని రచయిత భావించాడు.

ఈ పుస్తకం కేవలం ఉపాధ్యాయులే కాదు సమాజం పట్ల తనకు బాధ్యత ఉన్నదని భావించే ప్రతి ఒక్కరు చదవదగ్గది.

(రచయిత అధ్యాపకులు) వీ

నుండి విడువడి బతుకుతున్నప్పుడు వారి కడసారి బాధ్యతలు, హక్కులు సమాజానివా, స్నేహితులవా లేక కుటుంబానివా? వారిపై వారసత్వపు హక్కులు ఎవరికి ఉంటాయి అని నిరంతరం చర్చించేవాడు.

చార్లెస్ వెస్లీ ఈ ప్రశ్నలు తనకు తానుగా వేసుకున్నవే కాదు ఆలోచించేవారికి ఎక్కుపెట్టిన బాణాలు. సమాజంలోని వివిధ కోణాలను ప్రశ్నించి, ఎత్తిచూపి ఎగిసిపడిన మానసిక, భావజాల ఉద్వేగపు అలలు అవి. ఈ మూడు ప్రశ్నలు మనల్ని మనం ప్రశ్నించుకోవడానికి తద్వారా వ్యవస్థను ప్రశ్నించడానికి మనకొక నైతిక బాధ్యత గుర్తు చేయడమే కాకుండా ఒక ఉపయోగపు విలువను అందిస్తుందని నమ్ముతున్నాను!!.

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

### ప్రజా సంఘాల నాయకుల ఇళ్లపై ఎన్ఐఎ సోదాలు

విశాఖపట్నం జిల్లా ముంచంగిపుట్ట కేసు విచారణలో భాగంగా మార్చ్ 31న ఆంధ్రప్రదేశ్, తెలంగాణల్లో 31 చోట్ల సోదాలు చేసినట్లు జాతీయ దర్యాప్తు సంస్థ (ఎన్ఐఎ) ఏప్రిల్ 1న తెలిపింది. ఏకకాలంలో చేసిన సోదాల్లో 70 హార్డ్ డిస్క్‌లు, 19 పెన్ డ్రైవ్‌లు, 40 సెల్‌ఫోన్‌లు, 44 సిమ్ కార్డులతో పాటు 10 లక్షల రూపాయలను స్వాధీనం చేసుకున్నట్లు తెలిపింది. మావోయిస్టు సాహిత్యాన్ని స్వాధీనం చేసుకున్నామంది. ఆంధ్రప్రదేశ్‌లోని విశాఖపట్నం, గుంటూరు, ప్రకాశం, శ్రీకాకుళం, కృష్ణా, పశ్చిమగోదావరి, కడప జిల్లాల్లోని నిందితుల ఇళ్లతో పాటు తెలంగాణలో పౌరహక్కుల సంఘం నాయకుడు, న్యాయవాది రఘునాథ్; ప్రజా కళామండలి నాయకులు జాన్, కోటి; చైతన్య మహిళా సంఘం నాయకురాళ్లు దేవేంద్ర, శిల్ప; జననాట్య మండలి నాయకుడు దప్పు రమేష్ ఇళ్లలో మార్చ్ 31 రాత్రి వరకు సోదాలు జరిగాయి. పిలిచినపుడు విచారణకు రావాలని ఎన్ఐఏ అధికారులు వారికి నోటీసులు జారీజేశారు. మావోయిస్టులతో సంబంధాలున్నాయనే ఆరోపణపై ఆంధ్రప్రదేశ్‌లోని ముంచంగిపుట్ట పోలీస్ స్టేషన్‌లో గత ఏడాది ఒక కేసు నమోదైంది. ఆ కేసు ఇప్పుడు ఎన్ఐఏకు బదిలీ అయింది. ఇప్పటివరకు 64 మందిపై ఉపా కేసును ఎన్ఐఏ నమోదు చేసింది.

### విప్లవ రచయితల సంఘం సాహిత్య పాఠశాల

విప్లవ రచయితల సంఘం 22వ సాహిత్య పాఠశాలను విజయవాడ జింఖానా గ్రౌండ్స్ గాంధీనగర్‌లోని కందుకూరి కళ్యాణ మండపంలో ఏప్రిల్ 11న నిర్వహించింది. ఈ సమావేశానికి విరసం అధ్యక్షుడు అరసవిల్లి క్రిష్ణ అధ్యక్షత వహించారు. మరో యాభైల్లోకి విరసం–రూపొందుతున్న పోరాటాల ప్రపంచం కీనోట్ పేపర్‌ను పాణి ప్రవేశపెట్టారు. ఫాసిజం–బాధిత అస్తిత్వాల ధిక్కారం; నిర్బంధంలో రచయితలు, కార్యకర్తలు – ప్రజాస్వామిక ఆందోళన అంశాలపై మల్లీశ్వరి, డాని, రివేరా తదితరులు ప్రసంగించారు. ఈ సందర్భంగా 14 పుస్తకాలను వివిధ సాహితి సంస్థల సభ్యులు ఆవిష్కరించారు. ఈ కార్యక్రమానికి రెండు తెలుగు రాష్ట్రాల విప్లవ అభిమానులు హాజరయ్యారు.

### ఉద్యోగుల వయోపరిమితి పెంపుపై విద్యార్థుల నిరసన

ఉద్యోగుల పదవీ విరమణ వయసు పెంపు, కరోనా పేరుతో వర్సిటీలు, కాలేజీల మూసివేత విషయంలో ప్రభుత్వ తీరును వ్యతిరేకిస్తూయో నిరుద్యోగుల ఆధ్వర్యంలో విద్యార్థులు మార్చ్ 26న అసెంబ్లీ ముట్టడికి యత్నించారు. ఆర్‌టిసి బస్‌లో పబ్లిక్ గార్డెన్స్ వద్దకు చేరుకున్న విద్యార్థులు నేరుగా అసెంబ్లీ గేటు వద్దకు పరుగులు తీసి ప్రభుత్వానికి వ్యతిరేకంగా నినాదాలు చేశారు. పోలీసులు వారిని అడ్డుకొని అరెస్టు చేసేందుకు ప్రయత్నించగా విద్యార్థులు రోడ్డుపై బైటాయించారు. పోలీసులు విద్యార్థులను బలవంతంగా ఈడ్చుకెళ్లి వ్యాన్‌లలో తోసేసి పలు పోలీసుస్టేషన్‌లకు తరలించారు. తెలంగాణ వస్తే ఉద్యోగాలు వస్తాయని ఆశించిన నిరుద్యోగుల నోట్లో ముఖ్యమంత్రి మట్టికొడుతున్నారని, ఉద్యోగుల వయో పరిమితి పెంచడం దారుణమన్నారు. రాష్ట్రంలో షాపింగ్ మాల్స్, బార్లు, సినిమా థియేటర్లకు అనుమతిస్తూ విద్యాసంస్థలను మూసివేయడానికి కారణాలు చెప్పాలని డిమాండ్ చేశారు.

### నల్లమలలో చెంచులపై అటవీ సిబ్బంది దాడి

నల్లమల అటవీ ప్రాంతంలో ఇప్పపూల సేకరణకు వెళ్లిన గిరిజనులపై మార్చ్ 27న అర్ధరాత్రి అటవీ అధికారులు, సిబ్బంది దాడిచేశారు. నాగర్‌కర్నూల్ జిల్లా అచ్చంపేట మండలం చెంచపలుగు తాండా, గుంపన్ పల్లి గ్రామాలకు చెందిన 23 మంది గిరిజనులు హోలి సందర్భంగా తమ సంప్రదాయంలో భాగంగా ఇష్ట దేవతలకు నైవేద్యం సమర్పించడానికి ఇప్పపూల సేకరణకు బల్మూరు మండలం బాణాల సమీపంలోని అటవీ ప్రాంతానికి వెళ్లారు. చీకటి కావడంతో బండలచెలిమి ప్రాంతంలో వారంతా నిద్రించారు. అర్ధరాత్రి నిద్రిస్తున్న వారిపై అటవీ సిబ్బంది దాడికి పాల్పడ్డారు. లాఠీలతో కొట్టి, బూటు కాళ్లతో తన్ని మర్మాంగాలను గాయపరిచి గిరిజనులందరిని మన్ననూరు బేస్ క్యాంపులో నిర్బంధించారు. దాడి విషయం తెలిసిన గిరిజన సంఘాలు, వివిధ పార్టీల నాయకులు మార్చ్ 28న శ్రీశైలం రహదారిని దిగ్బంధించడంతో పాటు అధికారులపై తిరగబడ్డారు. ఈ ఘటనపై గిరిజన సంఘం హెచ్‌ఆర్‌సిలో ఫిర్యాదు చేసింది. ఈ దాడిపై న్యాయ విచారణ జరిపించాలని నిర్బంధ వ్యతిరేక వేదిక కన్వీనర్ ప్రొ. హరగోపాల్ డిమాండ్ చేశారు.

### దళితుడిపై ఇసుక మాఫియా దాడి

ఇసుక అక్రమ రవాణాను ప్రశ్నించిన దళిత యువకుడిపై ఇసుక మాఫియా కత్తులతో దాడిచేసిన ఘటన మహబూబ్‌నగర్ జిల్లా మిడ్జిల్ మండలం వాడ్యాలలో ఏప్రిల్ 16న జరిగింది. భూగర్భ జలాలు అడుగంటి పోతున్నందున గ్రామానికి ఆనుకొని ప్రవహించే దుందుబి వాగు నుంచి ఇసుకను తరలించవద్దని గ్రామస్తులు తీర్మానం చేశారు. తీర్మానాన్ని పట్టించుకోకుండా అదే గ్రామానికి చెందిన సాయి, శ్రీశైలం ట్రాక్టర్ ద్వారా ఇసుకను తీసుకెళ్లేందుకు ప్రయత్నించగా జంగయ్య, భాస్కర్ అనేవారు అడ్డుకునే ప్రయత్నం చేశారు. వారిని తప్పించుకొని ట్రాక్టర్‌ను తీసుకెళ్లారు. ఆ తరువాత కొద్దిమంది ఇసుక రావాణా చేస్తున్నావారు అడ్డుకుంటున్న వారితో ఘర్షణకు దిగారు. ఈలోగా జంగయ్య, భాస్కర్‌లకు మద్దతుగా మధు, మరికొందరు యువకులు నిలిచారు. ఆగ్రహించిన ఇసుక మాఫియా మద్దతుదారులు మధుపై కత్తులతో దాడికి పాల్పడ్డారు. తీవ్రగాయాలపాలైన మధును ఆస్పత్రికి తరలించారు.

### ప్రజా సంఘాల పై నిషేధం, ఎత్తివేయాలని నిరసన

వివిధ ప్రజా సమస్యలపై గత 50 సంవత్సరాలుగా పోరాడుతున్న పౌరహక్కుల సంఘం, విప్లవ రచయితల సంఘం, ప్రజా ఫ్రంట్, తెలంగాణ రైతాంగ సమితి తదితర 16 ప్రజా సంఘాలపై తెలంగాణ ప్రభుత్వం నిషేధం విధిస్తూ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి జిఓ నెంబర్ 73ను ఏప్రిల్ 23న జారీచేశారు. మార్చ్ 30 నుంచి ఏడాదిపాటు నిషేధ ఉత్తర్వులు రాష్ట్రంలోని 33 జిల్లాలకు వర్తిస్తాయన్నారు. ఈ నిషేధాన్ని ఖండిస్తూ పలు సంఘాలు, పార్టీలు ఏప్రిల్ 24న నిరసన తెలిపాయి. ప్రజా సంఘాలను నిషేధించి రాష్ట్ర ప్రభుత్వం ప్రజాస్వామ్యాన్ని ఖూనీ చేసిందని పౌరహక్కుల సంఘంతో పాటు వివిధ సంఘాలు విమర్శించాయి. హైదరాబాద్‌లోని సోమాజిగూడ ప్రెస్‌క్లబ్‌లో వారు విలేకరుల సమావేశంలో మాట్లాడారు. ప్రజా సంఘాలపై నిషేధాన్ని, పబ్లిక్ సెక్యూరిటీ చట్టాన్ని ఎత్తివేయాలని, జిఓ 73ని రద్దు చేయాలని డిమాండ్ చేశారు. ఈ విషయంపై న్యాయపోరాటం చేస్తామన్నారు. ప్రజా సంఘాలపై నిషేధం అప్రజాస్వామికమని దాన్ని వెంటనే ఎత్తివేయాలని మానవ హక్కుల సంఘం, తెలంగాణ ప్రజా అసెంబ్లీ, ఎస్ఎఫ్ఐ, తెలంగాణ విద్యావంతుల వేదిక, పాలమూరు అధ్యయన వేదిక, సిపిఐ, సిపిఎం, న్యూడెమోక్రసీతో పాటు తదితర సంఘాలు డిమాండ్ చేశాయి.

### గ్రామాలు ఖాళీ చేయమంటున్న నిర్వాసితులు

నమ్ముకున్న భూమి పాయె, కట్టుకున్న ఇల్లు మల్లన్నసాగర్‌లో మునగవట్టె, పూర్తి పరిహారం ఇవ్వకుండానే ఊరి నుండి వెళ్లగొట్టాలని మేము ఎట్లా బతికేది అంటూ మల్లన్నసాగర్ ముంపు గ్రామాలైన సిద్దిపేట జిల్లా తొగుట మండలం ఏటిగడ్డ కిష్టాపూర్, బ్రాహ్మణ బంజర్ గ్రామాల నిర్వాసితులు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. ముంపు గ్రామాలను ఖాళీ చేసేందుకు నిర్వాసితులు అంగీకరించినట్లు పత్రికల్లో వార్తా కథనాలు రావడం పట్ల ఆగ్రహం వ్యక్తం చేశారు. ఆయా గ్రామాల్లో సర్పంచ్‌లు వేర్వేరుగా ఏప్రిల్ 20న గ్రామ సభలు నిర్వహించి ఊరిని ఖాళీ చేసేది లేదని ఏకగ్రీవంగా తీర్మానం చేశారు. వీ

### భారత్ బంద్

కేంద్రం తీసుకువచ్చిన మూడు వ్యవసాయ చట్టాలకు వ్యతిరేకంగా మార్చ్ 26న రైతులు ఇచ్చిన భారత్ బంద్ పిలుపు ప్రభావం పంజాబ్, ఆంధ్రప్రదేశ్, కర్ణాటక, పంజాబ్, హరియానా, బీహార్‌తో సహా దేశంలోని అనేక ప్రాంతాల్లో ఉంది. రైతుల ఆందోళనకు నాయకత్వం వహిస్తున్న సంయుక్త కిసాన్ మోర్చా (ఎస్‌కెఎం) ఉదయం 6 గంటల నుంచి సాయంత్రం 6 గంటల వరకు బంద్‌కు పిలుపునిచ్చింది. మూడు వ్యవసాయ చట్టాలను రద్దు చేయాలని, తమ పంటలకు కనీస మద్దతు ధరకు చట్టపరమైన హామీ ఇవ్వాలని రైతులు కోరుతున్నారు. అమృత్‌సర్‌లో రైళ్లను అడ్డుకున్నారు.

### పంజాబ్‌లో బిజెపి ఎంఎల్ఏపై దాడి చేసిన రైతులు

పంజాబ్‌లోని ముకుట్‌సర్ జిల్లా మాలౌట్ ప్రాంతంలో మార్చ్ 28న ఓ కార్యక్రమంలో పాల్గొనడానికి వెళ్లిన బిజెపి ఎంఎల్ఏ అరుణ్‌ను సాగు చట్టాలను వ్యతిరేకిస్తున్న అక్కడి రైతులు చుట్టుముట్టి ఆయన దుస్తులపై ఇంకు చల్లి, బట్టలు చింపి కొట్టారు. ఈ ఘటనను నిరసిస్తూ బిజెపి రాష్ట్ర అధ్యక్షుడి ఆధ్వర్యంలో ముఖ్యమంత్రి అధికార నివాసం ముందు ధర్నా నిర్వహించారు. ఈ ఘటనకు బాధ్యత వహిస్తూ ముఖ్యమంత్రి రాజీనామా చేయాలని డిమాండ్ చేయగా ఈ ఘటనపై రాజకీయం చేయడానికి బదులు ఢిల్లీ వెళ్లి వివాదాస్పద రైతు చట్టాలను ఉపసంహరించుకునేలా చేయండన్నారు.

### ఇష్రత్ జెహాన్ ఎన్‌కౌంటర్ బూటకం కాదు

ఇష్రత్ జెహాన్ ఎన్‌కౌంటర్ కేసులో నిందితులుగా ఉన్న పోలీసు అధికారులను నిర్దోషులుగా విడుదల చేస్తూ సిబిఐ ప్రత్యేక కోర్టు మార్చ్ 31న తీర్పునిచ్చింది. గతంలోనే ముగ్గురు పోలీసు అధికారులను విడుదల చేయాలని అదేశించిన కోర్టు మిగిలిన ముగ్గురు నిందితులకు ఊరటనిచ్చింది. 2004 జనవరి 15న అహ్మదాబాద్ శివార్లలో తెల్లవారుజామున ఎన్‌కౌంటర్ జరిగింది. అందులో ముంబైకి చెందిన ఇష్రత్ జెహాన్ అనే 19 ఏళ్ల అమ్మాయితో పాటు జావేద్ షేక్, అమ్జాద్ అలీ అక్బరలీ రాణా, జీషన్ జొహార్ అనే నలుగురిని గుజరాత్ పోలీసులు కాల్చిచంపారు. ఈ ఎన్‌కౌంటర్ బూటకమనీ, తన కూతుర్ని అన్యాయంగా చంపారని ఇష్రత్ జెహాన్ తల్లి ఓ రిట్ పిటిషన్ వేశారు. దీంతో కోర్టు పర్యవేక్షణలో అ జటరనూ సిట్ దర్యాప్తు, మెజిస్ట్రీరియల్ విచారణ, సిబిఐ దర్యాప్తు జరిగాయి. ఇష్రత్ ఎన్‌కౌంటర్ బూటకమని ఈ మూడు విచారణలు తేల్చాయి. ఏడుగురు పోలీసు అధికారులపై సిబిఐ హత్యకేసు నమోదు చేసి విచారణ జరిపింది. ఈ ఏడుగురిలో ఒకరు మరణించగా గతంలోనే ముగ్గురిని వదిలివేసిన కోర్టు ఇప్పుడు మిగిలిన వారిని వదిలివేసింది.

### ప్రొ. సాయిబాబా ఉద్యోగం నుంచి తొలగింపు

అసిస్టెంట్ ప్రొఫెసర్ సాయిబాబాను ఢిల్లీ యూనివర్సిటీకి చెందిన రామ్‌లాల్ ఆనంద్ కాలేజీ అధికారులు తొలగించారు. ఈ విషయాన్ని సాయిబాబా కూతురు వెల్లడించారు. ఏప్రిల్ 1న ఓ ఉత్తరం వచ్చిందని, అసిస్టెంట్ ప్రొఫెసర్ పోస్టు నుంచి సాయిబాబను తొలగించామని అందులో పేర్కొన్నారని ఆమె తెలిపారు. 90 శాతం వైకల్యంతో వీల్‌చైర్‌కు పరిమితమైన ఆయనకు మావోయిస్టులతో సంబంధాలున్న ఆరోపణలపై 2017లో శిక్షపడినప్పటి నుంచి నాగ్‌పూర్ సెంట్రల్ జైల్లోనే ఉంటున్నారు.

### రైతు వ్యతిరేక వ్యవసాయ చట్టాలను రద్దు చేయాలి

రైతు వ్యతిరేక, కార్పొరేట్ అనుకూల వ్యవసాయ చట్టాలను రద్దు చేయాలని ప్రజా సంఘాల ఐక్య వేదిక డిమాండ్ చేసింది. విద్యుత్ సవరణ బిల్లును ఉపసంహరించి, పంటలకు కనీస మద్దతు ధరల చట్టం చేయాలని డిమాండ్ చేస్తూ వేదిక ఆధ్వర్యంలో ఆందోళన కార్యక్రమం నిర్వహించారు. ఏప్రిల్ 13న సుందరయ్య పార్క్ ముందు వేదిక ఆధ్వర్యంలో ఈ నిరసన ప్రదర్శన నిర్వహించారు. ఈ సందర్భంగా తెలంగాణ రైతు సంఘం ప్రధాన కార్యదర్శి తీగల సాగర్ మాట్లాడుతూ వ్యవసాయాన్ని సర్వనాశనం చేసే కేంద్ర వ్యవసాయ చట్టాలను తక్షణం రద్దు చేయాలని డిమాండ్ చేశారు. రైతుల పంటలకు మద్దతు ధరలు లభించే విధంగా మద్దతు ధరల గ్యారెంటీ చట్టం చేయాలని కోరారు. వ్యవసాయ పంపుసెట్లకు మీటర్లు బిగించొద్దని డిమాండ్ చేశారు.

### పెరుగుతున్న ఎన్‌కౌంటర్‌లు, మృతులు

మహారాష్ట్రలోని గడ్చిరోలి జిల్లాలో మార్చ్ 29న జరిగిన ఎన్‌కౌంటర్‌లో ఐదుగురు మావోయిస్టులు మృతిచెందారు. కోబ్రామెండా అటవీ ప్రాంతంలో మవోయిస్టులు సమావేశమయ్యారన్న సమాచారంతో పోలీసులు కూంబింగ్ చేపట్టారు. ఈ సందర్భంగా ఇరు వర్గాల మధ్య జరిగిన కాల్పుల్లో మృతిచెందిన మావోయిస్టుల్లో ఇద్దరు మహిళలున్నట్లు పోలీసులు తెలిపారు. ఛత్తీస్‌గఢ్‌లోని బీజాపూర్ జిల్లాలో భద్రతా బలగాలకు, మావోయిస్టులకు మధ్య ఏప్రిల్ 3న జరిగిన ఎదురుకాల్పుల్లో 24 మంది జవాన్ల మృతితో పాటు 31 మంది జవాన్లు గాయపడగా ఐదుగురు మావోయిస్టులు మృతి చెందారని పోలీసుల అధికారులు తెలిపారు. టెర్రాం వద్ద కూంబింగ్ దళాలపై

### ముజఫర్‌నగర్ అల్లర్లు

ముజఫర్‌నగర్ అల్లర్ల కేసులో ఆరోపణలు ఎదుర్కొంటున్న 12 మంది బిజెపి నాయకులకు వ్యతిరేకంగా నమోదైన కేసును వెనక్కి తీసుకోవడానికి స్థానిక కోర్టు అనుమతినిచ్చింది. ఈ కేసులో ప్రస్తుత యుపి మంత్రి సురేశ్ రానా, బిజెపి ఎంఎల్ఏ సంగీత్ సోమ్, బిజెపి మాజీ ఎంపి భర్తెందు సింగ్, విశ్వహిందూ పరిషత్ (విహెచ్‌పి) నాయకుడు సాధ్వి ప్రాచీతో పాటు మొత్తం 12 మంది ఆరోపణలు ఎదుర్కొంటున్నారు. అయితే, వీరిపై ఉన్న కేసును వెనక్కి తీసుకోవడానికి ప్రత్యేక కోర్టు జడ్జి రామ్ సుధ్ సింగ్ ప్రభుత్వ న్యాయవాదికి అనుమతిని మంజూరు చేశారు. ప్రజాప్రయోజనాల దృష్ట్యా ఈ కేసులో బిజెపి నాయకులను విచారించకూడదని యుపి ప్రభుత్వం నిర్ణయం తీసుకున్నదని ప్రభుత్వ న్యాయవాది రాజీవ్ శర్మ న్యాయస్థానాకి దరఖాస్తు ద్వారా వివరించారు. 2013లో ముజఫర్‌నగర్ మత ఘర్షణల్లో దాదాపు 62 మంది చనిపోగా అనేక మంది గాయపడ్డారు. 50 వేల మందికి పైగా వేరొక చోటుకు వెళ్లాల్సిన పరిస్థితి ఏర్పడింది. ఇలాంటి కేసులో యుపిలోని బిజెపి ప్రభుత్వం చేసిన అభ్యర్థనలను అనుసరించి న్యాయస్థానం అనుమతినివ్వడం విచారకరమని బాధితులు, పౌర, సామాజిక సంఘాల నాయకులు, కార్యకర్తలు ఆగ్రహం వ్యక్తం చేస్తున్నారు.

### జర్నలిస్టులకు భారతదేశంలో భద్రతలేదు

జర్నలిజానికి, జర్నలిస్టులకు భారతదేశం ప్రమాదకరమైనదని రిపోర్టర్స్ విథౌట్ బోర్డర్స్ నివేదిక పేర్కొంది. దేశంలో స్వేచ్ఛగా పనిచేసుకునే పరిస్థితి లేదని, వారికి ఆటంకాలు సృష్టిస్తున్నారని ప్రధాని మోడీని, హిందూత్వ కార్యకర్తలను బాధ్యులను చేస్తూ ఆ నివేదిక విమర్శించింది. 2021లో ప్రపంచ పత్రికా స్వేచ్ఛ సూచీని ఏప్రిల్ 20న ప్రచురించింది. 180 దేశాల్లో భారతదేశం 142వ స్థానంలో ఉంది. నేపాల్ 106వ స్థానంలో ఉండగా, శ్రీలంక 127 స్థానంలో ఉంది. సైనిక కుట్ర జరగడానికి ముందు మయన్మార్ 140వ స్థానంలో ఉంది. నార్వే అగ్రస్థానంలో ఉండగా ఆ తరువాతి స్తానంలో ఫిన్లాండ్, డెన్మార్క్ నిలిచాయి. జర్నలిస్టులకు ప్రమాదకరమైన దేశాల్లో భారత్ ఒకటని నివేదిక తెలిపింది. బిజెపి మద్దతుదారులు, హిందూత్వ సిద్ధాంతం కలిసి జర్నలిస్టులకు ప్రతిబంధకమైన వాతావరణాన్ని సృష్టించాయని పేర్కొంది. ప్రభుత్వాన్ని, ప్రభుత్వ కార్యకలాపాలను విమర్శిస్తున్నందుకు జర్నలిస్టులపై జాతి వ్యతిరేక శక్తులుగా ముద్ర వేస్తున్నారని పేర్కొంది. గతేడాది పత్రికా స్వేచ్ఛను అణచివేసేందుకు కొవిడ్‌ను ఎలా అవకాశంగా తీసుకున్నారో కూడా నివేదిక తెలిపింది. ఏ

## అంతర్యుద్ధం దిశగా మయన్మార్

మయన్మార్‌లో మార్చ్ 27న సైన్యం 76 ఆర్మీ డే ఉత్సవాలు జరుపుకుంటూనే ఆందోళనకారులపై వివిధ నగరాల్లో 91 మంది ఆందోళనకారుల్ని కాల్చి చంపింది. సైన్యాధ్యక్షుడు జుంటా జాతినుద్దేశించి ప్రసంగిస్తూ 'ప్రజలకు ఎలాంటి అపాయం జరగకుండా మిలటరీ అండగా ఉంటుంది. ప్రజాస్వామ్యాన్ని కాపాడేందుకు కృషి చేస్తుంది' అని ప్రకటించగా మరోవైపు సైన్యం ప్రజలపై కాల్పులు జరుపుతూనే ఉంది. మయన్మార్ అంతర్యుద్ధం దిశగా సాగుతోంది. కరేన్ వర్గం ప్రజలు ఎక్కువగా ఉన్న కరేన్ రాష్ట్రంలో మిలటరీకి వ్యతిరేకంగా గెరిల్లా యుద్ధాలు ప్రారంభమయ్యాయి. మార్చ్ 29న ముత్రావ్ జిల్లా దేహ్‌బునోహ్ గ్రామానికి సమీపంలో సాల్వీన్ నది ఒడ్డున థాయ్‌లాండ్ సరిహద్దుల్లో ఉన్న మయన్మాన్ మిలటరీ పోస్టులపై కరేన్ నేషనల్ యూనియన్ (కెఎన్‌యు) దళాలు దాడి చేశాయి. 10 మంది సైనికులను చంపేశాయి. మరో 8 మందిని అపహరించాయి. ఆ ప్రాంతంపై ఆధిపత్యాన్ని నిలబెట్టుకున్నాయి. దీంతో మయన్మార్ సైన్యం దేహ్‌బునోహ్ గ్రామంపై వైమానిక దాడులు జరిపింది. ఈ దాడుల్లో కెఎన్‌యు దళానికి చెందిన ఇద్దరు మరణించారు.

## బంగ్లాదేశ్‌లో దాడులు

భారత ప్రధాని నరేంద్ర మోడీ బంగ్లాదేశ్ పర్యటన మార్చ్ 26, 27 తరువాత హింస చోటుచేసుకుంది. బంగ్లాదేశ్ 50వ స్వాతంత్ర్య దినోత్సవం సందర్భంగా నరేంద్ర మోడీ బంగ్లాదేశ్ పర్యటించారు. ఆయన పర్యటనను నిరసిస్తూ ఇస్లామిక్ వాదులు చేపట్టిన ఆందోళనలు హింసాత్మకంగా మారాయి. మోడీ ప్రభుత్వ హయాంలో భారత్‌లో ముస్లింలపై వివక్ష పెరుగుతోందని ఆరోపిస్తూ హిఫాజత్-ఎ-ఇస్లాం ఆధ్వర్యంలో వందల మంది ఆందోళనకారులు మార్చ్ 26 నుంచి మొదలయిన ఆందోళనలు మార్చ్ 28 నాటికి తీవ్రస్థాయికి చేరుకున్నాయి. దేశవ్యాప్తంగా జరిగిన ఆందోళనల్లో హిందూ దేవాలయాలపై దాడులు, బస్సులకు నిప్పంటించడంతో పాటు రైళ్లను తగులబెట్టారు. ఈ దాడిలో 10 మంది ప్రయాణికులు గాయపడ్డారు. ప్రభుత్వ కార్యాలయాలపై దాడులు చేస్తుండగా అడ్డుకునేందుకు ప్రయత్నించిన పోలీసులపై రాళ్లదాడికి దిగారు. మూడు రోజులు కొనసాగిన ఆందోళనల్లో 11 మంది మృతిచెందినట్లు పోలీసులు ప్రకటించారు.

## ఆసియన్లపై హింసకు వ్యతిరేకంగా నిరసన

ఆసియన్ అమెరికన్లపై జరుగుతున్న జాత్యహంకార దాడులు, హింసకు వ్యతిరేకంగా అమెరికా అంతటా మార్చ్ 28న నిరసన ప్రదర్శనలు జరిగాయి. న్యూయార్క్‌తో పాటు దాదాపు 60 నగరాల్లో ఆందోళనకారులు మార్చ్ నిర్వహించారు. ఈ ప్రదర్శనల్లో వేలాది మంది పాల్గొన్నారని వర్ణ వివక్ష, యుద్ధ వ్యతిరేక పోరాట సంస్థ 'ఆన్సర్' తెలిపింది. న్యూయార్క్‌లో జరిగిన సభలో కొంతమంది ఆసియన్లు తమకు జాత్యహంకార శక్తుల నుంచి ఎదురైన చేదు అనుభవాలను, ఇతర దాడులను ఆవేదనతో వివరించారు. ఈ సందర్భంగా ఆందోళనకారులు జాత్యహంకారానికి వ్యతిరేకంగా నినాదాలు చేశారు. విద్వేషపూరిత చర్యల కారణంగా ఆసియన్ అమెరికన్ కమ్యూనిటీకి చెందిన అనేక మంది బాధితులుగా ఉన్నారని ఆన్సర్ తెలిపింది. ఫ్లస్సింగ్ ఇంటర్నేషనల్ హైస్కూల్ కు చెందిన అధ్యాపకుడు జోర్డాన్ ఓల్ఫ్ మాట్లాడుతూ, పొరుగువారు, స్నేహితులు, ఇతర విద్యార్థుల మాదిరిగానే ఆసియన్లు కూడా గౌరవం, భద్రతకు అర్హులేనని అన్నారు. న్యూయార్క్‌లో తమకు భద్రత ఉందని ప్రతి ఒక్కరూ భావించేలా ఉండాలని, విద్వేష దాడులు, హింసాకాండకు పాల్పడే వారిని వదిలి పెట్టకూడదని స్పష్టం చేశారు. తాము అన్ని విధాలుగా భద్రంగా ఉన్నామని ప్రతి ఒక్కరూ భావించేలా పోలీసులు తగిన చర్యలు తీసుకోవాలని ఓల్ఫ్ అన్నారు. 'వారు మాతో పోల్చుకుంటే భిన్నమైన వ్యక్తులు, శరీరం, రక్తం కూడా తేడా ఉంటుంది..' అని కొంతమందిలో నెలకొన్న భావనే ఆసియన్ అమెరికన్లపై దాడులకు ప్రధాన కారణంగా ఉందని మహట్టన్లో పాస్టర్‌గా చేస్తున్న రేలో అన్నారు. సమంతా ఎవ గెలిస్ మాట్లాడుతూ.. ఈ భూమికి, ప్రజలందరికీ శ్వేతజాతి ఆధిపత్యం ఓ పెను శాపంగా పరిణమించిందన్నారు. ఈ నెల 16న అట్లాంటాలో కాల్పుల ఘటన తరువాత న్యూయార్క్‌లో 10కి పైగా ర్యాలీలు జరిగాయి. ఆ కాల్పుల్లో ఆరుగుర్లు ఆసియన్లు మరణించారు.

## తైవాన్‌లో ఘోర రైలు ప్రమాదం

తూర్పు తైవాన్‌లో కొండపై నుంచి ఓ ట్రక్కు జారిపడి కిందనున్న పట్టాలపై పడగా అటుగా వెళుతున్న రైలు దాన్ని ఢీకొని సమీపంలోని సొరంగంలో చిక్కుకు పోయింది. పట్టాలు తప్పి బోగీలు చెల్లాచెదురయ్యాయి. వాటిలో కింది సీట్లల్లో కూర్చున్నవారు తీవ్రంగా నలిగిపోయారు. ఈ దుర్ఘటనలో మొత్తం 48 మంది మరణించారు. సుమారు 100 మంది తీవ్రంగా గాయపడ్డారు.

## ప్రపంచ అధినేతలకు బహిరంగ లేఖ

ప్రకృతిపై యుద్ధానికి చరమగీతం పాడాలని వందకు పైగా అంతర్జాతీయ సంస్థలు సామాజిక ఉద్యమాలు, పార్టీలు గత ఫిబ్రవరిలో పిలుపునిచ్చాయి. వాతావరణంలో కర్బన ఉద్గారాలను జీరో స్థాయికి తీసుకు వచ్చేందుకు దీర్ఘకాలికమైన చర్యలు తీసుకోవాలని కోరాయి. వాతావరణ విపత్తులను, పేద దేశాల ప్రజల సామాజిక, ఆర్థిక విపత్తుల ప్రభావాలను వివరించడానికి అవసరమైన విధానాలను రూపొందించాలని కోరాయి. ప్రస్తుతమున్న రీతిలోనే భూ వినియోగం అడవుల నరికివేత, గనుల తవ్వకాలు, జీవ వైవిధ్యాన్ని నాశనం చేసే క్రిమిసంహారక మందులపై ఆధారపడడం, వేగంగా సాగుతున్న పట్టణీకరణ క్రమం వంటివి ఇలాగే కొనసాగితే 450 కోట్ల మందికి పైగా ప్రజలు తీవ్ర సమస్యలు ఎదుర్కొంటారని, వారికి నాణ్యత గల ఆహారం, నీరు కూడా దొరకకుండా పోతుందని శాస్త్రీయ అధ్యయనాలు పేర్కొంటున్నాయని చెప్పారు. అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడి, బ్యాంకులు, బహుళజాతి సంస్థల ఆధీనంలో ఉన్న ఆర్థిక వ్యవస్థలన్నీ కలిసి ప్రకృతిని నాశనం చేస్తున్నాయని విమర్శించాయి. ఈ పరిస్థితుల్లో యావత్ సమాజాన్ని, సంస్థలను, ప్రజా ఉద్యమాలను, శాస్త్రవేత్తలను, పర్యావరణ సంస్థలను సమీకరించి తక్షణమే తీసుకోవాల్సిన చర్యలపై ఒక ఒప్పందానికి రావల్సిన అవసరం ఉందని వందకు పైగా సంస్థలు ఆ లేఖలో పేర్కొన్నాయి.

## మరో రెండు సార్లు రష్యా అధ్యక్షుడిగా పుతిన్

మరో రెండు సార్లు అధ్యక్ష పదవికి పోటీ చేసేందుకు తనకు వీలు కల్పించే చట్టంపై రష్యా అధ్యక్షుడు వ్లాదిమిర్ పుతిన్ ఏప్రిల్ 5న సంతకం చేశారు. దీని వల్ల ఆయన 2036 వరకు ఆ పదవిలో కొనసాగుతారు. ఆయన ప్రస్తుత ఆరేళ్ల పదవీ కాలం 2024లో ముగుస్తుంది. మళ్లీ అధ్యక్షుడిగా పోటీచేయాలా వద్ద అనేది ఆ తరువాత నిర్ణయిస్తానని ఆయన చెప్పారు.

## పురుగు మందుల వాడకం వల్ల ప్రమాదంలో ప్రపంచం

వ్యవసాయ రంగంలో పెద్ద ఎత్తున వాడుతున్న పురుగు మందులు పర్యావరణంలో కాలుష్య కారకాల్ని పెంచుతోందని ఆస్ట్రేలియాలోని యూనివర్సిటీ ఆఫ్ సిడ్నీకి చెందిన శాస్త్రవేత్తలతో కూడిన బృందం తెలిపింది. 168 దేశాల్లో శాస్త్రవేత్తల బృందం ఈ పరిశోధనను నిర్వహించింది. పురుగు మందుల నుంచి వెలువడుతున్న కాలుష్యకారకాల వల్ల ప్రపంచంలో 64 శాతం వ్యవసాయ భూమి ప్రమాదంలో పడిపోయిందని ఇందులో 31 శాతం భూమి హై రిస్క్‌లో ఉందని పరిశోధకులు అంచనా వేశారు. వీ




# కె.వి.ఆర్

## నాటకం, నాటికలు

పేజీలు: 168 వెల: రు. 150

కె.వి.ఆర్., శారదాంబ స్మారక కమిటీ ప్రచురణ

Advt.

# కె.వి.ఆర్. స్మృతిలో...

## (వ్యాస సంకలనం)

వెల: రు. 100 పేజీలు: 106

కె.వి.ఆర్., శారదాంబ స్మారక కమిటీ ప్రచురణ







# ఆట బొమ్మలు

## (కథా సంకలనం)

**మూల రచన: రవీంద్రనాథ్ ఠాగూర్, అనువాదం: కె.వి.ఆర్**

పేజీలు: 104 కె.వి.ఆర్., శారదాంబ స్మారక కమిటీ ప్రచురణ వెల: 100

ప్రతులకు: డా. ఎస్. రామకృష్ణ, శాంతి నర్సింగ్ హోమ్
నిర్మలా కాన్వెంట్ ఎదురుగా, పటమట, విజయవాడ - 520010
ఫోన్ : 9849083137

Advt.

# లేఖా సాహిత్యం

కేతవరపు రామకోటి శాస్త్రికి త్రిపురనేని మధుసూదన రావు ఉత్తరాలు

సంపాదకత్వం: కాత్యాయనీ విద్మహే

వెల: రు. 30 పేజీలు: 40

**విప్లవ రచయితల సంఘం ప్రచురణ**




Advt.




# కాషాయ ఫాసిజం
# హిందుత్వ తీవ్ర జాతీయవాదం
# నయా ఉదారవాద వనరుల దోపిడి

**అశోక్ కుంబము, తెలుగు: సి.ఎస్.ఆర్. ప్రసాద్**

**విప్లవ రచయితల సంఘం ప్రచురణ**

పేజీలు: 32 వెల: రు. 25

పై రెండు ప్రతులకు: డి.వి. రామకృష్ణారావు
ఎం.ఐ.జి-14, ఎ.పి.ఐ.సి. కాలనీ, కార్బైడ్ కంపెనీ ఎదురుగా, మౌలాలి,
హైదరాబాద్ - 500040, ఫోన్: 9989189250

Advt.

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 235 - May 2021 ● ISSN 2231-6892
● RNI Regn.No.APTEL/2003/11482 ● Published on 27/04/2021 ● Postal Regn. No. HD/1100/2020-22

Date of Posting : 29th, 30th



If undelivered please return to:

**VEEKSHANAM**

Mytri Residency, 3-6-394, St. No. 3,
Himayatnagar, Hyderabad - 500 029.
Phone: 040 66843495

To:
Mr./Mrs.________________

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020
and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao